# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 11 హైదరాబాద్ 148 నవంబర్ 2013 పేజీలు : 68 రు. 15

- ఆంధ్ర - తెలంగాణ సమస్యపై స్పందనలు
- పేలుళ్ల దర్యాప్తులో హక్కుల బలి
- రాజకీయ నేరాలు - నిరోధ చర్యలు
- అమెరికా గుప్పెట్లో భారత్
- ఆయుధం అణచివేత సాధనం
- అమెరికా షట్‌డౌన్
- కెన్యాలో విచక్షణారహిత హింస

## ఆర్ ఎస్ రావు స్మారక ఉపన్యాసం, సదస్సు

అరుదైన ప్రజామేధావి, మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రవేత్త అమరుడు ఆర్ ఎస్ రావు సంస్మరణలో ప్రతి సంవత్సరం స్మారక ఉపన్యాసం, స్మారక సదస్సు ఏర్పాటు చేయాలని నిర్ణయించి 2012 నవంబర్ 10-11లలో మొదటి ఉపన్యాసం, సదస్సు జరిపిన సంగతి పాఠకులకు తెలుసు. ఈ స్మారకోపన్యాసం, సదస్సులు సాధారణంగా ఆర్ ఎస్ రావుకు ఆసక్తి ఉండిన, ప్రజా ఉద్యమాల అవగాహనలను వ్యక్తీకరించగలిగిన అంశాల మీద ఉంటాయి. ఆ వరుసలోనే **2013 నవంబర్ 9 శనివారం సాయంత్రం 6 గంటలకు, హైదరాబాద్ బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో స్మారక ఉపన్యాసం, నవంబర్ 10 ఆదివారం ఉదయం 10 నుంచి సాయంత్రం 6 వరకు, సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) సెమినార్ హాల్, బేగంపేటలో సదస్సు** ఉంటాయి. గత సంవత్సరం 'కూడలిలో ఉన్నత విద్యారంగం - ప్రత్యామ్నాయల అన్వేషణ' అనే అంశం మీద స్మారకోపన్యాసం, 'సమాజ పరివర్తన' అనే అంశం మీద స్మారక సదస్సు ఏర్పాటయ్యాయి. ఈ సంవత్సరం స్మారక ఉపన్యాసానికీ, సదస్సుకూ ఇతివృత్తంగా 'సమాజ సాహిత్య సంబంధాలు' అనే అంశం ఉంటుంది.

హైదరాబాద్‌లో 2013 నవంబర్ 9 శనివారం సాయంత్రం ఆర్ ఎస్ రావు రెండవ స్మారకోపన్యాసంగా, సాహిత్యంలో సమాజ చలనపు ప్రతిఫలనం అనే విషయం మీద విప్లవకవి వరవరరావు ప్రసంగిస్తారు. ఆ మర్నాడు సమాజ చలనం - సాహిత్యంలో ప్రతిఫలనం అనే విషయం మీద డా. ముదునూరి భారతి ప్రాతిపదిక పత్రంతో ప్రారంభమయ్యే సదస్సులో సమాజ చలనాన్ని సాహిత్యంలో ఎలా పట్టుకున్నాను అనే విషయం మీద అల్లం రాజయ్య, నల్లూరి రుక్మిణి తమ అనుభవాలను పంచుకుంటారు. సాహిత్యంలో సమాజ ప్రతిఫలనం మీద పంకజ్ దత్, షోమా సేన్, స్వాధీన్ పట్టనాయక్, సరోజ్ మహంతి, కాత్యాయనీ విద్మహే, డి సుబ్రహ్మణ్యం, పాణి, కె వి కూర్మనాథ్, యాటెల్లి రామచంద్రం, డి వి రామకృష్ణారావు, ఎన్ వేణుగోపాల్ పత్రాలు సమర్పిస్తారు.

అందరూ ఆహ్వానితులే.

- ఆర్ ఎస్ రావు మిత్రులు

KRSA102M 268

148

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

నవంబర్ 2013
సంపుటి : 11
సంచిక : 11



## లోపలి పేజీల్లో...



### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; కరీంనగర్ - ద్యామర రేణుక; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - వి. శంకరయ్య; వరంగల్ - ఎ.కుమార్; అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు - బాలగురువయ్య; విజయనగరం - డి. సుధాకర్; విశాఖపట్నం - పి.వి. రమణ; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత



ప్రింటర్స్
దక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా
వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **01391101002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు ANDB 000/0139 నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం ఆర్థిక స్థితి గురించిన విజ్ఞప్తికి ప్రతిస్పందనగా జె. మనోహర్ రావు (హైదరాబాద్) రు. 5000, పి. అరుణాచలం (హైదరాబాద్) రు. 1000, హైదరాబాద్ ఆర్థిక సహాయం అందజేసిన వారందరికీ కృతజ్ఞతలు**

సెప్టెంబర్ సంచికలో సమైక్యాంధ్ర-తెలంగాణ వివాదం గురించి నేను రాసిన వ్యాసానికి స్పందిస్తూ రాజేంద్రబాబు రాసిన వ్యాసం చదివాను. ప్రత్యేక తెలంగాణ కోసం ఇటీవల ప్రారంభించిన ఉద్యమం ప్రారంభమైనప్పటి నుంచి వీక్షణం పలు వ్యాసాలను ప్రచురిస్తూ వచ్చింది. ఎక్కువగా తెలంగాణ గురించిన వ్యాసాలు ప్రచురిస్తూ వచ్చింది. వాటిలో రాజేంద్రబాబు రాసిన వ్యాసం ఒకటి. నామీద విసిరిన విసుర్లు తప్ప కొత్త ఏమీలేదు. ఆయనగాని, నేను రాసిన దాంట్లో గాని ఇంతవరకు ప్రచురిస్తూ వచ్చిన వ్యాసంలో కొత్త ఏమీలేదు. కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్రం.ఏర్పాటు చేయడానికి అంగీకరించింది కాబట్టి, ఇకనుంచి రాష్ట్రం ఏర్పాటులో వస్తున్న సమస్యలను చర్చించే, విమర్శించే వ్యాసాలు మాత్రమే ప్రచురించాలని సంపాదకులకు నా సూచన.

**- వి. హనుమంతరావు**, హైదరాబాద్

**జూ**న్, జూలై వీక్షణం సంచికలలో రంగనాయకమ్మ రాసిన 'శ్రమశక్తి ఉపయోగపు విలువ' గురించి రాసిన వ్యాసంపై జూలై, సెప్టెంబర్, అక్టోబర్ సంచికలలో జనార్ధన్, నాగభూషణం, వర్మల ఉత్తరాలు చూశాక ఈ ఉత్తరం రాయాలనిపించింది. గడ్డం పెంచుకున్నాడు, చేపలు తినమన్నాడు కనుక మార్క్స్‌కు మార్క్సిజం తెలియదు' అని రంగనాయకమ్మ రాశారని జనార్ధన్ రాసిన దానికి, జె.ఆర్. నాగభూషణం ఆమె రాసిన అసలు వాక్యాలు చూపించారు. నాగభూషణం రాసినది కరక్టే. ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా జనార్ధన్ రాసిన అర్థం ధ్వనించడం లేదు. 'అలాగానీ రాసి ఉంటే ఇన్నేళ్లలో ఆమె మీద వచ్చిన విమర్శల్లో ఒక్కసారైనా ఆ సంగతి ఎవరైనా ప్రస్తావించి ఉండరా?' అని కూడా రాశారు నాగభూషణం.

ఆ వాక్యాలు మార్క్స్‌కి వర్తించవా? పెట్టుబడి దారుడికీ, శ్రామికుడికీ మధ్యనున్న సంబంధంలో అమ్మడం, కొనడం అన్న పదాల్ని ఉపయోగించడంలో మార్క్స్ పొరపాటే చేసి ఉంటే, ఇన్నేళ్లలో ఒక్కసారయినా ఆ సంగతి ఎవరయినా ప్రస్తావించి ఉండరా? రంగనాయకమ్మ 'కాపిటల్ పరిచయం' రాసి 34 ఏళ్లు అయింది, అది తెలుగులోనే ఎక్కువ పాపులర్ అయింది. మార్క్స్ 'కాపిటల్' రాసి 150 ఏళ్లు అయింది. దాని అనువాదాలు ప్రపంచ భాషలన్నిటిలోనూ ఉన్నాయి. మార్క్స్‌లో పొరపాటు లేకపోయినా, పొరపాట్లు వెతకడం కోసం గోతి కింద నక్కల్లా కాచుక్కూర్చునే బూర్జువా ఆర్థికవేత్తల్లో, ఏ ఒక్కరికీ, ఇంత సుదీర్ఘకాలంలో కూడా రంగనాయకమ్మకు కనపడ్డ పొరపాటు కనపడలేదెందువల్ల? ఎందువల్లంటే ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని, అవి పొరపాటు అవగాహనని ఎవరికీ కలిగించలేదు కనక. రంగనాయకమ్మ మార్క్స్ గడ్డాన్ని గురించి చిరాకు పడడాన్ని జనార్ధన్ లాంటి వాళ్లు తప్ప ఎవరూ అపార్థం చేసుకోరు. ఆమెకి మార్క్స్ మీద ప్రేమ, గౌరవం లేదనీ అనుకోరు. ప్రేమగా ముద్దుగా విసుక్కున్నారు అనుకోవచ్చు. అది పుస్తకంలో కాక స్నేహితుల మధ్య మాటల్లో అయితే గడ్డం ఉండడం వల్ల తేలిగ్గా రాయలేకపోయాడు అని హాస్యంగా అనడం సవ్యమైన పద్ధతే అయితే, 'ముఖం మీద వెంట్రుకలు ఉండడం వల్ల రాసేవాళ్లు తేలిగ్గా రాయలేరు, నెత్తిమీద వెంట్రుకలు ఉండడం వల్ల చదివేవాళ్లు తేలిగ్గా అర్థం చేసుకోలేరు' అని హాస్యం చేసుకోవడం కూడా సవ్యమైన పద్ధతే అవుతుంది. చారిత్రాత్మక వ్యక్తుల మీద ఇలాంటి జోకుల్ని గ్రంథస్తం చేయడం మంచిపని కాదు. రంగనాయకమ్మ పుస్తకం కొన్ని శతాబ్దాల పాటు ఉండవలసిన పుస్తకం. దాంట్లోంచి ఇలాంటి హాస్యాన్ని తీసివేయడం ఉత్తమం. తీసివేయడం వల్ల 'కాపిటల్ పరిచయం'లో చెప్పవలసింది చెప్పలేకపోవడం కాని, ఆ పుస్తకం ఉపయోగం తగ్గిపోవడం కాని వెంట్రుకంత కూడా జరగదు.

**- వి.ఎస్. భరద్వాజ**, విశాఖపట్నం

'శ్రమశక్తి ఉపయోగపు విలువ' వ్యాసం గురించి సూర్యకుమారి అడిగిన ప్రశ్నకు రంగనాయకమ్మ వివరణ ఇంకొన్ని సందేహాలను తెచ్చిపెట్టింది. శ్రమశక్తిని సరుకు అనడం మానేసి 'శ్రమశక్తి' అంటే సరిపోతుంది అన్నారు. రంగనాయకమ్మ 'కాపిటల్ పరిచయంలో 'శ్రమశక్తి' అంటే శ్రమచేయాలంటే శక్తి కావాలి కాబట్టి, ఆ శక్తి ఏర్పడడానికి అవసరమయ్యే ఉత్పత్తుల విలువే శ్రమశక్తి విలువ అని రాశారు. పెట్టుబడిదారుడికి ఇచ్చేదాన్ని 'సరుకు' అనకుండా 'శ్రమశక్తి' అనమంటున్నారు. సరుకు బదులు శ్రమశక్తి అన్న మాటని వాడమంటున్నారు. నిజానికి శ్రామికుడు ఇచ్చేది కేవలం 'శ్రమశక్తిని' కాదు, శ్రమని. 'శ్రమశక్తి'నే ఇచ్చి పోషణ తీసుకుంటే రావలసినదంతా శ్రామికుడికి వచ్చినట్టే. 'సరుకు'కి బదులుగా 'శ్రమశక్తి' అన్న మాటని వాడడం ఎలా సరిపోతుంది?

రంగనాయకమ్మ వివరణలో కొనడం అనేదాన్ని 'పోషణ', 'జీతం' అన్నారు. శ్రామికుడు శ్రమచేసి శ్రమవిలువ తీసుకున్నాడు అని అనకూడదు కదా! (కనిపించేది అదే కాబట్టి అలా అనాలనిపిస్తుంది) శ్రమచేసి పోషణ తీసుకున్నాడు అని కదా అనాలి. ఎందుకంటే 'శ్రమవిలువ' 'పోషణ' విలువ ఒకటి కాదు కాబట్టి. కాని ఆ విషయం అమ్మకానికి పోయినప్పుడు, వాటి విలువల మీద పరిశోధన జరిగినప్పుడు పరిశోధన పూర్వరంగంలోనే ఆ మాటలు అనడం ఎలా కుదురుతుంది మార్క్స్?

'విద్యార్థులకూ, కార్మికులకూ' నేర్పేటప్పుడు, 'అమ్మడం-కొనడం' మాటల వల్ల ఎలాంటి సమస్య వస్తుందో కూడా వివరించాలని రాశారు. మార్క్స్ వాడిన మాటలకి అలవాటుపడ్డాం కాబట్టి వాటిని ఉంచుకుంటూనే వాటివల్ల వచ్చే సమస్యని వివరించాలి అని రాశారు.

విద్యార్థులకూ, కార్మికులకూ నేర్పడం అంటే ఎన్నెన్నో ప్రదేశాల్లో, ఎన్నెన్నో సార్లు జరగవలసిన విషయం. అంటే అసంఖ్యాక సందర్భాల్లో మార్క్స్ వాడిన మాటలు చెపుతూ ఉండడం, అవి తప్పు అంటూ ఉండడం అన్నమాట. అప్పుడెలాంటి సమస్య వస్తుందంటే, ఆఖరికి బయటికి పొక్కేది 'మార్క్స్ తప్పులు చెప్పేడంట'ని. ఇప్పటికే జాహ్నవి మార్క్స్ తప్పులు చెప్పేడు అని పెట్రేగిపోయి పేలుతున్నారు. అలాంటి వాళ్లకి ఇది గొప్ప మద్దతునిస్తుంది.

**- డా. వి. వెంకటేశ్వరరావు**, కాకినాడ

వీక్షణం చదువుతున్నవాళ్లందరినీ, ఆలోచింపజేసే విధంగా విద్యావంతులకు, బుద్ధిజీవులకు, ఆలోచనాపరులకు, రైతులకు, కార్మికులకు, పీడితులకు మహిళలకు ఇప్పుడు మనముందున్న మన దేశపు పార్లమెంటరీ తప్పుడు ప్రజాస్వామ్యం ఎటువంటిదో అందరికీ కనువిప్పుకలిగించే విధంగా, ప్రశ్నించే ధైర్యాన్నీ, చైతన్యాన్నీ పెంపొందించే విధంగా ఉంది. ఈ వ్యవస్థలో నిండి ఉన్న అవినీతి పాలకులను, వీరి అనుచరగణాన్ని, వీళ్ల అక్రమాలను ప్రజలందరికీ తెలియపరిచేలా వ్యాసాలు ఉంటున్నాయి. ప్రజలలో ఉన్న (ఈ వ్యవస్థ ప్రజల మెదళ్లలో నింపి ఉంచిన తప్పుడు భావాలను) అమాయకత్వాన్ని కొద్ది కొద్దిగా తొలగించడానికి, శాస్త్రీయ జ్ఞానాన్ని పెంపొందించడానికీ, చీకటిలోంచి వెలుతురులోకి మమ్మల్ని మెల్ల మెల్లగా నడిపిస్తున్న వీక్షణం పత్రికకు మా కృతజ్ఞతలు.

**- ఎ.ఎం. రాధాక్రిష్ణ**, రాజకీయ ఖైదీ, మైసూర్ సెంట్రల్ జైల్

'వర్తమాన చరిత్ర-రాజకీయార్థిక దృష్టి' శీర్షికలో వచ్చిన ద్రవ్యోల్బణం వ్యాసం నేటి పరిస్థితులలో రాదగిన వ్యాసంగా భావిస్తున్నాను. ద్రవ్యోల్బణం అంటే ఏమిటో చాలా మందికి తెలియదనవచ్చు. సామాన్య ప్రజలకు కూడా తెలియాల్సిన ఈ అంశం మీద దృష్టి నిలిపి రాసినందుకు ఈ వ్యాస రచయితను అభినందిస్తున్నాను. ఇందులో రచయిత వాడిన ఒకే ఒక్క మాట 'గతంలో బ్రాహ్మణుల గుత్తాధిపత్యం కింద సంస్కృతం నిర్వహించిన పాత్రనే బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు నిర్వహిస్తున్నారు' అనేది చాలా విలువైంది. బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు దోపిడీ పాలకవర్గాలకు ఉపయోగపడే విధంగానూ, ప్రజలకు నిజం తెలియకుండానూ తికమకపరిచి పదాల్ని వాడుతుంటారు. దోపిడీ, అదనపు విలువ అనే పదాల్ని వారి అర్థశాస్త్రంలో వాడరు. ఈనాడు ద్రవ్యోల్బణం గురించి తెలుసుకోవాల్సిన ఆవశ్యకత ఎంతో ఉంది గనుక ప్రతి ఒక్కరు చదివి తెలుసుకోవాలని కోరుతున్నాను. గతం నుంచి ఈ నాటి వరకు కూడ ఆ ధర్మం అనే పేరుతోనే జనాన్ని మోసం చేస్తున్నారు. ఈనాడు కూడా ప్రజాస్వామ్యం పేరుతోనే ప్రజల్ని వంచిస్తున్నారు. అందుకనే ద్రవ్యోల్బణం వ్యాసం చాలా విలువైంది అంటున్నాను. వెనుకబాటుతనం - వ్యవస్థ సంస్కృతి ప్రభావం అనే వ్యాసంలో ప్రజల్ని ఇంతకాలం కర్మసిద్ధాంతంతో కట్టిపడేశారు అనే

*(మిగతా 9వ పేజీలో...)*

# పెద్దమనుషులందరి చేతులకూ బొగ్గు మసి

బొగ్గుగనులను కార్పొరేట్ సంస్థలకు కేటాయించడంలో భారత ప్రభుత్వం ప్రజాప్రయోజనకరమైన, పారదర్శకమైన విధానాలు అమలు చేయడం లేదని, బొగ్గుగనులను అలా కేటాయించడం వల్ల ఆ గనుల యజమానులకు లక్షల కోట్ల రూపాయల అక్రమ లాభం చేకూరిందని 2012 మార్చ్ లో కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సిఎజి) నివేదికతో ప్రారంభమైన చర్చ చివరికి కేంద్ర విజిలెన్స్ కమిషన్, సిబిఐ పరిశోధనలకు, సుప్రీంకోర్టు కేసుకు దారితీసింది. తవ్వినకొద్దీ బయటపడుతున్న ఈ కుంభకోణంలో ప్రధానమంత్రి, బొగ్గు శాఖ కేంద్ర మంత్రులు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అత్యున్నతాధికారులు, కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీల పార్లమెంట్ సభ్యులు, టాటా, బిర్లా, జిందాల్ వంటి బడా పారిశ్రామికవేత్తలు ఎందరెందరికో సంబంధం ఉంది. సాధారణంగా అన్ని పాలకవర్గ ముఠాలకూ సంబంధం ఉన్న ఇటువంటి విషయాలలో అందరికందరూ కూడబలుక్కుని 'గప్‌చుప్ సాంబర్ బుడ్డీ, ఎక్కడి దొంగలు అక్కడే' అన్నట్టు మౌనంగా ఉండిపోతారు గాని, ఇక్కడ బడా కార్పొరేట్ సంస్థల మధ్యనే వేల కోట్ల రూపాయల పోటీ ఉండడం, అది రాజకీయ పక్షాల మధ్య తగాదాగా పరిణమించడం, కాగ్, విజిలెన్స్ కమిషన్, సిబిఐ వంటి సంస్థలు అనివార్యస్థితిలో కొన్ని నిజాలు ప్రకటించడంతో చిలికి చిలికి గాలివాన అయింది.

సిబిఐ గతంలో దాఖలు చేసిన చార్జిషీటులో కొంతమంది పారిశ్రామిక వేత్తలకు ఈ కుంభకోణంతో సంబంధం ఉన్నదని తేల్చగా, తాజాగా దాఖలు చేసిన మరొక ఛార్జిషీటులో హిండాల్కో కు చెందిన కుమార్ మంగళం బిర్లాను, అప్పటి బొగ్గు శాఖ కార్యదర్శి పి సి పరఖ్‌ను కూడ నిందితులుగా చేర్చింది. 'మా కంపెనీ అన్ని పనులూ చట్టప్రకారమే చేసింది' అని హిండాల్కో ప్రకటించింది. 'నేను చేసింది పొరపాటు నిర్ణయమైతే కావచ్చు గాని అక్రమం కాదు. అది విధానం ప్రకారం చేసిందే. అయినా నేను చేసింది తప్పయితే అప్పుడు బొగ్గు మంత్రిత్వ శాఖను చూస్తున్న మన్మోహన్ సింగ్ కూడ బాధ్యుడే' అని పరఖ్ అన్నాడు. 'బిర్లా వంటి పెద్దమనిషి మీద అవినీతి ఆరోపణ చేస్తారా' అని దేశంలోని వాణిజ్య పత్రికలన్నీ గగ్గోలు పెడుతున్నాయి. 'పద్ధతి ప్రకారం పనిచేసినందుకు మా ఐఎఎస్ అధికారులను ఇలా ఇరికిస్తారా' అని దేశవ్యాప్తంగా అధికారులందరూ కన్నెర్ర చేస్తున్నారు. 'ఇలా చేస్తే దేశపు వాణిజ్య విశ్వసనీయత ఏమైపోతుంది? పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు తమ పెట్టుబడులు పెట్టి దేశాన్ని ఉద్ధరించడానికి వస్తారా' అని పారిశ్రామికవేత్తలు, కేంద్ర మంత్రులు, అర్థశాస్త్రవేత్తలు, న్యాయవాదులు, పత్రికాధిపతులు గగ్గోలు పెడుతున్నారు. ఛార్జిషీట్ నుంచి కుమార్ మంగళం బిర్లా పేరు ఉపసంహరించాలని సిబిఐ ఆలోచిస్తున్నదని వార్తలు వస్తున్నాయి.

పర్యవసానాల మీద ఇంతగా జరుగుతున్న గందరగోళంలో అసలు విషయాలు మరుగున పడిపోతున్నాయి. ఒకవైపు బొగ్గుగనులను జాతీయం చేసిన ప్రభుత్వమే ఆ విధానాన్ని తిరగదోడి వేర్వేరు సాకులతో ప్రైవేటు వ్యాపార, పారిశ్రామిక సంస్థలకు బొగ్గుగనులు అప్పగించడం ప్రారంభించింది. అలా బొగ్గు గనులు అప్పగించడానికి 1976లోనే నిర్ణయం తీసుకున్నా, 1993లో ఆ నిర్ణయాన్ని మరింత విస్తరించినా, ఏ ప్రాతిపదిక మీద అలా అప్పగించవచ్చునో కచ్చితమైన విధాన నిర్ణయం మాత్రం జరగలేదు. ఒక అధికారుల స్క్రీనింగ్ కమిటీ ఇష్టారాజ్యంగా ఆ అనుమతులు ఇస్తూ వచ్చింది. తమకు బొగ్గుగని కావాలని చాలమంది దరఖాస్తు చేసుకున్నప్పుడు, తక్కువమందికి మాత్రమే ఇచ్చే అవకాశం ఉన్నప్పుడు తప్పనిసరిగా లంచాలు, ముడుపులు, పైరవీలు, పెద్దవారి ఆశీస్సులు వగైరా అక్రమాలు జరుగుతూనే ఉండేవి.

ఒడిశాలోని తాల్చేర్ బొగ్గుగనుల్లో తాలబీరా గని తమకు ఇవ్వాలని ఆదిత్య బిర్లా గ్రూప్ కు చెందిన అల్యూమినియం కంపెనీ హిండాల్కో దరఖాస్తును 2005లో పరిశీలించినప్పుడు ఆ గనిని నైవేలీ లిగ్నైట్ కార్పొరేషన్ అనే ప్రభుత్వ రంగ సంస్థకు ఇవ్వాలని స్క్రీనింగ్ కమిటీ నిర్ణయించింది. కాని ఆ నిర్ణయంపై తుది ఆమోదం ఇవ్వవలసిన ప్రధానమంత్రి కార్యాలయం ఆ నిర్ణయాన్ని పునరాలోచించమని వెనక్కి పంపింది. అప్పుడు హిండాల్కోను నైవేలీ లిగ్నైట్ తో, మహానది కోల్ ఫీల్డ్స్ అనే మరొక ప్రభుత్వ రంగ సంస్థతో కలిసి కూటమిగా ఏర్పడమని సలహా ఇచ్చి, ఆ కూటమికి ఆ గనులు కట్టబెట్టారు.

ఆతర్వాత ఆరు సంవత్సరాలకు పాత చిట్టాలు వెతుకుతున్న కాగ్ జరిగిన ఎన్నో అక్రమాలతో పాటు ఈ అక్రమాన్నీ కనుగొని బయటపెట్టింది. మొత్తం మీద 2004 నుంచి 2009 వరకు ఇచ్చిన అనుమతులతోనే ప్రైవేట్ వ్యాపార గృహాలకు, కొన్ని ప్రభుత్వరంగ సంస్థలకు రు. 10.76 లక్షల కోట్ల లాభాలు అప్పనంగా అందాయని ముసాయిదా నివేదిక రాసింది. నిజానికి బొగ్గు రంగంలో అక్రమాలు 1976 నుంచి జరుగుతున్నాయి. 1993 నుంచి పెరిగాయి. కాగ్ తవ్వి తీసినది సముద్రంలో కాకిరెట్ట మాత్రమే. అయినా కాగ్ మీద ఒత్తిడి తెచ్చి ఆ ముసాయిదాను మార్పించి, తుది నివేదికలో మొత్తం నష్టాన్ని రు. 1.86 లక్షల కోట్లకు తగ్గించారు. దాని ఆధారంగానే సుప్రీంకోర్టులో కేసు దాఖలైంది. విచారణ క్రమంలో పాత ఫైళ్లు సమర్పించమని సుప్రీం కోర్టు అడిగితే ఆ ఫైళ్లు మాయమైపోయాయని ప్రభుత్వం చెప్పింది. ఈ దేశంలో ప్రభుత్వం అనేది అంత క్రమబద్ధంగా, పద్ధతి ప్రకారం నడుస్తున్నదన్నమాట! ఇక సిబిఐ దొరికిన సమాచారంతోనే ఛార్జిషీట్లు వేయడం ప్రారంభించింది. సిబిఐ కూడ హోం మంత్రిత్వశాఖకు చెందిన అంగమే గనుక దాన్ని గౌరవించవలసిన అవసరమేమీ లేదు. కాని పాలకవర్గ ముఠా తగాదాల వల్ల అప్పుడప్పుడు ప్రజలకు అవసరమైన, తెలియవలసిన విషయాలు ఇలా బయటపడుతుంటాయి.

అలా ఈ కుంభకోణంలో బిర్లాలకు, అధికారులకు, కేంద్ర మంత్రులకు, రాజకీయ నాయకులకు, స్వయంగా ప్రధాన మంత్రి కార్యాలయానికి కూడ సంబంధం ఉందని బయటపడింది. అటు బిర్లా గానీ, ఇటు అధికారి గాని తాము విధానం ప్రకారమే పని చేశామని చెప్పడం ఇక్కడ గుర్తించవలసిన అంశం. అంటే ఈ దేశంలో అక్రమమే, అవినీతే, ఆశ్రిత పక్షపాతమే, ప్రజలకు చెందిన వనరుల లూటీయే ప్రభుత్వ విధానం అన్నమాట.

వీ

# రెండు రాష్ట్రాల తెలుగు ప్రజల ఐక్యత, వికాసం కావాలి

ఎట్టకేలకు అక్టోబర్ 3న కేంద్ర మంత్రివర్గ సమావేశం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుపై కాబినెట్ నోట్ ను అనుమతించింది. ఆ తర్వాత జరిగిన మూడు వారాలలో ఒక మంత్రివర్గ ఉపసంఘాన్ని నియమించారు. అది ఇప్పటికి రెండు సార్లు సమావేశం అయింది. ప్రజల నుంచి సలహాలను, సూచనలను ఆహ్వానిస్తోంది. సలహాలు, సూచనలు స్వీకరించడానికి నవంబర్ 5 ఆఖరితేదీ అని ప్రకటించింది. ఆ తర్వాత బిల్లు తయారు అవుతుందని, అది రాష్ట్రపతి దగ్గరికి వెళ్లి, ఆంధ్రప్రదేశ్ శాసనసభకు వచ్చి, వెనక్కి వెళ్లి పార్లమెంటు శీతాకాల సమావేశాలలో ఆమోదం పొందుతుందని అంటున్నారు. ఈ పనులన్నీ సక్రమంగా జరిగితే బహుశా డిసెంబర్ మొదటి వారంలోనో, రెండో వారంలోనో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు చట్టబద్ధం కావచ్చు. ఈలోగా పరస్పర వ్యతిరేక ప్రకటనలు, రెండు నాలుకల ధోరణి, ఉద్వేగాలను రెచ్చగొట్టే ప్రకటనలు, అబద్ధ ప్రచారాలు జరుగుతూనే ఉన్నాయి. కేంద్రప్రభుత్వం, కాంగ్రెస్ పార్టీ తమ మాటకు కట్టుబడి ఉంటాయా అని అనుమానించడానికి ఇప్పటికి కూడ ఆస్కారం ఉంది. కాని అరవై సంవత్సరాల తెలంగాణ ప్రజల ఆకాంక్షను అంగీకరించక తప్పని స్థితికి పాలకవర్గాలు చేరుకున్నాయనే అనిపిస్తున్నది. అంటే తెలంగాణ ఒక రాష్ట్రంగా ఏర్పడుతుంది. మిగిలిన ఆంధ్ర ప్రదేశ్ ఆ పేరుతో గాని, మరొక పేరుతో గాని మరొక రాష్ట్రంగా ఉంటుంది. ఈలోగా జరిగే పాలనాపరమైన సర్దుబాట్లు, మార్పు చేర్పులు యథావిధిగా జరిగిపోతాయి. తెలంగాణ వారైనా, మిగిలిన ఆంధ్ర ప్రదేశ్ వారైనా తెలుగు ప్రజలందరూ ఈ దశలో పునర్నిర్మాణం గురించీ, ప్రజానుకూల అభివృద్ధి విధానాల గురించీ, ఇరు ప్రాంతాల ప్రజల మధ్య సమన్వయ పూర్వక మైత్రి గురించీ ఆలోచించవలసి ఉంది. ఏర్పడనున్న రెండు రాష్ట్రాల భవిష్యత్ పునర్నిర్మాణం ప్రజానుకూలంగా జరగడానికి రాజకీయ పార్టీల మీద ప్రజలు, ప్రజాసంఘాలు, బుద్ధిజీవులు నిరంతర ఒత్తిడిని, జాగరూకతను ప్రదర్శించాలి. గత ఆరు దశాబ్దాల పాలనలో తెలంగాణకు మాత్రమే కాదు, ఉత్తరాంధ్రకూ, పల్నాడుకూ, రాయలసీమకూ, శ్రీకాకుళం నుంచి ఆదిలాబాద్ దాకా విస్తరించిన అటవీ ప్రాంతానికీ కూడ అన్యాయం జరిగింది. అసలు మొత్తంగా అన్ని ప్రాంతాల ప్రజలకూ అన్యాయం జరిగింది. పిడికెడు మంది పాలకుల ఇష్టారాజ్యంగా, వారి ఆశ్రితుల వైభోగంగా ఉమ్మడి రాష్ట్రం కొనసాగింది. ఇప్పుడు ఏర్పడనున్న రెండు రాష్ట్రాల ప్రజలూ చైతన్యయుతంగా ఈ విధానాలను అరికట్టడానికి ఉద్యుక్తులు కావాలి. ప్రజా సంక్షేమం, ప్రజా వికాసం, కనీసం రాజ్యాంగ ఆదేశిక సూత్రాలు పాలనా ప్రాతిపదికగా ఉండాలని ఉద్యమించాలి. అలాగే పాలక విధానాల అన్యాయాల వల్ల రాష్ట్రం రెండుగా విడిపోవడానికి దారి తీసినప్పటికీ ప్రజల మధ్య సంబంధాలు చెడిపోనక్కరలేదు. ఒకే భాష మాట్లాడే ఈ రెండు రాష్ట్రాల ప్రజలు మైత్రితో, సుహృద్భావంతో, ఉమ్మడి చారిత్రక, సాహిత్య, సాంస్కృతిక అంశాలను పరస్పరం గౌరవించుకుంటూ, యాభై ఏడు సంవత్సరాల మనుగడలో తగిలిన గాయాలను మాన్పుకుంటూ ముందుకు సాగవలసి ఉంది. రెండు రాష్ట్రాల ప్రజలూ ఏకమై రెండు రాష్ట్రాల పాలకుల మెడలు వంచి తమ వికాసాన్ని సాధించుకోవాలి.

వీ

# శ్రీలంకలో కామన్‌వెల్త్ సమావేశాన్ని బహిష్కరించాలి

భారత ప్రభుత్వానికి ఒక స్థిరమైన, సూత్రబద్ధమైన విదేశాంగ విధానం లేదని ఆరు దశాబ్దాల పైబడిన గత చరిత్ర రుజువు చేస్తున్నది. ఆ చరిత్రకు కొనసాగింపుగానే నవంబర్ 15-17ల్లో జరగనున్న కామన్ వెల్త్ ప్రభుత్వాధినేతల సమావేశం (కామన్ వెల్త్ హెడ్స్ ఆఫ్ గవర్నమెంట్స్ మీట్ - చోగమ్) సమావేశాన్ని బహిష్కరించమని దేశదేశాల్లో వస్తున్న డిమాండ్ ను, ప్రపంచవ్యాప్తంగా మానవహక్కుల సంఘాలు చేస్తున్న విజ్ఞప్తిని, చివరికి తమిళనాడు శాసనసభ ఏకగ్రీవ తీర్మానాన్ని కూడ పక్కనపెట్టి భారత ప్రభుత్వం ఆ సమావేశానికి వెళ్తున్నది. చోగమ్ సమావేశాన్ని బహిష్కరించమని అడగడానికి కారణం అది తమిళ జాతిని హననం చేసిన, దారుణ మారణకాండకు పాల్పడిన, యుద్ధనేరాల ప్రభుత్వ నాయకత్వంలో శ్రీలంక రాజధాని కొలంబోలో జరగనున్నది. అరవై మంది పాత్రికేయులను చంపి పత్రికారచన ప్రమాదకరంగా మారిన దేశాల జాబితాలో అగ్రభాగాన నిలిచిన దేశం శ్రీలంక. జాతి, వర్ణ, మత, రాజకీయ విశ్వాసాలకు అతీతంగా ప్రజలందరికీ సమానహక్కులు కల్పించాలని చోగమ్ 1971 లో ఆమోదించిన సింగపూర్ డిక్లరేషన్ మౌలిక ప్రాతిపదిక సూత్రాన్ని ఉక్కుపాదంతో అణచివేసి, నెత్తురుటేర్లలో ముంచిన అధ్యక్షుడు మహింద రాజపక్ష నిర్వహిస్తున్నది. సమావేశం శ్రీలంకలో జరగడం మాత్రమే కాదు, ఆ సమావేశం నరహంతకుడు మహింద రాజపక్షను రానున్న రెండు సంవత్సరాలకు కామన్ వెల్త్ ప్రభుత్వాధినేతల నేతగా (చెయిర్ పర్సన్ ఇన్ ఆఫీస్) ఎన్నుకోబోతున్నది. తమిళ ప్రజల పట్ల, తమిళ ఈలం ఉద్యమం పట్ల శ్రీలంక ప్రభుత్వం ఎంత దుర్మార్గమైన అణచివేత విధానాన్ని అమలు చేసిందో అందరికీ తెలుసు. ఉత్తరాదిన వేలాది మంది తమిళులను ఊచకోత కోసి, తమిళ ఈలం కోరిన ఎల్‌టిటిఇ ని నిర్మూలించిన తర్వాత, తమిళుల ఆకాంక్షలు నెరవేర్చడానికి రాజ్యాంగ సవరణ చేస్తున్నామని చెప్పి మోసం చేసిన ఘనత రాజపక్షది. ఎన్నికలు నిర్వహించినప్పటికీ, ఆ ఎన్నికలలో 38 స్థానాలకు 30 స్థానాలు గెలుచుకుని తమిళ నేషనల్ అలయన్స్ అధికారం చేపట్టినప్పటికీ, అర్థవంతమైన అధికార వికేంద్రీకరణ జరపకుండా ఉన్నదీ, తమిళులను రెండో తరగతి పౌరులుగానే చూస్తున్నదీ శ్రీలంక ప్రభుత్వం. అటువంటి చోట చోగమ్ సమావేశం సక్రమంగా జరిగిపోతే శ్రీలంక సింహళ జాతి దురహంకార పాలకులు తమ విధానాలకు ఆమోదం దొరికిందని విర్రవీగుతారు. తమిళుల మీద మరింతగా హింసా దౌర్జన్యాలు జరపడానికి పథకాలు రచిస్తారు. యుద్ధనేరాల మీద విచారణ జరపమని వెల్లువెత్తుతున్న డిమాండ్‌ను పెడచెవిన పెడతారు. ఐక్యరాజ్యసమితి నిపుణుల కమిటీ నివేదిక, డబ్లిన్ శాశ్వత ప్రజా న్యాయస్థానం తీర్పు, ఛానెల్ 4 డాక్యుమెంటరీలు శ్రీలంక ప్రభుత్వ మానవ హనన కార్యక్రమాలను స్పష్టంగా తెలియజెప్పాయి. సరిగ్గా ఈ కారణాల వల్లనే ప్రముఖ రచయితలు నోమ్ ఛామ్‌స్కీ, ఒర్హాన్ పాముక్, అరుంధతీ రాయ్ శ్రీలంకలో 2011లో జరిగిన అంతర్జాతీయ సాహిత్య సమావేశాన్ని బహిష్కరించారు. మానవహక్కుల గురించి ఆలోచించేవారి కనీస బాధ్యత అది. భారత ప్రభుత్వం కూడ ఆ బాధ్యత పాటించి శ్రీలంక చోగమ్ ను బహిష్కరించాలని భారత సమాజమంతా ఒత్తిడి తేవలసి ఉంది.

వీ

# వర్తమాన చరిత్ర - రాజకీయార్థిక దృష్టి

**ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటు**

భారత ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటు ఆరోగ్యకరంగా ఉందా లేదా అని ఇటీవల పెద్ద ఎత్తున చర్చ జరుగుతున్నది. వర్తమాన ఆర్థిక సంవత్సరంలో వృద్ధి రేటు భారత ప్రభుత్వం అంచనా వేస్తున్నట్టు 6.1 శాతం ఉండదని, అది 4.25 శాతం మాత్రమే ఉండబోతుందని అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ అక్టోబర్ 9న ప్రకటించింది. వెంటనే భారత ప్రభుత్వం తరపున మంత్రులు, అధికారులు ఐఎంఎఫ్ అంచనాను తప్పుపడుతూ ఖండన ప్రకటనలు ఇచ్చారు. ఆ మర్నాడే ప్రపంచ బ్యాంకు కూడ భారత వృద్ధి రేటు అంచనా కన్న తక్కువగానే, 4.7 శాతం మాత్రమే ఉండబోతుందని ప్రకటించింది. ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ (ఫిక్కి) వృద్ధిరేటు అంచనాలను 6 శాతం నుంచి 5 శాతానికి తగ్గించగా, కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (సిఐఐ) వృద్ధి రేటు 5 శాతానికి కూడ చేరకపోవచ్చునని అంది. ఈలోగా ఆసియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ (4.7 శాతం), హాంకాంగ్ అండ్ షాంఘై బ్యాంకింగ్ కార్పొరేషన్ (4 శాతం), క్రెడిట్ రేటింగ్ సంస్థ క్రిసిల్ (4.8 శాతం) కూడ వృద్ధి రేటు తక్కువగానే ఉంటుందని అన్నాయి. రెండు వారాలు గడిచినా ఈ వివాదం ఇంకా సాగుతూనే ఉంది. వృద్ధిరేటు గురించి తెలుగు పత్రికలలో కూడ అప్పుడప్పుడు వార్తలు, వ్యాఖ్యలు వస్తుంటాయి. వృద్ధి రేటుకు అర్థం ఏమిటో, అది ఎలా లెక్కిస్తారో, ఎంత ఉంటే ఏమవుతుందో, ప్రజాజీవితం మీద దాని ప్రభావం ఏమిటో చాలమంది పాఠకులకు తెలియని స్థితి ఉంది.

వృద్ధి రేటు అనేది పెట్టుబడిదారీ అర్థశాస్త్రం ప్రకారం ఆర్థిక వ్యవస్థకు, అంటే మొత్తంగా ప్రజా జీవనానికి సంబంధించి ఒక ముఖ్యమైన సూచిక. ఒక ఆర్థిక వ్యవస్థ గత సంవత్సరం కన్న ఈ సంవత్సరం ఎంత పెరిగింది, ఆ పెరుగుదల ఏ వడి (రేటు) తో ఉంది అని చెప్పేదే వృద్ధి రేటు. ఒక దేశపు ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటు ఎక్కువగా ఉన్నదంటే ఆ ఆర్థిక వ్యవస్థ ఆరోగ్యకరంగా పెరుగుతున్నదని అర్థం. తక్కువగా ఉన్నదంటే ఆ ఆర్థిక వ్యవస్థలో పెరుగుదల లేదని అర్థం. అయితే ఎన్నో రంగాలతో, విస్తృతంగా ఉన్న ఆర్థిక వ్యవస్థలో ఒక రంగం మాత్రం ఇబ్బడి ముబ్బడిగా పెరిగి, మిగిలిన రంగాలన్నీ దిగజారి పోయినా, సగటున ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటు పైకి పోతున్నట్టే కనబడుతుంది. అలాగే దేశంలోని 120 కోట్ల జనాభాలో ఒక వంద మంది తలా వెయ్యి కోట్ల ఆదాయం సంపాదించి, మిగిలిన 119,99,99,900 మంది ఆర్థిక పరిస్థితి యథాతథంగా ఉన్నా, దిగజారినా కూడ దేశ ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటు పైకి పోతున్నట్టే కనబడుతుంది. ఉదాహరణకు ప్రస్తుతం భారత ఆర్థిక వ్యవస్థలో 25 శాతం సంపద 100 కుటుంబాలకే చేరుతున్నది. ఆ 100 కుటుంబాల వృద్ధే దేశపు వృద్ధిరేటు పెరుగుతున్నట్టుగా భ్రమ కల్పిస్తుంది. అన్ని గణాంకాలలో ఉన్న మాయాజాలం లాగనే ఇది సగటు గణాంకమే తప్ప, నిజంగా ప్రజాజీవనంలో, జీవన ప్రమాణాలలో అభివృద్ధికి సూచికకాదు.

వృద్ధి రేటును లెక్క కట్టడానికి అర్థ గణాంక శాస్త్రవేత్తలు, అంతర్జాతీయ, జాతీయ పాలక, విధాన నిర్ణాయక సంస్థలు ప్రధానంగా జాతీయోత్పత్తి, జాతీయాదాయం అనే భావనల మీద ఆధారపడతారు. కనుక వృద్ధి రేటు గురించి తెలుసుకోవడానికి ముందు జాతీయోత్పత్తి భావన గురించి తెలుసుకోవాలి.

ఒక దేశ ఆర్థిక వ్యవస్థను లెక్క కట్టడానికి ప్రధానంగా జాతీయాదాయం (నేషనల్ ఇన్‌కమ్) అనేదాన్ని ప్రమాణంగా తీసుకుంటారు. ఈ ప్రమాణాన్ని సాంకేతికంగా, సంక్లిష్టంగా తయారుచేసి స్థూల జాతీయ ఉత్పత్తి (గ్రాస్ డొమెస్టిక్ ప్రాడక్ట్ – జిడిపి), స్థూల జాతీయాదాయం (గ్రాస్ నేషనల్ ఇన్‌కమ్), నికర జాతీయ ఉత్పత్తి (నెట్ నేషనల్ ప్రాడక్ట్ – ఎన్ ఎన్ పి) లాంటి అనేక కొత్త ప్రమాణాలు తయారు చేశారు. అమెరికన్ అర్థశాస్త్రవేత్త సైమన్ కుజ్నెట్స్ 1934లో అమెరికన్ కాంగ్రెస్ కోసం తయారుచేసిన ఒక నివేదికలో జిడిపి భావనను రూపొందించాడు. ప్రపంచ బ్యాంకును, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థను తయారుచేసిన బ్రెటన్‌వుడ్స్ సమావేశం (1944) ఈ జిడిపి భావనను ప్రామాణికం చేసి ఏ దేశ ఆర్థిక వ్యవస్థనైనా లెక్కించే ప్రాతిపదికగా నిర్ణయించింది. ఆ విధంగా జిడిపిని, అది సాధించే వృద్ధి రేటును ప్రమాణాలుగా తీసుకోవడం బూర్జువా అర్థశాస్త్రంలో ఆనవాయితీ అయింది.

స్థూల జాతీయోత్పత్తి అనేది ఆ సంవత్సరంలో దేశంలో, ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి అయిన మొత్తం సరుకుల, సేవల మార్కెట్ విలువ. దాన్ని లెక్కించడానికి మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి అయిన సరుకుల, సేవల మార్కెట్ ధరలను, లేదా దేశంలోని మొత్తం ఆదాయాలను, లేదా దేశంలోని మొత్తం ఖర్చును కూడుతారు. సైద్ధాంతికంగా ఈ మూడు పద్ధతులలో ఏది అనుసరించినా ఒకే అంకె వస్తుంది. స్థూల జాతీయోత్పత్తిని గణించడానికి వ్యక్తిగత వినియోగాల మొత్తం – పెట్టుబడుల మొత్తం – ప్రభుత్వ ఖర్చు – (ఎగుమతుల ఆదాయం – దిగుమతుల ఖర్చు) అనే సూత్రాన్ని వాడుతారు. జిడిపిని జనసంఖ్యతో విభజించగా వచ్చే అంకెను తలసరి ఆదాయం అంటారు. ఆ జాతీయోత్పత్తి పెరుగుదల రేటే వృద్ధి రేటు. అదే తలసరి ఆదాయానికి కూడ వర్తిస్తుంది.

ఈ స్థూల జాతీయోత్పత్తిని కూడ వర్తమాన ధరల్లోను, స్థిరధరల్లోను (అంటే ఏదో ఒక ముందరి సంవత్సరాన్ని ప్రాతిపదిక సంవత్సరంగా తీసుకొని) లెక్కిస్తారు. ఆ గణాంకానికి కూడ ముందస్తు అంచనా, మొదటి సవరణ అంచనా, రెండో సవరణ అంచనా, నిర్ధారిత అంకె అనే నాలుగు అంకెలు ఉంటాయి. అంటే 2012-13 గణాంకం చెప్పేటప్పుడు అది ముందస్తు అంచనాగా మాత్రమే ఉంటుంది. 2011-12 మొదటి సవరణ అంచనా, 2010-11 రెండో సవరణ అంచనా, 2009-10 మాత్రమే నిర్ధారిత గణాంకం అన్నమాట. అంటే భారత ప్రభుత్వం 2012-13 ఆర్థిక సంవత్సరం ముగిసిన తర్వాత, 2009-10 నిర్ధారిత అంకెను ప్రకటించ గలుగుతుందన్నమాట. ఇలా ఈ గణాంకాన్ని తయారు చేయడంలోనే ఇంత గందరగోళం ఇమిడి ఉండగా భారత ప్రభుత్వం, అర్థశాస్త్రవేత్తలు, ఆర్థిక వ్యవస్థ నిర్వాహకులు ఈ అంకె మీదనే తమ ఆశలన్నీ పెట్టుకుని ఆ మాయతో అమాయకులను మోసం చేస్తూ ఉంటారు.

ఇక ఈ అంకె ఒక ఏడాది నుంచి మరో ఏడాదికి ఎలా పెరుగుతున్నదనేది వృద్ధి రేటు. సహజంగానే అది వర్తమాన ధరలతో లెక్కించినప్పుడు ఒకరకంగానూ, స్థిరధరలతో లెక్కించినప్పుడు మరొకరకంగానూ ఉంటుంది. ఆ వృద్ధి రేటు అంకెను ఒక పెద్ద మాయాజాలంగా మార్చి అది చాల ముఖ్యమైనదన్నట్టు, దాని మార్పు ప్రజల జీవితాల మీద ఏదో పెనుమార్పు వేయబోయేట్టు అర్థశాస్త్రవేత్తలు, ప్రభుత్వాధికారులు, మంత్రులు

స్థూల జాతీయోత్పత్తికీ, వృద్ధి రేటుకూ సంబంధించి ప్రభుత్వ గణాంకాలు

| | 2007-08 | 2008-09 | 2009-20 | 2010-11 | 2011-12 | 2012-13 |
|---|---|---|---|---|---|---|
| వర్తమాన ధరల జిడిపి (రు. కోట్లు) | 49,87,090 | 56,30,063 | 64,77,827 | 77,95,313 | 89,74,947 | 1,00,28,118 |
| వృద్ధి రేటు (శాతం) | 16.1 | 12.9 | 15.1 | 20.3 | 15.1 | 11.7 |
| స్థిర ధరల (2004-05) జిడిపి (రు. కోట్లు) | 38,96,636 | 41,58,676 | 45,16,071 | 49,37,006 | 52,43,582 | 55,03,476 |
| వృద్ధి రేటు (శాతం) | 9.3 | 6.7 | 8.6 | 9.3 | 6.2 | 5.0 |

మూలం: భారత ప్రభుత్వ ఎకనమిక్ సర్వే, 2012-13

మాట్లాడుతుంటారు. హైందవ బ్రాహ్మణీయ శక్తులు గ్రహాలకు, గ్రహచలనాలకు మానవ జీవితంతో కల్పించిన సంబంధం లాంటిది ఇది. ఆ సంబంధం ఉండే అవకాశం లేకపోయినా ప్రతి ఒక్కరూ తమ గ్రహచారం ఎలా మారుతుందోనని భయపడుతుండే లాగనే వృద్ధిరేటు తగ్గితే తమ పరిస్థితి దిగజారుతుందేమోనని సగటు మనిషి భయపడే పరిస్థితి కల్పించారు.

ఈ జిడిపి అంకెను బట్టి తలసరి ఆదాయాన్ని లెక్కగట్టి, ఆ తలసరి ఆదాయమే జీవన ప్రమాణాలకు సూచిక అని చెపుతూ, వృద్ధి రేటు పెరిగినట్టుగానే తలసరి ఆదాయం కూడ పెరుగుతున్నదని, ప్రజల జీవన ప్రమాణాలు పెరుగుతున్నాయని భ్రమ కల్పించడం ప్రభుత్వాలు నేర్చుకున్న కొత్త వంచనాశిల్పం. దేశం మొత్తానికి సగటున లెక్కగట్టే జిడిపి వృద్ధి రేటు వ్యక్తిగత తలసరి ఆదాయాలకు వర్తించదనేది మొదటి అంశం. ఒకవేళ వర్తించినా ఆ వృద్ధి రేటు కన్న ధరల పెరుగుదల రేటు ఎక్కువగా ఉన్నప్పుడు జీవనప్రమాణం దిగజారడమే జరుగుతుంది తప్ప మెరుగుదల జరగదనేది రెండో అంశం. ఇంతకూ జిడిపి ని రూపొందించిన కుజ్నెట్స్ కూడ దాన్ని సామాజిక సంక్షేమ సూచికగా వాడడానికి వీలులేదని హెచ్చరిక చేశాడు. కాని ఇవాళ సంక్షేమ రాజ్యాలమని చెప్పుకుంటున్న అన్ని దోపిడీ ప్రభుత్వాలు జిడిపి లెక్కలు, తలసరి ఆదాయ లెక్కలు, వృద్ధి రేటు లెక్కలు చూపి ప్రజాసంక్షేమ పథకాలు రచిస్తున్నాయి.

**బొగ్గు కుంభకోణం - బడా పెట్టుబడి**

బొగ్గు గనుల కేటాయింపు కుంభకోణం వివాదం ప్రస్తుతం పతాక శీర్షికలకు ఎక్కుతున్నది గాని ఈ కుంభకోణానికి కనీసం నలభై సంవత్సరాల వయసు ఉంది. 2004 నుంచి 2011 వరకు కోల్ ఇండియా లిమిటెడ్ పనితీరు గురించి అధ్యయనం చేసి రెండు సంవత్సరాల కింద కాగ్ తయారుచేసిన ముసాయిదా నివేదికలో ఆ ఎనిమిది సంవత్సరాలలో బొగ్గు గనులను ప్రైవేటు సంస్థలకు అప్పగించినందువల్ల భారత ప్రభుత్వ ఖజానాకు 10 లక్షల 76 వేల కోట్ల రూపాయలు నష్టం వాటిల్లిందని రాసింది. తుది నివేదికను పార్లమెంటులో ప్రవేశ పెట్టే సమయానికి ఆ నష్టాన్ని ఒక లక్షా 86 వేల కోట్ల రూపాయలకు తగ్గించారు. ఈ కుంభకోణంలో ప్రధానమంత్రితో సహా, బొగ్గు శాఖ కాబినెట్ మంత్రులు, సహాయ మంత్రులు, అధికారులు, రాష్ట్ర ప్రభుత్వాలు కూడ భాగస్తులే.

ఈ కేసు విజిలెన్స్ కమిషన్ కూ, సిబిఐకీ వెళ్లినప్పటికీ, సుప్రీంకోర్టులో కేసు నడుస్తున్నప్పటికీ విచారణ నడవవలసిన దిశలో నడవడం లేదు. ఈ లోగా కేంద్ర ప్రభుత్వ బొగ్గు మంత్రిత్వశాఖలో ఈ కేసుకు సంబంధించిన అతి కీలకమైన ఫైళ్లు మాయమైపోయాయి.

దేశంలో ఉన్న ఖనిజ వనరులేవైనా దేశ ప్రజల ఉమ్మడి సంపద. వాటిని తమ అవసరాల కొరకు పొదుపుగా వాడుకోవడం, భవిష్యత్తరాల కొరకు భద్రపరచడం, పరిరక్షించడం ప్రజల బాధ్యత. ప్రజల చేత ఎన్నికయ్యామని, ప్రాతినిధ్య పాలన నడుపుతున్నామని చెప్పుకునే ప్రభుత్వాలు ఆ బాధ్యత నిర్వహించాలి. కాని అధికారం అంటే దేశాన్ని లూటీ చేయడానికి ఐదు సంవత్సరాల అనుమతి అనుకుంటున్న రాజకీయ పార్టీలు ఈ సహజ వనరులను అడ్డికి పావుసేరుగా అమ్మి పెట్టుబడిదారులకు లాభం చేకూర్చి, తాము లాభపడుతున్నాయి.

దేశంలోని బొగ్గు గనులు బ్రిటిష్ పాలనాకాలం నుంచి 1971 వరకు పూర్తిగా ప్రైవేటు సంస్థల చేతుల్లోనే ఉండేవి. భారత ప్రభుత్వం 1971-73లలో తెచ్చిన జాతీయకరణ చట్టాలతో అవి ప్రభుత్వ రంగంలోకి వచ్చాయి. కాని అతి త్వరలోనే ఈ జాతీయకరణ విధానానికి తూట్లు పొడవడం మొదలయింది. బొగ్గు గనుల జాతీయకరణ చట్టం (1973)కు 1976లోనే సవరణ తెచ్చి ఇనుము, ఉక్కు పారిశ్రామికవేత్తలు సొంత బొగ్గు గనులు ఉంచుకోవచ్చునని అనుమతి ఇచ్చారు. ప్రపంచీకరణ విధానాలలో భాగంగా 1993లో జాతీయకరణ చట్టాన్ని మరింత సవరించి విద్యుదుత్పత్తి రంగానికీ సిమెంట్ పరిశ్రమకూ కూడ సొంత బొగ్గు గనులను అనుమతించారు. ఈ నాలుగు రంగాలలో పరిశ్రమలు పెడుతున్నామనే పేరుతో బొగ్గు గనులు సంపాదించి, ఆ పరిశ్రమలు పెట్టకుండానే బొగ్గు తవ్వి ఇతరులకు అమ్ముకోవడం, పరిశ్రమలు పెట్టినా, తమకు అవసరమైనదానికన్న ఎక్కువ తవ్వి ఆ బొగ్గును, తమకు పనికి రాని స్థాయి బొగ్గును అమ్మడం ద్వారా వందల కోట్ల రూపాయలు సంపాదించడం బడా పారిశ్రామిక గృహాలకు సర్వసాధారణమైంది. దీనిలో లాభాలు ఎంత పెద్ద ఎత్తున ఉంటాయంటే టన్నుకు కనీసపక్షం నాలుగు వేల రూపాయలు ధర పలికే బొగ్గు తవ్వుకున్నందుకు పారిశ్రామికవేత్తలు ప్రభుత్వానికి చెల్లించవలసిన రాయల్టీ ఎక్కువలో ఎక్కువ నాలుగువందల రూపాయలు. ఒక్కొక్క పారిశ్రామిక గృహానికి వేల టన్నుల బొగ్గు తవ్వుకునే అనుమతులు దక్కాయి.

ఈ అనుమతులు ఇవ్వడానికి ఒక అధికారుల స్క్రీనింగ్ కమిటీకి సర్వాధికారాలు ఇస్తూ 1992లో బొగ్గు మంత్రిత్వశాఖ ఒక ఉత్తర్వు జారీ చేసింది. బొగ్గు గనులు కావాలని కోరే దరఖాస్తుదారులలో ఎవరికి ఏ ప్రాతిపదిక మీద ఇవ్వాలనేది 2005 దాకా నిర్ణయమే కాలేదు. కాని వందలాది అనుమతులు ఇవ్వడం మాత్రం జరిగిపోయింది. ఆ తర్వాత మార్గదర్శక సూత్రాలు ఏర్పరిచినప్పటికీ ఆశ్రితులకు అనుమతులు, అక్రమాలు, లంచాలు తవ్వినకొద్దీ బైటపడేటన్ని జరిగాయి.

ఈ దేశంలో పాలకవర్గాలు ఎన్ని అక్రమ మార్గాలలో, ఎంత దేశ వ్యతిరేకంగా, ప్రజా వ్యతిరేకంగా పాలిస్తున్నాయో, దేశ ప్రజలకు దక్కవలసిన సహజవనరులను తమ హక్కుభుక్తంగా, తమ యజమానులైన పెట్టుబడిదారుల బొక్కసంగా మారుస్తున్నాయో, మొత్తంగా భారత రాజకీయార్థిక వ్యవస్థ ఎట్లా దొంగల రాజ్యంగా ఉన్నదో, నడుస్తున్నదో అక్షరాలా కళ్లకుకట్టే ఉదాహరణ ఈ బొగ్గు కుంభకోణం. వీ



❖ **ఆల్బమ్** – హైకు సదృశ కవితలు – గోపరాజు రాధాకృష్ణ పుస్తకం ప్రచురణ,46 పేజీలు, 1/10 డెమీ, రు. 25, ప్రతులకు : గోపరాజు రాధాకృష్ణ, కేరాఫ్ గోపరాజు జవహర్‌లాల్, మోరి – 533 250; తూర్పు గోదావరి జిల్లా, ఫోన్ : 9948823500



❖ **కులం పునాదులు** – సామాజిక శాస్త్రం – డా. కత్తి పద్మారావు, లోకాయత ప్రచురణలు, 156 పేజీలు, 1/8 డెమీ, రు. 100, గ్రంథాలయ ప్రతి రు. 200, ప్రతులకు : కత్తి స్వర్ణకుమారి, అంబేడ్కర్ రీసెర్చ్ సెంటర్, 6-3-600/ఎ/2/-1, ఎఫ్ 5, తేజస్విని అపార్ట్‌మెంట్స్, హిల్‌టాప్ కాలనీ, ఎర్రమంజిల్, హైదరాబాద్ – 500 082; ఫోన్ : 9849741695; ఇమెయిల్ : padmaraokathi@yahoo.co.in



❖ **బీఫ్ రాజకీయాలు** – తెలంగాణ విద్యార్థి వేదిక – 76 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: కె. జగన్, రూం నెం. 40, నర్మదా హాస్టల్ (ఎన్.ఆర్.ఎస్.హెచ్) ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ – 500 007; ఫోన్ : 9912402011



❖ **పెద్ద కచ్చురం** – బూర్ల వేంకటేశ్వర్లు సాహితీ సోపతి ప్రచురణ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : బి. సంతోష, ఇ.నెం. 3-64/1, గ్రా. లాలపల్లి, ఎల్గైడ్ (పో & మం.), కరీంనగర్ – 505 525; ఫోన్: 9491598040; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **గీతాంజలి** – కేతవరపు రామకోటిశాస్త్రి – జిజ్ఞాస ప్రచురణ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ మందిర్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్



❖ **అంతస్తాపము** (ఛందోబద్ధపద్యాల సంపుటి) ఎలనాగ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 66 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **కావ్యనందనం** (మొదటి సంపుటం) డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 1/8 డెమీ, రు. 200



❖ **ఓనమాలు** (కవిత్వం) నాగరాజు రామస్వామి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 83 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **నీటి చుక్క** (దీర్ఘ కవిత) ఈతకోట సుబ్బారావు – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 46 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **నిత్య గాయాల నది** (కథలు) బెజ్జారపు రవీందర్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : బెజ్జారపు రవీందర్, 2-1-5/14/డి2, సురభి కాలనీ, అమర్‌నగర్, పెద్దపల్లి – 505 172; ఫోన్ : 9491046104;

పై పుస్తక ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్: 27678430; ఇమెయిల్ : palapittabooks@gmail.com

*(...4వ పేజీ తరువాయి)*

విషయాన్ని తెలియజేశారు. ఇంత శాస్త్ర జ్ఞానం పెరిగినా విచక్షణా జ్ఞానం కోల్పోయి ఇంకా కర్మ సిద్ధాంతాన్నే అనుసరిస్తూ ప్రజలు ఏవిధంగా దోపిడి వర్గాలకు వూడిగంజేస్తూ, వారి పల్లకీని మోస్తున్నరో అనేది అర్థమవుతుంది. ఈ రాజకీయ నాయకుల మోసకారితనానికి బలవుతూ కూడా వారినే నమ్ముకొని జైకొడుతున్నారు. ఏదో ఒక బలమైన నాయకుని ప్రాపకం సంపాదించుకొని జీవనం గడపాలని తప్ప తమకు స్వతంత్రంగా, గౌరవంగా జీవించగలిగే హక్కుందనే ఆలోచనే ప్రజలకు లేకుండా పోతున్నది అనేది నేటి వాస్తవం. తెలంగాణ విభజన, సమైక్యాంధ్ర ఉద్యమం వ్యాసం కూడా చాలా ముఖ్యమైంది. కొద్దోగొప్పో చైతన్యవంతం చేయగలిగిన ప్రజాసంఘాల ఉనికి సీమాంధ్రలో నామ మాత్రమైపోయింది. ఫలితంగా సీమాంధ్ర ప్రాంతాలలో సమైక్యాంధ్ర ఉద్యమం ఎగిసిపడుతుంది అంటున్నారు వ్యాస రచయిత. ఇది నిజమేగదా! ఎంతో మంది జనం కూడా అనుకునేది ఇదే విషయం. వేరే మార్గం చూపించే వారు లేరు కాబట్టి నయవంచకులైనప్పటికి వారేశరణ్యం అవుతున్నారు మాకు అని అంటుండడం యథార్థం. ఇదొకరకమైన బానిసత్వం అవవచ్చు.

– కడియాల సుబ్బనాచారి, దుత్తలూరు

ద్రవ్యోల్బణం మీద వ్యాసం చాలా బాగుంది. క్లిష్టమైన ఆర్థిక, సాంకేతిక విషయాలను బాగా వివరించారు. పాఠకులకు చాలా అవసరమైన ఈ వ్యాసంలో ఒక చిన్న పొరపాటు దొర్లింది. అది మొత్తం వ్యాస స్ఫూర్తికి భిన్నమైనది కాదు గాని, అది ఒక వాస్తవం గనుక గుర్తించాలని రాస్తున్నాను. కేంద్ర ప్రభుత్వ ద్రవ్యోల్బణ లెక్కలు టోకు ధరల సూచి (హోల్‌సేల్ ప్రైస్ ఇండెక్స్ – డబ్ల్యూపిఐ) కేంద్ర ప్రభుత్వ పరిశ్రమల మంత్రిత్వ శాఖలోని ఆర్థిక సలహాదారు కార్యాలయం తయారు చేయగా, కార్మిక మంత్రిత్వ శాఖకు చెందిన లేబర్ బ్యూరో (కన్స్యూమర్ ప్రైస్ ఇండెక్స్ – సిపిఐ) తయారు చేస్తుంది. పారిశ్రామిక కార్మికులకు, వ్యవసాయ కార్మికులకు, గ్రామీణ శ్రమజీవులకు, పట్టణ ప్రాంతాల శారీరకేతర శ్రమలు చేసే ఉద్యోగులకు విడివిడిగా ఈ సిపిఐ తయారు చేస్తారు. మొదటి మూడిటిని లేబర్ బ్యూరో తయారు చేయగా, నాలుగో దాన్ని కేంద్ర స్టాటిస్టికల్ సంస్థ తయారు చేస్తుంది. ఇంత వివరంగా చిల్లర ధరల సూచి తయారైనప్పటికీ, ద్రవ్యోల్బణం లెక్కలలో చాలా దేశాలలో లాగా చిల్లర ధరల సూచిని వాడడం లేదు. టోకు ధరల సూచినే వాడుతున్నారు.

– డి. సుబ్రహ్మణ్యం, అర్థశాస్త్రవేత్త, న్యూ ఢిల్లీ

## సకల జన భేరి

పార్లమెంట్‌లో తెలంగాణ బిల్లును ప్రవేశపెట్టాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ పొలిటికల్ జెఎసి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 29న నిజాం కాలేజీ గ్రౌండ్‌లో 'సకల జన భేరి' బహిరంగ సభ జరిగింది. ఈ సభకు టిఆర్ఎస్ పార్టీ అధ్యక్షులు కె. చంద్రశేఖర్‌రావు, పొలిటికల్ జెఎసి చైర్మన్ కోదండరాం, టిఎన్‌జిఒ అధ్యక్షులు దేవి ప్రసాద్, టిఆర్ఎస్ ఎంఎల్ఎలు, కార్యకర్తలు, వివిధ ఉద్యోగ సంఘాలు, విద్యార్థి సంఘాలు, ప్రజా సంఘాలు, అలాగే తెలంగాణ జిల్లాల నుంచి వేలాది మంది ప్రజలు హాజరయ్యారు.

## డిజిపిగా ప్రసాద్‌రావు

రాష్ట్ర డిజిపిగా 1979 బ్యాచ్‌కు చెందిన సీనియర్ ఐపిఎస్ అధికారి బి. ప్రసాద్‌రావు సెప్టెంబర్ 30న అధికారాలు చేపట్టారు. గతంలో ఆయన ఆర్‌టిసి ఎం.డి.గా,అవినీతి నిరోధక శాఖ (ఎసిబి) చీఫ్‌గా బాధ్యతలు నిర్వహించారు. ప్రసాదరావు స్వస్థలం గుంటూరు జిల్లా, తెనాలి మండలం, తేలప్రోలు.

## సినీ నటుడు శ్రీహరి మృతి

ప్రముఖ సినీ నటుడు శ్రీహరి (49) అక్టోబర్ 9న ముంబైలోని లీలావతి హాస్పిటల్‌లో కాలేయ వ్యాధితో బాధపడుతూ చనిపోయారు. ఆయనది కృష్ణా జిల్లా, పెదపారుపూడి మండలం, యలమర్రు గ్రామం. శ్రీహరి 1964 ఆగస్టు 15న జన్మించారు. హీరోగా, విలన్‌గా, క్యారెక్టర్ ఆర్టిస్టుగా నటించారు. ఆయన తెలుగు, మలయాళం, కన్నడం, తమిళం, హిందీ మొదలైన భాషల్లో 98 చిత్రాలలో నటించారు. ఆయన తొలి చిత్రం బ్రహ్మనాయుడు.

## టిపిఎఫ్ ఆవిర్భావ సభ

తెలంగాణ ప్రజా ఫ్రంట్ మూడో ఆవిర్భావ సభ అక్టోబర్ 9న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగింది. ఈ సభకు హాజరైన వక్తలు హైదరాబాదు పదేళ్ల ఉమ్మడి రాజధానికి, పోలవరం ప్రాజెక్టు నిర్మాణానికి వ్యతిరేకంగా మాట్లాడారు.తెలంగాణ పునర్నిర్మాణం లో ప్రజాసంఘాల పాత్ర క్రియాశీలకంగా ఉండాలన్నారు. ఈ సభకు విరసం సభ్యులు వరవరరావు, ప్రముఖ విద్యావేత్త చుక్కా రామయ్య, ప్రొ. హరగోపాల్, ప్రజాఫ్రంట్ అధ్యక్షులు ఆకుల భూమయ్య, ఉపాధ్యక్షులు ఎం. వేదకుమార్‌తో పాటు తెలంగాణ జిల్లాల్లోని అనేక మంది కార్యకర్తలు, ప్రజలు హాజరయ్యారు.

## హెచ్ఆర్ఎఫ్ మహాసభలు

మానవహక్కుల వేదిక 5వ రాష్ట్ర మహాసభలు అక్టోబర్ 12, 13 తేదీలలో విశాఖపట్నం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జరిగాయి. ఈ సభల్లో వివిధ జిల్లాలకు చెందిన ప్రతినిధులు చేపట్టిన కార్యక్రమాలను వివరించారు. రాష్ట్ర కార్యవర్గం రాష్ట్రంలోని జల వివాదాలను పరిష్కరించేందుకు ప్రభుత్వం ప్రత్యేక జలవిధానం రూపొందించాలని, ప్రాంతీయ అసమానతలు రూపుమాపేందుకు ప్రత్యేక విధానాలను అమలు చేయాలని, కొవ్వాడ అణు విద్యుత్తు కేంద్రం నిర్మాణం నిలిపివేయాలని, విశాఖ – కాకినాడ తీరంలో చేపట్టే పిసిపిఐఆర్ ప్రాజెక్టు నిలిపివేయాలని, దళితులపై దాడుల విషయంలో ప్రభుత్వం ఉదాసీనతను విడనాడాలని తీర్మానాలు చేసింది. రెండు సంవత్సరాల నూతన కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. అధ్యక్షులుగా ఎన్. జీవన్‌కుమార్, కార్యదర్శిగా వివిఎస్. కృష్ణ తిరిగి ఎన్నికయ్యారు.

## రావూరి భరద్వాజ మృతి

ప్రముఖ రచయిత, సాహితీవేత్త, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత రావూరి భరద్వాజ (86) అక్టోబర్ 18న హైదరాబాద్‌లో అనారోగ్యంతో చనిపోయారు. ఆయన 1925 జూలై 5న కృష్ణా జిల్లా, మోగులూరు గ్రామంలో జన్మించారు. రావూరి 187 రచనలు, 17 నవలలు, 500లకు పైగా కథలు రాశారు. పాకుడురాళ్లు, కాదంబరి. శిథిలసంధ్య, ఆ కళ్లు మొదలైన నవలలు, కిన్నెరసాని, లోకంకోసం కథల సంపుటిలతో పాటు ఆయన అనేక రచనలు చేశారు. పాకుడురాళ్లు అనే నవలకు రావూరి జ్ఞానపీఠ అవార్డు అందుకున్నారు. తెలుగు వాళ్లలో జ్ఞానపీఠ అవార్డు అందుకున్న మూడో వ్యక్తి ఈయననే.

## మహిళలపై ఆగని దాడులు

అక్టోబర్ 18న హైదరాబాదులోని హైటెక్ సిటీలో ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగినిని ఇద్దరు యువకులు వోల్వో కారులో ఎక్కించుకుని అత్యాచారం చేశారు. ఆ తర్వాత ఆమె ఉండే స్థలానికి తీసుకెళ్లి దింపేశారు. ఈ సంఘటన రాష్ట్ర రాజధానిలో జరగడంతో సంచలనం అయ్యింది. దీంతో రాష్ట్ర పోలీసులు రంగంలోకి దిగి వారిని అరెస్టు చేసి రిమాండ్‌కు పంపించారు.

## వై. రాధాకృష్ణమూర్తి మృతి

మాజీ రాజ్యసభ సభ్యులు, కమ్యూనిస్టు నాయకులు, ప్రజావైద్యులు, సాహిత్యాభిలాషి డా. యలమంచిలి రాధాకృష్ణమూర్తి (86) అక్టోబర్ 19న హైదరాబాదులో అనారోగ్యంతో చనిపోయారు. ఆయన కులాంతర వివాహాలు, విధవా వివాహాలు చేయించారు. ఆయన పౌరహక్కుల కోసం ఉద్యమించారు. ఆయన కృష్ణా జిల్లా, గుడివాడ మండలం, జమీదింట గ్రామంలో జన్మించారు.

## మున్సిపల్ కార్మికుల సమ్మె

రాష్ట్రంలోని మున్సిపల్ కార్మికులు తమ డిమాండ్ల సాధన కోసం అక్టోబర్ 21 నుండి 23 వరకు సమ్మె చేశారు. కార్మికులు సమ్మె చేయడంతో రాష్ట్రంలో అన్ని మున్సిపల్ కార్పొరేషన్‌లలో పనులు నిలిచిపోయాయి. దీంతో రాష్ట్ర ప్రభుత్వం స్పందించి వారి డిమాండ్లను అంగీకరించింది. ఈ సమ్మెలో మున్సిపల్ మజ్దూర్ సంఘం, సిఐటియు, హెచ్ఎంఎస్, ఐఎన్‌టియుసి, ఎఐయుటియుసి, టిఎన్‌టియుసి, టిఆర్ఎస్‌కెవి మొదలైన మున్సిపల్ కార్మిక సంఘాలు పాల్గొన్నాయి.

## అదనపు జడ్జీల నియామకం

రాష్ట్ర హైకోర్టు అదనపు న్యాయమూర్తులుగా తొమ్మిది మంది నియమితులయ్యారు. వారి చేత హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కల్యాణ్‌జ్యోతిసేన్ గుప్తా అక్టోబర్ 23న ప్రమాణ స్వీకారం చేయించారు.

## రాష్ట్రంలో భారీ వర్షాలు

రాష్ట్రంలో భారీ వర్షాల కారణంగా అపార ప్రాణ, ఆస్తి నష్టం సంభవించింది. ముప్పై మందికి పైగా చనిపోయారు. రాష్ట్ర వ్యాప్తంగా లక్షల హెక్టార్ల పంట నష్టం జరిగింది. వరి, పత్తి, మొక్కజొన్న, వేరుశెనగ మొదలైన పంటలు నీట మునిగాయి. మార్కెట్ యార్డుల్లో ధాన్యం తడిసి పోయింది. ఈ వర్షాలకు వేలాదిగా ఇళ్లు కూలిపోయాయి. మూడు వందలకు పైగా పశువులు చనిపోయాయి. వందలాది చెరువులు, వంతెన లు, రోడ్లు తెగిపోయి ప్రజల రాకపోకలకు ఇబ్బందులు ఏర్పడ్డాయి. వీ

# రాజ్యాంగ సంస్థల తీర్పులు

**అవినీతికి, నేరాలకు నిలయమైన పార్లమెంటరీ వ్యవస్థను మార్చే శక్తి న్యాయస్థానాలకు, రాజ్యాంగ సంస్థలకు లేదనీ, దానిని ప్రజా చైతన్యంతో మాత్రమే మార్చడం సాధ్యమనీ అంటున్నారు పి. వి. రమణ**

ప్రజాస్వామ్యం అంటే ప్రజలది, ప్రజల కొరకు, ప్రజల చేత పాలించబడే సమాజమని పెద్దలు చెప్పారు. కాని నేడు దేశంలో ప్రజల పేరుతో, ప్రజలు లేని, ప్రజలకు వ్యతిరేకంగా పాలించడమే ప్రజాస్వామ్యంగా అమలవుతున్న సందర్భంలో ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి చాలా ప్రయత్నాలు జరుగుతున్నాయి. వాటిలో భాగంగానే వేసిన ప్రజా ప్రయోజనాల వాజ్యాలపై రాజ్యాంగ సంస్థలైన సుప్రీంకోర్టు, కేంద్ర సమాచార కమిషన్‌లు ఇచ్చిన తీర్పులను చూడాలి.

రాజకీయాల్లో నేర చరితులను అరికట్టడానికి సుప్రీంకోర్టు రెండు తీర్పులతోపాటు ఎన్నికల్లో ఉచిత హామీలపై, అభ్యర్థులను తిరస్కరించే హక్కుపై మరో రెండు తీర్పులు ఇచ్చింది. ప్రజాప్రాతినిధ్య చట్టంలోని కొన్ని అంశాలు రాజ్యాంగ నిబంధనల్ని ఉల్లంఘిస్తున్నాయని, ఉన్నత న్యాయస్థానాల్లో పెండింగ్ కేసులున్నవారిపై వేటు పడకుండా రక్షణ కల్పించడమంటే నేరమయ రాజకీయాలను ప్రోత్సహించడమేనని, నేరగాళ్లకు ఓటు హక్కు లేకుండా వారు ఎంపిలు, ఎంఎల్‌ఎలు కాకుండా నిషేధం విధించాలని లిల్లీ థామస్‌తో పాటు స్వచ్ఛంద సేవా సంస్థ 'లోక్ ప్రహరి'కి చెందిన ఎస్ఎన్. శుక్లాలు దాఖలు చేసిన ప్రజా ప్రయోజన కేసుపై జస్టిస్ ఎఎన్. పట్నాయక్, జస్టిస్ ఎస్‌జె. ముఖోపాధ్యాయలతో కూడిన ధర్మాసనం ఇచ్చిన తీర్పు ప్రకారం చట్టంలో ఉన్న నిబంధన 'చట్టసభలలో సభ్యులను దోషిగా నిర్ధారిస్తూ తీర్పు వెలువడిన 3 నెలల వరకు అనర్హత వేటు వేయరాదు. ఆ వ్యవధిలో ప్రజాప్రతినిధి ఉన్నత న్యాయస్థానాలలో సవాలు చేసుకోవచ్చు. పిటిషన్ దాఖలు చేశాక, అది పరిష్కారం అయ్యేంతవరకు అనర్హత వేటు వేయరాదు' అన్నదాన్ని కొట్టివేస్తూ ఈ చట్టం ద్వారా ప్రజాప్రతినిధులకు వెసులుబాటు కల్పించడం ద్వారా ప్రభుత్వం తన అధికారాలను అతిక్రమించిందని ఆక్షేపిస్తూ 'ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 8 (4) రాజ్యాంగ విరుద్ధం. దోషిగా ప్రకటించిన నాటినుండే అనర్హత వేటు వర్తిస్తుంది. ఈ తీర్పుకంటే ముందు ఉన్నత న్యాయస్థానాలలో సవాల్ చేసిన ఎంపిలు, ఎంఎల్‌ఎలు, ఇతర ప్రజాప్రతినిధులకు ఈ నిర్ణయం వర్తించదు' అని తీర్పు ఇచ్చింది.

పోలీసు కస్టడీలో ఉన్నవారు ఎన్నికల్లో పోటి చేయరాదన్న పాట్నా హైకోర్టు ఉత్తర్వులను సవాలు చేస్తూ, ప్రభుత్వ ఎన్నికల కమీషనర్, ఇతరులు, దాఖలు చేసిన పిటిషన్‌పై విచారణ జరిపిన జస్టిస్ ఎఎన్. పట్నాయక్, జస్టిస్ ఎస్‌జె. ముఖోపాధ్యాయలతో కూడిన ధర్మాసనం జూలై 10న మరో తీర్పు చెప్పింది. 'ప్రజాప్రాతినిధ్య చట్టంలోని 62 (5) సెక్షన్‌లో నిబంధన ప్రకారం ఓటరు కాని వారు చట్ట సభలకు పోటీ చేయరాదన్న హైకోర్టు ఉత్తర్వులలో మాకు లోపమేమీ కనిపించలేదు. ఎన్నుకునే వ్యక్తి ఓటరు అయివుంటేనే ఎన్నికల్లో పోటీ చేయగలరని, కారాగారం లేదా పోలీసు కస్టడీలో ఉండడం వలన ఓటు హక్కు ఉండదని పేర్కొంది. జైలులో ఉన్న వ్యక్తి ఓటు వేయజాలరంటే, పోటీ కూడా చేయజాలరు. సెక్షన్ 62(5) ప్రకారం జైలు శిక్ష కారణంగా గానీ, మరే ఇతర కారణాల వల్ల గానీ, కారాగారంలో ఉన్న వారు, పోలీసు కస్టడీలో ఉన్న వారు ఓటు వేయలేరని' చెప్పింది.

చట్టసభలోకి నేరగాళ్ల ప్రవేశాన్ని నిరోధించే దిశగా సుప్రీంకోర్టు ఈ తీర్పు ఇచ్చింది. జైలు, పోలీసు కస్టడీలలో ఉన్న వ్యక్తులు పార్లమెంటు, అసెంబ్లీకు పోటీ చేయరాదని తేల్చి చెప్పింది. ఏ చట్టం కిందైనా ముందస్తు నిర్బంధం (ప్రివెంటివ్ డిటెన్షన్) లో ఉన్న వారికి మాత్రం ఈ అనర్హత వర్తించదని పేర్కొంది. ఈ తీర్పులో విచారణ ఖైదీలుగా కటకటాల వెనుక ఉంటూ కూడా ఎన్నికల బరిలోకి దిగే నేతలకు కళ్లెం వేసింది. 'ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని 4, 5 సెక్షన్‌లు చట్టసభలకు పోటీచేయడానికి అర్హతలు నిర్దేశించాయని, ఇందులోని ఒక నిబంధన ప్రకారం పోటీ చేయాలనుకునేవారు ఓటరు అయి ఉండాలని గుర్తు చేసింది. 4, 5, 62(5) సెక్షన్‌లను కలిపి విశ్లేషించిన ధర్మాసనం జైలు లేదా పోలీస్ కస్టడీలో ఉన్నవారు ఎన్నికల్లో పోటీ చేయరాదని పేర్కొంది. దోష నిర్ధారణ జరగకపోయినా, విచారణ ఖైదీగా జైలులో ఉన్నా ఎన్నికల్లో పాల్గొనడానికి అవకాశం లేదు.

అన్నాడిఎంకె, డిఎంకె పార్టీలు ఎన్నికల హామీలను నెరవేర్చాలని తీసుకున్న నిర్ణయాలను సవాలు చేస్తూ న్యాయవాది సుబ్రహ్మణ్య బాలాజీ వేసిన పిటిషన్‌ను పరిష్కరిస్తూ జూలై 5న, జస్టిస్ పి.సదాశివం, జస్టిస్ రంజన్ గొగోయ్‌లతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం 'ఓటర్లను ఆకర్షించడానికి రాజకీయ పార్టీలు ఎన్నికల ప్రణాళికలలో ప్రకటించే ఉచిత హామీలు, నిష్పాక్షిక, స్వేచ్ఛాయుత ఎన్నికల పునాదులు దెబ్బ తీస్తాయి. పార్టీల మేనిఫెస్టోలలోని ఉచిత హామీలు ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని నిబంధన 123 ప్రకారం అవినీతి కార్యకలాపాల కిందకి రావు. వాటిని నియంత్రించేందుకు ఎన్నికల కమిషన్ తగు మార్గదర్శకాలను రూపొందించుకోవాలి. ఉచిత హామీలు ప్రజలందరినీ ప్రభావితం చేస్తాయన్నది కాదనలేని వాస్తవం. అది నిష్పాక్షిక స్వేచ్ఛాయుత ఎన్నికల భావన మౌలికతనే చాలా వరకూ దెబ్బతీస్తుంది' అని తీర్పు చెప్పారు.

**ఆర్డినెన్స్ రద్దుపై రాహుల్‌గాంధీ డ్రామా**

సుప్రీంకోర్టు తీర్పులను తీవ్రంగా వ్యతిరేకిస్తూ అన్ని రాజకీయ పార్టీలు ఏకాభిప్రాయానికి రావడంతో, ప్రభుత్వం ప్రజాప్రాతినిధ్య చట్టానికి సవరణలను ప్రతిపాదిస్తూ రెండు బిల్లులను పార్లమెంటులో ప్రవేశపెట్టింది.

'ఈ చట్టం సవరణ కోసం అన్ని రాజకీయ పార్టీలు ప్రభుత్వంపై తీవ్రమైన ఒత్తిడి తేవడంతో ఈ సవరణ బిల్లును ప్రవేశపెడుతున్నాం. కొన్నిసార్లు మేం తప్పులు చేశాం. కొన్ని సార్లు కోర్టులు తప్పులు చేశాయి. ఈ సందర్భంలో వారు చేసిన తప్పును మేం సరిదిద్దుతున్నాం' అని న్యాయశాఖ మంత్రి కపిల్ సిబాల్ వ్యాఖ్యానించారు.

ఆగస్టు 4న, అఖిలపక్ష కమిటీని ఏర్పాటు చేసిన ప్రభుత్వం, సుప్రీంకోర్టు తీర్పును ఎదుర్కోవడానికి వీలుగా ఎన్నికల చట్టాన్ని సవరిస్తామని వాగ్దానం చేసింది. నేరాభియోగాలు ఎదుర్కొనడం మంత్రి పదవులకు అనర్హత కాదంటూ సుప్రీంకోర్టుకు ప్రభుత్వం అఫిడవిట్ సమర్పించింది. తీర్పుపై కేంద్రం దాఖలు చేసిన సమీక్షా పిటిషన్‌ను సుప్రీంకోర్టు తోసిపుచ్చిన నేపథ్యంలో, ఆర్డినెన్స్‌ను తెస్తున్నామని లేకపోతే శిక్షకు గురైన శాసనకర్తల పని అయిపోయినట్లేనని కపిల్ సిబాల్ ప్రకటించారు.

సుప్రీంకోర్టు తీర్పులను దెబ్బతీయడానికి కేంద్ర ప్రభుత్వం, దోషులుగా తేలిన ఎంపిలకు, ఎంఎల్ఎలకు భద్రత కల్పించే ఆర్డినెన్స్‌ను సెప్టెంబర్ 24న ఆమోదించి రాష్ట్రపతి ఆమోదం కొరకు పంపింది.

దోషులుగా నిర్ధారణ అయినవెంటనే అనర్హులుగా ప్రకటించకుండా, వారు ఉన్నత న్యాయస్థానాల్లో 90 రోజుల లోపున అప్పీల్ చేసుకొన్నప్పుడు 'స్టే' లభించినప్పుడు, ఆ కేసు పూర్తిగా పరిష్కరించబడేవరకు ఎంపిలు, ఎంఎల్ఎలు చట్టసభల్లో ఓటు వేయడానికిగానీ, జీతభత్యాలు పొందడానికి అనర్హులేగానీ, పార్లమెంట్, అసెంబ్లీల కార్యకలాపాలలో పాల్గొనవచ్చని నిర్ధారించింది. కాంగ్రెస్ ఎంపి, వర్కింగ్ కమిటీ సభ్యుడు అయిన రషీద్‌మసూద్ అవినీతి కేసులో దోషిగా తేలడంతో, రాజ్యసభ సభ్యత్వానికి అనర్హుడవుతాడు. అతనినేకాక దోషులుగా నిర్ధారింపబడే అవకాశమున్న అనేక మంది తమ పార్టీ సభ్యులను కూడా రక్షించుకోవడానికే కేంద్రం ఈ ఆర్డినెన్స్‌ను తెచ్చిందని సులువుగానే అర్థమవుతుంది.

ఈ ఆర్డినెన్స్ అనైతికం, రాజ్యాంగ విరుద్ధమని బిజెపి ప్రకటించింది. దీనిపై స్పందిస్తూ కేంద్ర ఆర్థికమంత్రి చిదంబరం 'ఆగస్టు 13న జరిగిన అఖిల పక్ష సమావేశంలో బిల్లుకు మద్దతిస్తామని, ఆర్డినెన్స్ తేవడానికి బిజెపితోపాటు అన్ని రాజకీయ పార్టీలు ఏకగ్రీవంగా అంగీకరించాయి. ఇప్పుడు బిజెపి మాట తప్పి 'యు' టర్న్ తీసుకుందని' విమర్శించారు. దీన్ని బట్టి ఆర్డినెన్స్‌కు బిజెపి వ్యతిరేకత అన్నది పెద్ద అబద్ధం అని తేలుతుంది.

సెప్టెంబర్ 24న, విడుదల చేసిన ఆర్డినెన్స్ ప్రాముఖ్యతను, అవసరాన్ని వివరిస్తూ సెప్టెంబర్ 27న సమాచార శాఖమంత్రి మనీష్ తివారి, ప్రధానమంత్రి ఆఫీసుకు చెందిన మంత్రి నారాయణ స్వామిలు వేరొక చోట సమావేశం జరుపుతున్న సమయంలోనే, ప్రెస్‌క్లబ్ ఆఫ్ ఇండియాలో కాంగ్రెస్ పార్టీ ప్రధాన కార్యదర్శి అజయ్‌మాకెన్ కూడా సమావేశం కొనసాగిస్తూ అదే విషయాన్ని మాట్లాడుతున్న సమయంలోనే, అకస్మాత్తుగా కాగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ ప్రవేశించి 'ఈ ఆర్డినెన్స్ ఓ నాన్‌సెన్స్. మా ప్రభుత్వం తప్పు చేసింది. దీన్ని చించి అవతల పారేయాలి' అని కేకలు వేస్తూ ఇది తన వ్యక్తిగత అభిప్రాయమన్నాడు. 'పార్టీల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుందని, బిజెపి అయినా, సమాజ్‌వాది పార్టీ అయినా, జనతాదల్ (యు) అయినా ఇదే చేస్తాయి. మనం అదే చేశామని మా పార్టీ వాదిస్తుంది. ఈ నాన్‌సెన్స్‌కు తెర దించాల్సిన సమయం వచ్చేసింది. మా పార్టీతో సహా అన్ని పార్టీలకు చెపుతున్నాను. అవినీతిపై మనం పోరాడాల్సిందే, అయితే ఇలాంటి అంశాలపై రాజీపడుతూ సాగలేం. ఇలాంటి చిన్న చిన్న అంశాలపై రాజీపడితే ప్రతి చోటా రాజీపడుతూనే ఉంటాం' అని అన్నాడు. 'మా పార్టీ ఏం చేస్తోంది. మా ప్రభుత్వం ఏంచేస్తోంది అన్నది గమనిస్తుంటాను. అందుకే నేర చరితులపై సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పునకు వ్యతిరేకంగా ఆర్డినెన్స్‌ను తేవడం తప్పని చెపుతున్నాను' అని కూడా అన్నాడు.

అసలు కథ ఏమిటంటే అంతకు ముందు అంటే సెప్టెంబర్ 24న రాష్ట్రపతి ఆమోదానికి ఆర్డినెన్స్‌ను పంపితే, ఆయన సంతకం చేయకుండా కేంద్రహోంమంత్రి సుశీల్‌కుమార్‌షిండే, న్యాయశాఖమంత్రి కపిల్ సిబాల్‌లను పిలిపించి దీనిపై భిన్నాభిప్రాయాలు ఉండగా, మరో వైపు దీనికి సంబందించిన బిల్లు పార్లమెంట్‌లో పెండింగ్‌లో ఉండగా, హడావుడిగా ఈ ఆర్డినెన్స్ తేవలసిన అవసరం ఏముందని ప్రశ్నించినట్లు ప్రచారం జరిగింది. దాంతో ఆర్డినెన్స్ ఎలాగూ రద్దయ్యే అవకాశాలు ఉన్నందున, కేవలం తనవల్లనే ఆర్డినెన్స్ రద్దయినట్లుగా ప్రచారం కావాలి. దానికోసమే రాహుల్ చేసిన హడావుడి అని అర్థమవుతుంది.

రాహుల్ ఇలా ఆర్డినెన్స్‌ను వ్యతిరేకించడం నాన్‌సెన్స్ లాంటి తీవ్ర పదాలు వాడడం, ఆర్డినెన్స్‌ను విడుదల చేసిన ప్రధానమంత్రిని అవమానించడమేనని అనేక మంది విమర్శించారు. ఈ అవమానానికి ప్రతిగా ప్రధానమంత్రిని రాజీనామా చేయమని కూడా కోరారు. కాని సెప్టెంబర్ 7న కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ నాయకత్వంలో పనిచేయడం ఎంతో సంతోషదాయకమైన విషయంగా భావిస్తున్నానని, 2014 ఎన్నికల తరువాత ప్రధాని పదవి చేపట్టడానికి రాహులే సరైన నాయకుడని, పాలకవర్గాల విధేయుడుగా ప్రధాని మన్మోహన్‌సింగ్ చెప్పినదాన్ని మర్చిపోయారు. అమెరికాకు వెళ్లి తిరిగి వచ్చిన ప్రధాని మరుసటి రోజునే అంటే అక్టోబర్ 2న రాష్ట్రపతి, అటార్నీ జనరల్‌లతో చర్చించిన తరువాత కాబినెట్ సమావేశంలో కూడా చర్చించి ఆర్డినెన్స్‌తో పాటు ఇదే అంశంపై అంతకుముందు పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన బిల్లును కూడా ఉపసంహరించుకోవాలని కేంద్ర మంత్రివర్గం ఏకగ్రీవంగా తీర్మానించిందని ప్రకటించారు.

గతంలో కేబినెట్ ఈ ఆర్డినెన్స్‌ను సమర్థించింది కదా అని విలేఖర్లు వేసిన ప్రశ్నకు 'నిజమే నాతోపాటు కొందరు మంత్రివర్గ సహచరులు కూడా సమర్థించారు. కేబినెట్ నిర్ణయాన్ని సమర్థించడం మా బాధ్యత. పైగా ఈ ఆర్డినెన్స్‌ను రద్దు చేయడం ప్రజాభిప్రాయం పట్ల తమ ప్రభుత్వానికి గల గౌరవానికి ఇది సూచన. ప్రజాస్వామ్యమంటే శిలాయుగం కాదని, దేనిపైన అయినా పునరాలోచన ఉండొచ్చు' అని ప్రధాని వ్యాఖ్యానించారు.

జైలుపాలైన రాజకీయ నాయకులు ఎన్నికల్లో పోటీ చేసేందుకు వీలుకల్పించే మరొక బిల్లుకు రాష్ట్రపతి సెప్టెంబర్ 24న ఆమోదం తెలపడంతో ఇది చట్టరూపం దాల్చింది. ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని నిబంధనల ప్రకారం జైలులో ఉన్న వ్యక్తి పోటీ చేయడానికి అనర్హుడని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును రాజకీయ పార్టీలన్నీ ముక్తకంఠంతో వ్యతిరేకించాయి. ఈ తీర్పు దుర్వినియోగం అయ్యే అవకాశం ఉందని ఆందోళన వ్యక్తం చేశాయి. దాంతో కపిల్‌సిబాల్ ప్రవేశపెట్టిన ప్రాతినిధ్య

చట్ట సవరణ బిల్లును ఉభయ సభలు ఆమోదించాయి. దానికి రాష్ట్రపతి ఆమోదముద్ర వేయడంతో, జైలుకెళ్లిన రాజకీయనేతల భవిష్యత్తుకు భద్రత లభించింది. జైలులో ఉన్న వ్యక్తి పేరు ఓటరు జాబితాలో ఉంటే అది అలాగే కొనసాగుతుందని, దాంతో ఆ వ్యక్తి ఎన్నికల్లో నామినేషన్ వేయడానికి అభ్యంతరం ఉండదని సవరణ చేశారు.

దోషులుగా నిర్ధారింపబడిన సభ్యులను రక్షించడానికి విడుదల చేసిన ఆర్డినెన్స్‌పై అభ్యంతరాలు చెప్పిన రాష్ట్రపతి, జైలులో ఉన్న రాజకీయ నాయకులను కాపాడే బిల్లును ఎలా ఆమోదించారో చెప్పాలి. అభ్యంతరాలు ప్రచారానికేనని, నేర చరితులను కాపాడడంలో తాను ఏమాత్రం తీసిపోలేదని దీన్ని బట్టి అర్థమవుతోంది.

**తిరస్కార హక్కుపై 'సుప్రీం' తీర్పు**

తమకు నచ్చని రాజకీయ నాయకులను తిరస్కరించే హక్కు ఓటర్లకు ఇవ్వాలంటూ 2004లో 'పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్)' దాఖలు చేసిన ప్రజా ప్రయోజన వాజ్యంపై విచారణ జరిపి సెప్టెంబర్ 26న, సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. జస్టిస్ పి. సదాశివం నేతృత్వంలో జస్టిస్ రంజనా ప్రకాష్ దేశాయ్, జస్టిస్ రంజన్ గొగోయ్‌లతో కూడిన ధర్మాసనం ఎలక్ట్రానిక్ ఓటింగ్ మెషిన్ (ఇవిఎం)లలో 'పైన ఎవరూ కాదు (నన్ ఆఫ్ ది ఎబోవ్ – ఎన్‌ఓటిఎ) అన్న స్విచ్‌ను పెట్టాలని, బాలెట్ పత్రాలలో కూడా ఈ అంశం ఉండాలని' ఆదేశించారు. 'బరిలో నిలబడ్డ ఏ ఒక్కరికీ ఓటు వేయకూడదని నిర్ణయించుకున్నా, వారు ఓటు హక్కును వినియోగించుకున్నట్లే అవుతుంది. రహస్య ఓటు హక్కును కొనసాగించినట్లవుతుంది. ఎన్నికల ప్రక్రియలో పూర్తి మార్పులు తీసుకొచ్చే తిరస్కార హక్కు అత్యావశ్యకమని, ప్రజల ఆకాంక్షలను రాజకీయ పార్టీలు తప్పనిసరిగా గుర్తించే పరిస్థితి దీని వలన ఏర్పడుతుందని, పార్టీలు నిలబెట్టిన అభ్యర్థులపై ఎక్కువ మంది ప్రజలు అసంతృప్తి వ్యక్తం చేస్తే అవి మంచి వాళ్లను నిలబెట్టే పరిస్థితి వస్తుందని' అన్నారు. 'ఓటు హక్కును వినియోగించుకోవడం భావ వ్యక్తీకరణలో భాగమేనని, ఈ హక్కును రాజ్యాంగంలోని 19(1)ఎ అధికరణం కల్పించిందని, తిరస్కరించే హక్కును నిరాకరిస్తే భావప్రకటనా స్వేచ్ఛను అరికట్టడమేనని' స్పష్టం చేశారు.

'ప్రజాస్వామ్యం బతకాలంటే, దేశంలో సరైన పరిపాలన ఉండాలంటే ప్రజా ప్రతినిధులుగా ఉత్తములను ఎన్నుకోవడం అవసరం. ఉన్నత నైతిక విలువలు ఉన్నవారిని సానుకూల ఓటు ద్వారా ఎన్నుకుంటేనే సుపరిపాలన సాధ్యమవుతుంది. అందువల్ల 'వారిలో నాకెవరూ నచ్చలేదు' అన్న బటన్‌ను ఎంచుకునే హక్కు, చైతన్యపూరిత ప్రజాస్వామ్యంలో ఓటరుకు తప్పనిసరిగా కల్పించాలి. ఫలితంగా ఉత్తములను బరిలోకి దించాల్సిన తప్పనిసరి పరిస్థితి రాజకీయ పార్టీలకు ఎదురవుతుంది. పార్లమెంటులో ఉండే ఓటింగ్ యంత్రాలలో ఎస్, నోస్, అబ్‌స్టైన్/అవును, కాదు (కావాలని దూరంగా ఉండడం)కు సంబంధించిన మీటలుంటాయి. ఈ విధంగా సభ్యులు కావాలనుకుంటే తప్పించుకునే అవకాశమున్నప్పుడు సాధారణ ఓటర్లకు అదే హక్కు ఉంటే తప్పేమిటని' ఈ సందర్భంగా ప్రశ్నించారు. కాని మొదటిసారీ ఉత్తములుగా మొదలైన వారు రెండవసారి ఎన్నికలకు అవినీతిపరులుగా మారుతున్న నేటి వ్యవస్థలో సుప్రీంకోర్టు ఆశిస్తున్న మార్పులు సంభవమా అన్న ప్రశ్న ఎదురవుతుంది.

అయితే పోల్ అయిన ఓట్లలో 50 శాతానికి మించి తిరస్కార ఓట్లు వస్తే, ఆ స్థానంలో మళ్లీ ఎన్నికలు నిర్వహించాలన్న అంశంపై సుప్రీంకోర్టు స్పష్టత ఇవ్వకపోవడంపై భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి.

ఈ తీర్పుపై రాజకీయ పార్టీల ప్రతిస్పందన ఇలా ఉంది. అంబేద్కర్ కూడా సమర్థించిన 'తిరస్కార హక్కు'ను కల్పించిన తీర్పును బిఎస్‌పి నాయకురాలు మాయావతి స్వాగతించారు. కాంగ్రెస్, బిజెపి పార్టీలు తిరస్కార హక్కు పర్యవసానాల పట్ల ఆందోళన చెందుతూనే ఆహ్వానించాయి. కాని సిపిఎం నాయకుడు సీతారాంఏచూరి 'ఇది చాలా అసహజమైన సందర్భం, దాన్ని సరిచేయాల్సి ఉంది. ఎన్నికల్లో పాల్గొనే రాజకీయ పార్టీలతో మాట్లాడకుండా ఇలా నిర్ణయించడం సరైనది కాదు. దీని వలన అసాధారణమైన పరిస్థితులు తలెత్తే ప్రమాదం ఉంది' అని వ్యాఖ్యానించారు. బూర్జువా పార్టీల ద్వంద్వ ప్రమాణాల గురించి, వారి అవకాశవాదం గురించి అందరికీ తెలుసు. కానీ కమ్యూనిస్ట్ నాయకుడు ఇంత తీవ్రంగా ప్రతిస్పందించడానికి కారణం, దీని వలన ప్రజలు తమను కూడా తిరస్కరించినట్లు రికార్డయ్యే ప్రమాదం ఉందని గుర్తించారని అర్థం చేసుకోవచ్చు.

తిరస్కార ఓటింగ్ విధానం 13 దేశాల్లో అమలులో ఉంది. గ్రీస్, ఉక్రెయిన్, స్పెయిన్, కొలంబియా, రష్యా దేశాలలోనే కాక, అమెరికాలోని నెవాడా రాష్ట్రం కూడా ఈ విధానాన్ని ప్రవేశపెట్టి ఉపసంహరించుకున్నాయి. ఎన్నికల్లో పోటీ పడుతున్న అభ్యర్థులు ఎవరూ నచ్చకపోతే ఓటు వేయకుండా ఉండే హక్కును 1961 నాటి మన ఎన్నికల నియమావళిలో పొందుపరిచారు. ప్రజాప్రాతినిధ్య చట్టంలోని 49(ఒ) నిబంధన ప్రకారం ఓటు వేయదలచుకోని ఓటరు పోలింగ్ బూత్‌కు వెళ్లి పోలింగ్ అధికారికి తన అభిప్రాయాన్ని తెలియజేసి రూల్ బుక్ 17(ఎ) పత్రంలో ఓటరు తన పేరు నమోదు చేయించుకుని సంతకం చేయాలి. కాని ఈ ప్రక్రియ వలన తిరస్కార హక్కును వినియోగించుకున్న ఓటర్ల గురించి అందరికీ తెలిసిపోయి, రాజకీయ పార్టీల కక్ష సాధింపునకు గురయ్యే ప్రమాదముంది. ముఖ్యంగా రాజ్యాంగంలోని వాక్, భావప్రకటన హక్కులకు సంబంధించిన ఆర్టికల్ 19 (1) (ఎ), విముక్తిహక్కుకు చెందిన ఆర్టికల్ 21, రహస్య బాలెట్‌లోని భావనలను, ప్రజాప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 49 (ఒ) అతిక్రమించడం వలన రాజ్యాంగ విరుద్ధమైన ఈ సెక్షన్‌ను తొలగించి తిరస్కార ఓటింగ్ హక్కును ప్రవేశపెట్టాలని పియుసిఎల్ తన వాజ్యంలో కోరింది.

**కేంద్ర సమాచార కమిషన్ తీర్పు**

2011లో రాజకీయపార్టీలకు వచ్చే విరాళాలకు సంబంధించిన సమాచారాన్ని అందజేయమని కేంద్ర సమాచార హక్కుల కమిషన్ కోరిన సందర్భంలో సిపిఐతో సహా మరికొన్ని పార్టీలు నిరాకరించడంతో రాజకీయ పార్టీలంటే పబ్లిక్ అథారిటీలేనని, అందువల్ల వాటిని ఆర్‌టిఐ చట్ట పరిధిలోకి తీసుకురావాలని అనేక మంది డిమాండ్ చేశారు. ప్రజాస్వామిక సంస్కరణల సంఘం (ఎడిఆర్)తో పాటు ఎస్ సి. అగర్వాల్ అనే సమాచార హక్కుల కార్యకర్త వేసిన కేసుపై కేంద్ర సమాచార హక్కుల కమిషన్ కమిషనర్ సత్యానంద మిశ్రా జూన్ 3న 'ప్రభుత్వం నుండి ప్రత్యక్షంగా, పరోక్షంగా పలు ప్రయోజనాలను అందుకుంటున్న 6 ప్రధాన రాజకీయపార్టీలు కాంగ్రెస్, బిజెపి, బిఎస్‌పి, ఎన్‌సిపి, సిపిఐ,

సిపిఎంలు సమాచార హక్కు చట్టంలోని పబ్లిక్ సంస్థల నిర్వచనం పరిధిలోకి వస్తాయని' ప్రకటించారు.

ఇదే సమస్యపై రాజకీయపార్టీలను రక్షించుకోవడానికి, అవి పబ్లిక్ సంస్థలు కావని నిర్ధారిస్తూ ఆగస్టు 13న లోక్‌సభలో ప్రభుత్వం ప్రతిపాదించిన సమాచార హక్కు సవరణల బిల్లును విమర్శల ఒత్తిడికి తట్టుకోలేక ప్రభుత్వం సెప్టెంబర్ 5న, సవరణల బిల్లును 'పార్లమెంట్ స్టాండింగ్ కమిటీ'కి నివేదిస్తున్నట్టు మంత్రి నారాయణస్వామి ప్రకటించారు.

కామన్‌వెల్త్ హ్యూమన్ రైట్స్ ఇనిషియేటివ్ (సిహెచ్ఆర్ఐ క్రి) 40 దేశాల్లో పారదర్శక జవాబుదారీ తనాన్ని విశ్లేషించి ఇచ్చిన నివేదిక ప్రకారం 'ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీ, జపాన్ వంటి 40 దేశాల్లో రాజకీయ పక్షాలు తమ ఆస్తి, అప్పుల చిట్టాతో పాటు, ఆదాయ వ్యయ వివరాలన్నీ చట్టబద్ధంగానే ఏటా బహిరంగ పరుస్తున్నాయి. ఆయా దేశాల్లో పార్టీలు కొన్ని పూర్తిగా ప్రభుత్వ నిధులపై ఆధారపడుతుండగా, మరికొన్ని అటు ప్రభుత్వం నుండి, ఇటు ప్రజల నుండి విరాళాల రూపేణా నిధులందుకుంటున్నాయి. స్వీడన్, టర్కీ లాంటి దేశాల్లో పార్టీలు స్వచ్ఛందంగానే తమ వివరాల్ని ప్రజలకు అందుబాటులో ఉంచుతాయి. పార్టీగతమైన ఆర్థిక సమాచారాన్ని తమంతట తామే అందించేలా ఆస్ట్రియా, భూటాన్, బ్రెజిల్, కెన్యా, ఫ్రాన్స్ వంటి దేశాల్లో స్పష్టమైన ఆదేశాలున్నాయి.

మన దేశంలో విరాళాలకు ఆదాయపు పన్ను మినహాయింపు ఇవ్వడం వలన, ఆ సదుపాయాన్ని ఉపయోగించుకోవడం కోసం దేశంలో 1200 పార్టీలు పుటుకువచ్చాయి.

### నేర చరితులను కాపాడడానికే దర్యాప్తు సంస్థలు

ఆరేళ్లుగా సమాజ్‌వాదిపార్టీ అధినేత ములాయమ్‌సింగ్‌యాదవ్ ఆదాయానికి మించిన ఆస్తులు కలిగి ఉన్నాడని సిబిఐ కేసు నడిపింది. నేడు అక్రమార్జన ఆరోపణలను బలపరిచే సరైన సాక్ష్యాధారాలు దొరకలేదని అదే సిబిఐ కేసు కొట్టేసింది. అత్యున్నత స్థాయిలో లాలూచీలకు, రాజకీయ ఒప్పందాలకు సంకేతమే ఈ కేసు రద్దని తెలుస్తుంది. ఈ లోగడ తాము నివేదించిన ఆదాయం, వ్యయం, ఆస్తులకు సంబంధించిన వివరాల్లో తప్పిదాలు చోటుచేసుకున్నాయని, ఆ కుటుంబ సభ్యులపేరిట ఉన్న పేలస్‌ను వేరెవరో కట్టించిందని సిబిఐ ప్రకటించింది.

2002లో తాజ్ కారిడార్‌కి సంబంధించిన 17 కోట్ల రూపాయలను దుర్వినియోగం చేశారని బిఎస్‌పి నేత మాయావతిపై సిబిఐ కేసు నమోదుచేసింది. 2004లో ఆదాయానికి మించి ఆస్తులున్నాయన్న కేసును కూడా వేసింది. వీటిని కూడా ఈ మధ్యనే సిబిఐ కొట్టివేసింది. లాలూ కేంద్రంలో కీలక పాత్ర పోషించినంతవరకూ, న్యాయస్థానాలు జోక్యం చేసుకోనంత వరకూ ప్రభుత్వం ఆయన జోలికి వెళ్లలేదు. ఇప్పుడు ఆయన విషయంలో ఉదాసీనతతో వ్యవహరించడానికి కారణం లాలూ రాజకీయ అవసరం తగ్గిపోవడమే. అదే ములాయమ్‌సింగ్ యాదవ్‌పై సిబిఐ కేసు మూసివేయడానికి కారణం ఆయన అవసరం కేంద్రంలో యుపిఎ ప్రభుత్వానికి ఉండడమేనని సులువుగా అర్థమవుతోంది. లాలూ ప్రసాద్, ములాయమ్‌సింగ్, మాయావతిలపై నమోదైన అక్రమార్జన కేసులు యుపిఎ ప్రభుత్వం రాజకీయ ప్రయోజనాలకు సాధనంగా వాడుకున్నారని తెలుస్తుంది. రాష్ట్రపతి ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో బిఎస్‌పిని తన దారికి తెచ్చుకోవడానికి కాంగ్రెస్ తాజ్ కారిడార్ కేసుతో బెదిరించింది. ఈ విధంగా పాలకులు తమ రాజకీయ లక్ష్యాలను నెరవేర్చుకోవడానికి సిబిఐ లాంటి దర్యాప్తు సంస్థలను వాడుకోవడం జరుగుతోంది. ఈ మధ్య సిబిఐని స్వతంత్ర సంస్థగా మార్చాలని డిమాండ్ వచ్చింది. గాలి జనార్ధన్‌రెడ్డి కేసులో జడ్జీలు కూడా ఎలా అమ్ముడు పోయారో చూశాం. అవినీతి రాజకీయాలు రాజ్యమేలుతున్నచోట స్వతంత్రత అనేది అసంభవం అని వేరే చెప్పనక్కర్లేదు.

ఉత్తరప్రదేశ్, 'కుండా' నియోజకవర్గం నుండి ఎన్నికైన ఎంఎల్ఎ రఘురాజ్‌ప్రతాప్‌సింగ్ అలియాస్ రాజుభయ్యా రాష్ట్ర ఆహార, ప్రజాపంపిణీ, జైళ్లశాఖ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన మరునాడే 2013 మార్చ్ 2న బలిపూర్ గ్రామంలో జరిగిన డిఎస్‌పి జియావుల్ హక్ హత్యా నేరంపై అరెస్టయి 7 నెలలు జైల్లోనే ఉన్నాడు. ఇతనిపై ఈ కేసే కాకుండా 8 ఇతర కేసులు కూడా ఉన్నాయి. స్వయంగా పోలీసు అధికారి భార్య పర్వీన్ అజాద్ ఆరోపణల ఆధారంగానే అతనిపై క్రిమినల్ కేసు విధించి అరెస్ట్ చేశారు. జైళ్లశాఖ మంత్రే జైలుపాలు అయ్యాడు. ఇతనిపై కేసులన్నీ సరైన ఆధారాల్లేవని ఉపసంహరించుకుని తిరిగి అతన్ని అఖిలేష్‌యాదవ్ మంత్రివర్గంలో ఈ మధ్యనే చేర్చుకున్నారు. ఉత్తరప్రదేశ్‌లో ఠాకూర్ల ఓట్లను సంపాదించడానికే ప్రభుత్వం ఈ పనిచేసిందని విమర్శకులు అంటున్నారు. దీనిపై 'ప్రభుత్వం కన్నా ఒక వ్యక్తి చాలా బలవంతుడని దీన్ని బట్టి రుజువవుతుంది' అని రాజ్యసభ ఎంపి నరేష్ అగర్వాల్ వ్యాఖ్యానించారు.

అక్రమాస్తుల కేసులో 16 నెలలుగా చెంచల్‌గూడ జైలులో ఉన్న వైఎస్ఆర్‌సిపి అధ్యక్షుడు వైఎస్. జగన్మోహన్‌రెడ్డికి సెప్టెంబర్ 3న సిబిఐ కోర్టు షరతులతో కూడిన బెయిల్ ఇచ్చింది. రాష్ట్ర విభజన నిర్ణయ నేపథ్యంలో రాబోయే ఎన్నికల్లో లబ్ధి పొందేందుకు కాంగ్రెస్, జగన్‌ల మధ్య జరిగిన రాజకీయ ఒప్పందం దీనికి కారణమని, సిబిఐ బెయిల్ వచ్చేటట్లు సహకరించడం వల్లనే జరిగిందని పత్రికల్లో బాహాటంగానే వ్యాఖ్యానాలు వచ్చాయి. ఇదే సిబిఐ 10 నెలల క్రితం జగన్ 49 వేల కోట్ల రూపాయల అక్రమ సంపాదనకు సంబంధించిన ప్రాథమిక ఆధారాలతో సుప్రీంకోర్టుకు సమర్పించింది. జగన్ విడుదల అవుతాడని కడపలో వారం రోజుల క్రితమే తెలిసి సంబరాలకు ఏర్పాట్లు చేసుకోవడం గమనిస్తే, ఇది ముందస్తుగానే జరిగిన ఒప్పందం ప్రకారమే జరిగిందనడానికి రుజువు. దీని ద్వారా సిబిఐతో పాటు ఇతర దర్యాప్తు సంస్థలను అధికారంలో ఉన్న రాజకీయ పార్టీలు తమ రాజకీయ అవసరాలకు ఎలా వాడుకుంటున్నాయో స్పష్టం అవుతుంది.

రాజకీయ వ్యవస్థలు ప్రజల విశ్వాసం కోల్పోతున్న నేటి తరుణంలో సుప్రీంకోర్టు, కేంద్ర సమాచార కమిషన్ లాంటి రాజ్యాంగ సంస్థలు క్రియాశీలత్వాన్ని ప్రదర్శించడాన్ని అర్థం చేసుకోవాలి. నేటి రాజకీయ వ్యవస్థ ఆ తీర్పులను గౌరవించి ఆదరిస్తుందన్న నమ్మకాలు ఎవరికీ లేవు. ఆచరించినా వాటిని కూడా తమకనుకూలంగా మార్చుకోవడం వాళ్లకు తెలిసిన అత్యంత సహజమైన విద్య. సామ్రాజ్యవాద సంకెళ్లను తెగగొట్టకుండా, అవినీతిని, రాజకీయాలలో నేర చరితులకు ప్రవేశం లేని నిజమైన ప్రజాస్వామ్యాన్ని సాధించడం సాధ్యం కాదు.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# అమెరికా గుప్పెట్లోకి భారత్

***అమెరికాతో కుదుర్చుకుంటున్న ఒప్పందాలు భారత ఆర్థిక వ్యవస్థకు ఎటువంటి ప్రయోజనాలు కలిగించవనీ, ఈ ఒప్పందాల వల్ల దేశం మరింతగా అమెరికా ఊబిలోకి కూరుకుపోతుందనీ అంటున్నారు* ఎ. నర్సింహ్మారెడ్డి**

ప్రధాని మన్మోహన్‌సింగ్ 2013 సెప్టెంబర్ 26 నుంచి అక్టోబర్ 1 వరకు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో అధికారిక పర్యటన జరిపారు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాతో ప్రధాని వాషింగ్టన్‌లోని శ్వేతసౌధంలో సెప్టెంబర్ 27న సమావేశమయ్యారు. పౌర అణు ఒప్పందం, రక్షణరంగ సహకారం, అంతర్జాతీయ భద్రత, వాణిజ్యం, పెట్టుబడులు, ఆర్థిక సహకారం తదితర పలు ద్వైపాక్షిక, అంతర్జాతీయ అంశాలపై ఒప్పందాలు కుదుర్చుకోవడంతో భారత్‌ను అమెరికాకు తాకట్టుపెట్టినట్లు అయింది. ఇప్పటికే దేశాన్ని అమెరికా జూనియర్ భాగస్వామిగా చేసిన సోనియా, మన్మోహన్‌లు ఈ ఒప్పందాలతో భారత్‌ను అమెరికా గుప్పిట్లో మరింత కూరుకుపోయేలా చేశారు. ద్వైపాక్షిక సంబంధాల్లో మరో కీలకాంశమైన ఆర్థిక సహకారంపై ఇరుదేశాల మధ్య వాణిజ్యాన్ని మరింత పెంపొందించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. అమెరికా ప్రవేశపెట్టిన ట్రస్టెడ్ ట్రావెలర్ నెట్‌వర్క్ ప్రోగ్రాం అయిన 'గ్లోబల్ ఎంట్రీ'లో భారత్‌కు సభ్యత్వం ఇవ్వడానికి అమెరికా అంగీకరించింది.

ఈ పర్యటన సందర్భంలోనే ఆయన ఐక్యరాజ్యసమితి (ఐరాస) సర్వసభ్య సమావేశానికి హాజరయ్యారు. ప్రధాని సెప్టెంబర్ 28న ఐరాస సమావేశానికి హాజరై అందులో ప్రసంగించారు. అభివృద్ధి చెందుతున్న దేశాలకు శాశ్వత సభ్యత్వం కల్పించేలా ఐరాసలో సంస్కరణలు చేయాలని డిమాండ్ చేశారు. భారత్‌కు శాశ్వత సభ్యత్వం రాకుండా చైనా అడ్డుపడుతుందని ఆరోపించారు. ఉగ్రవాదం పెరగడానికి అమెరికా అనుసరిస్తున్న విధానాలను, అవసరమున్నచోట నిధులందిస్తున్న వైనాన్ని పేర్కొనకుండానే ఉగ్రవాదాన్ని అణిచేందుకు ఐరాస మరింత నిబద్ధతతో పనిచేయాలని కోరారు. ఉగ్రవాదాన్ని పాకిస్థాన్ ఎగదోస్తుందని ఆగ్రహించారు. జమ్ము - కశ్మీర్ భారతలో అంతర్భాగమేననీ, ఈ అంశంలో ఎవరి జోక్యాన్ని సహించబోమన్నారు. ఒక రోజు ముందు ఐరాసలో పాకిస్థాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ ప్రసంగిస్తూ ఐరాస భద్రతా మండలి తీర్మానాలకు అనుగుణంగా కశ్మీర్ సమస్యను పరిష్కరించాలని కోరారు. కాగా భారత ప్రధాని ఐరాస తీర్మానాలకు కాలం చెల్లిందని, అన్ని అంశాలను సిమ్లా ఒప్పందం మేరకు ద్వైపాక్షిక చర్చల ద్వారా పరిష్కరించుకోవాలని భావిస్తోందని తెలిపారు. ఇరువురు ప్రధానుల ప్రసంగాలలో కశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికారం కోసం జరుగుతున్న పోరాటాలకు చోటు లేకపోవడం శోచనీయం. మరుసటి రోజు మన్మోహన్ సింగ్, పాకిస్థాన్ ప్రధాన మంత్రి నవాజ్ షరీఫ్‌తో కూడా సమావేశమై కశ్మీర్, ఉగ్రవాదం తదితరాలపై చర్చలు జరిపారు. ఇంకా ఆయన బంగ్లాదేశ్ ప్రధాని షేక్ హసీనాతో కూడా 20 నిమిషాలపాటు పలు ద్వైపాక్షిక అంశాలపై చర్చించారు.

ఇరువురు నేతల మధ్య జరిగిన మూడవ శిఖరాగ్ర సమావేశంలో ప్రధానమైన అంశంగా మరింత రక్షణ సహకారం ముందుకొచ్చింది. రక్షణ సహకారం, ఇంధనం, పర్యావరణ సమస్యలతో పాటు ద్వైపాక్షిక ఆర్థిక సంబంధాలు, భారత్‌లోకి అమెరికా పెట్టుబడులను పెంచడం కూడా చర్చకొచ్చాయి. రక్షణ సహకారం పెంపుపై ఎక్కువగా దృష్టి పెట్టారు. 2004లో యుపిఎ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన ఏడాది తర్వాత అంటే 2005 జూన్‌లో అమెరికాతో రక్షణ చట్రం ఒప్పందం (డిఫెన్స్ ఫ్రేమ్‌వర్క్ అగ్రిమెంట్) పై భారత్ సంతకాలు చేసింది. ఇరు దేశాల మధ్య సైనిక సహకారం పెరగడానికి ఈ ఒప్పందం ప్రాతిపదికగా ఉంది. 'అమెరికా, భారత్‌లు ఉమ్మడి భద్రతా ప్రయోజనాలను పంచుకుంటాయి. తమ సన్నిహిత భాగస్వాములను ఏ విధంగా ఉంచుతాయో అదే విధంగా ఇరు దేశాలూ పరస్పరం ఉంటాయి' అనేది అందులో పొందుపరిచిన మౌలిక సూత్రం. 'ఇదే సూత్రం రక్షణ సాంకేతిక పరిజ్ఞానం బదిలీ, వర్తకం, పరిశోధన, సహ అభివృద్ధి, రక్షణ రంగం పరికరాల సహ ఉత్పత్తి, సేవలకు వర్తిస్తుంది' అని కూడా అది పేర్కొంది. దీనర్థమేమంటే భారతదేశం మరిన్ని ఆయుధాలను అమెరికా నుంచి కొనుగోలు చేయాల్సి ఉంటుంది. ఆయుధాలు, సైనిక పరికరాలను కూడా సంయుక్తంగా ఉత్పత్తి చేయాల్సి ఉంటుంది. అమెరికాను సన్నిహిత మిత్రదేశంగా పరిగణించాల్సి ఉంటుంది. రక్షణ ఉత్పత్తికి గానూ అమెరికా ఆయుధ కంపెనీలు భారత్‌లో పెట్టుబడులు పెట్టడాన్ని ఇప్పుడు ప్రతిపాదించాయి. ఇందుకుగాను రక్షణ ఉత్పత్తి రంగంలోకి 26 శాతం ఎఫ్‌డిఐని అనుమతించాలని యుపిఎ ప్రభుత్వం గత జూలైలో నిర్ణయించింది. ఒక దాని తరువాత మరొకటి ప్రాతిపదికన ఎఫ్‌డిఐ పరిమితిని పెంచాలని కూడా నిర్ణయించారు.

భారతదేశంలో 17,300 కోట్ల డాలర్ల (పదిలక్షల కోట్ల రుపాయలు) అణు వాణిజ్యానికి అవకాశం ఉందనీ, అందుకే ఈ మార్కెట్లోకి దూసుకొచ్చి, అధిక వాటా కైవసం చేసుకోవాలన్నది జిఇ, వెస్టింగ్‌హౌస్ వంటి అమెరికా రియాక్టర్ తయారీదారుల ఆరాటం. వాటితో ఒప్పందాలు చేసుకోవాల్సిందిగా భారత ప్రభుత్వం మీద అమెరికా విపరీతమైన ఒత్తిడి తెస్తోంది. అణు నష్ట పరిహార చట్టం వల్ల ఆ మార్కెట్‌లోకి ప్రవేశించలేక పోతున్నామనీ అమెరికాలోని అణు వాణిజ్య సంస్థలు తమ ప్రభుత్వానికి మొరపెట్టుకున్నాయి. అమెరికా ప్రభుత్వం ఈ చట్టంలో సడలింపులు తేవాలని భారత్‌పై ఒత్తిడి తెస్తోంది. ఈ అణు ప్రమాద నష్ట పరిహార చట్టంలోని 17వ విభాగం ప్రకారం - విదేశీ కంపెనీలు మన దేశంలో నిర్మించిన అణు విద్యుత్ కేంద్రాల్లో ప్రమాదం సంభవించి ప్రాణ, ఆస్తి నష్టాలు జరిగితే ఆ అణు కేంద్ర నిర్వాహకులు బాధితులకు ముందు నష్టపరిహారం చెల్లించాలి. తర్వాత అలాంటి నాసిరకం పరికరాలు, (అవి నాసిరకమైనవని రుజువైతే) పదార్థాలు సరఫరా చేసిన సంస్థ నుంచి దాన్ని వసూలు చేసుకోవాలి.

(దేశంలో ప్రస్తుతం నడుస్తున్న అణు విద్యుత్ కేంద్రాలను ఎన్‌పిసిఐఎల్ నిర్వహిస్తోంది.) కాగా, పై చట్టంలోని నిబంధనలను అమెరికా కంపెనీలు వ్యతిరేకిస్తున్నాయి. ఒక్క అమెరికా కంపెనీలే కాకుండా, తమిళనాడులోని కూడంకుళం అణు విద్యుత్‌ను నిర్మిస్తున్న రష్యా, జైతాపూర్‌లో అణు విద్యుత్‌ను చేపడుతున్న ఫ్రాన్స్ దేశాలు కూడా ఈ నిబంధనలను వ్యతిరేకిస్తున్నాయి. ఈ చట్టం రావడానికి చాలా ముందు నుంచీ భారత్‌లో తాము అణుకేంద్రాలు నిర్మిస్తున్నందున అది తమకు వర్తించదని రష్యా వాదిస్తుండగా, చట్టాన్ని అంగీకరిస్తామని ఒక పక్క ఒప్పుకుంటూనే మరోపక్క తమ రియాక్టర్ల ధరలను ఫ్రాన్స్ విపరీతంగా పెంచింది. ఈ నేపథ్యంలో యుపిఎ ప్రభుత్వం 2011లోనే పార్లమెంటులో ఈ చట్టాన్ని ముందుకు తెచ్చి - ఎంత స్థాయిలో ప్రమాదం జరిగినా సరఫరాదారులు అందించే నష్టపరిహారం మాత్రం రు.1500 కోట్లకు లోపునే ఉండాలనే సవరణ చేసింది. అయినా అమెరికా భారత్‌పై ఒత్తిడి తగ్గించలేదు. నష్టపరిహారంపై నిబంధనలు పూర్తిగా తొలగించాలని వాదిస్తోంది.

ప్రధాని అమెరికా బయలుదేరుతూ వారిని మెప్పించేందుకు కొన్ని 'బహుమతులు' పట్టుకెళ్లారు. ఒకటి, అణు లయబిలిటీ చట్టంలోని 'పరిహారం' క్లాజును అమెరికన్‌లకు వర్తింపజేయకపోవడం. అమెరికా అణు పరికరాల కంపెనీ వెస్టింగ్ హౌస్ గుజరాత్‌లో అణు విద్యుత్తు కేంద్రం నెలకొల్పే ఒప్పందంపై మన అణు విద్యుత్ కార్పొరేషన్ సంతకం చేయడానికి ప్రధాని అణుభద్రతపై క్యాబినెట్ కమిటీ అనుమతి సంపాదించారు. రెండు, రిటైల్ వ్యాపారంలోకి ప్రవేశించే విదేశీ కంపెనీలు తమ అవసరాల్లో 30 శాతం విధిగా మన దేశంలోనే సేకరించాలన్న షరతును వాల్‌మార్ట్ అంగీకరించలేదు. ఈ షరతు స్థానిక ఉత్పత్తిదారులకు ఎంతో మేలుచేస్తుందని ప్రచారం చేసుకున్న ప్రభుత్వం ఇప్పుడు దాన్ని ఎత్తివేసింది. అంతేగాక 10 లక్షల జనాభా పైబడి ఉన్న నగరాల్లోనే బహుళజాతి రిటైల్ దుకాణాలన్న షరతును కూడా ఎత్తివేసింది. మూడు: రిఫ్రిజిరేటర్ గ్యాస్‌లను మార్చాలన్న ఒత్తిడిని బ్రెజిల్, దక్షిణాఫ్రికా, ఇండోనేషియా వంటి ప్రాదుర్భావ ఆర్థిక వ్యవస్థలు ప్రతిఘటిస్తుండగా ప్రధాని మాత్రం అమెరికా అనుకూలంగా తలూపారు.

భౌగోళిక రాజకీయాల్లో అమెరికాకు భారత్ మద్దతు:

యుపిఎ ప్రభుత్వం గత ఎనిమిదేళ్ల పాలనలో స్వతంత్ర విదేశాంగ విధానం నుండి పూర్తిగా వైదొలగింది. అమెరికాతో వ్యూహాత్మక పొత్తు పెట్టుకోవడం దీనికి కారణం. 2005 జూలైలో అమెరికా అధ్యక్షుడు, భారత ప్రధాని వాషింగ్టన్‌లో చేసిన సంయుక్త ప్రకటనతో మొదలయి వ్యూహాత్మక పొత్తు దిశగా చర్యలు ముందుకు సాగాయి. అమెరికా వ్యాపార, వాణిజ్య ప్రయోజనాలకు అనుకూలంగా భారత్ తన మార్కెట్ ద్వారాలు తెరిచింది. అమెరికాతో సన్నిహిత భద్రతా, సైనిక సంబంధాలు నెలకొల్పుకుంది. దీనిలో భాగంగానే అమెరికా తన ఆయుధాలను భారత్‌కు విక్రయించే వీలు కల్పించే, దాని షరతులకు తలొగ్గే తుది వినియోగ పర్యవేక్షణ ఒప్పందంపై భారత్ సంతకం చేసింది. ఇప్పటి వరకు యుపిఎ ప్రభుత్వం ఒక్క అమెరికా నుండే 40 వేల కోట్ల రూపాయల విలువ చేసే ఆయుధాలను కొనుగోలు చేసింది. అమెరికా వ్యూహాత్మక ప్రయోజనాలలో కొన్నింటికి సహకరించే షరతుమీద ఐరాస భద్రతా మండలిలో భారత్‌కు శాశ్వత సభ్యత్వ ప్రతిపాదనకు ఒబామా అంగీకరించాడు. ఆఫ్ఘనిస్థాన్‌లో అమెరికా వ్యూహానికి భారత్ పూర్తి మద్దతు అందిస్తోంది. అంతర్జాతీయ అణు ఇంధన సంస్థలో అణ్వాయుధ సమస్యపై ఇరాన్‌కు వ్యతిరేకంగా అమెరికా మెప్పుకోసం నాలుగు సార్లు ఓటు చేసింది. ఇరాన్ - పాకిస్థాన్ - ఇండియా గ్యాస్ సరఫరా పైపులైన్ అమెరికా ఒత్తిడితో తుంచివేశారు. దీని స్థానంలో అమెరికా చెప్పినట్లు మరింత ఖరీదైనప్పటికి తుర్క్‌మెనిస్థాన్ - ఆఫ్ఘనిస్థాన్ - పాకిస్థాన్ పైపులైన్ ఒప్పందంపై భారత్ సంతకం చేసింది. లిబియాలో నాటో, పశ్చిమ దేశాల జోక్యాన్ని సమర్థించింది. సిరియాపై తన యుద్ధ ప్రణాళికలకు సహకరించాలని కూడా ప్రభుత్వంపై అమెరికా ఒతిడి తెస్తోంది. బ్రిక్స్‌లో సభ్యదేశంగా ఉంది. భారత్, చైనా, రష్యా త్రైపాక్షిక చర్చల్లో పాల్గొంటుంది. అయినా స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరిస్తూ అమెరికా, ఇజ్రాయిల్‌లకు వ్యతిరేకంగా చర్యలు తీసుకోలేక పోతున్నది.

జనాభా రీత్యా, సహజవనరుల లభ్యత రీత్యా ఆసియా అతిపెద్ద ఖండం. షాంఘై సహకార సంఘంలో ప్రధాన భాగస్వామయిన చైనా ఆర్థికంగా బలపడుతోంది. ప్రపంచవాణిజ్యంలో చైనా మూడవ స్థానంలో ఉంది. చైనా, ఆసియన్‌ల స్వేచ్ఛా వాణిజ్య మండలి ఆవిర్భావం, ఆసియా ఉమ్మడి ద్రవ్యం గురించిన మాటలు, అమెరికా సామ్రాజ్యవాదులకు కంటగింపుగా ఉన్నాయి. మరోవైపు సైబీరియాను పసిఫిక్ మహాసముద్రంతో కలుపుతూ 2757 కిమీ పొడవైన చమురు చేరవేసే పైపులైన్ పూర్తి కావడంతో రష్యా ఆర్థికంగా బలపడడమే కాకుండా పలు ఆసియా దేశాలతో సంబంధాలు మెరుగుపడ్డాయి. అందువల్లనే ఈ ప్రాంత భౌగోళిక రాజకీయాలతో తన ఆధిపత్యాన్ని నిలుపుకోవడానికి ఆసియా - పసిఫిక్‌లో భారత్‌ను వ్యూహాత్మక భాగస్వామిగా చేసుకొని చైనాను నిరోధించడానికి అమెరికా ప్రయత్నిస్తోంది. నిజానికి చైనాతో భారత్‌కు వాణిజ్య సంబంధాలు పెరుగుతున్నాయి. ఇరు దేశాల మధ్య ఏటా 6500 కోట్ల డాలర్ల వాణిజ్యం జరుగుతోంది. ప్రాంతీయ శక్తిగా ఎదగాలన్న భారత పాలక వర్గాల విస్తరణవాద కాంక్షలనూ, మధ్య ఆసియా, దక్షిణాసియాల్లోకి అమెరికా చొచ్చుకు రావడాన్నీ, ఆసియాలో చైనాకు ప్రత్యర్థిగా భారత్‌ను నిలుపాలన్న అమెరికా ప్రయత్నాలనూ, ప్రజల దృష్టి మళ్లించేందుకు భారత, పాకిస్థాన్‌లోని పాలకవర్గాలు తమ తమ దేశాల్లో రెచ్చగొడుతున్న జాతీయోన్మాదాన్నీ గమనించినప్పుడు దక్షిణాసియాలో శాంతి నెలకొనడానికి బదులుగా దేశాల మధ్య ఉద్రిక్తతలు తిరిగి పెరుగుతున్నట్లు ఇటీవలి సరిహద్దు ప్రాంతంలో చోటు చేసుకుంటున్న చర్యలు తెలియజేస్తున్నాయి.

2012 జనవరిలో వచ్చిన 'వ్యూహాత్మక మార్గదర్శకత్వం' అనే పెంటగాన్ పత్రంలో జపాన్, ఆస్ట్రేలియా, దక్షిణ కొరియా వంటి దీర్ఘకాలిక మిత్రులతో పాటు వ్యూహాత్మక భాగస్వామి భారత్‌కు చాలా ప్రముఖమైన స్థానాన్నే కల్పించింది. ఆసియాలో అమెరికా తన ఉనికిని విస్తరించుకోవడానికి, వివిధ ఆసియా దేశాల్లో వైమానిక స్థావరాలను ఉపయోగించుకుంటుందని తాజాగా గత జూలైలో పసిఫిక్ ప్రాంతంలోని అమెరికా వైమానిక దళ చీఫ్ జనరల్ కార్లిస్లే విలేకరులతో మాట్లాడుతూ చెప్పారు. దీనికి సంబంధించి పేర్కొన్న వివిధ ప్రదేశాల్లో కేరళలోని తిరువనంతపురం కూడా ఉంది. ఆసియా - పసిఫిక్ ప్రాంతానికి అమెరికా 'వ్యూహాత్మక ఇరుసు'గా దీన్ని చూడాల్సి ఉంటుందని 2012 మేలో అప్పటి అమెరికా రక్షణశాఖ మంత్రి లియోన్‌పనెట్టా మొదటిసారిగా భారత్‌లో పర్యటించినప్పుడు పేర్కొనడాన్ని ఇక్కడ గుర్తు చేసుకోవచ్చు. వాషింగ్టన్‌కు ప్రధాని వెళ్లడానికి ముందుగానే అమెరికా రక్షణశాఖ సహాయ మంత్రి ఆస్టోన్ కార్టెర్, భారత జాతీయ భద్రతా సలహాదారు శివశంకర్ మీనన్‌ల మధ్య చర్చలు జరిగాయి. రక్షణ రంగ వాణిజ్యాన్ని, రక్షణ పరికరాల ఉమ్మడి ఉత్పత్తిని ఎలా మెరుగుపరచాలనే అంశంపై వారు చర్చలు జరిపారు.

చిల్లర వర్తకంలోకి ఎఫ్‌డిఐని అనుమతించేందుకు నిబంధనలను

సడలించడం, అణు రియాక్టర్లను అమెరికా కంపెనీలు విక్రయించేందుకు వీలు కల్పిస్తూ పౌర అణు నష్టపరిహార బాధ్యతల చట్టాన్ని నీరుగార్చడం వంటి వాటి ద్వారా అమెరికా ప్రయోజనాలను నెరవేర్చేందుకు ప్రయత్నిస్తోంది. అమెరికా, భారత్ వ్యూహాత్మక ప్రయోజనాలు ఒక దానితో ఒకటి పెనవేసుకుపోవడమనేది తదనంతర కాలంలో భారత్‌పై తీవ్ర ప్రతికూల ప్రభావం చూపబోతోంది. ఇరాన్ నుంచి చమురు దిగుమతులను తీవ్రంగా తగ్గించడం వంటి వాటిని బట్టి భారత్ తన స్వీయ ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఎలా వ్యవహరిస్తోందో మనం ఇప్పటికే చూశాం. ఇవి ఐరాస ఆంక్షలు కానందున ఇరాన్‌పై అమెరికా పెట్టే ఆంక్షలను తాము ఆమోదించేది లేదని చెప్పే సాహసం భారత్‌కు లేదు. చివరకు సిరియా విషయంలో కూడా అమెరికా ప్రయోజనాలకు అనుగుణమైన వైఖరినే భారత్ తీసుకుంటోంది. 2012 ఫిబ్రవరిలో భద్రతామండలిలో ప్రవేశపెట్టిన పశ్చిమదేశాల తీర్మానాలకు అనుకూలంగా ఓటు వేయడం ద్వారా దాన్ని ధృవీకరించింది. ఈ తీర్మాణాన్ని రష్యా, చైనాలు వీటో చేశాయి. సిరియా విషయాల్లో అమెరికా ప్రతిపాదిత జోక్యాన్ని ప్రపంచవ్యాప్తంగా అందరూ తీవ్రంగా వ్యతిరేకించడం, రష్యా ఇతర బ్రిక్ దేశాలు తీసుకున్న కఠిన వైఖరి కారణంగా మాత్రమే జి- 20 శిఖరాగ్ర సదస్సు సందర్భంగా భారత్ సిరియాలో సైనిక జోక్యాన్ని వ్యతిరేకించింది.

సంయుక్త ప్రకటన సారాంశం:

అమెరికాతో 'వ్యూహాత్మక భాగస్వామ్యం' నెరుపుతున్న భారత ప్రధాని రానురాను భాగస్వామ్యాన్ని 'లొంగబాటు' కింద మార్చేస్తున్నారు. ప్రధాని ఈ మధ్య చేసిన అమెరికా పర్యటన, అధ్యక్షుడు ఒబామాతో చర్చల అనంతరం విడుదలైన సంయుక్త ప్రకటన ఇందుకొక ఉదాహరణ. ప్రధాని పర్యటన నేపథ్యంలో పౌర అణువిద్యుత్‌పై భారత్, అమెరికా తొలి వాణిజ్య ఒప్పందం చేసుకున్నాయి. భారత్‌లో అణుప్లాంటు నెలకొల్పేందుకు భారత్ న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్ (ఎన్‌పిసిఐఎల్), అమెరికా కంపెనీ వెస్టింగ్‌హౌస్ మధ్య ఒప్పందం కుదిరింది. తాజా ఒప్పందం ఫలితంగా భారత్‌లో ఏపీ - 1000 అణు రియాక్టర్ టెక్నాలజీకి లైసెన్సు ఇచ్చేందుకు మార్గం సుగమమైంది. వీటిని వీలైనంత త్వరగా ముగిస్తామని కూడా చెపుతూ అందుకు కృషి చేయాలని ఇరు దేశాల్లోనూ సంబంధిత వర్గాలన్నింటినీ కోరారు. కాగా అణు భద్రతాంశాలపై అమెరికా అణు నియంత్రణల సంస్థ, భారత అణు విద్యుత్ నియంత్రణా సంస్థలు ఒక అవగాహనా ఒప్పందం కుదుర్చుకోనున్నాయని కూడా అమెరికా యంత్రాంగం ప్రకటించింది. కాగా గుజరాత్, ఆంధ్రప్రదేశ్‌లలో వాణిజ్యపరమైన అణువిద్యుత్ ప్లాంట్లను ఏర్పాటు చేయాలని భారత ప్రభుత్వం యోచిస్తోంది. ఇందుకు సంబంధించిన పాలనాపరమైన ఏర్పాట్లు త్వరలో పూర్తికానున్నాయి. ఒప్పందం కింద భారతదేశానికి వెస్టింగ్‌హౌస్ తయారు చేసే ఎపి - 1000 న్యూక్లియర్ రియాక్టర్లు ఆరింటిని అందజేస్తుంది. ఈ ఒప్పందం విలువ దాదాపు 14 బిలియన్ (రు. 84000 కోట్లు) డాలర్లు. కాగా గుజరాత్, ఆంధ్రప్రదేశ్‌లలో సంయుక్తంగా చేపట్టనున్న అణువిద్యుత్ సంస్థల నిర్మాణానికి అవసరమైన పనిని వేగవంతం చేయాలని ఎన్‌పిసిఐఎల్‌కు, వెస్టింగ్ హౌస్ కంపెనీలకు ఇరుదేశాలు సూచించాయి.

'వాతావరణ మార్పు'కు సంబంధించి రిఫ్రిజిరేట్ గ్యాస్ విషయంలో కేంద్ర మంత్రివర్గ నిర్ణయానికి విరుద్ధంగా, సెప్టెంబర్ ఆరంభంలో సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో జరిగిన జి-20 సమావేశంలో రిఫ్రిజిరేట్ గ్యాస్‌లు లేదా హైడ్రోఫ్లోరో కార్బన్స్ (హెచ్.ఎఫ్.సి.లు) నియంత్రించాలన్న సంయుక్త ప్రకటనపై ప్రధాని సంతకం చేశారు. దీని పర్యవసానంగా భారత - అమెరికాలు ఈ క్రమానికి సంబంధించిన ఒప్పందంపై సంతకాలు చేయాలని అమెరికన్ అధికారులు పట్టుబట్టారు. ఒబామా కూడా ప్రధానిపై ఒత్తిడి చేసినట్లున్నారు. వాతావరణ మార్పుపై వర్కింగ్ గ్రూపు ఏర్పాటుకు, హెచ్ఎఫ్‌సిలపై ఇండియా - యుఎస్ టాస్క్‌ఫోర్స్ సమావేశాన్ని తక్షణం ఏర్పాటు చేయడానికి ఇరుదేశాలు ఇప్పుడు అంగీకరించాయి'. టాస్క్‌ఫోర్స్ నాలుగేళ్లుగా ఉన్నా ప్రాథమిక సూత్రాలపై కూడా అంగీకారం కుదరలేదు. ఈ టాస్క్‌ఫోర్స్ ఇప్పటికైనా ముందుకు కదిలి 2013 అక్టోబర్‌లోగా తన నివేదిక ఇస్తే, భారత్ మాంట్రియల్ ప్రోటోకాల్ కింద హెచ్ఎఫ్‌సిల మీద నవంబర్‌లో సభ్య దేశాలతో జరగనున్న వార్షిక సమావేశంలో చర్చల్లో పాల్గొంటుంది. లేని పక్షంలో ఈ అంశంపై భారత్‌కు అమెరికా సాయపడినట్లయింది. కాగా ప్రస్తుతం మాంట్రియల్ ప్రోటోకాల్, ఐరాస వాతావరణ మార్పుల ఫ్రేంవర్క్ కన్వెన్షన్ (యుఎన్ఎఫ్‌సిసి) కింద హెచ్ఎఫ్‌సిల దశల వారీ నిర్మూలనకు గాను తగు చర్యలు, కార్యకలాపాలను అక్టోబర్ నెలాఖరి కల్లా భారత్ నిర్ణయించుకోవలసి ఉంది. ఈ లోగా అమెరికా ఒత్తిడి భరించి నివేదిక పూర్తి చేస్తే బారత్‌కు ఈ అంశంపై మరో ఏడాది సమయం లభిస్తుంది. అమెరికా హరిత సాంకేతికతలకు సమర్థన, మద్దతు ఇస్తోందని ప్రపంచం గుర్తించేలా చేయాలన్న ఒబామా ఆకాంక్షలో ఈ హెచ్ఎఫ్‌సిల నిర్మూలన కూడా ఒకటి. అందుకే దీన్ని సాధించేందుకు ఆయన భారత్‌కు సాయపడుతూ, దానిపై ఒత్తిడి కూడా తెస్తున్నారు.

హెచ్ఎఫ్‌సిలు ఫ్రిజ్‌లలో వాడే వాయువులు. ఇవి వాతావరణాన్ని కలుషితం చేస్తాయి. వీటిని దశల వారీగా నిర్మూలించి, ఆ స్థానంలో కొత్త సాంకేతికతలు వాడాలని అన్ని దేశాలనూ మాంట్రియల్ ప్రోటోకాల్, యుఎన్ఎఫ్‌సిసిలు బద్దుల్ని చేస్తున్నాయి. అమెరికా ఇంకా వీటిని వాడుతోంది. అయినా భారత్, చైనా వంటి దేశాలు వీటిని దశల వారీగా వదిలేసి శుభ్రమైన వాయువులను వాడాలని అమెరికా ఒత్తిడి తెస్తోంది. ఈ గ్యాస్‌లకు ప్రత్యామ్నాయమైన కొన్ని స్వచ్ఛమైన గ్యాస్‌లకు కొన్ని అమెరికన్ కంపెనీలు పేటెంట్ కలిగి ఉన్నాయి. భారత్, చైనా వంటి పెద్ద మార్కెట్ కొరకు అవి ప్రేమ చూపుతున్నాయి. వీటిని మాంట్రియల్ ప్రోటోకాల్ ద్వారా భారత్, చైనాల మీద రుద్దాలని కూడా అమెరికా ప్రయత్నిస్తోంది. తద్వారా అమెరికాకు, ఒబామాకు హరిత సాంకేతికతల వాడకాన్ని పెంచిన ఘనత లభించడమే కాకుండా అమెరికా కంపెనీలకు వాణిజ్యం దక్కుతుంది. వాతావరణ మార్పుపై యుఎస్ ఫ్రేంవర్క్ కన్వెన్షన్ కింద దీన్ని ఆచరణలోకి తెస్తే అభివృద్ధి చెందిన దేశాలు కొంత ఖర్చు భరించాల్సివస్తుంది. అందువల్ల ఆ అవసరంలేని మాంట్రియల్ ప్రోటోకాల్ కింద ఈ వ్యాపారాన్ని ముందుకు నెట్టడానికి అమెరికా ప్రయత్నిస్తోంది. తమ దేశ పరిశ్రమలకు పదుల లక్షల కోట్ల వ్యాపారాన్ని ఆర్జించిపెట్టవచ్చు. దీనితో అనేక వందల సంవత్సరాలుగా ప్రకృతిని నాశనం చేస్తూ భూతాపం పెరగడానికి ప్రధాన కారణలైన పారిశ్రామిక దేశాలు వర్ధమాన దేశాలకు అధునాతన టెక్నాలజీ అందించడానికయ్యే భారాన్ని పంచుకోవాలన్న ఐరాస ఆదేశాన్ని తోసిపుచ్చే అవకాశం ఏర్పడింది. అంతేగాకుండా ఇలాంటి చర్యల ద్వారా అమెరికా యుఎన్ఎఫ్‌సిసి ప్రాధాన్యత తగ్గించి నీరు కారుస్తోందనీ; ఇతర ఒప్పందాలకు (మాంట్రియల్ ప్రోటోకాల్ వంటివి) ఆ ఘనత దక్కేలా చేస్తోందనీ విమర్శలు వెలువడుతున్నాయి.

ఇరు దేశాల మధ్య ద్వైపాక్షిక వాణిజ్యాన్ని ఐదు రెట్లు పెంచుకోవాలని అమెరికా, భారత్‌లు భావిస్తున్నాయి. ప్రస్తుతం ఇరుదేశాల మధ్య

వాణిజ్యం 10000 కోట్ల డాలర్లు (రు. 6 లక్షల కోట్లు) గా ఉంది. రెండు దేశాల మధ్య వాణిజ్య బంధాన్ని మరింత ధృడం చేసుకునేందుకు గాను పెట్టుబడుల విధానాలకు ఆటంకాలుగా ఉన్న అంశాలను త్వరితగతిన పరిష్కరించుకోవాలని అమెరికా అధ్యక్షుడికి, భారత ప్రధానికి మధ్య జరిగిన ద్వైపాక్షిక పెట్టుబడుల ఒప్పందం సందర్భంగా ఈ మేరకు నిర్ణయం తీసుకున్నారు. దీర్ఘకాలిక అవకాశాలను అందిపుచ్చుకునేందుకు భారత్‌లో భారీఎత్తున పెట్టుబడులు పెట్టాలని అమెరికా కంపెనీలను ప్రధాని ఆహ్వానించారు. అమెరికా పారిశ్రామిక అధిపతులతో సమావేశమైన సందర్భంగా మాట్లాడుతూ, మౌలిక సదుపాయాలు, రక్షణరంగం సహా వివిధ విభాగాల్లో పెద్దఎత్తున పెట్టుబడులకు అవకాశాలున్నాయని అన్నారు. అంతేకాకుండా భారత్‌లో వృద్ధికి అవకాశమున్న అన్ని అంశాలపై దృష్టి పెట్టడమే కాకుండా ప్రోత్సాహకర వాతావరణాన్ని కల్పించేందుకు అన్నిచర్యలు తీసుకుంటున్నట్లు వివరించారు. పెట్టుబడులకు రక్షణరంగం అత్యంత ఆకర్షణీయంగా ఉందని అమెరికా వ్యాపారవేత్తలు దీన్ని పూర్తి స్థాయిలో సద్వినియోగం చేసుకోవాలని ఆయన ఈ సందర్భంగా సూచించారు. వృద్ధికి ఊతమిచ్చే లక్ష్యంతో ఇప్పటికే రిటైల్, టెలికాం రంగాలలో విదేశీ ప్రత్యక్షపెట్టుబడుల పరిమితిని పెంచడం జరిగిందని వివరించారు. అంతేకాకుండా కీలక ప్రాజెక్టులకు మార్గం సుగమం చేసే ఉద్దేశంతో అడ్డంకులన్నింటిని తొలగించేందుకు ప్రభుత్వపరంగా పలు చర్యలు తీసుకుంటున్నట్లు తెలిపారు. 1991లో ఆర్థిక సంస్కరణల శకం ప్రారంభమైన నాటి నుంచి దేశంలోని అన్ని రాజకీయ పార్టీలు.. అమెరికా పారిశ్రామిక దిగ్గజాలకు మద్దతు పలుకుతూ వస్తున్నారని యుఎస్ సిఇఒల ఫోరం సమావేశంలో ప్రధాని పేర్కొన్నారు.

ఇరు దేశాల్లోనూ పెట్టుబడులు, ఆర్థికాభివృద్ధి, పారదర్శకత, ఉద్యోగావకాశాలను పెంచే 'ఉన్నత స్థాయి ద్వైపాక్షిక ఒప్పందం' ఒక దాన్ని త్వరలో కుదుర్చుకోవాలనే అంశానికి కట్టుబడి ఉంటామని నేతలిద్దరూ పునరుద్ఘాటించారు. వస్తు ఉత్పత్తిరంగంలో పెట్టుబడులపై ఉమ్మడి కమిటీని ఏర్పాటు చేయడం ద్వారా వాణిజ్య పెట్టుబడుల రంగంలో అడ్డంకులను తొలగించాలని నిర్ణయించారు. బాలిలో ప్రపంచ వాణిజ్య సంస్థ మంత్రిత్వ స్థాయి చర్చల్లో సత్ఫలితాల కోసం ఇరు దేశాల అధికారులూ కలిసి పనిచేయాలని తీర్మానించారు. 2014లో భారత్ నిర్వహించనున్న శాస్త్ర, సాంకేతిక సదస్సులో అమెరికా భాగస్వామ్య దేశంగా ఉండాలన్న భారత ఆహ్వానానికి అమెరికా ఆమోదం తెలిపింది.

2014లో పసిఫిక్ సముద్రం చుట్టూ ఉన్న ప్రాంతంలో (రిమ్ ఆఫ్ పసిఫిక్) అమెరికా పసిఫిక్ కమాండ్ నిర్వహించే నావికా విన్యాసాలలో భారత్ పాల్గొంటుందని ఒబామాతో కలిసి విడుదల చేసిన సంయుక్త ప్రకటన పేర్కొంది. 1990వ దశకం మధ్య నుంచి జరుగుతున్న ఈ నావికా విన్యాసాలు, భారత్ – అమెరికా సైనిక విన్యాసాలు విస్తరించుకోవడంలో ఒక భాగం. ప్రపంచంలోకెల్లా భారత్‌తో కలిసే అమెరికా పెద్ద సంఖ్యలో సైనిక విన్యాసాలు నిర్వహిస్తోంది. అమెరికా, జపాన్‌లతో కలిసి భారత్ ఇప్పటికే త్రైపాక్షిక సైనిక విన్యాసాలు నిర్వహించింది. ఇదంతా ఆసియా ప్రాంతంలో అమెరికా వ్యూహాత్మక కూటమిలోకి భారత్‌ను కూడా లాగాలన్న ఆ దేశ ప్రణాళికలో భాగమే. ఈ పర్యటనలో భారత్‌ను అమెరికాకు అత్యంత సన్నిహిత మిత్ర దేశంగా ఉంచేందుకు ప్రధాని అంగీకరించారు.

అమెరికా జాతీయ భద్రతా సంస్థ (ఎన్ఎస్ఎ) మన దేశం సహా వివిధ దేశాల్లోకి గోప్యంగా చొరబడి ఎలక్ట్రానిక్ గూఢచార్యం సాగిస్తుంటే, దానికి ప్రధాని నిరసన తెలిపినట్లుగా లేదా నేతలిరువురూ కనీసం చర్చించినట్లు కూడా సంయుక్త ప్రకటన పేర్కొనకపోవడం శోచనీయం. స్నోడెన్ వెల్లడించిన వివరాల ప్రకారం అమెరికా నిఘాకు భారత్ ప్రధాన లక్ష్యంగా ఉంది. సేకరించిన మొత్తం డేటా పరిమాణాన్ని బట్టి చూస్తే ఐదవ స్థానంలో ఉంది. వాస్తవానికి, అమెరికా మిత్ర దేశాలైన జర్మనీ, ఫ్రాన్స్‌లు తెలిపిన స్థాయిలో కూడా ఈ గూఢచర్యం గురించి భారత్ నిరసన తెలియజేయలేదు. పైగా దీనికి విరుద్ధంగా, ఇదేమీ నిఘా గూఢచర్యం కాదని భారత విదేశాంగ మంత్రి సల్మాన్ ఖుర్షీద్ స్వయంగా ప్రకటించారు. భారత్ సార్వభౌమత్వంలోకి అమెరికా చొరబాటును సైతం ప్రశ్నించలేని దౌర్భాగ్య స్థితిలో భారత ప్రభుత్వం ఉంది.

ఇరు దేశాల మధ్య పరస్పర వాణిజ్యం, పెట్టుబడులు పెరగాలనే ఆసక్తి ఈ సమావేశాలలో అమెరికావైపు నుంచే అధికంగా వ్యక్తమైంది. ఆసియా ఖండంలో అమెరికా వ్యాపార యాత్రకు భారతదేశమే దిక్సూచిగా నిలుస్తుందని అమెరికా భావిస్తోంది. అమెరికాలో భారతదేశం పట్ల అంతర్గతంగా ఉన్న ఈ అభిప్రాయాలన్నీ కార్యరూపం దాల్చాలనే ఉద్దేశంతోనే ఇరుదేశాల మధ్య పరస్పరం జరిగే వస్తువులు, సేవల వర్తకాన్ని ఐదింతలు చేయాలని నిర్ణయించారు. రక్షణరంగంలో సన్నిహిత సహకారానికై 2009లోనే 'డిఫెన్స్ ఫ్రేమ్‌వర్క్' ఒప్పందం జరిగినప్పటికీ అధునాతన టెక్నాలజీ బదలాయింపునకు అమెరికా సిద్ధపడలేదు. ఈ ప్రాంతంలో 'నిన్ను మించిన మిత్రుడు లేడ'ని ప్రధానిని ప్రశంసలతో ముంచెత్తే ఒబామా తమ ప్రయోజనాలకు అవసరమైన మేరకే రక్షణ సహకారం కొనసాగిస్తున్నాడు. రష్యా, ఫ్రాన్స్, ఇజ్రాయిల్‌లతో సంయుక్త పరిశోధన – అభివృద్ధిలో భారత్‌కు సంబంధం ఉన్నందున అమెరికా చట్టాలు అందుకు అనుమతించడం లేదని, దీనికొక మార్గం కనుకోవాలని మాత్రం సంయుక్త ప్రకటన తెలిపింది.

జపాన్‌లోని ఫుకుషిమా, రష్యాలోని చెర్నోబిల్, అమెరికాలోని త్రీమైల్ ఐలాండ్ తరహా అణు ప్రమాదాలు జరిగితే మన పరిస్థితి ఏమిటి? ఫుకుషిమా దుర్ఘటన తరవాత ఆ ప్రాంతాన్ని అపాయరహితం చేయడానికి జపాన్ 5000 కోట్ల నుంచి 7000 కోట్ల డాలర్లు వ్యయం చేయాల్సి వచ్చింది. భారత్ అంతభారం భరించగలదా? ప్రమాదానికి బాధ్యులైన వారిని తప్పించి, పన్ను చెల్లింపుదారుల డబ్బుతోనే ప్రభుత్వం పరిహారం ఇవ్వాలా? చివరకు యుపిఎ సర్కారు ఆ దిశలోనే అడుగులు వేస్తున్న సూచనలు కనిపిస్తుండడంతో ప్రజల్లో ఆందోళన పెరుగుతోంది. నిజానికి అణువిద్యుత్ కంటే చౌకగా, ప్రమాదరహితంగా హైడ్రో, థర్మల్, సోలార్, పవన విద్యుత్ తయారు చేసుకునే అవకాశాలు ఉన్నాయి. యూనియన్ కార్బైడ్ భోపాల్ గ్యాసు దుర్ఘటన దుష్ఫలితాలు మన ముందున్నాయి. అయినా, అణువిద్యుత్‌కు ప్రాధాన్యత ఇవ్వడం అంటే ప్రజల ప్రాణాలు ఫణంగా పెట్టి కార్పొరేట్లకు లాభాలు సంపాదించి పెట్టడమే భారత ప్రభుత్వ విధానంగా ఉంది.

1991లో ప్రభుత్వం చేపట్టిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ సంస్కరణలు మన ఆర్థిక వ్యవస్థలో రెండు పరిణామాలకు దారితీసింది. ఒకటి, ఉత్పత్తి, వాణిజ్యంలో కార్పొరేట్ గుత్తాధిపత్యం పెరిగింది. కంట్రోళ్ల ఎత్తివేత విపరీతమైన లాభాలకు దారి తీసింది. సంక్షేమ పథకాల నిధులు కుదింపు, ప్రభుత్వరంగ సంస్థల మూసివేత వలన పేదరికం, ధరలు పెరిగాయి. రెండవది, వాణిజ్యాన్ని సరళీకృతం చేయడం, టోకు, చిల్లర వ్యాపారాలలో కార్పొరేట్ సంస్థల ప్రవేశం, అనేక సరకుల వ్యాపారంలో ఫ్యూచర్స్ వ్యాపార ధోరణులు ప్రవేశించడంతో సట్టా వ్యాపారం తనవంతు పాత్ర తాను పోషిస్తోంది. ప్రజల మౌలిక సమస్యలైన అవిద్య, పేదరికం,

# అమెరికా షట్‌డౌన్

***అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభానికి అమెరికా షట్‌డౌన్ ఒక హెచ్చరిక అనీ, రాబోయే రోజుల్లో దాని ప్రభావం అమెరికా ఆధిపత్యంలో ఉన్న దేశాలన్నిటిపై పడుతుందనీ అంటున్నారు భాస్కర్ ఏంపెల్లి***

ఇటీవలి కాలంలో అమెరికాలో జరుగుతున్న పరిణామాలు ఆసక్తిగా, ఆందోళనకరంగా ఉన్నాయి. 2008 ఆర్థిక సంక్షోభం, వాల్ స్ట్రీట్ ముట్టడి ఉద్యమం, అమెరికా ప్రభుత్వం షట్ డౌన్ అనేవి ఆసక్తిగా ఉంటే, అమెరికా ప్రపంచం మీద తన ఆధిపత్యాన్ని కాపాడుకోవడానికి తీవ్రవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య పునరుద్ధరణ పేరు మీద అది అరబ్ దేశాలపై చేస్తున్న యుద్ధాలు ఆందోళన కలిగించేవి.

అనిశ్చితి ప్రధాన లక్షణంగా గల పెట్టుబడిదారీ విధానాలు, ఆర్థిక మాంద్యం, ద్రవ్యోల్బణం, నిరుద్యోగం లాంటి స్వల్పకాలిక ఆర్థిక సంక్షోభానికి ప్రజలను గురిచేయడమే కాకుండా, అది దీర్ఘకాలంలో తన ఆర్థిక కేంద్రాలను మార్చుకుంటుంది. తూర్పు యూరోప్ దేశాలు కేంద్రంగా ఉన్న ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తర్వాత బ్రిటన్ కేంద్రంగా మారి సామ్రాజ్యాలను నిర్మించుకున్నది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా కేంద్రంగా ఆర్థికవ్యవస్థ మారింది. ఈ కేంద్రాలన్నిటికి ప్రపంచంలో వేరే ఎక్కడో విచ్చలవిడి దోపిడీ మూలాలు ఉంటాయి. తూర్పు యూరోప్, బ్రిటన్‌లు ఆసియా, ఆఫ్రికాలలో వలసలు ఏర్పాటు చేసుకొని దోపిడీ చేస్తే, స్వేచ్ఛా ఆర్థిక వ్యవస్థ అయిన అమెరికా ఆర్థిక మూలాలు ఆఫ్రికా బానిసత్వంలో ఉన్నాయి. ప్రపంచాన్ని నడిపిస్తున్న చమురు నిల్వలు కలిగిన అరబ్ దేశాల మీద పెత్తనం ఎన్ని రోజులు సాగితే అన్ని రోజులు ప్రపంచం మీద అమెరికా పెత్తనం సాగుతుంది. కమ్యూనిస్టు, తీవ్రవాద బూచిని చూపెట్టి రసాయన ఆయుధాలు కలిగి ఉన్నారనే నెపంతోని స్వతంత్ర దేశాల మీద యుద్ధాలు చేస్తూ, ప్రపంచానికి తన ఆయుధ సంపత్తిని చూపి భయపెట్టినంత కాలం మాత్రమే అమెరికా ఆర్థిక పెత్తనం కొనసాగుతుంది. అమెరికాది అంగబలం మాత్రమే అర్థబలం కాదు. అది వాపు మాత్రమే బలుపు కాదు. ఆయుధం చూపించి అత్యాచారం చేయ చూసే పాశవిక మృగత్వం అమెరికాది. దాని పతనం అంచులను చూపించేదే ఈ అమెరికా ప్రభుత్వం అక్టోబర్ ఒకటి నుండి పదిహేడు రోజులు జరిగిన ప్రభుత్వ కార్యకలాపాల నిలిపివేత (షట్‌డౌన్).

అమెరికా అంగవిన్యాసాలకు, అర్థవిన్యాసాలకు, ఆయుధ విన్యాసాలకు అబ్బురపడి పోయి 'ఓహో అమెరికా' అని జబ్బలు చరుచుకొని పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదుల పొత్తిళ్లలో చేరిన వాడే రాజు – అరబ్ దేశాలలో అయితే, ప్రజాస్వామ్య దేశాలలో వాళ్లను ప్రధానమంత్రులంటారు. ఉదారవాదులు, నయా ఉదారావాదులు కూడా కాదు, అమెరికాకు కావాల్సింది నయవంచకులు. ఆదర్శ నాయకునిగా, భారత ప్రధానిగా నరేంద్రమోడీకి జాతీయ, అంతర్జాతీయ ప్రసార మాధ్యమాలు చేస్తున్న ప్రచారం అందులో భాగమే.

నిరుద్యోగం, ఆకలిచావులు, ఆత్మహత్యలు, పౌష్టికాహారలోపం లాంటి ఏ ఒక్క సమస్య పరిష్కారం కాలేదు. ప్రపంచబ్యాంక్ అభివృద్ధి నమూనా ప్రజల జీవనాధారాలను కొల్లగొడుతోంది. అవినీతి కుంభకోణాలకు, నల్లధనానికి అంతేలేదు. పకృతివనరులు, ప్రభుత్వనిధులు కార్పొరేట్ సంస్థలకు ధారాదత్తం చేస్తున్నాయి. సమ్మిళిత, సమీకృత అభివృద్ధి గురించి ప్రధాని, ఆర్థికమంత్రి చెపుతున్నప్పటికీ బడ్జెట్‌లో ఆ ఊసే ఉండడంలేదు. హక్కుల కొరకు ఉద్యమించే ప్రజలపై ప్రభుత్వం ఉక్కుపాదం మోపుతోంది. మరోవైపు ప్రభుత్వ యంత్రాంగపు ఫాసిజీకరణ పెరుగుదల, నల్ల చట్టాల ఆమోదం, కేంద్రంలో కొనసాగుతున్న అస్థిరత్వం దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో పెరుగుతున్న ప్రజా ఉద్యమాల రూపంలో రాజకీయ సంక్షోభం ప్రతిబింబిస్తోంది. అయినా మరిన్ని సంస్కరణలకు ప్రభుత్వం పూనుకుంటోంది.

అమెరికాతో భారత్ సంబంధాలు అత్యంత లొంగుబాటు దశకు చేరాయి. అమెరికాతో పెరుగుతున్న సైనిక సహకారం కీలకమైన రక్షణ, సాయుధ బలగాల వ్యవస్థల్లోకి అమెరికా చొరబాటుకు వీలు కల్పిస్తోంది. ఇది భారత్ సార్వభౌమాధికారానికి, స్వతంత్ర విదేశాంగ విధానానికి, వ్యూహాత్మక స్వయం ప్రతిపత్తిపై తీవ్రమైన పర్యవసానాలు కలగజేస్తుంది. ప్రధాని, అమెరికా అధినేతతో తన చివరి అధికారిక సమావేశం ఆ దేశానికి అనేక రాయితీలివ్వడానికి ఉపయోగించుకున్నట్లు సూచిస్తోంది. యుపిఎ ప్రభుత్వం అమెరికా అనుకూల విధానాలు ఎలా ఉన్నా ప్రతిపక్ష బిజెపికి, దేశంలోని ప్రాంతీయపార్టీలకు పెద్దగా అభ్యంతరాలూ లేవు. అణు లయబిలిటీ క్లాజు సడలింపు పట్ల బిజెపి పార్లమెంట్ బయట అరిచింది. కాని పార్లమెంటులో వ్యతిరేకించలేదు. న్యూయార్క్‌లో పాక్ ప్రధాని నవాజ్ షరీఫ్‌తో, ప్రధాని సమావేశం కాకూడదని జాతీయ దురహంకారాన్ని ప్రదర్శిస్తున్న ప్రతిపక్ష బిజెపిపార్టీకి ఉన్న ఏకైక ఆందోళన తప్ప అమెరికా కార్పొరేట్ సంస్థలకు రాయితీల రూపంలో భారత్ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెడుతూంటే నోరు మెదపదు. ఈ రకంగా భారత పాలక వర్గాలు అమెరికాతో వ్యూహాత్మక సహకారానికి ఎంతగా కట్టుబడి ఉన్నాయో ఇది సూచిస్తోంది. యూపిఏ కూటమి గాని, ఎన్‌డిఏ కూటమి గాని ఒకే నాణానికి 'బొమ్మ – బొరుసు' లాంటివేనని వేరుగా చెప్పనవసరం లేదు. అత్యధిక ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకమైన కార్పొరేట్ సామ్రాజ్యవాద అనుకూల ఆర్థిక విధానాలను ప్రజాతంత్ర వాదులు ఎదిరించవలసి ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమనాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* ✦

**షట్‌డౌన్ అంటే**

అమెరికా రాజ్యాంగం ప్రకారం కాంగ్రెస్ క్రమం తప్పకుండా ప్రభుత్వ నిధులకు సంబంధించిన బిల్లును ఆమోదించాలి. అట్లా చేయడంలో ప్రభుత్వం విఫలం అయితే ప్రభుత్వం రోజువారి కార్యకలాపాల నిధుల ఏర్పాటు చేయకపోవడం వలన అత్యవసరం కాని సేవలను మూసి వేయవలసి వస్తుంది. ప్రభుత్వం షట్‌డౌన్ అనేది ప్రభుత్వ రోజువారి కార్యకలాపాలకు వెచ్చించే నిధుల కాలం ముగిసినప్పుడు, కొత్తగా నిధుల కేటాయింపుల విషయంలో ఏకాభిప్రాయం రానప్పుడు, కేటాయింపులు జరిగే వరకు కొనసాగుతుంది.

అమెరికా ప్రభుత్వం పూర్తిగా పనిచేయదని దీనిఅర్థం కాదు. ముఖ్యమైన ప్రభుత్వ విభాగాలైన జైలుసెక్యురిటీ, సరిహద్దు నిఘా, ఇతర అత్యవసర విభాగాలు పనిచేస్తాయి. జాతీయపార్కులు, మ్యూజియమ్స్, జ్ఞాపికలు లాంటి అత్యవసరం కాని విభాగాలు మూసివేయబడతాయి. ఇటువంటి అత్యవసరం కాని ఉద్యోగాల్లో ఉన్నవారు ఎలాంటి చెల్లింపులు లేకుండా ఇంటికి పంపించబడతారు. ప్రస్తుతం వీరి సంఖ్య 800,000 గా ఉంది. అయితే 1996 లో జరిగిన షట్‌డౌన్ సందర్భంలో ఇటువంటి ఉద్యోగులందరికీ చెల్లింపులు చేశారు.

**జరిగిన పరిణామాలు**

షట్ డౌన్ ప్రారంభానికి ఒకవారం ముందు రిపబ్లికన్ల ఆధిపత్యం ఉన్న హౌస్, ఒబామా కేర్‌గా పిలవబడుతున్న ప్రైవేట్ ఆరోగ్య బీమా వంటి ఆరోగ్య సంస్కరణలకు నిధులు కేటాయించకుండా దాన్ని నిలిపివేసే విధంగా ఒక బడ్జెట్‌ను ప్రవేశపెట్టింది. అదేవారం చివరలో ఒబామా హెల్త్‌కేర్ పథకం అమలును నిలిపివేసేటట్టు సవరణలు చేసిన బడ్జెట్‌ను ఆమోదించి, అభ్యంతరాలు ఉంటే తెలపమని ఒబామాని కోరింది.

డెమొక్రాట్ల ఆధిపత్యం ఉన్న సెనేట్ ఆ బిల్లును తిరస్కరించింది. ఒబామా కేర్‌ను బలహీనపరిచే ఏ బిల్లునైనా తన వీటో అధికారంతో రద్దు చేస్తానని ఒబామా తేల్చిచెప్పారు. ఒబామా కేర్‌పై జరిగే చర్చను జాప్యం చేసే తాత్కాలిక సవరణ బిల్లును ఆమోదించే దిశగా ప్రయత్నాలు జరిగినప్పటికీ అవి సఫలం కాలేదు. 'మీరు ప్రభుత్వాన్ని నిలిపిస్తారు. కాని ఎఫ్ఫర్డబుల్ కేర్ (ఒబామా కేర్) ఆక్ట్‌ను కాదు' అని ఒబామా ప్రకటించారు. ఒబామా రెండుసార్లు అధికారంలోకి రావడానికి ప్రధానకారణంగా చెప్పుకునే ఈ ఒబామా హెల్త్‌కేర్ పథకం నిరుద్యోగులైన 30 మిలియన్ల అమెరికన్లకు ప్రైవేట్ హెల్త్ ఇన్సూరెన్స్ వర్తించే విధంగా తయారుచేయబడింది. అయితే 56 శాతం అమెరికన్లు దీనిని వ్యతిరేకిస్తున్నారు. 11 శాతం మంది ఇది సరైన వ్యక్తులకు చేరదనే కారణంతో వ్యతిరేకిస్తున్నారు. ప్రైవేట్ కాకుండా ప్రభుత్వమే పూర్తి నిధులతో ఇటువంటి పథకాలు రూపొందించాలని చాలా మంది అమెరికన్ల కోరిక

ఒబామా కేర్ (ఎఫ్ఫర్డబుల్ కేర్) ఆక్ట్ మార్పులకు, నిధులకు సంబంధించి హౌస్‌కి , సెనేట్‌కి మధ్య కొత్తగా నిధుల కేటాయింపులో ఒప్పందం కుదరకపోవడం వలన అమెరికా ప్రభుత్వం అత్యవసరం కాని సేవలను నిలిపివేశారు. ఈ మూసివేత ఎంతకాలం కొనసాగుతుంది అనేదాన్ని బట్టి అమెరికా ఆర్థిక వ్యవస్థపైన దాని ప్రభావం ఎలా ఉంటుందో చెప్పోచ్చు. తగ్గిన ప్రభుత్వ ఉద్యోగుల ఆదాయం ప్రభావం కచ్చితంగా ఆర్థిక వ్యవస్థ మీద ఉంటుంది. వారం రోజులు ప్రభుత్వం మూసివేస్తే అంచనా వేసిన 2.8 వృద్ధి రేటులో 0.2 నుండి 0.3 వరకు తగ్గే అవకాశం ఉంది. గత పద్దెనిమిది సంవత్సరాలలో పాక్షికంగా ప్రభుత్వం మూసివేయడం ఇది మొదటిసారి. ఇంకా కొద్దివారాలు ఇది కొనసాగితే అమెరికా మరొక సంక్షోభాన్ని ఎదుర్కొని ఉండేది.

**కారణాలు**

అప్పుల్లో కూరుకుపోయిన కంపెనీలను బెయిల్ అవుట్ చేయడం కోసం పరిమితికి మించి అప్పులు చేయడం వలన భవిష్యత్తులో వడ్డీలు కూడా కట్టే పరిస్థితిలేదు. అమెరికా తన పౌరుల ఆదాయాల మీద 100 శాతం పన్నులు విధించినా సంయుక్త ప్రభుత్వ బడ్జెట్‌కు సరిపోదు. అమెరికా హోదాని నిలబెట్టుకోవడానికి ఇంకా అప్పు చేయవలసి వస్తుంది అని నేషనల్ ఇన్ఫ్లేషన్ అసోసియేషన్ ఆఫ్ అమెరికా ప్రకటించింది. ప్రపంచ చరిత్రలో ఏ దేశానికి లేని అప్పు అమెరికాకు ఉంది. అమెరికా ఖర్చుపెట్టె ప్రతి డాలర్‌లో 46 శాతం అప్పు చేస్తుంది.

అమెరికా అప్పు చేయడానికి ఒక పరిమితి ఉంటుంది. ఇది 1917లో మొదవలైంది. 1960 నుండి ఇప్పటివరకు 78 సార్లు ఈ పరిమితిని పెంచారు. ప్రస్తుతం ఈ రుణపరిమితి 16.7 ట్రిల్లియన్ డాలర్లు, అయితే అక్టోబర్ 17న అమెరికా అప్పు ఈ పరిమితిని మించి పోతుంది. ఇటువంటి పరిస్థితిలో ఒబామా కేర్‌కు నిధులు కేటాయించడం సరికాదని రిపబ్లికన్ల వాదన.

అక్టోబర్ 17 లోపల రుణపరిమితికి సంబంధించిన చర్చలు ముగించి, రుణపరిమితి పెంచాలి. లేకపోతే అమెరికా ఏ బిల్లును కుడా చెల్లించలేదు. అమెరికా తను చెల్లించవలసిన అప్పుకి వడ్డీని కూడా చేలించలేని పరిస్థితికి దిగజారుతుంది. కాబట్టి, రుణపరిమితి పెంచడానికి సంబంధించిన చర్చ అనేది చాలా ముఖ్యమైనది. ఈ సందర్భాన్ని ఉపయోగించుకొని ప్రభుత్వం పైన ఒత్తిడి తీసుకు వచ్చి ఒబామా కేర్ ని తాత్కాలికంగానైనా అడ్డుకోవాలని వేసిన వ్యూహం షట్‌డౌన్‌కి కారణమైంది. ఈ తాత్కాలిక షట్‌డౌన్ అనేది ఒక విధంగా రుణపరిమితి పెంచే చర్చను సులభం చేసి, అటువంటి చర్చ కూడా లేకుండా చేసింది. అక్టోబర్ 17న ఇరువర్గాలు ఒక అవగాహనకు రాకపోతే అమెరికా ఆర్థిక వ్యవస్థలో, ఫలితంగా డాలర్ ప్రామాణికంగా నడుస్తున్న ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలో జరిగే పరిణామాలు అమెరికాకే కాదు ప్రపంచానికి కూడా తెలుసు. అందుకే బ్రిటన్, యూరోప్ దేశాలు, ఇతర అగ్రదేశాలు ఈ షట్‌డౌన్ కి ముగింపు పలకమని విజ్ఞప్తులు చేసింది. అమెరికా రుణపరిమితి పెంచకపోతే అమెరికా ఆర్థికబలం ఎంతో తెలిసిపోయేది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని, 2014 ఫిబ్రవరి 7 వరకు సరిపోయే రుణపరిమితిని పెంచి, 2014 జనవరి 15 వరకు ప్రభుత్వ ఖర్చులకు సరిపోయే బడ్జెట్‌ని ఆమోదించాలనే ఒప్పందంతో అక్టోబర్ 17న షట్‌డౌన్‌ను విరమించారు. ఇది తాత్కాలిక విరమణ మాత్రమే.

*(రచయిత ఆర్థికశాస్త్ర పరిశోధక విద్యార్థి, సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

# 'రాష్ట్ర విభజన' - మూడు ప్రాంతాల ప్రజాభిప్రాయాలు

***జూలై 30 కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మాన నేపథ్యంలో వీక్షణం మూడు ప్రాంతాలలో సాధారణ ప్రజల అభిప్రాయాలను సేకరించడానికి ప్రయత్నించింది. సెప్టెంబర్, అక్టోబర్ సంచికల్లో పదమూడు జిల్లాల ప్రజాభిప్రాయాలను ప్రచురించాం. మిగిలిన జిల్లాల ప్రజాభిప్రాయాలను అందిన మేరకు ప్రచురిస్తున్నాం. - సం.***

కలిసి ఉండడం మంచిది. లేదా విడిపోవడమే జరిగితే హైదరాబాద్ మీద ఇరు ప్రాంతాలకు హక్కుండాలి.

**- యఫ్. మహమ్మద్,** వ్యాపారి, ఉదయగిరి

విడిపోతే హైదరాబాద్ పోతుంది కదా! ఆ నగరం మీద ఆధారపడి ఎంతో మంది జీవనం గడుపుచున్నారు. బడా కోటీశ్వరులు ఎక్కడైనా పెట్టుబడులు పెట్టి వ్యాపారాలు చేసుకోగలరు. ప్రపంచమంతా తిరగగలరు. చంద్రమండలానికి కూడా పోయి సంపాదించుకొంటారు. కూలీ నాలీ పనిచేసుకునేటోళ్లు ఎక్కడికైనా పోగలరు. వారిపని వారికుంటుంది. ఉద్యోగస్తులకే కదా ఇబ్బంది. ఎక్కువగా మధ్యతరగతి ఇబ్బందుల పాలు కావలసి వస్తుంది. రాబోయే కాలంలో మా పిల్లల భవిష్యత్తు ఏమిటి. తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ప్రకటించినప్పుడు తప్పనిసరిగా హైదరాబాద్ నగరంలో కూడా ఆంధ్రా వాళ్లకు హక్కుకల్పిస్తే మంచిది. ఆ నగరం మీద ఆధారపడి చదువుకొన్న విద్యార్థుల పరిస్థితి ఏమిటి? కనుక కలిసి ఉంటే అందరికి మంచిది. ఇబ్బందికి గురిఅయ్యేది ఎక్కువగా మధ్యతరగతి వాళ్లమే కదా!

**- కడియాల జ్యోతి,** ప్రభుత్వ ఉపాధ్యాయురాలు, నెల్లూరు

కలిసి ఉండడం మంచిది. భవిష్యత్‌లో పిల్లల చదువుగాని, ఉద్యోగాలుగాని హైదరాబాద్ నగరంలోనే ఎక్కువగా అవకాశాలు ఉన్నాయి కదా! అలాంటి నగరాన్ని ఒదులుకోవడం పిల్లల భవిష్యత్తును పోగొట్టుకోవడమే.

**- ఎం.వి. రామక్రిష్ణ,** బ్యాంకు ఉద్యోగి, విజయవాడ

ఎంతోకాలం నుండి అసంతృప్తికి గురిఅయి పోరాడుతున్నారు గనుక వారి ప్రాంతాన్ని వారికి విడగొట్టడమే మంచిది. ఈ ఉద్యమాలన్నీ కూడా స్వార్థ రాజకీయాలతో కూడినవి ఆంధ్ర రాజధానిగా ప్రకాశం జిల్లాలో ఒంగోలు ప్రాంతం అనువుగా ఉంటుంది. అందరికి మంచిది. అన్ని జిల్లాలకు దగ్గర. ఇక్కడ అభివృద్ధి చేసుకోవచ్చు కదా! ఒకే నగరంలో ఇరు ప్రాంతాల వారు కలిసి ఉండలేరు.

**- అయితా వెంకటసుబ్బారావు,** వ్యాపారి, దుత్తలూరు

ఇరు ప్రాంతాల ఉద్యమాలు కూడా పాలకవర్గ పార్టీ నాయకులు రెచ్చగొట్టారు గాని ప్రజలలో నుండి వచ్చినవి కావు. విడిపోవాలనే ఆలోచన తెలంగాణ ప్రాంత అధికార పార్టీ నాయకులలో నుండే వచ్చింది. ఆ తర్వాత ప్రజలను రెచ్చగొట్టారు. తర్వాత ప్రజలు ఇష్టంగానే వీధుల్లోకొచ్చి ఉద్యమాలు చేశారు. కేంద్ర కాంగ్రెస్ పార్టీ పక్షపాతంగానే తెలంగాణ పాలకవర్గాన్ని తక్కువ చూపు చూస్తూ వచ్చిన కారణంగా అసూయతో వేరు బాట పట్టినారు. పదవుల దగ్గర నుండి అన్ని అధికార పగ్గాలు ఆంధ్రవారికే ఇస్తూ వచ్చారు. అందువలన ఆంధ్రా పాలకుల మీద అసూయతో వేరు కుంపటి పెట్టుకోవాలని తహతహలాడుతున్నారు. ఆంధ్రా వాళ్లే ఇరు ప్రాంతాల మీద ఆధిపత్యాన్ని కొనసాగించుకొంటేగాని వారి పెట్టుబడులు, అస్తులు పదిలంగా ఉండవు అనే ఉద్దేశముతో అడ్డు తగులుతున్నారు. కానీ ఇది ప్రజా ఉద్యమం కాదు. ఈ ద్వేషభావాన్ని రగిల్చింది కేంద్ర ప్రభుత్వమే! ఆ బాధ్యత వారిదే గనుక వారే దీనిని పరిష్కరించవలసి ఉంటుంది. ఇరు ప్రాంతాల మధ్య కేంద్ర కాంగ్రెస్ నాటకాలాడుతున్నది. తోలు బొమ్మలు ఆడించినట్లు ఇరు ప్రాంతాల వారిని తెరమీదికెక్కించారు. అనేది యదార్థం. ఇరువైపుల వారికి సమన్యాయం జరిగినప్పుడే ఇది పరిష్కరింపబడుతుంది.

**- వేమూరి క్రిష్ణయ్య,** రైతు, దుత్తలూరు

సుదీర్ఘకాలం తెలంగాణ మనుగడకోసం పోరాడిన చరిత్ర ఆ ప్రజలకున్నది. నైజాం నుండి విముక్తి పోరాటంలో అన్ని కష్టాలు అనుభవించి అనేక బలిదానాలు చేసిన చరిత్ర ఉన్నది. తెలంగాణ ప్రజలు నిర్మల మనస్కులు. ఆంధ్రా వాళ్ల ఆధిపత్యంతో విసిగిపోయి తమ కాపురం తామే చేసుకుంటామంటే వారిని అడ్డుకోవడం న్యాయం కాదు. ఆంధ్రావాళ్లు అక్కడికి పోయి బాగా సంపాదించారు. ఆంధ్రావాళ్లదంతా దగాకోరుతనమే గాని న్యాయం లేదు. ఆనాటి నైజాం వ్యతిరేక పోరాటంలో ఆంధ్రవారు సహకారం అందించారు అనేది నిజమేగాని ఎక్కువగా బలిదానాలు చేసింది తెలంగాణ వారే గనుక వారి న్యాయమైన కోరికను తిరస్కరించకుండా వారి ప్రాంతాన్ని వారికి వదిలిపెట్టడం మంచిది. ఆంధ్రాలోనే పెద్ద నగరాన్ని నిర్మించుకోవచ్చు కదా!

**- కురిచేటి బ్రహ్మయ్య,** కార్పెంటర్, అయ్యవారి పల్లె,

కలిసి ఉండడం మంచిది. రెండు రాజధానులుగా ఒకే నగరంలో కుదరదు. విడగొడితే ఆంధ్రావారికి నష్టమే గనుక ఎందుకొచ్చింది ఇదంతా. ఆంధ్రప్రదేశ్‌గా ఉంటేనే మంచిది.

**-షేక్ రంతుల్లా,** టీచర్, ఉదయగి

రాజకీయ నాయకులు చేసే కుటిల పన్నాగాలు అనవచ్చు, ఇది ప్రజల నుండి రాలేదు. ప్రజల ఇబ్బందులు కూడా దృష్టిలో పెట్టుకొని ఉద్యమాలు చేయాలి కాని ప్రజలను ఇబ్బంది పెట్టి చేయడం ద్రోహం.

**- వి. కోటేశ్వరరావు,** టీచర్, నెల్లూరు

(సేకరణ **కడియాల సుబ్బానాచారి,** దుత్తలూరు, నెల్లూరు) వీ

# విద్యుదుత్పత్తి - కొన్నివాస్తవాలు

**విద్యుత్తు ఉత్పత్తికి కారణమైన బొగ్గును వెలికితీయడానికి తమ ప్రాణాలను ఫణంగా పెడుతూ రాష్ట్రానికి వెలుగు అందిస్తున్న కార్మికుల బాధలను, గాథలను వివరిస్తున్నారు కె.సుభాషిణి**

ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక (ప్రరవే) 2013 సెప్టెంబర్ 25న హైదరాబాద్‌లోని బంజారాహిల్స్‌లో లామకాన్‌లో ఏర్పాటు చేసిన 'రాష్ట్ర విభజన - చర్చ' కార్యక్రమానికి రాష్ట్రంలోని పలు జిల్లాల నుండి రచయిత్రులు హాజరయ్యారు. దాదాపు మూడుగంటల పాటు జరిగిన చర్చలో పలు అంశాల మీద రచయిత్రులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. ప్రరవే 2010లో ప్రకటించిన తన ముసాయిదా పత్రంలో ప్రజాస్వామిక ఆకాంక్షను వ్యక్తపరిచే ఏ ఉద్యమానికైనా తన మద్దతును తెలియజేస్తుంది అని చెపుతూ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కొరకు జరిగే ఉద్యమాలకు మద్దతును ప్రకటించింది.

2013 సెప్టెంబర్ 26న పన్నెండు మంది ప్రరవే సభ్యులు ఆదిలాబాద్ జిల్లాలోని మంచిర్యాల, మందమర్రి చుట్టుపక్కల గ్రామాలలో ఓపెన్ కాస్ట్ బొగ్గు గనులను సందర్శించారు. ఉత్తర తెలంగాణలో ఓపెన్ కాస్ట్ గనుల పేరిట జరిగే విధ్వంసాన్ని, ప్రజల మీద దాని ప్రభావాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. తరువాత వివిధ ఉద్యోగ సంఘాల సమైక్యవాదులు 2013 సెప్టెంబర్ 29న 'సమైక్య రాష్ట్ర ప్రజా గర్జన' పేరిట కర్నూల్‌లో భారీ సమైక్యాంధ్ర సభను నిర్వహించారు.

ఈ మూడు కార్యక్రమాలు కూడా వేరు వేరు తేదీలలో, వేరువేరు ప్రాంతాలలో, వేరువేరు అంశాలకు సంబంధించిన వాటిలాగా కనిపిస్తున్నప్పటికి ఈ మూడింటి మధ్య అంతర్లీనంగా ఒక బలమైన అంశం ముడిపడి ఉంది. ఈ మూడు రోజులలో చోటుచేసుకున్న చర్చలు, అధ్యయనాలు, వక్తల ప్రసంగాలనన్నింటిని క్రోడీకరించి అసలు సారాంశాన్ని బయటకు తీసుకొని రావడమే ఈ వ్యాసం ఉద్దేశం.

'ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అత్యధికంగా విద్యుత్ వినియోగం జరుగుతోంది తెలంగాణలోనే' అని ఒక కోస్తా ప్రాంతపు రచయిత్రి తన దగ్గర ఉన్న గణాంకాలతో పాటు వివరించారు (25-9-2013). 'మా బొగ్గును సీమాంధ్ర వాళ్లు తీసుకుపోతున్నారు అని తెలంగాణవారు అంటున్నారు. కానీ, విజయవాడ థర్మల్ పవర్ ప్రాజెక్ట్ (విటిపిఎస్) నుండి ఉత్పత్తి అవుతున్న విద్యుత్తులో ఎక్కువ భాగం తెలంగాణకే పోతోంది' అని ఎపిఎన్‌జిఒ నాయకుడు ప్రకటించాడు (29-9-2013). ఇందులో కొంచెం వాస్తవమే! అయితే ఈ వాస్తవం వెనుక ఉన్న కుట్రనూ, అవాస్తవాలనూ మరుగుపరిచే ప్రయత్నం బాగా కనిపిస్తుంది.

బొగ్గును వెలికి తీయడానికి కార్మికులు పడే కఠోరశ్రమను అందులోని సాధకబాధకాల గురించి రాజకీయ నాయకులు కాని, ఉద్యోగ సంఘాల నాయకులు కాని, ప్రజలకు ఏనాడైనా తెలియజేసే ప్రయత్నం చేశారా? అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, పి.చంద్ మొదలగు తెలంగాణ రచయితలు బొగ్గుగని కార్మికుల వ్యథలను కథలుగా రాశారు. సిటడెల్ (ఎ.జె క్రోజిన్), జెర్మినల్ (ఎమిలి జోలా), డి.హెచ్ లారెన్స్ తదితర ప్రపంచ రచయితలు ప్రమాదభరితమైన బొగ్గుగని కార్మికుల జీవితాలకు అక్షరరూపం ఇచ్చారు. రచయితలూ, సామాజిక కార్యకర్తలూ మాత్రమే ఈ పనిచేశారు.

భూమి లోపలికి కొన్ని కిలోమీటర్ల లోతున ఏటవాలుగా ఉండే బొగ్గు బావుల్లో బొగ్గును వెలికి తీయడానికి సింగరేణి కార్మికులు తమ చెమటను, రక్తాన్ని ధారపోస్తున్నారు. ఏటవాలుగా ఉండే బొగ్గుబావుల్లో (ఇన్‌క్లెయిన్) పని చేయడం అంత సులభంకాదు. ఏటవాలు ఉపరితలంపై నిలబడుతూ, నడుస్తూ సంవత్సరాల తరబడి పనిచేయడం అనేది మామూలుగా నిలబడి పని చేసుకునేవారి ఊహకు ఏమాత్రం అందనిది. నిప్పుల కొలిమి లాంటి బొగ్గుబావుల్లో పని చేస్తున్నప్పుడు ధారాపాతంగా ప్రవహించే చెమటల వలన శరీరాల్లో ఉండవలసినంత నీటి శాతం కోల్పోయి మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధుల బారినపడ్డ బొగ్గు బావి కార్మికుల జీవితాల గురించి మానవ సంబంధాలు అంటూ గుండెలు బాదుకుంటున్న నాయకులు ఆలోచించారా? ధూళి, దుమ్ముల మధ్య నిరంతరం సంచరిస్తూ, బ్లోయర్స్ నుండి వచ్చే గాలి సరిపోక సరైన ఆక్సిజన్ అందక ఊపిరితిత్తుల వ్యాధుల బారిన పడుతున్న బొగ్గు బావి కార్మికులు పూసుకున్న బొగ్గు మసిని ఈ నాయకులు ఏనాడయినా పులుముకున్నారా? కాళ్లమునివేళ్ల మీద శరీరాన్ని మోపుతూ, ఏటవాలుగా భూమి లోపలి పొరలలోకి బొగ్గుకోసం ప్రయాణించే క్రమంలో కీళ్ల నొప్పులతో బాధపడుతూ రెగ్యులర్‌గా పనికి హాజరు కాలేక మస్టర్ కోతలతో వాళ్లు కోల్పోయిన నెలజీతాల గురించి, ఎన్‌జిఒ నాయకులమని చెప్పుకుంటూ ఇంక్రిమెంట్లు, ప్రమోషన్లు పొందుతూ బొట్టు పని చేయకుండా వసూళ్ల రూపంలో లక్షలను పోగేసుకున్న వీళ్ల చూపు ఏనాడైనా బొగ్గుగని కార్మికుల పైకి మళ్లిందా? ఏ నిమిషంలోనైనా ప్రమాదాలు జరుగవచ్చుని, ఏ క్షణంలో అయినా ప్రాణాలు పోవచ్చుని తెలిసి కూడా తమ ప్రాణాలు ఫణంగా పెట్టి బొగ్గును బయటకు చేరవేస్తూ రాష్ట్రానికి విద్యుత్తును అందిస్తూ ప్రజలను అంధకార బారినుండి కాపాడుతున్న బొగ్గుబావి కార్మికుల జీవితాల్లో అలుముకున్న చీకట్ల గురించి ఏ పూటైనా కరెంటులేని సమయాల్లో గుర్తు చేసుకున్నారా?

నిరంతరం ప్రమాదాల అంచున సంచరిస్తూ, రోగగ్రస్థులై, చాలి చాలని జీతాలతో గుడిసెలలో బతుకుతూ సరైన తిండి, వైద్యం లేక పిల్లలను ఉన్నత చదువులు చదివించుకోలేక కుమిలిపోతున్న బొగ్గుగని కార్మికులు ఎక్కువభాగం ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలోని గ్రామాలకు చెందినవారు. వ్యవసాయం గిట్టుబాటు కాక, ఉన్న ఊర్లల్లో పనులు లేక, బొగ్గుబావిలో పని ఎంతో కష్టమైనది అని తెలిసికూడా వీటిలోనే పని చేయడానికి సన్నద్ధ మయ్యారు. అంటే వీరి ఆర్థిక పరిస్థితి ఎటువంటిదో అర్థం చేసుకోవచ్చు. ఈ మాత్రపు భాగ్యానికి కూడా ప్రస్తుతం వీళ్లు నోచుకోవడం లేదు.

ఓపెన్ కాస్ట్ పద్ధతుల ద్వారా బొగ్గును వెలికి తీయడం మొదలు పెట్టినప్పటి నుండి వీరి పరిస్థితి మరింత దిగజారింది. ఉపాధి కోసం ఎదురు చూసే కూలీలకు ఈ ఓపెన్‌కాస్ట్ గనులు శరణాగతింగా తగిలాయి. బొగ్గు తవ్వడానికి, ఎత్తిపోయడానికి కేవలం ప్రొక్లెయినర్లను మాత్రమే ఉపయోగిస్తుండడంతో బొగ్గుగనుల మీద ఆధారపడిన ఇక్కడి ప్రాంత ప్రజలు ఉపాధిని పూర్తిగా కోల్పోవాల్సి వచ్చింది. ఈ ఓపెన్ కాస్ట్‌లతో

కేవలం ఉపాధి కోల్పోవడమే కాకుండా పర్యావరణానికి తీవ్ర ముప్పు ఏర్పడింది. చుట్టు పక్కల గ్రామాల ప్రజల మీద దీని ప్రభావం పడింది. పేలుళ్లకు ఇళ్లు బీటలు పడుతుంటే, బీటలు వారిన ఆ ఇండ్లల్లో నిరంతరం భయంతోనే ప్రజలు బతుకుతున్నారు. ఊర్ల చుట్టూ అలుముకున్న దుమ్ము, ఎత్తిపోస్తున్న మట్టి, గుట్టలుగా పేరుకుపోతూ గ్రామాల మధ్య అడ్డుగోడలుగా తయారై ప్రజల రాకపోకలను పూర్తిగా ఆపేస్తున్నాయి. మండు వేసవిలో కూడా నీటిని అందిస్తున్న వాగులు ధ్వంసం అయ్యే ప్రమాదం కూడా ఏర్పడింది. వాగులకు అటు ఇటు పెరిగే గడ్డి, పశువులకు ఆహారంగా సరిపోతోంది. వాగులలోని నీరు ప్రజల, పశువుల తాగునీటి సమస్యను తీరుస్తున్నాయి. ఇప్పుడు ఈ ఒపెన్‌కాస్ట్ పద్ధతి ద్వారా వాగులకూ, ఊర్లకూ మధ్య మట్టి గుట్టలు ఏర్పడితే ప్రజలకూ, పశువులకూ జీవనాధారమైన వాగులతో సంబంధం పూర్తిగా తెగిపోయే ప్రమాదం ఉంది. దీనితో పశుసంపదపై పూర్తిగా ఆధారపడిన ఎర్రగుంటపల్లె ప్రజల జీవితాలు చిన్నాభిన్నమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. తమ జీవితాలను ఇంత సంక్షోభంలోకి నెట్టివేస్తున్న ఈ బొగ్గును ఎవరు తవ్వుతున్నారో, ఎందుకు తవ్వుతున్నారో, ఇది ఎక్కడికి రవాణా అవుతుందో, దీన్ని ఎవరు వాడుతున్నారో, ఎవరు సంపన్నులుగా వెలిగిపోతున్నారో తెలియనంత అమాయక ప్రజలు వీళ్లు.

ఇక్కడ ఉత్పత్తి అవుతున్న బొగ్గును వేరే ప్రాంతాలకు రవాణా చేసి ఆ బొగ్గుతో అక్కడ విద్యుత్తును ఉత్పత్తి చేసి మళ్లీ అక్కడ నుండి విద్యుత్తును ఇక్కడకు సరఫరా చేస్తున్నారు. 'ఉత్పత్తి అయ్యే విద్యుత్తులో ఎక్కువ భాగం తెలంగాణకే పోతోంది' అని వాపోవడం ఏ నీతి శాస్త్రాల కిందికి వస్తుందో వివరించగలరా? ఇచ్చిపుచ్చుకోవడం అనేది ఏ ప్రాంతాలకైనా, రాష్ట్రాలకైనా చివరకు దేశాలకైనా సర్వసాధారణం. ఇలాంటి కనీస అవగాహన కూడా లేకుండా, పుచ్చుకున్నవాటిని పూర్తిగా విస్మరించి, కేవలం ఇస్తున్న వాటిని మాత్రమే నొక్కి చెప్పడం అంటే వాస్తవాన్ని నోరునొక్కే దబాయింపు వ్యవహారం కాక మరొకటి కాదు. బొగ్గు అంటే కేవలం ఒక ఖనిజంగానో లేక ఒక నల్లటి ఘన పదార్థంగానో కాకుండా ఇది కార్మికుల రక్తం, చెమటలతో తయారు అయినటువంటిది అన్న భావన తట్టకపోవడం అన్నిటికన్నా పెద్ద విషాదం. విద్యార్థులు, ఉద్యోగస్తులు, రైతులు వెరసి ప్రజల కోసం ఉద్యమాలు చేస్తున్నాం అని చెప్పుకునే ఈ ఉద్యోగ సంఘాల నాయకులకు బొగ్గుగని కార్మికులు కూడా ప్రజలలో భాగమే అన్న విషయాన్ని గుర్తించలేదు అని అనుకోవాలా లేక కావాలనే పక్కకు నెట్టేశారా? కార్మికుల గురించి నామమాత్రపు ఆలోచనా, సానుభూతి లేని ఈ నాయకులు ప్రజల వైపు లేరని పూర్తిగా పెట్టుబడిదారుల వైపే ఉన్నారని ఎవరికైనా అర్థమవుతుంది.

తెలంగాణకు ఎక్కువ విద్యుత్తు ఖర్చు అవుతున్నది అన్న మాట ఒకింత వాస్తవమే. అయితే ఎందుకు అనే ప్రశ్న వేసుకుంటే దీనికి సమాధానంగా ప్రభుత్వ బాధ్యతారాహిత్యం కనపడుతుంది. తెలంగాణలో (10 జిల్లాలు కలిపి) 18.3 లక్షలు, రాయలసీమలో (4 జిల్లాలు) 7.2 లక్షలు, కోస్తాంధ్రలో ( 9 జిల్లాలు) 6.5 లక్షల వ్యవసాయ బోర్ వెల్స్ ఉన్నాయి. బోరుబావుల కింద వ్యవసాయానికి అయ్యే ఖర్చు, చెరువుల, కాలువల కింద వ్యవసాయానికి అయ్యే ఖర్చు ఒకే రకంగా ఉండదు అన్న విషయం రైతులు కానివారికి కూడా అర్థమయ్యే విషయమే. ఉచిత కరెంట్ ఇస్తున్నాం అని ఎంతగా ఊదరగొట్టినా బోర్ల కింద వ్యవసాయం అంటేనే బాగా ఖర్చుతో కూడుకున్నది. భూగర్భ జలాలు అంతంత మాత్రంగానే ఉన్న ప్రాంతాలలో కనీసం 300 అడుగులకు పైగా బోరు దింపితే తప్ప నీరు పడదు. అది కూడా గ్యారంటి లేదు. ఒకవేళ పడినా ఆ బోరు ఎప్పుడు ఎండిపోతుందో తెలియని పరిస్థితి. ఒక బోరు వేయాలంటే ఎంత ఖర్చు అవుతుందో, అందులోకి దింపే పైపులకు ఎంత అవుతుందో ఇంకా ఇవికాక మోటర్లకు, స్టార్టర్లకు ఎంత అవుతుందో, చెరువుల, కాలువల కింద వ్యవసాయం చేసే వారికి ఎలా అర్థమవుతుంది? ఎప్పుడు వస్తుందో తెలియని కరెంట్ కోసం ఎదురు చూసుకుంటూ, నిద్రను ఆపుకుంటూ తోటల దగ్గరే కాపల కాచే పరిస్థితి తెలంగాణ, రాయలసీమ రైతులది. తెలంగాణ, రాయలసీమ రైతుల కన్నీటి గాథల మీద పుంఖానుపుంఖాలుగా సాహిత్యం వచ్చింది. సరైన ఆహారం లేక బక్కచిక్కిన వీరి శరీరాలను, నిద్ర లేక పీక్కుపోయిన వీళ్ల ముఖాలను చూస్తే తెలుస్తుంది వీళ్ల ఆర్థిక పరిస్థితి ఏమిటో!

తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు రెండు కూడా ఒకానొకప్పుడు చెరువులకు ప్రసిద్ధి. తెలంగాణలో కాకతీయ రాజులు చెరువులను తవ్వించి వాటి కింద వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తే, రాయలసీమలో విజయనగర రాజులు ఆ పని చేశారు. రోజురోజుకు పెరిగిపోతున్న జనాభాను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వాలు మరిన్ని చెరువులను నిర్మించాల్సింది పోయి స్థానికంగా ఉండే చెరువులను, కుంటలను, వాగులను పూర్తిగా నిర్లక్ష్యం చేసి తెలంగాణ, రాయలసీమ రైతుల నడ్డి విరిచి కోలుకోకుండా చేసి, రైతులను ఆత్మహత్యలు చేసుకునేట్టుగా చేశాయి.

ఏడాదికేడాది విద్యుత్తు వినియోగం సమాజంలో పెరుగుతూ వస్తోంది. రాబోయే ఐదు సంవత్సరాలలో అంటే 2013 ఏప్రిల్ 1 నుండి 2018 మార్చ్ 31 వరకు ప్రాంతాల వారిగా విద్యుత్తు సామర్థ్యాన్ని పెంచడానికి ప్రభుత్వం పూనుకున్నది. కరెంట్ పేరుతో పాలకులు చేసే కుట్రలు, కుతంత్రాలు అన్నీ ఇన్నీ కావు. మొత్తం 14432 ఎం.డబ్ల్యు. విద్యుత్తును ప్రభుత్వ, ప్రైవేట్‌ల ఉమ్మడి అధ్వర్యంలోనూ విడివిడిగానూ ఉత్పత్తి చేయడం నిర్ణయించింది. రాయలసీమలో 600 ఎం.డబ్ల్యు (4 శాతం), తెలంగాణలో 6660 ఎం.డబ్ల్యు (47 శాతం) హైదరాబాదుతో పాటు, కోస్తాంధ్రలో 7072 ఎం.డబ్ల్యు (49 శాతం) విద్యుత్తును ఉత్పత్తి చేయడానికి నిర్ణయం జరిగిపోయింది. పేరుకు రాయలసీమ నాయకులు ముఖ్యమంత్రులుగా ఉన్నప్పటికి, వారు కోస్తాంధ్ర ప్రాంతానికే అధిక ప్రాధాన్యం ఇచ్చి సొంత గడ్డను పూర్తిగా నిర్లక్ష్యం చేశారు అనడానికి ఇది కూడా ఒక నిదర్శనం.

మంచిర్యాల, మందమర్రి చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలకు ఒపెన్ కాస్ట్ గనులు ఏ కంపెనీల ఆధ్వర్యంలో జరుగుతున్నాయో అందరికి తెలియదు. 'ఎవరు అయ్యుండవచ్చు' అని ప్రశ్నించినప్పుడు సీమాంధ్ర వాళ్లు అన్న సమాధానం వచ్చింది. 'ఇదే పని తెలంగాణ వాళ్లు చేస్తే మీకు ఏం అభ్యంతరం ఉండదా?' అని తిరిగి ప్రశ్నించినప్పుడు 'మమ్మల్ని ఇబ్బంది పెట్టే వాళ్లు ఏవరైతేనేమీ? వాళ్లేమైనా మాకు ముద్దా?' అన్న సమాధానం సంతృప్తిని కలిగించింది. బయట శత్రువులతో పాటు అంతర్గత శక్తుల స్వార్థాలను ఒకే దృష్టితో చూసినప్పుడే ఎవరైనా తమ హక్కులను కాపాడుకోగలరు. అది తెలంగాణ ప్రజలు చేశారు. కరెంట్ బూచిని చూపించి ఒక వైపు తెలంగాణ ప్రజలను భయపెడుతూ, మరొక వైపు రాయలసీమ ప్రజలు తమకు లొంగి ఉండేట్టుగా కోస్తా పెట్టుబడిదారులు పావులు కదుపుతున్నారు.

రాయలసీమ ప్రజలు ఇంతవరకు ఆటలో అరటిపండుగా మాత్రమే ఉంటూ వచ్చారు. తెలంగాణ ప్రజలను స్ఫూర్తిగా తీసుకొని సమైక్యంలో రాయలసీమ ఎలా దగాపడిందో తెలుసుకొని ఆటలో అరటిపండుగా కాకుండా ఆ అరటిపండునే ఆరగించి శక్తి పుంజుకొని ఇక తామే ఆట ఆడే స్థాయికి చేరుకొని, కోస్తాంధ్ర పెట్టుబడిదారులను వారికి తొత్తులుగా మారిన రాయలసీమ పెట్టుబడిదారులను, రాజకీయ నాయకుల ఆటలను కట్టడి చేసి తమ హక్కులను కాపాడుకోవాల్సిన చారిత్రిక బాధ్యత ఇప్పుడు రాయలసీమ ప్రజల ముందు నిలిచి ఉన్నది.

*(రచయిత్రి ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక సభ్యురాలు)* ✿

# ఉద్యమాల వల్ల విద్యార్థులకు నష్టాలు

**సమైక్య, విభజన ఉద్యమాల వల్ల రాజకీయ పార్టీలు, ప్రైవేట్ పెట్టుబడిదారీ సంస్థలు లాభపడుతున్నాయినీ, విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారనీ అంటున్నారు. పి. యేసురాజు**

ప్రస్తుతం జరుగుతున్న సమైక్య – విభజన ఉద్యమాలు విద్యార్థుల భవిష్యత్తును ప్రశ్నార్థకంగా మారుస్తున్నాయి. ఎప్పుడో కార్పొరేటు వైద్యం అందిస్తామని ఇప్పుడు తగిలిన గాయానికి ప్రథమ చికిత్స చేయించకుండా చావగొట్టినట్టుంది నేటి స్వార్థపర రాజకీయ నాయకుల పెట్టుబడిదారీ ఉద్యమాలు. మన ఉద్యోగాలు సీమాంధ్ర వాళ్లు గద్దల్లాగా కొట్టుకు పోతున్నారు. కాబట్టి కలిసి ఉంటే ఇక్కడ ఉండే వారికి ఉద్యోగాలు రావని తెలంగాణ నాయకులు, హైదరాబాద్ లేకపోతే ఇక్కడ విద్యార్థులకు ఉద్యోగాలు రావు – హైదరాబాద్‌లో ఉండే సీమాంధ్ర ఉద్యోగాలు పోతాయని పైకి సమైక్యాంధ్రని చెపుతూ హైదరాబాద్‌లోని తమ పెట్టుబడులను కాపాడుకోవడం కోసం, హైదరాబాద్ కోసం జరిగే స్వార్థ ఉద్యమాలకు విద్యార్థుల్ని పావుల్లాగా వాడుకుంటున్నారు.

ఉద్యమాలు భవిష్యత్తులో అభివృద్ధి సాధించేలా ఉండాలి గానీ ప్రస్తుత పరిస్థితికి నష్టం కలిగించకూడదు. కానీ రాజకీయ నాయకులు మాత్రం ఇరు ప్రాంతాల్లో తమ ఉనికిని కాపాడుకోవడం కోసం విద్యార్థుల్లో అభద్రతా భావాన్ని నింపి తమ ప్రయోజనాలను కాపాడుకోవడం కోసం విద్యా సంవత్సరం నష్టపోయేలా వారి జీవితాలతో ఆడుకుంటున్నారు. ప్రస్తుతం జరుగుతున్న ఉద్యమాల వల్ల ఒక ప్రాంత విద్యార్థులూ, మరో ప్రాంత విద్యార్థుల పట్ల ద్వేషభావం పెంచుకుంటున్నారు.

ప్రస్తుతం మూడునెలలుగా జరుగుతున్న స్వార్థపూరితమైన సమైక్యాంధ్ర ఉద్యమం, గత నాలుగు సంవత్సరాలుగా నిర్విరామంగా జరిగిన తెలంగాణ ఉద్యమం పెద్ద వాళ్ల ప్రయోజనాలకు సంబంధించినవే గానీ, పేదోళ్ల సమస్యల పరిష్కారానికి ఏ మాత్రం కాదు. తెలంగాణ ఏర్పడినప్పటికీ పేద విద్యార్థుల ఉద్యోగాలూ, ఉన్నత చదువులూ కలలు గానే ఉండి పోతాయి. సమైక్యంగా ఉన్న అవి కలలుగానే ఉండిపోతాయి.

ఈ ఉద్యమాల వల్ల పేద విద్యార్థులకు అందాల్సిన స్కాలర్‌షిప్‌లు ఎక్కడికక్కడ పెండింగ్‌లో ఉండిపోయాయి. ఆదాయ, కుల, నివాస ధృవీకరణ పత్రాలు జారీ చేసేవారే లేకుండా పోయారు. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యనభ్యసిస్తూ, సంక్షేమ హాస్టళ్లో ఉంటున్న నిరుపేద విద్యార్థుల నోటికాడి కూడు తీసేశారు. విద్యాసంస్థలు తెరిచి నెలరోజులు గడవక ముందే, విద్యార్థులకు పూర్తిస్థాయిలో పాఠ్యపుస్తకాలు అందకముందే ఈ ఉద్యమాల వల్ల సీమాంధ్రలోని అన్ని ప్రభుత్వ విద్యాసంస్థలూ, సంక్షేమ హాస్టళ్లు మూతపడ్డాయి. అటు తెలంగాణలోనూ ఇదే పరిస్థితి కొనసాగుతూ వచ్చింది. ఉపాధ్యాయులు, వార్డెన్లు, సిబ్బంది, లెక్చరర్లు సమ్మె కారణంగా అసలే పందుల దొడ్లలా ఉండే ప్రభుత్వ పాఠశాలలూ, కాలేజీలూ, వసతి గృహాలూ అసాంఘిక కార్యక్రమాలకు అడ్డాగా మారుతున్నాయి. సమ్మె తర్వాత విద్యార్థులు అక్కడ చదువుకోవాల్సిన పరిస్థితి. అందుకే ప్రభుత్వ విద్యనభ్యసిస్తున్న విద్యార్థుల సంఖ్య ఈ ఏడాది లక్షల్లో తగ్గింది. ఈ ఉద్యమాలు ఇలాగే కొనసాగితే ప్రభుత్వ విద్యాసంస్థలనూ, సంక్షేమ హాస్టళ్లనూ నిర్వహించే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానికి తప్పుతుంది.

కెజి నుండి పిజి దాకా విద్యార్థులు ఈ ఉద్యమాలకు గురైనారు. ఇంజనీరింగ్ కౌన్సిలింగ్ పైనా ఉద్యమాల ప్రభావం తీవ్రంగా పడింది. అందుకే వందల మంది ప్రతిభ గల విద్యార్థులు వేరే రాష్ట్రానికి తరలిపోయారు. ఆర్‌టిసి సమ్మె కారణంగా గ్రామాల నుంచి పట్టణాలకు వచ్చి చదువుకొనే విద్యార్థులు ప్రైవేట్ ట్రావెల్స్ ద్వారా వచ్చి మూడు రెట్లు ఛార్జీలు చెల్లించి చదువుకోవాల్సిన పరిస్థితి దాపురించింది. ప్రభుత్వ విద్యాసంస్థలు, రోడ్ రవాణా సంస్థ సమ్మె కారణంగా, రెండు ప్రాంతాల ఉద్యమాకారుల చేతకానితనం వల్ల ప్రైవేట్ ట్రావెల్స్, కార్పొరేట్ విద్యాసంస్థలు తమ వ్యాపారాన్ని యథేచ్ఛగా కొనసాగుతుండగా మీ లక్ష్యం నెరవేరుతుందా? అని ఉద్యమ నాయకులను మీడియా ప్రశ్నించగా మా ఉద్యమం ప్రభుత్వ వ్యవస్థ మీదే అని చెప్పడం పలు విమర్శలకు దారి తీస్తుంది. కార్పొరేట్ విద్యాసంస్థలను ఆపివేస్తే ఆ సంస్థల యాజమాన్యం కోట్ల రూపాయలు ముడుపులిచ్చి కేంద్రమంత్రుల స్థాయిలో ఒత్తిడి తెస్తాయని వారికి తెలియదేమో పాపం. ఏది ఏమైనా ఈ ఉద్యమాలు కొంతమంది ఉద్యమ నాయకులకు కాసుల వర్షం కురిపించాయి. రాజకీయ నాయకుల పెట్టుబడిదారుల ఆస్తుల విలువలు రెట్టింపు చేస్తున్నాయి. విద్యార్థులకు మార్గనిర్దేశం చేయాల్సిన రాజకీయ పార్టీలు వారిని రాజకీయ గుండాలుగా మార్చి విగ్రహాల విధ్వంసం, హింసాత్మక ఉద్యమాలు వంటివి వారి చేత చేయించి విద్యార్థుల జీవితాలను పావులాగా వాడుకొని వారిని కటకటాల పాలు చేయిస్తున్నాయి. కొంతమంది విద్యార్థులకు డబ్బును ఎరగా చూపి తమకు నచ్చని వారి ఆస్తులపై, వారి ఇళ్లపై దాడులు చేయించి వారి చేతిలో కీలుబొమ్మగా మార్చుకుంటున్నారు.

రాష్ట్రంలో విద్యార్థి లోకానికి జరిగే అన్యాయాన్ని చూసి తట్టుకోలేక అనేక వేల మంది విద్యార్థులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. రాష్ట్రంలో విద్యార్థి సమస్యలకై నిరంతరం పోరాటం చేసే విద్యార్థి సంఘం (ఎస్ఎఫ్ఐ) నాయకులను ఈ ఉద్యమానికి బాధ్యులను చేసి అరెస్టు చేయడం బాధాకరం. రాష్ట్రంలో ఇంత అన్యాయం జరుగుతుంటే విద్యాశాఖాధికారులూ, మంత్రులూ మాత్రం నెల రోజుల అన్నం ఒకేరోజు తినమన్నట్టుగా సిలబస్ మొత్తాన్ని మూడునెలల్లో పూర్తి చేస్తామంటున్నారు. సీమాంధ్ర ఉద్యమ నాయకులు ఇప్పటి వరకు జరిగింది ఉద్యమానికి మొదటి మెట్టు అని, తెలంగాణ నాయకులు తెలంగాణకు అన్యాయం జరిగితే భవిష్యత్‌లో ఉద్యమాలకు సిద్ధం కావాలని చెప్పడం వల్ల విద్యార్థులు వారి జీవితాలు అగమ్యగోచరంగా మారుతాయోనని తీవ్ర ఆందోళన చెందుతున్నారు.

ఇప్పటికే రాష్ట్ర విద్యార్థిలోకానికి అపారమైన నష్టం కలిగింది. దీనిని ఎవరూ పూడ్చలేరు. కాబట్టి ఇకనైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ స్వార్థ రాజకీయ ప్రమోజనాలు చూసుకొని విద్యార్థులను, వారి జీవితాలను పావులాగా వాడుకోకుండా మొద్దు నిద్ర వీడి విద్యార్థుల జీవితాలలో వెలుగులు నింపాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ఎస్ఎఫ్ఐ నాయకులు)* వీ

# ఈ ఉద్యమాలు ఎవరి కోసం?

**ప్రస్తుతం నడుస్తున్న ఉద్యమాలలో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొంటున్నా, వాటిని రాజకీయ పార్టీలు తమ స్వార్థానికి మాత్రమే ఉపయోగించుకుంటున్నాయని అంటున్నారు కడియాల సుబ్బనాచారి**

ఈ ఉద్యమాలలో సాధారణ ప్రజలు కూడా, ఆసక్తి కనపరుస్తూ పాల్గొంటున్నారనేది యథార్థం. ఈ రాజకీయ నాయకులు పెట్టే బహిరంగ సభలకు, నిరసన దీక్షలకు జనం పాత్ర బాగానే ఉందనేది కూడా అంతే నిజం. ఈ ఉద్యమాలు ప్రధానంగా రాజకీయ నాయకుల స్వార్థం కోసం అనేది జనానికి తెలియదనడానికి లేదు. ఇది రాజకీయపార్టీల కోసమే అనేది బాగా తెలుసు. కానీ జనంలో అసంతృప్తి లేకుండా వీధుల్లోకి రారు కదా. ఏదో ఒక మేరకు ప్రజల అసంతృప్తిని ఉపయోగించుకుంటూ ప్రజల ప్రయోజనం కోసమే ఈ ఉద్యమాలు చేస్తున్నట్లు జనాన్ని మభ్యపెట్టడంలో ఈ రాజకీయ నాయకులు బహునేర్పరులు అనేది అందరికి తెలిసిందే. జనం లేకుండా ఏ ఉద్యమాలు ఉండవు. ఎవరు నడిపిస్తున్నారు. అనేదానితో నిమిత్తం లేకుండా ప్రజలు తమ అసంతృప్తిని వ్యక్తం చేసుకొనేదానికి వచ్చిన ఈ అవకాశాల్ని వాడుకుంటారనేది ముఖ్యంగా గమనించాల్సిన అంశం. అటువంటి అవకాశాలు వచ్చినప్పుడు ప్రజల కోసం పనిచేసే పార్టీలు రంగం మీదకు రాలేకపోతే జరిగే నష్టం అపారం. విప్లవనాయకత్వం రాలేనప్పుడు ఈ దోపిడీ పార్టీలు ప్రజల అసంతృప్తిని ఈ విధంగా పక్కదారులు పట్టించి తమవెంట తీసుకొని పోతారు అనేది నేడు బాగా తెలుస్తోంది.

విప్లవ నాయకత్వాన్ని జనం వైపుకు రానీయకుండా అన్ని జాగ్రత్తలు తీసుకునేందుకు ఈ పార్టీలన్నీ కూడా సిద్ధమే. ఇందులో ఎవరికి తేడాలు లేవు. అన్ని పార్టీల వారు కూడా విప్లవోద్యమాన్ని అణగదొక్కే వారే అనేది నేటి అనుభవసత్యం. 1969వ సంవత్సరంలో తెలంగాణ ఉద్యమం ఊపందుకున్నప్పుడు ఆంధ్రలో 'ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం' చెలరేగింది. జరిగిన వాస్తవం ఏమిటంటే జై ఆంధ్ర నినాదంతో ఈ బడా పెట్టుబడిదారీ వర్గాలన్ని అందుకు మద్దతు తెలిపినాయి. ఆనాటికి ఇంత భారీ ఎత్తున హైదరాబాద్‌లో తమ సంపదను పోగేసుకోలేదు గనుకనే ఆనాడు హైదరాబాద్ మాట రాలేదు. ఈ 40 సంవత్సరాల కాలంలో హైదరాబాద్ మొత్తాన్ని సీమాంధ్ర దోపిడివర్గాలు ఆక్రమించేశాయి గనుకనే హైదరాబాద్‌ను ముందు పెడుతున్నారు. దీనంతటిని బట్టి తేలేదేమిటంటే తమ సంపదల్ని మరింత పెంచుకోవడానికి హైదరాబాద్ నగరం వారికొక మంచి వనరుగా దొరికింది గనుకనే ఈ స్వర్గాన్ని వదిలి పెట్టడానికి ఇష్టంలేకనే సమైక్య నినాదంతో కొందరు నాయకులు, సమన్యాయం పేరుతో ఇంకొందరు నాయకులు ముందుకొస్తూ జనాన్ని తమ వైపుకు లాక్కొచ్చుకుంటున్నారు.

ఈ ఉద్యమాలలో నిరుద్యోగ సమస్యతో బాధపడే నిరుద్యోగ వర్గాలు, మంచి ఉన్నతమైన ఉద్యోగాలు చేస్తూ అక్కడ సంపద పోగేసుకుంటున్న ఉన్నత వర్గాల వారు ఈ ఉద్యమాలకు బాగా వెన్నుదన్నుగా ఉన్నారు. కానీ ఇరుప్రాంతాల ప్రజల సమస్యలు ఎన్నో ఉన్నప్పటికీ వాటి మీదకు ప్రజల్ని మరలించనీయకుండా కేవలం ఒక హైదరాబాద్ పోతే సర్వం పోయినట్లేనని చిత్రిస్తూ ఆంధ్ర ప్రాంత నిరుద్యోగ యువకుల్ని పక్కదోవ పట్టిస్తున్నారు. ఇరుప్రాంత ప్రజల్ని చైతన్యపరుస్తూ సఖ్యత కలుగజేసి ప్రజా రాజ్యాధికారం సాధించుకునే వైపు జనాన్ని తీసుకొచ్చే పనిని విప్లవ ఉద్యమ మేధావులు చేయవలసి ఉంది. కానీ వీరి మీద ఉన్న నిర్బంధం కారణంగా వీరికి ప్రజలలోకి రాగల పరిస్థితిలేదు. కాని ఈ ఉద్యమాల నుంచే ప్రజలే తమ నాయకత్వాన్ని సృష్టించుకుంటారనేది చరిత్ర సత్యం. ప్రజలకు మార్గ నిర్దేశనం చేసే నాయకులు ఇప్పుడు అవసరం ఇదివరకంటే కూడా ఈనాడు ఈ అవసరం చాలా ఉంది. ఎందుకంటే ఈనాటి రాజకీయ నాయకుల మీద ప్రజలకు ఏమాత్రం నమ్మకం లేదు. నమ్మకం ఉండి ఈ ఉద్యమాలలో జనం పాల్గొనడంలేదు అనేది యథార్థం. అన్ని పార్టీల బండారం బయటపడింది. ఎవరినోట విన్నా ఫలానా పార్టీ మంచిది అనేవారు లేరు. ఈ పరిస్థితులలో నమ్మకం కలిగించగల నిబద్ధతగల నాయకత్వాన ఒక రాజకీయ పార్టీ వస్తే మాత్రం మిగత పార్టీలకు పుట్టగతులుండవు అనేది ఈరోజు నిజమవుతుంది అని చెప్పుకోవచ్చు. ఎన్ని ప్రలోభాలు పెట్టినా జనం తమ వ్యతిరేకతను వ్యక్తం చేయగల స్థితిలో ఉన్నారు అనేది కూడా మరింత సత్యం. దోపిడి వర్గాల నిజ స్వరూపాన్ని విప్లవ పార్టీలు చేయవలసిన పనిలేకుండా ఈ దోపిడి పార్టీలే బాగా జనానికి అవగాహన కలిగిస్తున్నాయి. ఒకరి బండారం మరొకరు బయటపెట్టుకుంటున్నారు కదా! జనం ఇప్పుడు ఏమనుకుంటున్నారంటే వాళ్లు చెప్పేది నిజమే. వీళ్లు చెప్పేది నిజమే. ఇందులో ఎక్కువ తిన్నది ఎవరూ లేరు. అందరూ అందరే అని జనంలో వచ్చిన మార్పును కూడా గుర్తించాల్సిన సమయం వచ్చింది. ఇంత దీర్ఘకాలం ఈ ఉద్యమాలు కొనసాగడానికి కారణం కూడా సులభంగా తెలుసుకోవచ్చు. ప్రజల్లో ఈ పాలకవర్గాల మీద ఇంతముందు కంటె కూడా ఈనాడు వ్యతిరేకత బాగా ఉంది.

ఐతే దీర్ఘకాల సమస్యల మీదకు పోకుండా శాశ్వత విముక్తి కోసం పోరాడకుండా కేవలం పాక్షిక కోరికల మీదనే కేంద్రీకరించి పోరాటాలు చేయడంలో బూర్జువా పార్టీల హస్తం బాగా ఉంది. ఏవిధంగానైనా ప్రజల్ని తమ నిజమైన సమస్యల మీదకు పోనీయకుండా ఈ రాజకీయ నాయకులు తమ రాజకీయ కోరికలు తీర్చుకోవడానికి ఈ ఉద్యమాల్ని బలహీన పరుస్తున్నారనేది జగమెరిగిన సత్యం. ఇందుకు గోరంతలు కొండంతలు చేసి బాగా ప్రచారాన్ని ఇవ్వడంలో ఈ దోపిడి పార్టీల హస్తం ఉంది. ఈ వర్గాల సపోర్టు బాగా ఉండ బట్టే ప్రజలు ఉద్యమాన్ని నీరుగానీయకుండా పోరాడుతున్నారనేది యథార్థం. ఇలాంటి అవకాశాలు వచ్చినప్పుడు ప్రజాస్వామిక పార్టీలు ఏవైనా ముందుకొస్తే అనేక విధాలుగా చీలగొట్టి ఉద్యమాన్ని బలహీనపరిచి నీరుగారుస్తారనేది నిజం. ఇప్పటి కర్తవ్యం ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడమే. ఈ కర్తవ్యాన్ని నిర్వహించడంలో ప్రస్తుతం విప్లవపార్టీల మేధావులు వెనుకబడి పోతున్నారనేది వాస్తవం. ఈ పోరాటం ఇంతటితో ఆగేదికాదు. సమస్యలున్నంత వరకు ప్రజ్వరిల్లుతూనే ఉంటాయి. తాత్కాలికంగా చల్లార్చి కొంతకాలం వాయిదా వేసుకోవచ్చునేమోగాని ప్రజా ఉద్యమాలు ఆగవు. తుది పరిష్కారం అయ్యేదాకా జరుగుతూనే ఉంటాయి. దోపిడి పాలకులు పూర్తి పరిష్కారాన్ని ఇవ్వలేరు అనేది సత్యం. ఇప్పుడు ప్రధానంగా చేయవలసింది విప్లవ మేధావులు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడమే. అజ్ఞానంతో చేసే పోరాటాలు తుదిదాకా జరగవు. చైతన్యంతో చేసే పోరాటాలు లక్ష్యాన్ని చేరుతాయి. ఇది చరిత్ర చెప్పిన సత్యం.

*(రచయిత ఆయుర్వేద వైద్యులు)* వీ

# సమతుల్య అభివృద్ధికి నిరోధకులెవరు?

**ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా ప్రాంతాల మధ్య అసమానతలు సృష్టించి, ఆయా ప్రాంతాల ప్రజల మధ్య విద్వేషాలను రెచ్చగొడుతున్న రాజకీయనాయకులను నిలదీయాలంటున్నారు ముప్పాళ్ల భార్గవశ్రీ**

అమెరికాలో స్వాతంత్ర్య యుద్ధం, అబ్రహం లింకన్ నడిపిన నీగ్రో బానిసత్వ వ్యతిరేక పోరాటం లేకుండా: ఇంగ్లండ్‌లో క్రాంవెల్ తదాది నాయకులు సాగించిన ప్రజాస్వామిక పోరాటం లేకుండా : స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వాలను నినదించిన ఫ్రెంచి విప్లవం లేకుండా ఆయా దేశాలు ప్రపంచ దేశాల సముదాయంలో ఇంత బలమైన రాజ్యాలు అయి ఉండేవా! రొట్టె (ఆహారం), భూమి, బానిసత్వం నుండి జనాల విముక్తి (లెనిన్) అనే నినాదాలు ఇచ్చిన కార్మిక, కర్షక వర్గాలతో స్నేహం, ప్రజలకు నిర్ణయాధికారం, స్వతంత్రతపై ఆధారపడి దేశం అని (సన్‌యట్‌సేన్) చాటిన, దున్నేవానికి భూమి, నూతన ప్రజాస్వామ్యం అన్న కార్యక్రమాలు (మావో జెడాంగ్) ఇచ్చిన నవంబర్, అక్టోబర్ విప్లవాలు లేకుండా రష్యా, చైనాలు ప్రపంచంలో ప్రగతి దారులెంట నడిచిన దేశాలుగా రూపొంది ఉండేవా!

ఆంధ్రప్రదేశ్‌లో సమగ్ర సమతుల్యమైన అభివృద్ధి జరగకపోవడానికి కారకులెవరు?-ప్రాంతాల మధ్య అసమానతలు కల్పించి: కొన్ని ప్రాంతాల పట్ల, అలాగే ఆదివాసి ప్రాంతాల పట్ల వివక్షలను ప్రదర్శించి: తెలుగు ప్రజల మధ్య వైషమ్యాలను రేకెత్తించి, వ్యాప్తి చేసినవారు పాలకులు, పాలక వర్గపార్టీల అగ్రనేతలే కాదా!

ఇన్నేళ్ల వరకు ఆంధ్రపదేశ్‌లోని రాయలసీమలో మనుషులకు, పశువులకు తాగడానికి, జీవన అవసరాలు తీర్చుకోవడానికి తగినన్ని నీళ్లు దొరకని పరిస్థితిని మనం చూస్తున్నాం. పంటలకు అవసరమైన సాగునీటి సంగతి కూడా అంతే. ఇతర అనేక జిల్లాల్లో కూడా ఇదే పరిస్థితిని మనం చూస్తున్నాం. అయినప్పటికీ ప్రతిఏటా గోదావరిలోనూ, కృష్ణాలోనూ వందల టిఎంసిల నీరు పారి వృథాగా సముద్రంలో కలిసిపోతున్నది. కానీ రాయలసీమకు నీటిని మళ్లించిన పాలకుడే లేకపోయాడు. గోదావరిపైన ఇచ్చంపల్లి, కంతాలపల్లి, దేవాదుల మొదలైన ప్రాజెక్టులు కట్టి తెలంగాణ భూములకూ, రైతులకూ సాగునీరు, తాగునీరు ఇచ్చిన పాలకుడే లేకపోయాడు. గోదావరి మిగులు జలాలను అవసరమైన ప్రాంతాలకు మళ్లించిన పాలకుడే లేకపోయాడు. 'తెలంగాణలో గానీ, కోస్తాలో గానీ, రాయలసీమలో గానీ కొన్ని నీటి పథకాలు అమలులోకి వచ్చాయంటే అందుకు కారణం అక్కడ సాగిన ప్రజాందోళనలే; పాలకుల ఇష్టానుభూతులతో రూపొందించి అమలు పరిచిన పథకం ఒక్కటంటే ఒక్కటీ లేదు.

అపారంగా ఉన్న సహజ వనరులు ఎవరి ప్రయోజనం కోసం! ఇచ్ఛాపురం దగ్గర మొదలుపెట్టి తడ వరకు వెయ్యి కిలోమీటర్ల తీరానికి ఆనుకొని ఉన్న తీర ప్రాంతం విస్తారంగా ఇంధన వాయువు లభిస్తున్నది. శ్రీకాకుళం నుండి తూర్పు గోదావరి జిల్లా వరకు పడమటి అంచున ఉన్న కొండలలో బాక్సైట్, అల్యూమినియం మరెన్నో ఖనిజ సంపదల నిల్వలు ఉన్నాయి. పశ్చిమగోదావరి జిల్లా నుండి మొదలుపెట్టి అదిలాబాద్ వరకు గోదావరి నదికి ఇరువైపులా బొగ్గు నిల్వలు అపారంగా ఉన్నాయి. అదే గోదావరికి దిగువ వైపున వరంగల్, ఖమ్మం జిల్లాల్లో అపారమైన ఇనుప ఖనిజ గనులున్నాయి. చుక్క నీరు కూడా దొరకని అనంతపురం జిల్లాలో అపారమైన ఖనిజ సంపదల గనులున్నాయి. అంతేకాక బంగారు ఖనిజ నిల్వలూ ఉన్నాయి. అనంతపురం జిల్లా ఉరవకొండ, గుత్తి, కర్నూలు జిల్లా ఆలూరు, పత్తికొండ తాలూకాలలో వజ్రపు నిల్వలు ఉన్నాయి. అలాంటి వజ్రపు నిల్వలే కృష్ణానదికి ఇరువైపులా గుంటూరు జిల్లాలోను, కృష్ణా, ఖమ్మం జిల్లాల సరిహద్దులలోనూ ఉన్నాయి. రాష్ట్రమంతటా సున్నపురాయి నిల్వలు (సిమెంట్), గ్రానైట్ నిల్వలు, ముగ్గురాళ్ల నిల్వలు, నాపరాళ్ల నిల్వలు, పలకరాళ్ల నిల్వలు, అభ్రకం, రాగి నిల్వలు కొల్లలు కొల్లలుగా ఉన్నాయి. రాష్ట్రంలో పశ్చిమ సరిహద్దున ఉన్న అనంతపురం, రాయదుర్గం తాలూకాలోనూ, కర్నూలు జిల్లా ఆదోనీ తాలూకాలోనూ, మహబూబ్‌నగర్ జిల్లా అలంపురం, గద్వాల ప్రాంతాలలోనూ, రంగారెడ్డి జిల్లా తాండూరు ప్రాంతంలోనూ, మెదక్ జిల్లా జహీరాబాద్ ప్రాంతంలోనూ, నిజామాబాద్ జిల్లా బోధన్, నవీపేట ప్రాంతంలోనూ, అదిలాబాద్ జిల్లా బాసర నుండి అదిలాబాద్ ప్రాంతం వరకు బంగారం కంటే విలువైన నల్లటి భూములు ఉన్నాయి. నీరు అందితే రెండు పంటలు, మూడు పంటలు పండించగలిగిన భూములు అవి.

అయినప్పటికీ వ్యవసాయ భూమి పంపకాలు జరగలేదు. జరగాల్సిన రీతిలో వ్యవసాయ అభివృద్ధి జరగనూలేదు. పంటలపైన, వ్యవసాయంపైన ఆధారపడి విస్తరించాల్సిన గ్రామీణ, చిన్న, మధ్యతరగతి పరిశ్రమలు విస్తరించనూ లేదు. మానవ శ్రమశక్తి వ్యవసాయ రంగం నుండి, అనుబంధ రంగాల నుండి చిన్న, మధ్యరకం పరిశ్రమలకు మార్చబడనూలేదు. ప్రభుత్వాల విధానాల వలన, నిర్వాకాల వలన వ్యవసాయం నష్టాల పాలవుతున్నా, కుదేలైపోతున్నా వ్యవసాయ రంగంపైన ఆధారపడిన యువత మరో రంగం వైపు మరలేందుకు దారిలేక తమ బతుకులను గాలిలో వేళ్లాడదీసుకుంటున్నారు. వ్యవసాయం ప్రధానంగా ఉన్న మన సామాజిక, ఆర్థిక వ్యవస్థలో పాలకుల విధానాల కారణంగా అన్ని వృత్తులు విధ్వంసం అయిపోయాయి. ఆఖరికి చేనేత వృత్తి కూడా జీవనాధారానికి పనికిరానిదిగా తయారై చేనేత వృత్తిపై ఆధారపడిన వారిని జీవశ్చవాలుగా మార్చివేస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లోని అదిలాబాద్ జిల్లా నుండి శ్రీకాకుళం వరకు ఉన్న ఆదివాసిలు తమ ప్రాంతపు వనరులను అనుభవించడానికి, స్వయం

పాలనకు నోచుకోవడం లేదు, మలేరియా లాంటి జ్వరం వస్తే ఆదివాసిలు కుప్పలు కుప్పలుగా రాలిపోతున్నారు. ప్రసవించలేక గర్భిణీల మరణాలు, ప్రసవించాక శిశు మరణాలు లెక్కకు మించి జరుగుతున్నాయి. ఆఖరికి అభివృద్ధి చెందినవంటున్న గుంటూరు, కృష్ణా లాంటి జిల్లాల్లో కూడా అంతుపట్టని రోగాలతో గ్రామాలకు గ్రామాలు పడకేస్తున్నాయి.

### విద్యా, వైద్యా రంగాలను శాసిస్తున్నది ఎవరు?

66 సంవత్సరాల భారతావనిలో, 56 సంవత్సరాల ఆంధ్రప్రదేశ్‌లో పాలకుల పరిపాలనలో నేటికీ విద్య అందరికీ అందడం లేదు. ప్రజలందరూ విద్యావంతులైనపుడే దేశాభివృద్ధి సాధ్యమవుతుందన్న పెద్దల సూచనలు ఉన్నా, సార్వజనీన సార్వత్రిక విద్య, కామన్ స్కూల్ విద్యా విధాన ఆవశ్యకతను సవివరంగా ముందుకు తెచ్చిన కొఠారి కమిషన్ వంటి కమిషన్ల నివేదికలు ఉన్నా గ్రామాలలో, పట్టణాల వాడలలో అవిద్య రాజ్యమేలుతోంది. పాలకులు ముందుకు తెస్తున్న సర్వశిక్ష అభియాన్, మాధ్యమిక శిక్ష అభియాన్, బడిబాట, విద్యాహక్కు చట్టాలు, విద్యను అందరికి అందించని వారి ధగాను కప్పిపుచ్చుకొనడానికి ప్రచార సాధనాలుగా పనికొస్తున్నాయి. గత 10 సంవత్సరాల కాలాన్ని పరిశీలిస్తే 1 నుండి 6వ తరగతుల మధ్య డ్రాపవుట్ల సంఖ్య విపరీతంగా పెరిగిపోతున్నది. వేలల్లో ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు మూతపడుతున్నాయి. ప్రభుత్వ ఉన్నత పాఠశాలలు కనీస సంఖ్యను నిలబెట్టుకోడానికి తిప్పలు పడుతుండడం మనం చూస్తున్నాం. కనీస వసతులు లేక, ఉపాధ్యాయులు లేక ప్రభుత్వ పాఠశాలంటేనే చదువురానివని, గతిలేనివారు మాత్రమే చేరేవనే చిన్న చూపును పెంచింది ఈ పాలకులు కాదా? పందుల కొట్టాలుగా తయారవుతున్న సంక్షేమ హాస్టళ్ల దుస్థితికి కారకులెవరు? ప్రభుత్వ, ఎయిడెడ్ జూనియర్, డిగ్రీ కళాశాలల్లో లెక్చరర్ పోస్టులు భర్తీ చేయకుండా, అభివృద్ధికి ప్రభుత్వ నిధులు మంజూరు చేయకుండా అవి నానాటికి క్షీణించి, రోగగ్రస్తమై అస్తమించే స్థితిని కల్పించింది పాలకులు కాదా? మరోవైపు ప్రైవేటు విద్యా సంస్థలకు విచ్చలవిడిగా పర్మిషన్లిస్తూ అవి గుత్త సంస్థల స్థాయికి ఎదిగి విద్యా రంగాన్నే శాసించే స్థాయికి చేర్చింది పాలకులు కాదా? ప్రైవేటు విద్యా, వైద్య సంస్థల నిర్వహణలో పాలక రాజకీయ నాయకులే భాగస్వాములు కాదా ! మేధో వికాస కేంద్రాలుగా, సమాజానికి విజ్ఞానాన్ని అందించాల్సిన విశ్వవిద్యాలయాలను నిరంతరం అలజడిలో ఉంచుతూ, ఏదో ఒక విద్వేషాలను రెచ్చకొడుతూ బలహీన పరిచి విదేశీ సంస్థల చేతికి ఒక్కో విభాగాన్ని అప్పచెప్పేందుకు (20వ శతాబ్దపు గురుకులాలు, పరిశ్రమలకు అనుసంధానం) చేస్తున్న ప్రయత్నాలు, విశ్వవిద్యాలయాల ఆస్తుల అమ్మకం పాలకుల స్వార్ధ ప్రయోజనాల కుట్రలలో భాగం కాదా! అందరికీ ఉచిత నిర్బంధ విద్యనందించాల్సిన పాలకులు ఫీజ్ రీఎంబర్స్‌మెంట్ల పేరుతో విద్యార్థులను బిక్షగాళ్లుగా మార్చి రీఎంబర్స్‌మెంట్ ఉంటే చదువు లేకుంటే లేనట్లుగా తయారు చేస్తున్నారు. సేవా రంగాలన్నింటినీ, సంక్షేమ రంగాలైన విద్యా, వైద్య రంగాలన్నీంటినీ ప్రజల హక్కుగా కాక పాలకులు వారి పైనున్న ప్రపంచ బ్యాంకు, విదేశీ బహుళజాతి సంస్థల బిక్షగా మారుస్తున్న విధానాలు దేశ, రాష్ట్ర అభివృద్ధికి ఆటంకాలుగా మారాయి.

### ప్రజా ప్రతినిధులు ఏంచేస్తున్నారు?

విద్యా, వైద్య రంగాల ప్రైవేటీకరణ ఫలితంగా ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమలలోని పేద ప్రజల బిడ్డలు విద్యకు, వైద్యానికి దూరం చేస్తుంటే పాలకులు చేపట్టిన ఈ విధానాలను ఎంఎల్ఎలు, ఎంపిలు అడ్డుకోరేమిటి? ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేట్ పరంచేస్తూ ఉన్న ఉద్యోగాల్లో కోత విధిస్తూ, కాంట్రాక్ట్, ఔట్‌సోర్సింగ్ పేరుతో యువత శ్రమను దోపిడీ చేస్తున్న సంస్థలను సమర్ధించే విధానాలను ఎంపి, ఎంఎల్ఎలు ప్రశ్నించరేమిటి? రెండు లక్షలకు పైగా ఉపాధి చూపగల ఆర్‌టిసిని నష్టాల బాట పట్టించి పాలక రాజకీయ బంధు గణాల అక్రమార్జన వనరుగా, విదేశీ సంస్థల టెక్నాలజీ అమ్మకపు వనరుగా మార్చిన పాలకులను ఎంపి, ఎంఎల్ఎలు నిలదీయరేమిటి? అందరికీ విద్యను, వైద్యాన్ని, ఉపాధిని అందించిన పాలకులే మనకు కనపడరు కదా! నేటి సమస్యలన్నింటికీ మూలమైన పాలకులు, పాలక వర్గ రాజకీయ నాయకులు సమస్యల పరిష్కారం కొరకంటూ అడ్డదిడ్డ వాదనలు చేస్తూ ప్రజల్ని గందరగోళ పరుస్తున్నారు. మన రాష్ట్రంలోని పాలకవర్గ పార్టీలు అన్నిటికీ ఆమోద యోగ్యమైన ప్రపంచ బ్యాంకు ఏకైక ఎజెండా ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ విధానాలేనన్నది ఇన్ని సంవత్సరాల వారి ఆచరణ నిదర్శనం కాదా ! మరి అటువంటప్పుడు ఈ పాలకులు రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి పాటు పడతారని నమ్మతామా!

### ప్రాంతాల మధ్య అసమానతలు పెంచింది ఎవరు?

సమాజం అంతటికి అత్యంత ఆవశ్యకాలైన తిండి, బట్ట, ఆవాసం, ఆరోగ్యం, విజ్ఞానానికి సంబంధించిన విషయాలలో ఆంధ్రప్రదేశ్ అధోగతిలోనే ఉంటున్నది. మరి, ఈ సామాజిక వ్యవస్థ తెలుగు ప్రజలకు ఒరగబెట్టింది ఏమిటి? అత్యధిక సంఖ్యలో ప్రజలు దరిద్రపుటంచున జీవితాలను గడుపుతూ ఉన్నారంటే పాలకులు మొత్తం ప్రజలకు చేసిన మేలు ఏమీలేదనే కదా!

1956 పెద్ద మనుషుల ఒప్పందం అమలు జరపకపోవడానికీ, 1971-73 నాటి అష్ట సూత్రాలు అమలు జరపకపోవడానికీ, వెనుకబడిన ప్రాంతాలు అభివృద్ధికి నోచుకోక పోవడానికి, రాష్ట్రంలో ఉన్నటువంటి మొత్తం ప్రజలందరికి కనీస సౌకర్యాలు అందకపోవడానికి, ప్రస్తుత వ్యవస్థలోని అసమ సంబంధాలకు, పాలకులు అనుసరిస్తున్న విధానాలే ప్రధాన కారణాలు కాక మరేమిటి!

ప్రాంతాల మధ్య, జిల్లాలు, తాలూకాల మధ్య అసమానతలకు, వెనుకబాటుకు ప్రస్తుత వ్యవస్థలో భాగమైన పాలకులే బాధ్యులుగా ఉన్నారు. అయినా, ఆ అసమానతలను, వెనుకబాటును చూపి వాటికి బాధ్యులైన పాలకులలో కొందరు ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటు కొరకు ఆందోళనలకు దిగారు. పాలకులలోని మరికొందరు తమ ఆస్తుల, కాంట్రాక్టుల రక్షణ కొరకు ప్రజలను ఉద్వేగాలలోకి ఈడ్చుతున్నారు.

వ్యవస్థాగతమైన (సాంఘికం, ఆర్థికం, ప్రాంతీయం) అసమానతల వలన ప్రజలలో, నూతన తరాలలో ఆవేదనలు, ఆందోళనలు చెలరేగిపోతూ ఉంటే పాలకవర్గాల రాజకీయపక్షాలు (వైరి పక్షాలుగా కన్పించుతున్నప్పటికీ) అవకాశవాద విధానాలతో, వైఖరులతో జతకడుతూ, విడిపోతూ, ఎత్తుకు పైఎత్తులు వేస్తూ ప్రజలను ముఖ్యంగా యువతను సంకుచిత ఉద్వేగాలకు లోనుచేస్తున్నారు. విభజనకు

# తెలంగాణ ఏర్పాటులో నత్తనడక ఎందుకు?

**తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ప్రకటన నిర్ణయం వెనుక కాంగ్రెస్ పార్టీ ప్రజాకాంక్ష కంటే కూడా ఎక్కువగా తన రాజకీయ ప్రయోజనాలకే విలువిచ్చిందని అంటున్నారు డా. జి. లచ్చయ్య**

'ఒకే దెబ్బకు రెండు పిట్టలు' అనేది ఆంగ్ల సామెత. తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ ఈ సామెత ముసుగులోనే కొనసాగుతోంది. 60 సంవత్సరాల సుదీర్ఘ పోరాట ఫలితంగా దిగొచ్చిందా, లేక కాంగ్రెస్ పార్టీ రాజకీయ అవసరాలకు మెట్టుదిగి తెలంగాణ ప్రక్రియకు ఢిల్లీ పీఠం శ్రీకారం చుట్టిందా అనేది చర్చనీయాంశం కాకున్నా, జరుగుతున్న పరిణామాలు మాత్రం తెలంగాణ ప్రజల ఆకాంక్ష కన్నా, కాంగ్రెస్ పరిరక్షణనే ప్రధానమని గత రెండు నెలలుగా జరుగుతున్న రాష్ట్ర, ఢిల్లీ తతంగాలు తెలుపుతున్నాయి.

2014 ఎన్నికల ముందు కదులుతదని భావించిన తెలంగాణ సాకారం ఉన్నఫలంగా నిజాం కాలేజి కాంగ్రెస్ సమావేశంతో ఊపందుకోవడం ఓ విచిత్రమే. రెడ్డచ్చి మొదలు పెట్టాడన్నా చందంగా తిరిగి దిగ్విజయ్‌సింగ్ రాష్ట్ర వ్యవహారాల్ని చూడడం మొదలుపెట్టిన వెనువెంటనే తెలంగాణ ప్రక్రియ ప్రారంభం కావడం వెనుక పెద్ద తతంగమే జరిగి ఉంటుంది. జూలై 30న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ భేటి కావడం తెలంగాణ ఏర్పాటు ప్రక్రియను ప్రకటించడం లగడపాటి, కావూరి, టిజిల కన్నా తెలంగాణ ఉద్యమకారులకు, అందునా తెలంగాణ కాంగీలకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ సంకేతాలు ఎలా తెలిసాయనడం కన్నా, ఢిల్లీ పెద్దలు వైకాపకు ఎలా సమాచారం అందించారనేది కూడా మరో పెద్ద రాజకీయం. ప్రకటన వెలువడక ముందే 16 మంది ఎంఎల్ఎలు రాజీనామా ప్రకటించారంటే రాజకీయ లాబీ ఎలా ఉందో తెలుస్తోంది.

సరే. కారణం ఏదైనా తెలంగాణ ఏర్పాటు కావడం సంతోషమే అయినా, తెలంగాణ ప్రకటన తర్వాత రాష్ట్రంలో చోటు చేసుకున్న, చేసుకుంటున్న పరిణామాలే మరింత ఆశ్చర్యకరంగా, ఆందోళన కరంగా ఉంటున్నాయి. ఏర్పాటు కాబోతున్న తెలంగాణ సంతోషం తెలంగాణ వాదులకు ఉండకపోవడం ఒకటైతే, తెలంగాణ ఏర్పాటు కాకుండా ఎలా అడ్డుకోవాలనేది సమైక్యవాదులకు అంతు పట్టకుండా పోయింది. అందుకే అడ్డు అదుపులేని ఉద్యమం ఆంధ్రా, సీమలో కొనసాగుతుంటే, ఢిల్లీలో అనారోగ్య పరిణామాల ఆందోళనను కలిగిస్తున్నాయి. రెండు నెలల ఆలస్యంగానైనా – కేంద్ర మంత్రి వర్గం జూలై 30న ప్రకటించిన ప్రకటనకే కట్టుబడి అక్టోబర్ 3న ఆమోదించినా, తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ 2014 ఎన్నికలలోపు పూర్తి అవుతుందా అనేది ఇప్పుడు అందర్ని వెంటాడుతున్నది. సోనియా, ఆంటోని, షిండే ఆరోగ్య సమస్యలు కూడా తెలంగాణ ఏర్పాటు ప్రక్రియకు మధ్య మధ్యన అడ్డు వస్తున్నాయంటే అనుమానాలు కూడా పెరుగుతున్నాయి. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ప్రకటన వెలువడిన రెండు నెలల తర్వాతగాని క్యాబినెట్ ఆమోదం పొందక పోవడం, అవి ఎలాంటి నోటును తయారు చేయకుండానే జరగడం అనుమానాలకు తావీవ్వడమే కాకుండా, కుట్రపూరిత అంతర్గత ప్రణాళిక ఏదో కాంగికి ఉండే ఉంటుంది. ప్రకటన జరిగి రెండు నెలలు గడిచినా క్యాబినెట్ కమిటీకి నోట్ తయారు చేయలేదంటే, అనుకోకుండానో ఆంటోని కమిటీ ఏర్పాటు కాదు. ప్రణాళికాబద్ధమైన ప్రణాళిక ఏదో ఉండి ఉంటుంది.

---

అంగీకరించిన ప్రధాన పాలకపక్షాలకు చెందిన శక్తులు ఈవేళ ఆంధ్ర, తెలంగాణ ప్రాంత ప్రజల ముందు వినూత్న ప్రదర్శనలు చేస్తూ దర్శనం ఇస్తున్నారు.

పాలక రాజకీయ నాయకులెవ్వరూ, ఏనాడూ, రాష్ట్రంలో సమగ్ర, సమతుల్యమైన అభివృద్ధికి తోడ్పడలేదు. అయినా పాలకులు, వారి అనుయాయులే కొందరు విభజన వాదాన్ని ఎత్తుకున్నారు. వాళ్లే పాలకులై ఉండి: వాళ్లే ప్రాంతీయ అసమానతలకు కారకులై ఉండి, ఈ కారణంగా వారే నేరస్తులై ఉండి, వారే పరిష్కార కర్తలు కావాలని అనుకోవడం తెలుగు ప్రజలందరికి మోహాన విషాదాన్ని పులమడమే.

ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటులో గానీ, సమైక్యరాష్ట్రంలో గానీ ప్రజలు ఎదుర్కొంటున్న ఏ ఒక్క సమస్యను పరిష్కరించలేదు. మౌలిక పరిష్కారం నుండి ప్రజల దృష్టి మళ్లించి, ఎవరి ఆధిపత్యంలో రాజకీయ అధికారం ఉండాలన్న తగవును పరిష్కరించుకునేందుకు పాలకవర్గాలలోని ముఠాలు ప్రజల మధ్య విద్వేషాలను రెచ్చగొడుతున్నాయి.

తెలుగు మాట్లాడే ప్రజలందరి మధ్య తెలుగు భాషను అనుసరించే కష్టజీవులందరి మధ్య సౌహార్ద పూరిత వాతావరణం నెలకొల్పడానికి, ప్రజలందరికి మౌలిక సదుపాయాలను సమకూర్చే సమగ్ర, సమతుల్య అభివృద్ధి కోసం పిడికిళ్లు బిగించాల్సిన తరుణం ఆసన్నమైంది. ప్రాంతాల మధ్య, ఆయా ప్రాంతాలకు సంబంధించిన ప్రజల మధ్య వైమనస్యాలు వ్యాప్తి చేసిన, కాలుష్య పూరితమైనటువంటి వ్యతిరేక వాతావరణాన్ని వ్యాప్తి చేస్తున్న పాలకులను నిలదీసే కర్తవ్యాన్ని వివిధ రంగాల ప్రజలతో పాటు ముఖ్యంగా విద్యార్థి, యువజన శక్తులు చేపట్టాలి. భారతదేశం స్వతంత్రమైన, ప్రజాతంత్రయుతమైన దేశంగా వెలుగొందడానికి సర్వవ్యాపిత, ప్రజాతంత్ర ఉద్యమం అవసరం! అభివృద్ధి కోసం, సామాజిక మార్పు కోసం తెలుగు నాట ఉన్న అన్ని ప్రాంతాల కార్మిక, కర్షక బడుగు, బలహీన వర్గాలు, ప్రజాతంత్ర శక్తులు కలిసి మెలిసి పోరాడడం, బుజం బుజం కలిపి నడవడం తక్షణావసరం.

*(రచయిత సిపిఐ (ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ముందు, రాష్ట్ర విషయానికి వచ్చినప్పుడు, ఆంధ్రా, సీమలో పరిస్థితి చేజారడం కన్నా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలే కావాలని చేజారనిచ్చాయి. ముందస్తు చర్యలుగా, ప్రతి ఉద్యమ సందర్భంగా తెలంగాణలో, విశ్వవిద్యాలయాల్లో పారా మిలిటరీ బలగాల్ని దింపి, ఉక్కుపాదం మోపి, విద్యార్థినిలను కూడా చూడకుండా హింసించిన రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రా, సీమ ఉద్యమాన్ని ఉదాసీనతతో చూడడమే ఇందుకు నిదర్శనం. పోతే, ఈ సంధికాలంలోనే డిజిపిది ఓ అంకం నడవడం. ఆయన పదవి కాలాన్ని పొడగించమని క్యాట్‌ను కోరడం, ఇంతలోనే ఆయన ఆస్తుల కైంకర్యంపై సిబిఐ దర్యాప్తును వేయడం, పదవీకాలాన్ని పొడగించలేమని రాష్ట్ర ప్రభుత్వం, కోర్టు చెప్పడం అంతా నాటకీయ పరిణామం కాగా, విధిలేని స్థితిలో పదవి విరమణ చేసిన దినేష్‌రెడ్డి తన పదవికాలంలో శాంతి భద్రతల్ని పరిరక్షించానని, ఒక్క రబ్బరు బుల్లెటును కూడా వాడలేదని ప్రకటించడం గమనార్హం. బహుశ ఆయన వ్యక్తిగతంగా తన కళ్లతో ఉస్మానియా యూనివర్సిటీలో రామాంజనేయుల నేతృత్వంలో జరిగిన దమనకాండని చూడలేదనే అహంకార భావనతో అలా అన్నాడా, లేక సిఎం అలా అనిపించాడా తెలియదుగాని, కేంద్ర క్యాబినెట్ తెలంగాణపై ఆమోదం తర్వాత సీమాంధ్రలో చెలరేగిన ఉద్యమాన్ని రబ్బర్ బుల్లెట్లతో అణచవద్దని స్వయంగా కిరణ్‌కుమార్ రెడ్డి ప్రకటించడం మరో ముఖ్య అంశం. డిజిపి పదవీ విరమణ చేసేదాకా తెలంగాణపై క్యాబినెట్ సమావేశం కాకపోవడం వెనక రాష్ట్ర దిక్కార స్వరం బలంగా పనిచేసిందనేది అవగతమవుతుంది. ఇదే నిజమైతే సిఎంను, గవర్నర్‌ను రాబోయే కాలంలో ఢిల్లీ పీఠం ఎలా తట్టుకుంటుందనేది మరో ప్రశ్న. పోతే పదవీ విరమణ తర్వాత డిజిపి దినేష్‌రెడ్డి ముఖ్యమంత్రిపై చేసిన తీవ్ర వ్యాఖ్యానాలు అందరిని దిగ్భ్రాంతికి గురిచేశాయి. దీని వెనకగల నాటకీయత ఏంటో ఎవరికి అర్థం కావడంలేదు. వికె సింగ్‌లాగా దినేష్‌రెడ్డి రాజకీయ లబ్దిని ఆశిస్తున్నట్లు కనపడుతున్నా, దీనివెనక అదృశ్యహస్తం ఏదో ఉండి ఉంటుంది.

ఇది ఇలా ఉంటే – ఊహించని విధంగా 16 నెలల తర్వాత ఆరోపించిన 10 చార్జిషీట్లలో 8 ఆరోపణలకు సరైన ఆధారాలు లేవని సిబిఐ జగన్ విషయంలో తెలంగాణ, అదృశ్య హస్తం తనను ప్రేరేపిస్తేనే జగన్‌పై ఆరోపణలు చేశానని సంచలనాలకు పేరుమోసిన మాజీ మంత్రి శంకర్‌రావు ప్రకటించడం మరో కొసమెరుపు. ఓ వైపు ఆంధ్రా, సీమలో ప్రేరేపిత ఉద్యమం జరుగుతుండగా, విజయమ్మ ఢిల్లీకి వెళ్లడం, వెనువెంటనే సెప్టెంబర్ 24న జగన్‌ను రాచమర్యాదలతో బయటకు వదలడం జరిగిపోయాయి. ఇలా జగన్ బయటికి రావడం చంద్రబాబు కన్నా, ఆంధ్రా, సీమ కాంగీ వర్గాల్నే ఎక్కువగా కలవరపర్చింది. దీనికనుగుణంగానే ఢిల్లీలో చాకో పొత్తుల విషయంగా ప్రకటన చేయడం జరిగిపోయాయి.

నాటి నుంచి నేటిదాకా కాంగీది అదే దుష్టబుద్ధి. తాను చేయాల్సిన పనిని ఇతరులతో చేయించడం, కాల్చాల్సిన బుల్లెట్‌ను ఇతరుల భుజాలపై ఉంచి కాల్చడం కాంగీకున్న నేర్పరి తనమే. రాష్ట్రంలో ఇప్పుడంతా రసకందాయకమే. ఏమి జరుగుతోందో, జరగబోతుందో ఊహించడం, చెప్పడం అతికష్టమే. అయితే కాంగీ చరిత్ర తెలిసిన వారెవరికైనా – జరగబోయేదాన్ని ఊహించడంలో నీతిపరుడిగా పేరుమోసిన పివి నర్సింహారావే జార్ఖండ్ ముక్తి మోర్చాకు డబ్బులిచ్చి పదవిని కాపాడుకున్నాడనే అపవాదు ఉండనే ఉంది. యువ ప్రధానిగా పేరు పొందిన రాజీవ్, విపి సింగ్‌కు, దేవగౌడకు చేయిచ్చిన విషయం తెలిసిందే. ఇక ఇందిర విషయం తెలియంది లేదు. ఆరు నూరైనా కాంగ్రెస్‌కు కావాల్సింది కాంగ్రెస్ మార్క్ పాలనా. వ్యక్తులెవరనేది కాదు ముఖ్యం. యువ జగన్ కొంత తలదించి సోనియాజీని యాచించితే, ముఖ్యమంత్రి అయ్యేవాడే. కాని అలా జరగకనే, సిబిఐ రుచి చూపించింది. జగన్ అరెస్టప్పుడే అనేక ఊహాగానాలు వెలువడ్డాయి. జగన్‌ను దారిలోకి తేవడానికే ఈ సిబిఐ తతంగమనేది కొందరు ఊహించారు కూడా. సిబిఐని ఎలా వాడుకోవాలో కాంగ్రెస్‌కు తెలిసినంతగా మరే రాజకీయ పార్టీకి తెలియదనేది లాలూ సంఘటనలో కూడా రుజువైంది. అందుకే అదో కాంగీ పంజరంలోని చిలుక అని అత్యున్నత న్యాయస్థానం వ్యాఖ్యానిస్తే, నిజమేనని స్వయంగా సిబిఐ డైరెక్టర్ రైలు, బొగ్గు కుంభకోణం సందర్భంగా ఒప్పుకోవడం గమనార్హం.

తెలంగాణ విషయంలో చూసినప్పుడు, 2014లోపు ప్రక్రియ పూర్తవుతుందా అనేది పెద్ద అనుమానంగా మారింది. అందరిలో ఉత్కంఠ ఇదే. రమారమి కేంద్ర ప్రభుత్వం పదవికాలం 6 నెలలు మాత్రమే. ఈ ఆరు నెలల్లో పార్లమెంట్ సమావేశాలు రెండే రెండు జరుగుతాయి. ఒకటి శీతాకాల సమావేశం కాగా, మరోటి బడ్జెట్ సమావేశం. బడ్జెట్ సమావేశాలు కూడా సరిగా జరగని పరిస్థితిలో ఓటాన్ ఎకౌంట్‌తో సరిపెట్టి ఎన్నికల్ని ప్రకటించవచ్చు. ఈలోపుగా జరగబోయే ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు కూడా రాజకీయ వాతావరణాన్ని తారుమారు చేయవచ్చు. ఒక్క మోడీ వ్యతిరేక ఓట్లు తప్ప, యుపిఎ ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఏ ఒక్క సంక్షేమ పథకం (ఎం.ఎన్.ఆర్.ఇ.జి.ఎస్, రైతుల రుణ మాఫీ, ఆహార భద్రత, వృద్ధాప్య ఫించన్, ఫీసుల పథకాలు) కాంగీని గట్టెక్కించకపోవచ్చు. కాంగ్రెస్ తిరిగి పాలనలోకి రావాలంటే ఐక్య సంఘటన అనివార్యం. దీనితోపాటుగా అత్యధిక ఎంపిలను చేతిలో ఉంచుకుంటేనే, రాహుల్ ప్రధానమంత్రి కాగలుగుతాడు. ముఖ్యమైన కేంద్ర మంత్రి పదవుల్ని దక్కించుకోగలుగుతుంది. ఇది జరగాలంటే గతంలో అత్యధిక ఎంపిలను అందించిన రాష్ట్రాలే శరణ్యం. ఇందులో ఉత్తరప్రదేశ్ పరిస్థితి చేజారిఉంది. ఇక మిగిలింది పెద్ద రాష్ట్రాలైన ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రలతో పాటుగా, ఒడిశా, కేరళ, కర్నాటక, జమ్ము కశ్మీర్, అస్సాం తదితర రాష్ట్రాలే. రాజస్థాన్‌లో బిజెపి తిరిగి కైవసం చేసుకునే అవకాశాలున్నట్లు కథనాలు. గుజరాత్, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్‌తోపాటుగా, బీహార్‌లో బిజెపి ప్రాధాన్యత ఉండనే ఉంటుంది. ఇక ఉత్తరప్రదేశ్‌లో బిఎస్‌పి, సమాజ్‌వాదీ పార్టీలు అవకాశం కొద్ది మెదులుతాయి. ములాయాంజీ చిన్న రాష్ట్రాలను వ్యతిరేకిస్తూ ప్రకటన చేయనే చేశారు. మమతాజీ, జయాజీలు కొరకరాని చక్కెర బెండ్లే, బిజెపి లేదా మూడో కూటమి అధికారంలోకి రావచ్చు? లేదా పరువు పోయేది ఏమిలేదు. గెలిస్తే కాంగీకి సంతోషమే గాని ఓడితే మాత్రం నెహ్రూ కుటుంబానికి దీర్ఘకాలిక సెలవే. సోనియా చరిష్మాతో రాహుల్ ప్రధాని అయ్యే అవకాశాలేగాని, స్వయంగా రాహుల్ ప్రధాని అయ్యే అవకాశాలు లేవు. ఆయనలో పిల్లతనం మెండు అని, మొన్నటి ఎంపిల నేర చరిత ఆర్డినెన్స్ బిల్లు సందర్భంగా తేలిపోయింది. తల్లి చివాట్లు పెట్టింది అంటే, రాహుల్ రాజకీయ పరిపక్వత ఎంతో తేలిపోయింది.

ఇలాంటి పరిస్థితిలో, ఆంధ్రప్రదేశ్‌లోని (విడిపోకపోతే) ఇరు

ప్రాంతాల్లో మెజారిటీ సాధించాలనేది కాంగీ ఏకైక లక్ష్యం. ఇది నెరవేరాలంటే తెలంగాణకు అనుకూలంగా తెలంగాణలో, సీమాంధ్రకు అనుకూలంగా సీమాంధ్రలో నటించడం కాంగికి అనివార్యమైంది. అందుకే, మరో నత్తనడక దొంగాటను మొదలుపెట్టింది. వెనక్కి పోము అంటూనే ముందుకు అడుగులు వేయలేని, వేసినా అవిటివాడిలా, అతిమెల్లగా అడుగు వేసే దిగ్విజయ్‌సింగ్, తెలంగాణ ఏర్పాటుకు డెడ్‌లైను లేదు, ఎంత కాలమైనా పట్టవచ్చు అని సుశీల్‌కుమార్ షిండే, ఆంటోని కమిటీ రిపోర్ట్ తర్వాతనే విధివిధానాల ప్రక్రియ అని మరో ప్రకటన కొనసాగడం అనేక అనుమానాలకు తావిస్తున్నది. పైగా జాతీయ పార్టీలు సహకరిస్తే ఎన్నికల్లోగా తెలంగాణ ఏర్పాటు అంటూ దిగ్విజయ్‌సింగ్ నర్మగర్భంగా 2014 ఎన్నికలలోపు తెలంగాణ ఏర్పాటు అనుమానమే అనే సందేహాన్ని వ్యక్తపరచగా, రాష్ట్ర అసెంబ్లీకి ఒకేసారి నేరుగా బిల్లునే పంపిస్తామని చెప్పడం, ఢిల్లీలో ఏకీకృత విధానం అంటూ ఏదీ లేదనేది తెలుస్తుంది.

ప్రక్రియ మొదలైందని భావించినా – అనుకున్న సమయంలో ఏది జరగక, పూర్తికాక పోతే, 2014 ఎన్నికల ప్రకటన మెడమీద కత్తిలాఉండే, తెలంగాణ ఏర్పాటు....ప్రశ్నార్థకమే అవుతుంది. రెండు నెలలకు కాని కేంద్ర మంత్రి వర్గం తెలంగాణ విషయంగా భేటికాలేని స్థితి ఉంటే, ముందు పది మందితో, తర్వాత కుదించి ఏడుగురితో ఏర్పాటైన గ్రూప్ ఆఫ్ మినిస్టర్స్ సమష్టిగా శీతాకాల సమావేశాలకు ముందు రాష్ట్ర విధి విధానాలకు రూపం ఇవ్వగలరా? కేంద్ర ప్రభుత్వమే ఆరు వారాల (42 రోజులు) సమయాన్ని ఇస్తే, ఇదే కాలంలో వారు సంప్రదింపులు చేపట్టినా శీతాకాల సమావేశాలు దగ్గరపడతాయి (నవంబర్ చివరి వారం). అప్పటికి, పద్మవ్యూహపు మలుపులన్నింటిని తెలంగాణపై రాసిన నోట్ తిరగాలి. ముందుగా రాష్ట్రపతి దగ్గరికి, తిరిగి కేంద్ర ప్రభుత్వం, తర్వాత రాష్ట్ర అసెంబ్లీ, తిరిగి కేంద్ర ప్రభుత్వం మళ్లీ రాష్ట్రపతి దగ్గరికి, తిరిగి పార్లమెంట్‌కు రావాలి. అప్పుడు చర్చ, ఆమోదం తర్వాతగాని బిల్లు బయట పడదు. ఇవన్నీ కూడా ఒకదాని తర్వాత ఒకటి జరిగితే, బడ్జెట్ సెషన్స్ నాటికి పార్లమెంట్‌కు చేరుతుంది. లేదంటే మహిళా బిల్లులా, భేతాళ కథల్లోని శవంలా తెలంగాణ బిల్లు చెట్టెక్కినా ఆశ్చర్యం లేదు.

ఇలా జరగడమే కాంగీకి అవసరం. అప్పుడు ఇరు ప్రాంతాల్లో (విడిపోకున్నా విడిపోయినట్లున్న ప్రాంతం) ఓట్లను అడిగే హక్కును సంపాదిస్తుంది. కాంగ్రెస్ తిరిగి వస్తేనే కేంద్రంలో తెలంగాణపై బిల్లు వస్తుందని తెలంగాణ ప్రజలు, మా ఉద్యమ ఫలితంగానే తెలంగాణ బిల్లును ఆపగలిగామని సీమాంధ్ర ఉద్యోగులు, రాజకీయ నాయకులు భావించి కాంగీకి ఓట్లు పడేలా చేసుకోవాలనే కుట్ర కూడా ఇందులో దాగిఉంది. ఇలా రెండు ప్రాంతాల్లో కాంగ్రెస్ బలాన్ని పుంజుకొని, రాష్ట్రంలో, కేంద్రంలో పాలన చేయాలనేది నిగూడార్థం. అందుకే డమ్మీ కార్డుగా జగన్‌ను వాడుకోవచ్చనే కుటిల నీతితోనే జగన్‌ను జైలు నుంచి తప్పించింది. కాంగీ బలంతో అధికారంలోకి వస్తే జగన్‌కు తిరిగి జైలు తప్పదు. లేదా జగన్ సహకారంతో ఒప్పందం కుదిరితే మెజారిటీని బట్టి జగన్‌గాని, లేదా ఢిల్లీ సీల్డ్ కవర్ ముఖ్యమంత్రిగాని ఇరు ప్రాంతాలకు ముఖ్యమంత్రి అవుతాడు. ఆ తర్వాత తెలంగాణ చూసుకోవచ్చు, జగన్‌ను కూడా చూసుకోవచ్చు.

కాదూ, కూడదని ఓడితే, రాబోయే ఎన్‌డిఏ లేదా మూడో కూటమి ప్రభుత్వాలకు తెలంగాణ సమస్య ముందు నుయ్యి, వెనుక గొయ్యిలా తయారైతుంది. బిజెపితో బాబు పెనవేసుకోవడంతోటే ఈ దృశ్యం స్పష్టంగా కనపడుతున్నది. తిరిగి తన దుర్మార్గపు బుద్ధిని బాబు ప్రదర్శించడనేది గ్యారంటీ ఏమిలేదు. ఎన్‌డిఏ ప్రభుత్వంగాని, మూడో కూటమిగాని కేంద్రంలో అధికారంలోకి రావడంతోనే, అటకెక్కిన తెలంగాణ బిల్లును దించకపోవచ్చు. దించిన చర్చపేరున కాలయాపన చేయనూవచ్చు.

ఇన్ని చిక్కుముడులతో తెలంగాణ ప్రక్రియను కొనసాగిస్తున్న కేంద్రం, ప్రధానంగా కాంగీకి, మనసా, వాచా తెలంగాణ ఇవ్వడం ససేమిరా ఇష్టం లేదు. రాజకీయ చతురతతో ఆడుతున్న నాటకంలోని ఓ భాగం మాత్రమే. లేదంటే, గత రెండు నెలల్లోనే పైన చెప్పిన ప్రక్రియలన్నీ పూర్తి అయి, శీతాకాల పార్లమెంట్ సమావేశాలకు బిల్లు బయట పడుతుందా అంటే అలా జరిగే పరిస్థితే లేదు. సీమాంధ్ర ఎంపిలు, మంత్రులు ఎలా అడ్డు తగులుతారో, తగిలేలా చేస్తారో తెలియదు.

ఇక హైదరాబాద్ విషయంగా చూసినప్పుడు – రాయల తెలంగాణ, యూనియన్ టెరిటరీకి స్వతంత్ర రాష్ట్రానికి, శాశ్వత రాష్ట్రానికి అంగీకరించకున్నా, 10 సంవత్సరాలు అవకాశం ఇవ్వడం ఓ సుదీర్ఘకాలమే. హైదరాబాద్‌లో స్థిరపడిన వారికి రక్షణ విషయంగా జాగ్రత్తలు తీసుకుంటే సరిపోయేది. ఒకటీ, రెండు సంవత్సరాలలో రాజధాని నిర్మాణం జరిగిపోతుంది. అంతగా టెక్నాలజీ అభివృద్ధి లేని 1953లో నెహ్రూ మద్రాస్ నుంచి తక్షణం విడిపోవాలని సూచిస్తే, టెక్నాలజీ బాగా అందుబాటులోకి వచ్చిన ఈ రోజుల్లో 10 సంవత్సరాలు ఉమ్మడి రాజధానిగా ఉంచడం మరికొన్ని కొత్త సమస్యలు తెచ్చి పెట్టడమే అవుతుంది. ఇప్పటికే చండీగడ్ ఉమ్మడి రాజధాని సమస్యను ఎదుర్కొంటున్నది. 1966లో ఏర్పడిన పంజాబ్ హర్యానా రాష్ట్ర ఉమ్మడి రాజధానిని, 1975 నాటికే పంజాబ్‌కు అప్పజెప్పాలని ఇందిరతో, రాజీవ్‌తో ఒప్పందాలు జరిగినా, నేటికి అమలుకు నోచుకోక పోగా, హర్యానాకు నేటికి రాజధాని నిర్మాణం జరగలేదు. భవిష్యత్తులో హైదరాబాద్ పరిస్థితి ఇలా కాదనే గ్యారంటీ ఏమి లేదు. పది సంవత్సరాల తర్వాత, రాజకీయ పరిస్థితులు ఎలా ఉంటాయో తెలియదు. ఈకాలంలో రెండు సాధారణ ఎన్నికలు జరుగుతాయి. రాజకీయాలు, నాయకులు అటూ, ఇటూ అవుతారు. హైదరాబాద్‌లోని కాంగీలు, బిజెపిలు, ఎంఐఎంలు, లోక్‌సత్తాలు, టిడిపిలు, ముఖేష్, దానం లాంటి నాయకత్వాన మరో కొత్త సమస్యను తెచ్చి పెట్టరనే గ్యారంటీ ఏమిలేదు.

ఇలా జరుగుతున్న ప్రతీ పరిణామం, తెలంగాణ ఏర్పాటుకు నెమ్మదిగా, అతి నెమ్మదిగా, వీలైనప్పుడు మాత్రమే ముందుకు తీసుకెళ్లే కొత్త నాటకం ఢిల్లీలో మొదలైంది. దీన్ని కూడా తెలంగాణ వాదులు గుర్తించి నిలదీస్తే తప్ప – 2014 ఎన్నికలకు ముందే తెలంగాణ సాకారం కాదు.

వీటన్నిటికి తోడు జగన్ లోటస్‌పాండ్ రాజకీయాలు, చంద్రబాబు జంతర్‌మంతర్ కమ్ ఆంధ్రభవన్ రాజకీయాలు రాష్ట్ర ప్రజలకు ఉరితాళ్లుగా మారకపోతే, తెలంగాణ ప్రక్రియ గాడిలోపడవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# పేలుళ్ల దర్యాప్తుల్లో హక్కుల హననం

**ప్రభుత్వం పేలుళ్ల వెనుక ఉన్న అసలైన కారకులను పట్టుకోకుండా అమాయకులైన ముస్లిం యువకులను పట్టుకొని, చిత్రహింసలకు గురిచేసి వారి విలువైన జీవితాలను నాశనం చేస్తుందని అంటున్నారు ఎల్. అరణ్య**

మక్కా మసీదులో బాంబు4 పేలుడు ఘటన జరిగి ఆరేళ్లు గడిచి పోయింది. కేసు అనేక మలుపులు తిరుగుతూనే ఉంది. కాని కేసు విచారణపేరిట అనేకమంది అమాయకులు జైలు గోడల మధ్య నలుగుతూ పోలీసు లాఠీల బారిన పడుతూ చిత్రహింసలకు గురవుతున్నారు. కేసులకు పరిష్కారం కనుగొనే మార్గంలో ఆ పేరుతో పోలీసులు పౌరహక్కులను ఎలా కాలరాస్తారో, నేరం ఒప్పుకోవడం కాకుండా నేరాన్ని ఒప్పించడం లక్ష్యంగా ఎలా వ్యక్తులను హింసిస్తారో తెలుసుకోవడానికి మక్కామసీదు ఘటన ఒక మంచి ఉదాహరణ.

2007 మే 18న మక్కామసీదులో అమర్చిన బాంబు పేలింది. ఆరోజు శుక్రవారం, ముస్లింలకు పవిత్రమైనరోజు. వారం మొత్తంలో సమయం దొరకక నమాజ్ (ప్రార్థన) చేయలేకపోయిన వారు కూడా ఆరోజైతే తప్పనిసరిగా ప్రార్థన చేస్తారు. అందుకు ఉన్న వేదికలలో హైదరాబాద్‌లోనైతే మక్కామసీదు ముఖ్య వేదిక. ఆరోజు మసీదులో దాదాపు పదివేలమంది ప్రార్థన చేస్తున్నారు. ఆ సమయంలో పేలిన బాంబు వల్ల తొమ్మిది మంది చనిపోయారు. దాదాపు 30కి పైగా గాయపడ్డారు. గాయపడ్డవారిని ఆసుపత్రికి తరలించడం అనేది మానవత్వంతో కూడిన చర్య. నిజం చెప్పాలంటే మనిషి ఇవాళ తన మానవీయతను కోల్పోతూ, 'మనకెందుకులే' అనే సంకుచిత వ్యక్తిత్వాన్ని పెంపొందించుకుంటున్న కాలంలో బతుకుతున్నాడు. కానీ బాంబు పేలిన వెంటనే అనేకమంది ముస్లింలు బాధితులను ఆసుపత్రికి చేర్చే పని ప్రారంభించారు. అలా తీసుకువెళ్తున్న వారిపై పోలీసులు కాల్పులు జరపగా మరో ఆరుగురు మరణించారు. 21 మంది గాయపడ్డారు. అసలు ఆ సమయంలో ఎందుకు కాల్పులు జరపాల్సి వచ్చింది? అది కూడా ఆసుపత్రికి తీసుకెళ్లే ఒక మంచి పని చేస్తున్న వారినెందుకు కాల్చారు? అనే ప్రశ్నలకు ఇప్పటికీ సమాధానం లేదు. పోలీసులు శాంతిభద్రతల రక్షణ పేరిట ఎవరో ఏమిటో కూడా చూడకుండా విచక్షణ లేకుండా కాల్పులు జరుపుతారని చాలా మందికున్న అభిప్రాయానికి ఆరోజు మక్కామసీదు పేలుడు అనంతరం జరిగిన పోలీసు కాల్పులు సాక్ష్యంగా నిలిచాయి.

మసీదులో బాంబు పేలిన కొద్దిసేపటికి ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా వాళ్లు చేరుకున్నారు. అప్పటికే ఎప్పుడు పుట్టిందో ఎలా పుట్టిందో తెలియదు గానీ శవాల పోస్టుమార్టమ్ కంటే ముందే ఈ బాంబుపని తీవ్రవాదులదే అని, పాకిస్తాన్ హస్తముందనే మాట ఒకటి బయటకు వచ్చింది. మీడియా వాళ్లు వచ్చాక ఫొటోలు, వీడియోలు తీయడం అయ్యాక స్థానిక పోలీసుల ఇంటర్వ్యూ సమయంలో ఈ చర్య పాకిస్తాన్ ఉగ్రవాదులదేననే విషయం పోలీసులు, మీడియా ద్వారా వేగంగా వ్యాపించడం ప్రారంభించారు. టెలివిజన్‌లలో అదేవార్త ప్రసారమైంది. క్రమంగా ఛానళ్ల వాళ్లు అస్పష్టమైన వార్తకు మరిన్ని రంగులద్దడం ప్రారంభించారు. ఇది కచ్చితంగా ఇండియన్ ముజాహిద్దీన్ పనే అని కొన్ని, హుజి (హర్కతుల్ జిహాది ఇస్లామి) పనే అని కొన్ని, లష్కరే తొయిబా పని అని కొన్ని వార్త కథనాలు ప్రసారం చేశాయి. ఈ కథలకు ఊతమిస్తూ మరో అడుగు ముందుకేసి పోలీసులు ఈ చర్య కచ్చితంగా షాహిద్‌బిలాల్ చేసిందేనని నిర్ధారించారు. ఘటనాస్థలాన్ని వదిలి అంగుళమైనా కదలని పోలీసులు, మీడియా ఇలాంటి సున్నితమైన ఘటనాస్థలంలో వ్యవహరించాల్సిన తీరును మర్చిపోయి ప్రజలలో ఉద్రేకాలు రెచ్చగొట్టేలా ప్రవర్తించారు. పాకిస్తాన్ ఉగ్రవాద సంస్థల పాత్ర ఉంటే ఉండవచ్చు కానీ, ఘటనాస్థలం దాటి పరిశోధన చేసిన తర్వాత కదా, ఎవరీపనిచేశారో నిర్ధారించాల్సింది! కానీ అలా జరగలేదు. ఇక తర్వాత బిలాల్ అనుచరులుగా చెప్తూ స్నేహితులను, బంధువులను తీసుకెళ్లి థర్డ్‌డిగ్రీ ప్రయోగించి అనేక చిత్రహింసలకు గురిచేశారు. వారిపై ఉగ్రవాదులకు సహాయం చేస్తున్నారంటూ కేసులు పెట్టారు.

షాహిద్‌బిలాల్ హైదరాబాద్‌లోని మూసరాంబాగ్ ప్రాంతవాసి. బిలాల్ ఇంటర్ పరీక్షల సమయంలో స్పీకర్లలో భజనలు చేస్తూ ప్రశాంతతను భంగపరుస్తున్న ఒక హిందూచర్యను తన స్నేహితులతో కలిసి తనూ వ్యతిరేకించాడు. పోలీసులు అందరినీ జైలులో వేశారు. తర్వాత బిలాల్‌ను తప్ప అందరినీ విడుదల చేసి బిలాల్‌పై మాత్రం బిజెపి నాయకుడు ఇంద్రసేనారెడ్డిని చంపాలనుకున్నాడనే అక్రమకేసు పెట్టి జైలులోనే ఉంచారు. ఒకసారి పోలీసుల దుర్మార్గ వలలో పడితే అందులోంచి బయటకురావడం ఎంత కష్టమో చెప్పడానికి బిలాల్ జీవితమే ఉదాహరణ. తర్వాత బిలాల్‌ను 2002 దిల్‌సుఖ్‌నగర్ సాయిబాబ గుడి పేలుళ్ల కేసులో ఇరికించారు. 2005లో జరిగిన టాస్క్ ఫోర్స్ కార్యాలయంలో పేలుళ్ల కేసు కూడా బిలాల్‌ను ప్రధాన నిందితునిగా పోలీసులు చూపించారు. ఆ తర్వాత హఠాత్తుగా పోలీసులు ప్రకటించింది ఏమిటంటే బిలాల్ పరారీలో ఉన్నాడని. ఈ పరారీ కథ కూడా పోలీసు సృష్టే అని బిలాల్ బంధువులు, మిత్రులు ఆరోపిస్తున్నారు. పోలీసులే బిలాల్‌ను ఎత్తుకెళ్లి మిస్సింగ్ అని ప్రకటించారంటున్నారు. పోలీసులకు ఇలాంటి పనులు అలవాటే కనుక వారి మాటలు కొట్టివేయడానికి లేదు. మక్కామసీదు పేలుళ్ల అనంతరం పరారీలో ఉన్న బిలాల్ పేరును బయటకుతెచ్చి పేలుళ్లకు అతనే కారకుడని నిర్ధారించారు. అది కూడా పేలుళ్లు జరిగిన కేవలం పది నిమిషాల వ్యవధిలోనే ఈ నిర్ధారణకు ఆధారభూతమైన ప్రాథమిక సాక్ష్యం ఏమిటనేది పోలీసులకే తెలియదు. ఎవరో ఒకరి మీద నెట్టాలి కనుక, అందుకుగాను పరారీలో ఉన్న బిలాల్‌పేరు గతంలో రెండు ఉగ్రవాద ఘటనలలో బలవంతంగానైనా నెట్టబడి ఉన్నందున మక్కామసీదు పేలుళ్లకు బిలాల్‌ను కారకుడని చూపితే

సరిపోతుందని భావించి మరోసారి ఈ కేసులో కూడా బిలాల్‌ను ఇరికించారు. తర్వాత చాలా మిస్సింగ్ కేసులలో జరిగినట్లుగానే 2007 ఆగస్టు 30న బిలాల్ కరాచీ ఎన్‌కౌంటర్‌లో మరణించాడని, అందులో మన పోలీసులు కూడా పాల్గొన్నారని 2008లో గర్వంగా ప్రకటించి పోలీసులు చేతులు దులుపుకున్నారు. గోకుల్‌చాట్, లుంబినిపార్క్ పేలుళ్లలో కూడా అన్యాయంగా పేరు ఇరికించబడి, అది జరిగిన వారానికే షాహిద్‌బిలాల్ ఎన్‌కౌంటర్ కావడం యాదృచ్ఛికమనే అనుకోవాలా?

షాహిద్‌బిలాల్ మరణంతో దాదాపు రెండు సంవత్సరాలు కేసు స్తబ్దంగా ఉండిపోయింది. జరిగిందంతా చూస్తే మక్కామసీదు పేలుళ్ల అనంతర ఘటనలు కేవలం ఒక వర్గాన్ని, ఒక మతాన్ని టార్గెట్ చేసే దిశగా సాగాయని అర్థమవుతుంది. ఒక మక్కామసీదు విషయంలోనే కాదు అసలు ఇలాంటి ఏ ఘటనల సందర్భంగానైనా పోలీసులకంటూ ఒక ప్రత్యేకమైన వ్యూహం ఉంటుంది. వారికి కొన్ని ఏరియాలపై కన్ను ఉంటుంది. కొందరు వక్తులమీద లక్ష్యం ఉంటుంది. ఇక ఘటన జరిగిన వెంటనే ఆయా ఏరియాలలోని ఆ వ్యక్తులపై పోలీసు దాడులు, సోదాలు మొదలవుతాయి. మతపరమైన ఘటనలు జరిగిన వెంటనే హైదరాబాద్‌లోని పాతబస్తి, మూసరాంబాగ్, సైదాబాద్, యాకుత్‌పురా మొదలైన ముస్లింలు ఎక్కువగా ఉండే స్థలాలలో మాత్రమే ఒకరకమైన అప్రకటిత కర్ఫ్యూ ఉంటుంది. వందలాది పోలీసులు ఆ ప్రాంతాలను చుట్టుముడతారు. ఆ ప్రాంతాలలో కాస్తంత చురుగ్గా వ్యవహరించే వారిని, ప్రజలను సంఘాలుగానో, సంస్థలుగానో కూడగట్టే వారిని అదుపులోకి తీసుకుంటారు. ముఖ్యంగా అక్కడి ఎం.ఎల్.ఎకో, ఎం.పికో వ్యతిరేకంగా వ్యవహరించే వారిని ఈ నెపంతో ఘటనతో సంబంధం ఉన్నా లేకున్నా అరెస్టు చేస్తారు. ఆ వ్యక్తులనే కాకుండా వారి స్నేహితులను, బంధువులను అందరినీ తీసుకెళ్లి విచారణ పేరిట చిత్రహింసలు పెడతారు. మహిళలపట్ల అసభ్యంగా, అనుచితంగా ప్రవర్తిస్తారు. ఇలా చేయడానికి వారికంటూ ఉండే ఒక అదుపులేని స్వేచ్ఛ ఏమిటంటే ఉగ్రవాదులపై కఠినవైఖరి ప్రదర్శించడం అనే రాజకీయ మద్దతు. ఆ మద్దతుతోనే ఎవరిపైనైనా ఏవిధంగానైనా ప్రవర్తించే అధికారాన్ని పోలీసులు పొందుతున్నారు. చాలా చిత్రమైన విషయమేమిటంటే అలా అమాయకులను హింసిస్తున్నప్పుడు పౌరులు, సమాజం కూడా పెద్దగా ప్రశ్నించడంలేదంటే ఉగ్రవాదం విషయంలో పోలీసులు ఏం చేసినా ఫర్వాలేదు అనేవిధంగా సమాజాన్ని కూడా పోలీసులు మార్చగలగడం. అందుకే గమనిస్తే కొన్ని ప్రజా సంఘాలు మినహా ముస్లింలు వేరే విషయాలలో పోరాటం చేసినంతగా ఉగ్రవాద కేసులలో అమాయకుల అక్రమ అరెస్టుల విషయంలో పోరాటం చేయలేకపోతున్నారు.

తర్వాత అరెస్టు చేసిన వారిపై ఏదో ఒక ఉగ్రవాద సంస్థతో సంబంధాలు ఉన్నాయనే ముద్రవేస్తారు. మీడియా దీనికి విశేషమైన ప్రచారం కల్పిస్తుంది. ఇక్కడొక విషయం చెప్పుకోవాలి. పోలీసులు తమకు నోటికి వచ్చిన ఏదో ఒక ఉగ్రవాద సంస్థ ఆ ఘటన వెనక ఉందని ఎలాంటి పరిశోధన, సాక్ష్యం, ఆధారాలు లేకుండా మీడియా కోసం, పోలీసులు త్వరగా స్పందించారనే పేరు రావడంకోసం తమకు తోచిన ఏదో ఒక సంస్థపేరును ప్రకటిస్తారు. అవసరమైతే ఏదో ఒక కొత్త సంస్థ పేరుతో తామే ఒక ఉగ్రవాద సంస్థ పేరుపెట్టి మరీ మీడియా ముందుకు వదులుతారు. ఆ సంస్థ ఉందా, లేదా, ఆ సంస్థ బాధ్యత ప్రకటన ఇచ్చిందా లేదా ఇవన్నీ వివరాలు అనవసరం. ఏదో ఒక సంస్థపేరు వాడుకుంటే ఆ సంస్థ సభ్యుడంటూ అమాయకులపై కేసులు పెట్టడం, విచారణ పేరిట లక్షలు, కోట్లు నిధులు కావాలని ప్రభుత్వం ద్వారా కేటాయించుకోవడం అనేదే లక్ష్యం. ఇంత దిగజారుడుగా పోలీసులు వ్యవహరిస్తారని ఊహించని బాధితుల కుటుంబ సభ్యులు మాత్రం బెయిల్ కోసం, విడుదల కోసం పోలీసులను నిరంతరం ప్రాధేయపడుతూనే ఉంటారు.

ఇక అరెస్టు చేసిన వారి నుంచి సమాచారం రాబట్టే పేరుతో వారిని నిరంతరం చిత్రహింసలకు గురిచేస్తారు. నమాజ్ చేసినా, అల్లా అన్నా లాఠీలు శరీరాల మీద వాతలు పెడతాయి. ఈ సమయంలో బెయిల్‌లు, హెబియస్ కార్పస్‌లు, పౌరహక్కులు వంటి రాజ్యాంగపరమైన ఏ రక్షణలూ పౌరులకు వర్తించని రీతిలో పోలీసులు వ్యవహరిస్తారు. న్యాయవాదులను, ప్రజా సంఘాలను, ఒక దశలో కోర్టు తీర్పులను, మెజిస్ట్రేట్‌ల ఆదేశాలను కూడా ఖాతరు చేయకుండా తమ ఇష్టాను సారంగా, తమకు నచ్చినన్ని రోజులు వారిని హింసిస్తూ అడిగిన ప్రతిసారీ 'విచారణ సాగుతుంది' అని చెప్తూ ఆ పేరుతో విచ్చలవిడిగా చిత్రహింసలను వారిపై అమలు చేస్తూ వస్తారు. నిజానికి ఇదంతా కూడా ఒక ప్రణాళిక ప్రకారమే సాగుతుంది. దీని వెనక ప్రభుత్వం, ప్రభుత్వ పెద్దల, పైస్థాయి అధికారుల అభయ హస్తాలుంటాయి. కేసుతో సంబంధంలేని అమాయకుడైన ఎవరో ఒకరిని చూపించైనా సరే వారిని కేంద్రబిందువు చేస్తూ ఏదో ఒక విధంగా కేసును వేగంగా ముగించడమే లక్ష్యంగా పోలీసులు పని చేయాల్సి ఉంటుంది. అందుకే వారు ఎవరిని అరెస్టు చేసినా, ఎలా హింసలు పెట్టినా వారికి ప్రభుత్వాల మద్దతు లభిస్తుంది.

తమ చిత్రహింసలతో అమాయకుల నుంచి పోలీసులు ఒప్పుకోలు ప్రకటన (కన్ఫెషన్ స్టేట్‌మెంట్) తీసుకుంటారు. కేవలం పోలీసుల హింసలు భరించలేక నేరం చేయకున్నా సరే చేశానని ఒప్పుకోవడమే కన్ఫెషన్ వెనక ఉన్న సంగతి. అలా ఒప్పుకోకపోతే ఎన్‌కౌంటర్ చేస్తామని, పదులకొద్ది కేసులు పెట్టి ఈ చిత్రహింసలను శాశ్వతం చేస్తామని, కుటుంబ సభ్యులను కూడా హింసలు పెడతామని పోలీసులు బెదిరిస్తుంటారు. వెరసి తమకిష్టం లేకపోయినా బాధితులు భయంతో కన్ఫెషన్‌పై సంతకం చేస్తారు. (కన్ఫెషన్ స్టేట్‌మెంట్‌లను కోర్టులు సాక్ష్యాలుగా తీసుకోవు. కానీ మీడియాలో చూపి ఆ వ్యక్తి ఉగ్రవాదే అని ప్రజలను నమ్మించడానికి కన్ఫెషన్లు పనిచేస్తాయి కనుక బలవంతంగానైనా పోలీసులు కన్ఫెషన్లను తీసుకుంటారు). తర్వాత కోర్టులో ప్రవేశపెట్టి తప్పుడు సాక్ష్యాలతో వారికి యావజ్జీవ లేదా కఠిన కారాగార శిక్షలు పడేలా చేస్తారు. కన్ఫెషన్‌కు అంగీకరించని వారిని పోలీసులు తాము బెదిరించినట్లుగానే ఎన్‌కౌంటర్ చేస్తారు. పోలీసుల నుంచి ఆయుధాలు లాక్కుని దాడి చేయడం వల్లనో, పరారీలో ఉన్న ఉగ్రవాదులను వెతుకుతున్న సమయంలో హఠాత్తుగా కాల్పులు ప్రారంభించడం వల్లనో పోలీసులు ఆత్మరక్షణ కోసం ప్రతిగా జరిపిన కాల్పుల్లో మరణించాడని పోలీసులు ఎన్‌కౌంటర్ కథ అల్లి మరో అమాయకుని వెంటపడతారు.

ఇదంతా సాధారణంగా జరుగుతున్న ఒక పద్ధతి (ప్రాసెస్). అది మొన్నటి సాయిబాబ గుడి బాంబు పేలుడులో గానీ, గోకుల్‌చాట్, లుంబిని పార్క్ ఘటనలో గానీ, నిన్నటి దిల్‌సుఖ్‌నగర్ పేలుళ్లలో గానీ పోలీసులచే అనుసరించబడుతున్న పద్ధతి. మక్కామసీదు బాంబు పేలుళ్ల ఘటనలో కూడా సరిగ్గా ఇదే పద్ధతి అనుసరించబడింది. జాతిరక్షణ

చర్యలపేరిట మక్కామసీదు పేలుళ్లను చూపిస్తూ అనేకమంది ముస్లింలను అన్యాయంగా అదుపులోకి తీసుకున్నారు. ఉగ్రవాద సాహిత్యం, ఆయుధాలను వాళ్ల ఇండ్లల్లో పడేసి వాటిపక్కన బలవంతంగా నిల్చోబెట్టి సాక్ష్యాలుగా ఉపయోగపడేలా ఫోటోలు, వీడియోలు తీసి, వారితో తెల్ల కాగితాలపై సంతకాలు తీసుకుని రోడ్ల మీద కొట్టుకుంటూ, ఈడ్చుకుంటూ తీసుకెళ్లి జాతి వ్యతిరేకులుగా వారిని చూపే ప్రయత్నం చేశారు. వారికి కనీసం న్యాయపోరాటం చేసే అవకాశాన్ని కూడా ఇవ్వలేదు. బార్ అసోసియేషన్లు కూడా ఉగ్రవాదానికి సంబంధించిన కేసులను టేకప్ చేయడానికి నిరాకరిస్తున్నారు. అమాయక ముస్లింల పక్షాన వారి హక్కులకోసం అభినందనీయ పోరాటం చేస్తున్న సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ సభ్యులను వేదనలకు గురిచేశారు. దాని కార్యదర్శి లతీఫ్‌ఖాన్, గతంలో తనపై కుట్రకేసు బనాయించినా ధైర్యంతో ముస్లింల హక్కుల పరిరక్షణకు ఉద్యమిస్తూనే ఉన్నారు. మక్కా పేలుళ్ల కేసులో అదుపులోకి తీసుకున్న ముస్లింల గురించి సానుభూతిగా మాట్లాడిన ప్రజా సంఘాల వారిని కూడా బెదిరించారు. నెలలకొద్దీ బాధితులను పోలీసుల కస్టడిలో ఉంచుకునేలా కోర్టుల నుంచి పోలీసులు అనుమతులు తెచ్చుకున్నారు. క్రమంగా బాధితుల కుటుంబాలు సామాజికంగా, ఆర్థికంగా కృశించిపోయి ఉన్న ఇళ్లు, వస్తువులు అమ్ముకుని బికారిగా రోడ్డున పడ్డాయి. ఈ పరిస్థితికి కారణం అమాయకులను కేసులో ఇరికించడం. ఉగ్రవాద చర్యలన్నిటికీ కారణభూతులు ముస్లింలే అనే దుర్మార్గమైన ప్రచారాలు, అనుమానాలు. అయితే ఇప్పుడొక విషయం గమనించాలి. పేలుళ్ల వంటి సందర్భాలలో చాలా అన్యాయంగా ముస్లిం సమాజాలపై ప్రజల, ప్రభుత్వాల అనుమానం, పోలీసుల దాడులు ఉంటూ వచ్చాయి. ఈ సందర్భాల అనుభవాల పరంపర చివరికి ఏ ఘటన జరిగినా వారినే బాధ్యులు చేసే పరిస్థితికి వెళ్లింది. దీనికి పరాకాష్ట ఏమిటంటే ఒక ముస్లిం ప్రార్థనాలయంపై దాడి జరిగినప్పుడు దానికి బాధ్యులుగా ఎంచాల్సివస్తే ఆ మతానికి వేరుగా ఉండే మతాన్ని అనుమానించాలి. కానీ ముస్లిం ప్రార్థనాలయంపై దాడి అయిన సరే ముస్లింలనే అనుమానించాలి అనేంతగా ముస్లింలను బాధ్యులను చేసి, ఉగ్రవాద చర్యలకు ముస్లింలు మాత్రమే కారకులుగా ఉంటారనే పెనుభూతంలా తయారైన అనుమానాలను ప్రోదిచేసుకుంటూ ప్రభుత్వాలు, హిందూ ఉగ్రవాద భావజాల ప్రచారకులు, పోలీసులు వ్యవహరిస్తుంటే నూటికి డెబ్బైమంది బీదబిక్కీలుగా ఉన్నా ముస్లింలు వారి ఉక్కుపాదాల కింద, హింసాకాండల వల్ల నలిగిపోతూ వస్తున్నారు. ఇవాళ ముస్లిం ప్రాంతాలలో జరుగుతున్నదదే. మక్కామసీదుపై దాడి సందర్భంలోనూ ముస్లింలనే టార్గెట్ చేసిన విచిత్రాన్నిబట్టి ముస్లింలపై కొనసాగుతున్న దుర్మార్గ నిర్బంధం అర్థం చేసుకోవచ్చు.

ఇక మరోసారి మక్కామసీదు ఘటన విషయానికి వద్దాం! షాహిద్‌బిలాల్ ఎన్‌కౌంటర్ తర్వాత స్తబ్ధంగా మారిన ఘటన 2010లో స్వామి అసిమానంద్, సాధ్వి ప్రాగ్య తదితర ఆర్‌ఎస్‌ఎస్ హిందూ నాయకులు, మిలిటరీ ఉన్నతాధికారుల సమావేశాలకు సంబంధించిన సంభాషణలు బయటపడడంతో మక్కామసీదు పేలుళ్లకు అసలు కారకులెవరో బయట పడింది. నిజానికి ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన చాలా ఉగ్రవాద చర్యలు హిందూ ఉగ్రవాదుల పనే అనే విషయానికి బీజప్రాయమైన సాక్ష్యాలు స్వామి అసిమానంద్ మాటలతో బయట పడ్డాయి. ముస్లింలు ఎక్కువగా ఉన్నందుకు మలెగావ్ (మహారాష్ట్ర) లో, నిజాం చక్రవర్తి హైదరాబాద్‌ను పాకిస్తాన్‌లో కలపాలనుకున్న కారణంగా హైదరాబాద్‌లో, హిందువులు ఎక్కువగా వచ్చే అజ్మీర్‌దర్గా, ముస్లిం విద్యార్థులు చదవే అలిఘర్ యూనివర్శిటీలో, సంఝౌతా ఎక్స్‌ప్రెస్‌లలో బాంబులు పేల్చి ముస్లింలపై తమకున్న పగ తీర్చుకోవాలని పేలుళ్లకు పథకం పన్నారు. అయితే మక్కామసీదు ఘటన తర్వాత వెంటనే స్పందించిన మీడియా, పోలీసులు అసిమానంద్ ప్రకటన తర్వాత నిశ్శబ్ధమైపోయారు. మీడియాలో ఒక్కవార్తగానీ, కథనంగానీ ప్రసారం కాలేదు. ఒకనాడు ముస్లింల పాత్రవిషయంలో ముస్లింలను టెర్రరిస్టులుగా నిర్ధారించి వేసిన మీడియా ఇప్పుడు హిందూ టెర్రరిస్టులను మాత్రం అతివాదులు, నిందితులు అని సున్నిత పదజాలంతో సంబోధిస్తున్నాయి. సమాజంలో పలుకుబడి ఉన్నవారి పాత్ర ఉందని తేలడంతో పాటు వారి నుంచి ఆశించే ప్రయోజనాల మూలంగా వారి పాత్రను మరుగు పరిచేలా ప్రవర్తిస్తున్నది. హుజి బంగ్లాదేశ్ నుంచి నడుస్తున్న సంస్థ కనుక హైదరాబాద్‌లో ఉన్న అనేక బంగ్లా ముస్లిం యువకులను అరెస్టులు చేసి హింసించిన పోలీసులు ఇప్పుడు ఈ విషయమై తప్పు పట్టాల్సిన ఆర్‌ఎస్‌ఎస్, బిజెపిలకు సంబంధించిన కార్యకర్తలను తూతూ మంత్రంగా విచారణ చేస్తూ స్వేచ్ఛగా వదిలేస్తున్నారు. పైగా ఇంకానూ ముస్లిం యువకులనే పదేపదే తీసుకుపోతూ మనోవేదనకు గురి చేస్తున్నారు. కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రి హోదాలో మక్కామసీదు కేసులో అన్యాయంగా అదుపులోకి తీసుకున్న వారందరికీ బేషరతు క్షమాపణలు చెప్తున్నట్లు 2010 డిసెంబర్‌లో ప్రకటించిననూ ఇవాల్టికి కూడా అమాయకులను ఇబ్బందికి గురిచేయడం ఆగలేదు. అంటే ప్రభుత్వాన్ని కూడా కాదని పోలీసు వ్యవస్థ ఎంత ఇష్టారాజ్యంగా పని చేస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. మసీదు పేలుళ్లు జాతి వ్యతిరేక చర్య అయినప్పుడు, అది హిందూ సంస్థలపని అని తెలిశాక నేరాన్ని వాటికి వర్తింపచేసి కేసులు పెట్టాలి కదా. ముస్లింలు చేస్తే (చేశారనడానికి ఒక్క ఆధారమూ లేదుగానీ) దేశద్రోహం అవుతుంది గానీ హిందువులు చేస్తే కాదా? ముస్లింలను పనికట్టుకుని ఇరికిస్తున్నారనడానికి ఇంతకన్న సాక్ష్యం ఏం కావాలి? ప్రభుత్వం తనే అందించిన నష్టపరిహారం 70 లక్షలు నిజంగా పోలీసు కాల్పులలో గాయపడ్డ వారికి, అక్రమ కేసులకు గురైన వారికి న్యాయంగా అందకపోవడం చూస్తే ప్రభుత్వ క్షమాపణలు కూడా పచ్చిబూటకమని తెలుస్తున్నది.

బాబ్రి మసీదు విధ్వంసం జరిగిన నాటినుంచి భారతీయ జనతాపార్టీ, ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పిలు దాన్ని గొప్ప వీరోచిత చర్యగా చెప్తూ సామాన్య ప్రజానీకం మనసులలో హిందూ అతివాద విష భావాలను చొప్పిస్తూ వచ్చాయి. శౌర్యదివస్ పేరిట ఉత్సవాలు జరుపుతూ మత సున్నితత్వాన్ని దెబ్బతీసే విధంగా, రెచ్చగొట్టే ఉపన్యాసాలతో హిందూ ఉగ్రవాద మూకలను తయారు చేస్తున్నాయి. వారికి ఆయుధాలిచ్చి నడివీథులలో విచ్చలవిడిగా మైనారిటీలపై దాడులు చేసేలా ప్రోత్సహిస్తున్నాయి. సెప్టెంబర్ 2011 దాడుల తర్వాత అమెరికా ప్రపంచ వ్యాప్తంగా ఇస్లాం టెర్రరిజంపై దాడి ప్రారంభించడంతో హిందూ టెర్రరిజం మరింత బలాన్ని సంపాదించుకుంది. ఆ బలంతోనే గుజరాత్‌లో ఆరువేల మంది ముస్లింలను చంపించి నరేంద్రమోడీ హిందూ టెర్రరిజాన్ని దేశవ్యాప్తంగా అమలు పరచడానికిగాను జరిపిన ప్రయోగంలో విజయం సాధించాడు. ఆ విజయాన్ని కొనసాగిస్తూ భోపాల్‌లో (2003), జామా మసీదులో

(2006), సంఝౌతా ఎక్స్‌ప్రెస్‌లో, మలెగావ్ (2006, 2008)లో, అజ్మీర్ దర్గాలో (2007), గోవాలో (2009) ఆ ప్రయోగాలనే నిర్వహించారు. రేపు మోడీని ప్రధానిగా చేసి ఆ ప్రయోగాన్ని దేశమంతా అమలు చేయాలని ఆర్ఎస్ఎస్ ఉవ్విళ్లూరుతున్నది. తమ ఈ ప్రయోగాలకు అడ్డువచ్చిన వారిపై కేసులు పెట్టడం, భౌతికంగా దాడులు చేయడం వంటివి చేస్తూ వచ్చారు. మలెగావ్ పేలుళ్లలో హిందూ సంస్థల ప్రమేయం ఉందని పరిశోధించి చెప్పిన హేమంత్ కర్కరే ముంబై దుర్ఘటనలో మరణించడం యాధృచ్ఛికమేమీ కాదని కూడా చాలామంది అనుమానపడుతున్నారు. గుజరాత్ మారణ హోమం మొదలు ప్రతీహింసలోను గ్యాస్ సిలిండర్లు, ఎక్స్‌ప్లోజివ్స్, ఆర్‌డిఎక్స్, తుపాకులు, మారణాయుధాలు సిమ్‌కార్డులు ఎలాంటి లైసెన్స్‌లు లేకున్నా ఉపయోగిస్తున్ననూ ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. కనీసం విచారణ అయినా జరపడం లేదు. పైగా పాతబస్తీలోని అనేక మంది అమాయక ముస్లిం యువకులను టెర్రరిస్టుల ముద్రవేసి చంపివేశాయి. వారి బంధువుల ఆందోళనలను అణిచివేస్తూ వచ్చాయి. శాంతియుత ఉద్యమాలకు కూడా కాల్పులతో జవాబిస్తూ మైనారిటీ సున్నితత్వాన్ని పూర్తిగా దెబ్బతీశాయి. రెండు మతాల మధ్య పూడ్చుకోలేనంత అగాధాన్ని సృష్టించాయి. మీడియాలో కూడా మెజారిటీ సెక్షన్ హిందూ సంస్థలకే అనుకూలంగా ఉండడం విషాదకరం. వేలాది మంది ముస్లింలను, అమాయకులను కేసులలో ఇరికించిన విషయాలెన్నో ఉన్ననూ, వాటిని ధైర్యంగా చెప్పడానికి సిద్ధంగా ఉన్న ప్రజలను కలిసి మీడియా వాటిపై ఇన్వెస్టిగేటివ్ కథనాలను ప్రసారం చేయడానికి సుముఖంగా లేకపోవడం, కనీసం అలాంటి బాధిత ప్రజలకు నష్టపరిహారం విషయంలోనైనా వార్తలు ప్రసారం చేయాలనుకోకపోవడం బాధాకరం.

మీడియా, పోలీసుల, ప్రభుత్వాల ఈ ఉదాసీన వైఖరివల్ల ఇవాళ దేశం మొత్తం మీద హిందూ ఉగ్రవాదం చాలా పెరిగిపోయింది. క్రమంగా వ్యవస్థీకరించబడింది. గుజరాత్ హత్యాకాండను మోడీ బాహాటంగా సమర్ధించుకునేంతగా ఆ వ్యవస్థీకరణ ఎదిగింది. మోడీ ప్రధానిగా రేపు ఆ వ్యవస్థీకరణకు రాజకీయ అధికారం తోడయ్యే ప్రమాదం ముంచుకు రానున్నది. ఉదాసీనతను వదిలి న్యాయంగా విచారణ జరిపి అసలైన దోషులను సమాజానికి చూపితేనే ఆ ప్రమాదం నుంచి బయటపడే అవకాశానికి మార్గం సుగమమవుతుంది.

కన్నాబిరాన్ అన్నట్లుగా ఒక మైనారిటీ సమూహాన్ని టార్గెట్ చేయడం నాగరికతకు, నాగరిక సమాజాలకు చాలా దారుణ ఫలితాలనిస్తుంది. అటువంటి పరిపాలన ప్రజాస్వామ్య పునాదులనే పెకిలించి వేస్తుంది. లౌకిక భావనలు తొలగించబడి ఆ పాలన సంకుచిత ఛాందసవాదం వైపు ప్రయాణం చేస్తుంది. టెర్రరిజాన్ని నియంత్రించడం మాట అటుంచి టెర్రరిస్టు పాలనవైపే అడుగులు పడతాయి. ఇప్పటికే ముస్లింలపై అప్రకటిత అత్యవసర పరిస్థితి కొనసాగుతున్నది. సమాజాలు పాలకులను ప్రశ్నించలేకపోతే ఈ పరిస్థితి మరింత దిగజారి ఒక అతిపెద్ద మైనారిటీ వర్గం ఈ దేశానికి శత్రువులుగా, ఉగ్రవాదులుగా చిత్రించబడే ప్రమాదం ఏర్పడవచ్చు. అది ప్రగతిశీలతకు, జాతి క్షేమానికి మంచిది కాదు. అందుకే సమాజాలు ప్రభుత్వాలను ప్రశ్నించాల్సి ఉంది. సమాజాలు ముస్లింలపై తమకున్న అనుమాన భావనను వదులుకుంటేనే అది సాధ్యం. అందుకుగాను అవి గుర్తించాల్సిన విషయమేమిటంటే - ఉగ్రవాదులలో ఎక్కువమంది ముస్లింలే కావచ్చు, కానీ ముస్లింలంతా ఉగ్రవాదులు కారని.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

## వీక్షణం రచయితలకు సూచనలు

పది సంవత్సరాలలో, నూట నలభై ఎనిమిది సంచికలలో వీక్షణం రెండు వేలకు పైన వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతిలోనూ, సుబోధకతలోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పేజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది.
- చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్‌లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్‌లో గాని, పేజ్‌మేకర్‌లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

# ప్రజా పోరాటాలు పాలకులకు ఒక హెచ్చరిక

*అంతర్జాతీయంగా జరుగుతున్న కార్మిక ఉద్యమాలను నీరుకార్చడానికే ఐఎల్ఒని ముందుకు తెచ్చారనీ, దీని ముసుగు తొలగించడానికి సంఘటిత, అసంఘటిత రంగ కార్మికులు సంఘటితంగా సమస్యలను పరిష్కరించుకోవాలనీ అంటున్నారు* **వి. హనుమంతరావు**

ఇటీవల దేశంలో జరిగిన రెండు రోజుల సమ్మె పాలకులకూ, పెట్టుబడిదారులకూ, కార్పొరేట్లకూ, బహుళజాతి సంస్థలకూ ఒక హెచ్చరిక. భారతదేశం ఈ విషయంలో ఒంటరిగా లేదు. ఈజిప్టుతో ప్రారంభమై, దక్షిణ అమెరికా దేశాల్లో, పెట్టుబడిదారీ దేశాల్లో వీధుల్లోకి వచ్చిన వేల లక్షల మంది కార్మికుల, ప్రజల కోపాగ్నిని పాలకవర్గాలు రుచిచుశాయి. ఎక్కడో ఎందుకు? పెట్టుబడిదారీ విధానానికి పుట్టినిల్లయిన అమెరికాలోనే నిరుద్యోగులు నిరసనలతో ప్రదర్శనలు చేశారు. పెట్టుబడిదారీ విధానానికి చావుగంటలు మోగించడం ప్రారంభించారు.

సమ్మె అంటే చీదరించుకునే, ముఖం ముడుచుకునే వారు ఉదాహరణకు పారిశ్రామికవేత్తలు, చిన్న చిట్టి పారిశ్రామికులు, అధికారులు ఇతరులు కూడా వీధి ప్రదర్శనల్లో పాల్గొనడం గమనించాల్సిన విషయం.

ప్రపంచవ్యాప్తంగా ఈ పరిణామానికి కారణమేమిటి? స్విట్జర్లాండ్ లోని జెనివాలో జూన్ 5 నుండి 20 వరకు జరిగిన 102వ అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఒ) సమావేశానికి హాజరైన డైరెక్టర్ జనరల్ ప్రవేశపెట్టిన నివేదిక విశ్లేషణను మన ముందుంచారు. ఇక్కడ ఒక చిన్న హెచ్చరిక చేయాల్సి ఉంది. ఈ సంస్థ కేవలం కార్మిక ప్రతినిధుల సంస్థ కాదు. పెట్టుబడిదారీ వర్గం, ప్రభుత్వ ప్రతినిధులు కూడా ఉంటారు. అలాగే మన దేశంలో ఉన్న వివిధ పార్టీలకు అనుబంధంగా ఉన్న అఖిల భారత ట్రేడ్ యూనియన్ల ప్రతినిధులు కూడా పాల్గొన్నారు. సమస్త ప్రపంచ కార్మికుల స్థితిగతులను డైరెక్టర్ జనరల్ సమావేశం ముందుంచారు. ఆ నివేదిక ప్రకారం ప్రపంచంలో 20 కోట్ల మంది నిరుద్యోగులుగా ఉన్నారు. మరో 22.2 కోట్ల మంది వచ్చే ఐదేళ్లలో ప్రపంచ లేబర్ మార్కెట్‌లో ప్రవేశిస్తారు. అంటే ఇప్పటి నుంచి 2019 నాటికి 42 కోట్ల మందికి ఉపాధి కల్పించాల్సి ఉంటుంది. ప్రభుత్వాలు ఇంత మందికి ఉపాధి కల్పించాల్సిన విధానాలను రూపొందించాలి. ఆ సూచనలేమీ లేకపోగా, పరిస్థితులు క్షీణించే దిశలో పయనిస్తున్నాయి. పారిశ్రామిక రంగంలో రోబోట్లు ప్రవేశిస్తున్నాయి.

తయారీ రంగంలో రెండు లక్షల రోబోట్లు ఇప్పటికే ప్రవేశించాయి. 2015 నాటికి ఈ సంఖ్య 15 లక్షలకు చేరుకుంటుంది. ఇది కేవలం తయారీ రంగంలో ప్రస్తుతం ఉన్న పరిస్థితి. వచ్చే కాలంలో ఈ రోబోట్లు ఇతర రంగాల్లో కూడా ప్రవేశించవచ్చు. ఇది ప్రస్తుతం సమాజంలో ఉన్న అసమానతలను మరింత ఎక్కువగా పెంచుతుంది. ఒక పక్క నిరుద్యోగుల సంఖ్య పెరిగి బీదరికం, పేదరికం పెరుగుతుండగా, రెండో పక్క మన దేశంలో కేవలం నూరు మంది కుబేరుల ఆస్తుల విలువ 2011లో 12 లక్షల కోట్ల రూపాయలు. అంటే మన దేశ బడ్జెట్ అంతన్నమాట అని డైరెక్టర్ జనరల్ అన్నారు.

డైరెక్టర్ జనరల్ ఇంకో మాట కూడా అన్నారు. ప్రస్తుత కార్మికుల సంపాదన దారిద్ర రేఖకు మించి ఉండడం లేదు. దీనితో పేదల సంఖ్య పెరుగుతుంది. ఒకవేళ పేదరికపు రేఖ దాటినా, వారి ఆదాయం ఆ రేఖ దరిదాపుల్లోనే ఉంటుంది. లేదా ఆ రేఖ దిగువకు జారిపోతున్నారు. సరుకుల ఉత్పత్తిదారుల మధ్య పోటీ పెరిగి, ఆ పోటీలో పైచేయి సాధించడానికి కార్మికుల జీతాల్లో కోత విధిస్తారు.

డైరెక్టర్ జనరల్ ప్రకారం మన దేశంలో, మొత్తం ఉత్పత్తుల నికర విలువలో కార్మికుల జీతాలు ఒక శాతం. 1980వ దశకం చివరి దశలో 20 శాతం ఉండగా, అది 1990వ దశకం అదే కాలంలో 20 శాతానికి, 2010లో 9.4 శాతానికి పడిపోయిందంటున్నారు. గమనించాల్సిన పరిణామం మరొకటి ఉంది. ఒకే పారిశ్రామిక సంస్థలో పర్మనెంటుగా పని చేస్తూ చట్టం ప్రకారం లభించాల్సిన పెన్షన్ వగైరా లభిస్తున్న కార్మికుల సంఖ్య తగ్గుతూ వస్తోంది. ఒకరి కన్నా ఎక్కువ యజమానుల వద్ద పనిచేయాల్సిన పరిస్థితిలో ప్రపంచ కార్మికుల సంఖ్యలో సగం మంది ఉన్నారు. అంటే వారికి ఉపాధి సెక్యూరిటీ గాని, ఆదాయం సెక్యూరిటీ గాని లేదన్న మాట. సామాజిక సెక్యూరిటీ ప్రశ్నేలేదు.

ఈ సమస్యలన్నిటి గురించి ఏకాభిప్రాయం సాధించడం, ఇది వరకు చేసిన నిర్ణయాలను అమలు పరచడం సాధ్యం కావడంలేదని డైరెక్టర్-జనరల్ వాపోయారు. మొదటి ప్రపంచ యుద్ధం అనంతరం సోవియట్ యూనియన్ అవతరించడం, ప్రపంచ కార్మికవర్గం జేజేలు పలకడం గమనించిన సామ్రాజ్యవాద దేశాలు ఈ సంస్థను సృష్టించి కార్మిక వర్గాన్ని వీధి ప్రదర్శనల నుంచి చర్చలు, సమావేశ మందిరాలకు తరలించి కార్మికుల పోరాట పటిమను చల్లార్చడం ధ్యేయంగా ఈ సంస్థ వెనుకనున్న ఆలోచన. ఈ దుష్ట ఆలోచనకు ఒక బంగారు ముసుగు తగిలించారు. శాశ్వత శాంతి నెలకొనాలంటే సామాజిక న్యాయం సాధించాలని, అన్యాయాలను, అక్రమాలను నిలువరించకపోతే అశాంతి ప్రబలుతుందని, అశాంతికి దారి తీస్తుందని, అందుచేత ప్రస్తుత పరిస్థితుల్లో మార్పు అవసరమని ఆ సంస్థ నియామావళి ముందుమాటలో రాసుకున్నారు. ఇది సాధించాలంటే పని గంటలు నిర్దేశించాలని, నిరుద్యోగాన్ని నివారించుకోవాలని, జీవించడానికి చాలినంత జీతం ఇవ్వాలని, వారి ఆరోగ్యం కాపాడాలని ఇలా ఎన్నో లక్ష్యాలు పేర్కొన్నారు. కాని రాతలు వేరని, ఆచరణ మనకు తెలియచేస్తుంది. ప్రపంచ దేశాలన్ని

ఈ నియమావళి మీద సంతకాలు చేశాయి. ప్రతి సంవత్సరం జరిపే ప్రపంచ సమావేశాలల్లో తీర్మానాలు చేశారు. కాని సమావేశ ద్వారం దగ్గరనే తీర్మానాల కాగితాలు చెత్తబుట్టలోకి వెళ్లిపోయాయి.

యాజమాన్యాలు, ప్రభుత్వాలు కుమ్మక్కై కార్మికుల హక్కులను కాలరాయడం కొనసాగుతూనేఉంది. హక్కుల అమలు మాట అటుంచి కార్మిక యూనియన్ల ఏర్పాటును కూడా నిరోధిస్తున్నారు. కర్మాగారాల్లో కాలకృత్యాలు తీర్చుకోవడానికి కూడా సమయం ఇవ్వడం లేదు. అన్ని సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో పనిచేయాల్సిన గంటలకు పరిమితే వేరు. మరికొన్ని కర్మాగారాల్లో యూనియన్లను అనుమతించారు. వారి ప్రతినిధులతో చర్చలు జరపడానికే నిరాకరిస్తున్నారు. ప్రభుత్వ అండ యాజమాన్యాలకు కొండంత ఉంది.

ఈ అంతర్జాతీయ సంస్థ సోది అంత నాకెందుకు అని కొంతమంది అమాయాక కార్మికులు అనుకోవచ్చు. ఫ్యాక్టరీ, నా జీతం, నా కుటుంబం ఇదే నా ప్రపంచం అని అనుకోవడమంటే ఊరంతా ఒక దారి అయితే, ఉలిపి కట్టెదొకదారి అన్నట్టుంది. శరీరంలో కాళ్లు, చేతులు, కళ్లు, చెవులు, ముక్కు, నోరు అన్ని కలిస్తేనే మానవుడవుతాడు. ఈ అంగాలన్ని వేటికవే అని అనుకుంటే శరీరమే ఉండదు.

కార్మికుడు కూడా తానొక్కడిగా తన కోరికను సాధించుకోలేడు. కార్మికుడు గుర్తుంచుకోవాల్సింది నూటికి 93 శాతం మంది శ్రామికులు అసంఘటిత రంగంలోనే ఉన్నారు. ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా 93 శాతం మందిని బయట ఉంచి ఏమి సాధించగలవు ? ఇటీవల జరిగిన అఖిల భారత సమ్మె యూనియన్లు సంయుక్తంగా సమ్మెలో పాల్గొనడం అభినందించదగినదే. కాని అది ఒక చిన్న అడుగు ముందుకు వేయడం మాత్రమే. ఐకమత్యమే బలం అన్న నానుడి అందరూ అంగీకరించితే కాని 93 శాతం మంది కార్మికులు సంఘటిత యూనియన్లలో లేరు. అయితే గుడ్డిలో మెల్లలాగ వివిధ చేతివృత్తుల వారు మన రాష్ట్రంలో రాష్ట్ర మహాసభలు జరుపుకోవడం శుభసూచకం. సభలు జరుపుకొని, ఉపన్యాసాలు విని లేచివెళ్లిపోవడం కాదు.

ఇది మొదటి అడుగు మాత్రమే. పాలక పార్టీలు, యాజమాన్యాలు ఎప్పుడూ ఎల్లవేళలా (వాళ్లలో వాళ్లు తన్నుక చచ్చినా) కార్మికులు, శ్రమజీవులు సంఘటితం కావడం ఇష్టం ఉండదు. కార్మికులను ప్రలోభ పెట్టి పబ్బం గడుపుకోవడానికే ప్రయత్నిస్తారు. అసంఘటిత రంగంలో మహిళలు గణనీయమైన సంఖ్యలో ఉన్నారు. గ్రామాల్లో వ్యవసాయ రంగంలో మహిళా కార్మికులు ఎక్కువ సంఖ్యలో చేరుతుండడం గమనార్హం. కార్మికులు వారి వారి యూనియన్లను బలోపేతం చేసుకొంటూనే అసంఘటిత రంగంలో ఉన్న వారందరినీ సంఘటిత పరచడం ప్రస్తుత కార్మిక యూనియన్ల నాయకుల ప్రధాన కర్తవ్యంగా భావించాలి. ఆ వైపుగా ముందడగు వేయాలి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

పంచ్ కాలమ్

# పరుగులు తీస్తున్న ధరలు

ధరలు పెరగడం లేదు. పరుగులు తీస్తున్నాయి. భారతదేశ చరిత్ర పుటలు తిరిగేస్తే ధరలు యుపిఎ ప్రభుత్వం లేదా అంతకు ముందు బిజెపి ప్రభుత్వమో పాలించినప్పటి నుంచే ధరలు పెరగడం ప్రారంభింలేదు 1960 నుంచి అందుబాటులో ఉన్న అధికారిక గణాంకాలు చూస్తే చాలు గుండెలవిసి పోతాయి. ధరల పెరుగుదలను వినిమయ ధరల సూచితో కొలిచి ప్రతి నెలా విడుదల చేస్తారు. ప్రభుత్వాలే విడుదల చేసిన ఈ గణాంకాలను చూడండి.

| సంవత్సరం | ధరల పెరుగుదల సూచి (1960లో 100 కాగా) | సూచి గణాంకాల పెరుగుదల (పాయింట్లు) |
|---|---|---|
| 1960 | 100 | 93(10 సం.ల్లో) |
| 1970 | 183 | 207 |
| 1980 | 390 | 528 |
| 1990 | 918 | 1256 |
| 2000 | 2174 | 1838 |
| నవంబర్ 2009 | | 3835 |
| నవంబర్ 2010 | | 4131 |
| నవంబర్ 2011 | | 4542 |
| నవంబర్ 2012 | | 4976 |
| 1960-1990 మధ్య పెరుగుదల | | 828 |
| నవంబర్ 2011-12 | | 845 |

ధరలు పెరిగిన కొద్ది సామాన్యుని జీవితం, కార్పొరేట్ రంగం ముందకు దూసుకపోతోంది. ప్రభుత్వ రంగానికి ఇస్తున్న సబ్సిడీలు (ప్రోత్సాహకాలనే ముద్దు పేరు) సగటున ప్రతి రోజు రు. 700లు. అంటే గంటకు రు. 3 కోట్లు, అది కూడా బడ్జెట్ ద్వారా వారి ఒళ్లోపోస్తున్నారు. ఫలితం? 1995 - 2010 మధ్యకాలంలో 256929 రైతు ఆత్మహత్యలు ! మీ వోటు బిజెపికా, కాంగ్రెస్‌కా? ఆలోచించుకోండి. వీ

ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు మీద మీరు ఎం.ఒ. ఎందుకు పంపుతున్నారో రాయండి. - సం.

# ఇది కథ కాదు

**పేదరికం గురించి చదవడం, చర్చించడం కాకుండా, నిజంగా అనుభవిస్తే ఎలా ఉంటుందో అని ప్రయోగం చేసిన ఇద్దరు సంపన్న విద్యావంతుల కథనాన్ని వివరిస్తున్నారు డా. నళిని**

ఆకలి, పేదరికం, ఆహార బిల్లు, దారిద్ర్య రేఖ, పోషకాహార లేమి, ఆహార పంపిణీ విధానం – ఇవన్నీ నేడు చర్చనీయాంశాలు ఉంటున్నాయి. యువత కూడా ఈ సమస్యల మీద ఆలోచిస్తున్నారనడానికి నిదర్శనంగా ఈ మధ్య మాకు 'అడాలసెన్స్ ఇండియా' నుంచి ఒక గ్రూపు మెయిల్ వచ్చింది. దాని సారాంశమే ఇది.

పోయిన సంవత్సరం చివరలో ఇద్దరు యువకులు నెల రోజుల పాటు సగటు భారతీయుడి ఆదాయంతో బతికి చూద్దామనుకున్నారు. వారిలో ఒకరు తుషార్. ఇతను హర్యానా పోలీస్ అధికారి కొడుకు. పెన్‌సిల్వేనియా విశ్వవిద్యాలయంలో చదివి, అమెరికా, సింగపూర్‌లలో మూడేళ్లపాటు ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకర్‌గా పనిచేశాడు. రెండవతను మాట్. తన తల్లిదండ్రులతో కలిసి యుక్త వయసులోనే అమెరికాకి వలస వెళ్లాడు. ఎంఐటిలో చదివాడు. ఇద్దరూ వేరు వేరుగా ఇండియాకి వచ్చి, బెంగళూరులో యుఐడి ప్రాజెక్ట్‌లో చేరారు. వాళ్లు ఒకే ఇంట్లో అద్దెకి ఉంటూ, చాలా మంచి స్నేహితులయ్యారు.

వారికి హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. తమ దేశానికి ఏదో విధంగా ఉపయోగపడదామనే ఉద్దేశంతో ఇక్కడికి వచ్చారు. కాని వారికి భారతదేశం గురించి తెలిసింది చాలా తక్కువ. అందుకే 'ఒక సగటు భారతీయుడిని అర్థం చేసుకోవడం కోసం సగటు ఆదాయంతో బతికి చూద్దాం' అన్నాడు తుషార్. మాట్‌కి కూడా ఈ ఆలోచన నచ్చింది. తమని శాశ్వతంగా, పూర్తిగా మార్చివేయగల ప్రయాణాన్ని వాళ్లు అలా ఆరంభించారు.

మరి సగటు భారతీయుడి ఆదాయం ఎంత? భారతీయుల తలసరి ఆదాయం నెలకు రు. 4,500 అని తేలింది. అంటే రోజుకి రు. 150. ప్రపంచ వ్యాప్తంగా అందరూ అద్దె కోసం తమ ఆదాయంలో మూడవ వంతు వెచ్చిస్తారు. అంటే, అద్దెని మినహాయిస్తే ఇక మిగిలింది రోజుకి వంద రూపాయలు. ప్రభుత్వ లెక్కల ప్రకారం వారు పేదవారు కారు. సగటు భారతీయులు మాత్రమే. భారతదేశంలో 75 శాతం మంది ఈ ఆదాయం కంటే తక్కువతోనే బతుకుతున్నారు.

ఈ యువకులిద్దరూ తమ ప్రయోగం కోసం ముందుగా తమ పని మనిషి ఇంట్లోకి మారారు. ఆమె విస్మయంగా చూసింది. వారికి రోజులో ఎక్కువ భాగం ప్రణాళికలు వేసుకోవడానికి, ఆహార సేకరణ ప్రయత్నాలకి సరిపోతుంది. బయట తినే ప్రసక్తి లేదు. దాబాలు కూడా ఖరీదైనవే. పాలు, పెరుగు తమకి అదనపు ఖర్చు కాబట్టి వాటిని తక్కువే వాడేవారు. మాంసం, బ్రెడ్ అందని ద్రాక్షలే. నెయ్యి, వెన్నల వాసనే లేదు. కొద్దిపాటి నూనెతో సరిపెట్టుకోవాలి. ఇద్దరూ బాగా వంట చేయగలరు. తిండి పుష్టి కలవారే. అన్నిటి కంటే సోయా మీల్‌మేకర్ ముక్కలు వాళ్లకి నచ్చాయి. అవి అందుబాటు ధరలో ఉండడమే కాక, వీటిలో మాంస కృత్తులు పుష్కలంగా ఉంటాయి. అందుకని వాటితో రకరకాల వంటలు చేయసాగారు. పార్లే–జి బిస్కట్లు కూడా చౌకే. 25 పైసలతో 27 కేలరీలు. అరటి పండు ముక్కల్ని వేయించి బిస్కట్‌తో కలిపి తినే తినుబండారాన్ని వాళ్లు కనిపెట్టారు. ప్రతిరోజు అది వారికి పసందైన విందు.

### నిబంధనల జీవితం

రోజుకి వంద రూపాయలతో బతకడం వల్ల వారి జీవితం కుదించుకు పోయింది. రోజుకి ఐదు కిలోమీటర్ల కంటే ఎక్కువ దూరం బస్సులో వెళ్లలేని పరిస్థితి వారిది. అందుకే అంతకు మించిన దూరాలకు నడకే గతి. కరెంటు రోజుకి ఐదారు గంటలే వాడాలి. లైట్లు, ఫ్యాన్లు పొదుపుగా వాడాలి. అందులోనే సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు ఛార్జి చేసుకోవాలి. లైఫ్‌బాయ్ సబ్బుని సగం సగం వాడుకోవాలి. బయట దుకాణాల ముందు నుంచి నడుస్తూ, తాము కొనలేని వస్తువుల్ని బేరీజు వేసేవారు. సినిమా చూడడానికి పైసలు చాలవు. జబ్బు పడితే ప్రణాళిక తారుమారే. అందుకే జబ్బు పడకపోతే చాలనుకునేవారు.

ఈలోపు, ఇంకా పెద్ద సవాల్ మిగిలే ఉందని వారికి తోచింది. భారత ప్రణాళికా సంఘం లెక్కల ప్రకారం పట్టణాల్లో దారిద్ర్య రేఖకి గీటురాయి రోజుకి 32 రూపాయలు (పల్లెల్లో మనిషికి రోజు 26 రూపాయలు). ఈ లెక్కలు చాలా వివాదాస్పదమయ్యాయి. వీటి మీద ఎంతో చర్చ జరిగింది. అందుకని మిత్రులిద్దరూ దారిద్ర్య రేఖ దిగువనున్న ఆదాయంతో బతికి చూద్దామని సంకల్పించారు.

### భయంకరమైన అనుభవం

తమ అనుభవం కోసం వారు మాట్ తాతగారి గ్రామానికి వెళ్లారు. కేరళలో కరుకాచల్‌లో రోజుకి 26 రూపాయలతో బతకసాగారు. ఉప్పుడు బియ్యం తింటూ, ఒక దుంప, లేదా అరటి పండు, టీ డికాషన్‌తో సరిపెట్టుకున్నారు. తాము ఎంచుకున్న 'పేదరికం'లో 18 రూపాయలతో సమతుల ఆహారం తీసుకోవడం అసాధ్యమని తెలిసింది. రోజంతా తిండి గురించి ఆలోచించడంతోనే సరిపోయేది. ఎంత దూరమైనా నడవక తప్పదు. బట్టల సబ్బు కూడా పొదుపే. సెల్‌ఫోన్లు, ఇంటర్‌నెట్ వాడకం వారి ఆదాయానికి సరిపోవు. జబ్బు పడితే మాత్రం సర్వనాశనమే. ప్రణాళికంతా తలకిందులైపోతుంది. ఈ 26 సంవత్సరాల యువకులకి తాము ఎంచుకున్న ఈ 'అధికారిక పేదరికం' ఒక పీడకలలా గడిచింది.

దీపావళితో తమ ప్రయోగం ముగిసింది. అప్పుడు వాళ్లు తమ స్నేహితులకి ఇలా రాశారు – 'మేము మా 'సామాన్య' జీవితానికి తిరిగి వచ్చినందుకు సంతోషంగా ఉన్నామని చెప్పగలిగితే బాగానే ఉండేది. మా ప్రయోగ కాలమంతా మేము కోరుకున్న విందు భోజనం రెండు రోజుల క్రితం మాకు అందినందుకు హాయిగా ఉందని చెప్పగలిగితే బాగానే ఉండేది. అది చాలా పసందైన విందు. మా ఆత్మీయులు తమ ప్రేమనంతా నింపి పెట్టిన విందు. కానీ ప్రతి ముద్దలో మాకు మన దేశంలోని నలభై కోట్ల ప్రజలు కనిపించారు. అలాంటి విందు ఆ ప్రజలకి ఇప్పటికీ ఎండమావే. మేము మా సుఖమయ జీవితంలోకి మారిపోగలం గాని వారు తమ జీవిక అనే యుద్ధ రంగంలో అలానే మిగిలిపోయారు. వారికి ఉన్నవి కష్టతరమైన ఎంపికలు, తీరని కోరికలు, తీవ్రమైన అవరోధాలు. వారికి స్వాతంత్ర్యం అతి తక్కువ. ఆకలి మాత్రం బహు హెచ్చు..'.

**ఎన్నో ప్రశ్నలు**

'ఇప్పుడు మమ్మల్ని దుబారా ఖర్చు బాధిస్తుంది. ఆ షాంపూ గాని, నూనె గాని, కొలోన్ గాని నిజంగా అవసరమా? వారాంతపు సెలవుల్లో ఆ ఖరీదైన రెస్టారెంట్‌లో విందు భోజనం అవసరమా? ఇంకా వివరంగా చూస్తే, మన చుట్టూ ఉన్న సంపదకి మనం అర్హులమా? సుఖమయ జీవితం అనుభవించగల ఇంట్లో పుట్టడం మన అదృష్టమా? అత్యవసరం కాని వస్తువుల్ని సైతం అత్యవసరంగా భావిస్తూ వాటికి మనం అర్హులమెలా అయ్యాం? తమ అభివృద్ధికి అవసరమైన విద్యకి, తమని పరిరక్షించగల వైద్యానికి ఆ నిరుపేదలు అనర్హులెలా అయ్యారు?'

'ఈ ప్రశ్నలకి మాకు సమాధానం తెలీదు. కానీ, తప్పు చేస్తున్నామనే భావం మాలో బలంగా ఉంది. ఎంతో కష్టతరమైన జీవితాన్ని గడుపుతూ కూడా దారిద్ర్యానికి అటువైపు ఉన్నవారు మమ్మల్ని ప్రేమ, ఆప్యాయతల్లో ముంచెత్తి, మాపై ఎంతో దయ చూపి, మా అపరాధ భావాన్ని పెంచారు. మేము వాళ్లని జీవితాంతం అపరిచితులుగానే చూసి ఉండవచ్చు. కాని వాళ్లు మమ్మల్ని అలా ఎన్నడూ చూడలేదు..'

ఈ ఇద్దరు స్నేహితులు పేదరికంతో జరిగిన ఈ చిన్న పరిచయంతో ఏమి నేర్చుకున్నారు? ఆకలి వల్ల కోపం పెరుగుతుందని తెలుసుకున్నారు. అందరికీ సరిపడ పోషకాహారం అందించే ఆహార చట్టం అత్యవసరం అని అర్థమయింది. చిన్న చిన్న కలలు కూడా పేదరికంలో కల్లలుగానే మిగిలిపోతాయని తెలిసింది. అన్నిటినీ మించి ప్రజాస్వామ్యంలో సహానుభూతి అవసరమని మాట్ భావించాడు.

గ్రామాల్లో 80 శాతం మంది, పట్టణాల్లో 64 శాతం మంది ఇప్పటికీ పేదరికంలో మగ్గుతున్నారు. సమతులాహారం, విద్య, వైద్యం వారికి గగనకుసుమాలే. గంజి నీళ్లతో, అంబలితో, కారంతో కాలం గడుపుతున్నారు. మాంసకృత్తులు, విటమిన్లు, ఖనిజాలు లేని ఆహారంతో కనిపించని ఆకలికి (హిడెన్ హంగర్) బలైపోతున్నారు. పేద, ధనిక వర్గాల మధ్య వ్యత్యాసం తీవ్రతరమవుతోంది. నిజానికి దారిద్ర్య రేఖని నిర్ణయించడానికి తలసరి ఆదాయమే ప్రమాణంగా తీసుకుంటున్నారు గాని, ఆనాటి నిత్యావసర వస్తువుల ధరలని పరిగణించడం లేదు. అలా చూస్తే గనక దారిద్ర్య రేఖని 'పస్తుల రేఖ' అని పిలవక తప్పదు. పడిపోతున్న రూపాయి విలువ, ఆకాశాన్నంటుతున్న నిత్యావసర వస్తువుల ధరలు, తరిగిపోతున్న కొనుగోలు శక్తి, నిరుద్యోగం, అవినీతి కలగలిసి సామాన్యుడి జీవన ప్రమాణాన్ని దెబ్బతీస్తున్నాయి. వ్యవసాయ రంగం, పారిశ్రామిక రంగం నిరాశాజనకంగా ఉంటున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో పైన చూసిన యువకుల్లాంటి వాళ్లు దేశానికి ఎంతో అవసరం. పక్కవాడి గురించి ఆలోచించగల చైతన్యం యువతలో పెరిగితే నేటి వ్యవస్థని ప్రశ్నిస్తూ, పరిష్కారాలు వెతికే దిశగా దేశం పయనించడం ఖాయం. లేకుంటే ఎడ్వర్డో గేలియానో చెప్పిన 'అనామకులే' (నోబడీస్) మిగులుతారు.

'ఏదో ఒక రోజు తమని అదృష్టమనే వర్షం ముంచెత్తి తమ పేదరికాన్ని పారదోలుతుందని అనామకులు కలలు కంటారు. కానీ అదృష్టం అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ వర్షించదు. చిరుజల్లులా కూడా పలకరించదు. ఎంత పిలిచినా, మొక్కులు మొక్కినా అదృష్టం ఇటు రాదు. అనామకులు (నోబడీస్) అనామకుల పిల్లలు. శూన్యానికి యజమానులు. అనామకులు, పేరు లేని వారు, ఉనికి లేని వారు. బెదిరిన కుందేళ్లలా పరుగెడతారు. అన్ని వైపుల నుంచి అణచివేతకి, నిర్బంధానికి గురై జీవిస్తూనే మరణిస్తారు. వాళ్లు ఉనికిలో లేరు, కాని ఉండగలరు. వాళ్లకి భాషల్లేవు, మాండలికాలు ఉన్నాయి. వాళ్లకి మతం లేదు, మూఢ నమ్మకాలున్నాయి. వాళ్లు కళని సృష్టించరు, హస్త కళలు వాళ్లవే. వాళ్లకి సంస్కృతి లేదు, జానపదం ఉంది. వాళ్లు మనుషులు కారు, మానవ వనరులు. వాళ్లకి ముఖాలు లేవు, పనిచేసే చేతులున్నాయి. వాళ్లకి పేర్లు లేవు, సంఖ్యలతో పిలవాలి. వాళ్లు చరిత్రకెక్కరు, స్థానిక వార్తా పత్రికల నేర చిట్టాల్లో ఉంటారు. ఈ అనామకులు తమని మట్టు పెట్టే తూటా పాటి చేయరు!' (ఎడ్వర్డో గేలియానో)

అలాంటి అనామకుల గురించి నిలిచి ఆలోచించే స్ఫూర్తిని కలిగించిన తుషార్, మాట్ లాంటి యువకులు ఇంకా ఎన్నో నిజాలని బయట పెట్టవలసి ఉంది. ఇంకా ఎన్నో అంతరాలను ఛేదించవలసి ఉంది. పేదరికాన్ని నిర్మూలించే సమసమాజం వైపు అడుగులు వేయవలసి ఉంది.

('అడాలసెన్స్ ఇండియా' గ్రూప్ మెయిల్ ఆధారంగా)

*(రచయిత శిశు వైద్యులు,*

*ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక నాయకురాలు)*

వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి.*

*– సం.*

# కెన్యాలో విచక్షణారహిత హింస

**కెన్యాలోని రాజకీయార్థిక అసమానతల వల్ల ముందుకు వస్తున్న హింసా చర్యలను అమెరికా ప్రోత్సహిస్తోందనీ, మరోవైపు ఆ దేశంపై దాడిచేసి అక్కడి మార్కెట్‌ను కొల్లగొడుతోందనీ అంటున్నారు ఎం.కె.కుమార్**

కెన్యా రాజధాని నైరోబీలోని వెస్ట్‌గేట్ వాణిజ్య సముదాయంలో సెప్టెంబర్ 21న జరిగిన ఉగ్రవాద దాడుల్లో 68 మంది మరణించగా, 200 మంది గాయపడ్డారు. నైరోబీ ప్రాంతంలో భారతసంతతి వారు ఎక్కువుగా నివసిస్తుంటారు. మృతుల్లో ఇద్దరు భారతీయులని, మరో 25 మంది దాకా గాయపడ్డారని భారత రాయబార సంస్థ ప్రకటించింది. స్థానిక రేడియో విభాగంవారు చిన్నపిల్లలకు వెస్ట్‌గేట్ వాణిజ్య సముదాయంలో పలు పోటీలు నిర్వహించడంవల్ల పిల్లలు, మహిళలు, స్థానిక ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. 15 మంది సాయుధులైన దుండగులు విచక్షణారహితంగా కాల్పులు జరుపడంతో ఈ మారణకాండ సంభవించింది. సంఘటనకు పూర్తి బాధ్యత వహిస్తున్నామని సోమాలియాకు చెందిన అల్‌ఖైదా అనుబంధ ఇస్లామిక్ ఉగ్రవాద సంస్థ అల్ షబాబ్ ట్విట్టర్‌లో వెల్లడించింది. ఉగ్రవాదం కూడా అక్కడి సామాజిక, ఆర్థిక అసమానతల నుండే పుడుతుంది. వాటిని పరిష్కరించడంలో పాలకవర్గం చిత్తశుద్ధితో ప్రయత్నించకపోగా, అణచివేతను, హింసను ప్రయోగిస్తోంది. దీనివల్ల ఉగ్రవాదం తీవ్రమవుతుందే కాని తగ్గదని చారిత్రకంగా రుజువైంది. సామ్రాజ్యవాదం తన ప్రయోజనాల రీత్యా చాలా దేశాలలో ఉగ్రవాదాన్ని పెంచిపోషిస్తోంది. వరుసగా నాలుగు రోజుల పాటు జరిగిన ఈ మారణకాండలో కెన్యా అధ్యక్షుడు కిన్యెట్టా రక్త సంబంధీకులు కూడా ఉన్నారు. ఉగ్రవాదులు ఉపయోగించిన రాకెట్ల లాంచర్లు, గ్రెనేడ్ల వల్ల నాలుగు అంతస్తుల వెస్ట్ గేట్ మాల్‌లో మూడు అంతస్తులు నేలమట్టమయ్యాయి. 63 మంది జాడ ఇప్పటికీ తెలియలేదు. చనిపోయిన వారిలో భారతీయులతో పాటు అమెరికా, బ్రిటిష్ పౌరులు ఉన్నారని కెన్యా ప్రభుత్వం ప్రకటించింది. అమెరికా ఇంటర్‌పోల్ కెన్యా పేలుళ్లు అల్ షబాబ్‌లో ప్రముఖ నాయకురాలైన షెరాఫియా నాయకత్వంలో జరిగిందని, ఆమె ప్రత్యక్షంగా ఈ దాడుల్లో పాల్గొన్నదని రెడ్ నోటీస్ జారీ చేసింది. 2011లో ఈమె అక్రమ ఆయుధాలను, పేలుడు పదార్థాలను కలిగి ఉందనే ఆరోపణతో కెన్యా ప్రభుత్వం ఆమెపై అరెస్టు వారెంట్ జారీ చేసింది.

2011లో సోమాలియాపై కెన్యా జరిపిన దురాక్రమణకు ప్రతిగానే కెన్యాలో ఈ మారణకాండకు పాల్పడ్డామని అల్ షబాబ్ ఉగ్రవాద సంస్థ ప్రకటించింది. తమను తాము వారు సోమాలియా దేశభక్తులుగా ప్రకటించుకున్నారు. సోమాలియా కేంద్రంగా పనిచేస్తున్న అల్ షబాబ్ ముస్లిం తీవ్రవాద సంస్థ అని, దీని మాతృసంస్థ అల్‌ఖైదా అని, దీనికి లిబియా ఉగ్రవాద సంస్థ (ఎల్‌ఐఎఫ్‌జి)తోను సంబంధాలున్నాయని కెన్యా మీడియా పేర్కొంది. ఈ సంస్థలకు అమెరికా, ఫ్రాన్స్, బ్రిటన్‌ల నుండి నిధులు, ఆయుధాలు సమకూరుతున్నాయి. అలాగే సిరియాలో సాగుతున్న కిరాయి తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న అల్‌ఖైదాకు కూడా ఇవే దేశాలు తమ సహాయ సహకారాలను అందిస్తున్నాయి. నిజానికి 2011లో సోమాలియాపై కెన్యా జరిపిన ఏకపక్షదాడికి అమెరికా, ఫ్రాన్స్ దేశాలు సంపూర్ణ మద్దతివ్వడమే గాకుండా ఆయుధాలు, మందుగుండు సామాగ్రిని సమకూర్చాయి. సోమాలియాలోని అల్‌షబాబ్ ఉగ్రవాద స్థావరాలపైనే తాము దాడిచేశామని, సాధారణ ప్రజలు ఎవ్వరూ చనిపోలేదని కెన్యా ప్రభుత్వం పేర్కొంది. సోమాలియాపై దాడి సందర్భంలో అమెరికా, ఫ్రాన్స్‌లు తమ మిలిటరీ సలహాదారులని పంపడం పట్ల కెన్యా అధ్యక్షుడు, ప్రధాని పట్ల విభేదాలు తలెత్తడాన్ని అప్పట్లో పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి.

ప్రపంచంలోని మార్కెట్‌ను సామ్రాజ్యవాద దేశాలు పంచుకున్నాయి. అందులో భాగంగానే అమెరికా అనుకూల దేశాలు చైనా-రష్యా కూటమిని ఎదుర్కోవడానికి అనేక పేద, వర్ధమాన దేశాలలో యుద్ధాలు చేస్తున్నాయి. మార్కెట్ ప్రయోజనాల కోసం అమెరికా చేసే ఈ యుద్ధాలకు అల్‌ఖైదా తనవంతు మద్దతును ఆయా దేశాలలో అందిస్తోంది. అల్‌ఖైదా రూపంలో పశ్చిమదేశాలకు, అమెరికాకు వ్యతిరేకంగా పోరాడుతున్నట్టు కనపడుతున్నప్పటికీ సారంలో అమెరికా మార్కెట్ ప్రయోజనాలకు వ్యూహాత్మకంగా ఉపయోగపడుతుంది. చైనా-రష్యా వారు ఏయే దేశాలలో పెట్టుబడులను ఎక్కువగా పెడుతున్నారో అక్కడ అల్‌ఖైదా, తన అనుబంధ సంస్థలతో ఉగ్రవాద చర్యలను చేపట్టి, హింసాకాండకు పాల్పడుతోంది. వెంటనే అమెరికా ఆ దేశాలు ఉగ్రవాదులకు స్థావరాలుగా మారాయని ఆయాదేశాలపై కయ్యానికి కాలుదువ్వుతుంది. గత మూడు దశాబ్దాలుగా అమెరికా ఈ విధానాన్నే అవలంబిస్తోంది. ఆఫ్రికాలో చైనా పెట్టుబడులు ఎక్కువగా విస్తరిస్తున్నాయి. మాలి దేశంలో గిరిజన తెగలు చేస్తున్న పోరాటాలను అణచడానికి, చైనా ప్రాబల్యాన్ని నివారించడానికి ఫ్రాన్స్ మాలిపై దాడిచేసింది. ఈ తరహా వ్యూహాన్నే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు సోమాలియాపై జరపాలని నిర్ణయించుకున్నాయి. అందులో భాగంగానే కెన్యాలోని వెస్ట్ గేట్ మాల్‌లో అల్‌షబాబ్ మారణకాండను సృష్టించింది. ఈ సంఘటనకు సోమాలియానే బాధ్యత వహించాలని, ఈ తరహా దాడులను ఆపడానికి సోమాలియాపై సైనిక చర్యలను కూడా తీసుకోవాలని అమెరికా మీడియా అప్పుడే కథనాలను ప్రసారం చేస్తోంది. సోమాలియాపై 2006, 2011లోను అమెరికా దాడులు చేసింది. ఆ దాడుల్లో వందలాది సోమాలియా సాధారణ ప్రజలు చనిపోయారు.

కెన్యాలో జరిగిన మారణకాండకు అల్‌షబాబ్ కార్యకర్తలు బాధ్యులైనప్పటికీ, వారి దాడులను అడ్డుపెట్టుకుని సామ్రాజ్యవాద దేశాలు వ్యూహాత్మక ప్రయోజనాలను నెరవేర్చుకోబోతున్నాయి. కెన్యాలో జరిగిన సంఘటనను అమెరికా అనుకూల దేశాలు తీవ్రంగా ఖండించాయి.

అంతర్యుద్ధాలను రేకెత్తించడంలో సిద్ధహస్తురాలైన అమెరికా కెన్యా సంఘటనను ఆధారం చేసుకుని అప్పుడే పావులు కదపడం ప్రారంభించింది. ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్ యుద్ధాలకు ట్రిలియన్ డాలర్లను కుమ్మరించిన ద్రవ్య సంస్థలు వాల్‌స్ట్రీట్ (అమెరికా) దసిటీ (లండన్), ఫ్రాంక్‌ఫర్ట్ (జర్మనీ) సోమాలియాపై మరో యుద్ధానికి ఫైనాన్స్ అందించేందుకు సిద్ధంగానే ఉన్నాయి. ద్రవ్య సంస్థలు లాభాల కోసం యుద్ధాలను అవే తయారుచేయడం సామ్రాజ్యవాద యుగంలోనే చెల్లింది.

అల్ షబాబ్‌లో ఎక్కువగా కెన్యా ప్రాంత వాసులు, ముఖ్యంగా ఈ మధ్యనే ఇస్లాం మతస్తులుగా మారినవారున్నారు. ఈ ఉగ్రవాద సంస్థలో అల్‌షబాబ్‌లోని 10 శాతం వరకు కెన్యా ప్రజలున్నారు. వీరు కెన్యా ముజాహిదీన్లుగా పిలువబడుతున్నారు. పేదరికం, నిరుద్యోగం లాంటి ఆర్థిక సమస్యల వల్ల యువత ఈ ఉగ్రవాద సంస్థలలో ఎక్కువగా చేరుతున్నారు. ముఖ్యంగా ముస్లిం ప్రాంతమైన కెన్యా సముద్రతీర ప్రాంతం, టాంజానియాలోని మామ్‌బాసా, జాంజీబార్ ప్రజలు ఎక్కువగా ఉగ్రవాద సంస్థలలో చేరుతున్నట్లు కెన్యా పోలీసులు పేర్కొంటున్నారు. కెన్యాలో ఉగ్రవాద దాడులు గత రెండు దశాబ్దాలుగా జరుగుతూనే ఉన్నాయి. 1975లో నైరోబీలో జరిగిన బాంబింగ్, 1980లో నార్‌ఫోక్ హోటల్‌పై దాడి, 1998లో నైరోబీలోని అమెరికా రాయబార కార్యాలయంపై దాడి, 2002లో ఇజ్రాయిల్ విమానంపై దాడులు ఉగ్రవాద సంస్థలు చేసినవే. అయితే ఈ దాడులన్నీ కూడా కెన్యా, అమెరికాకు, ఇజ్రాయెల్‌కు అనుకూలంగా వ్యవహరిస్తుండడం వల్లే చేశామని ఉగ్రవాద సంస్థలు పేర్కొన్నాయి.

అక్టోబర్ 2011లో సోమాలియా ఆర్మీ, కెన్యా మిలటరీ సంయుక్తంగా దక్షిణ సోమాలియాలోని ఆల్‌షబాబ్ సంస్థ కార్యకర్తలు ఎక్కువగా నివసించే ప్రాంతాలలో దాడులు జరిపాయి. అప్పటి నుండి కెన్యాలో బాంబు, గ్రెనేడ్ దాడులు ఎక్కువయ్యాయి. 2012 నుండి ఇప్పటి వరకు కెన్యాలో 18 బాంబు దాడులు జరిగాయి. సుమారు 200 మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఈ దాడులు ఎక్కువగా నైరోబీ, మాంబసా, దడాబ్, వజీర్, గరిస్సా ప్రాంతాలలో జరిగాయి. ఈ దాడులు ఎక్కువగా కెన్యా పోలీసు స్టేషన్లను, చర్చిలను, బార్లను, నైట్‌క్లబ్‌లను కేంద్రంగా చేసుకుని జరిగినవే. ఉగ్రవాదాన్ని కట్టడిచేయాలనే ఉద్దేశంతో కెన్యా ప్రభుత్వం తీసుకొచ్చిన ఉగ్రవాద నిరోధక చట్టం 2012 తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొంది. ఈ చట్టాన్ని ఉపయోగించి ప్రభుత్వాన్ని ప్రశ్నించే వారందరినీ ఉగ్రవాదులుగా ముద్రలు వేసి, జైళ్లలో తోస్తున్నారని ప్రతిపక్షాలు విమర్శిస్తున్నాయి.

2006లో అమెరికా అధ్యక్షుడు బుష్ నిర్ణయం మేరకు ఇస్లామిక్ న్యాయ సమాఖ్య ఉనికిని తగ్గించే ప్రయత్నం జరిగింది. ఈ సంఘటన ఆల్‌షబాబ్ అవతరించడానికి కారణభూతమైంది. ఆల్‌ఖైదాకు, ఆల్‌షబాబ్‌కు కనీసం కార్యకర్తలు కూడా లేని పరిస్థితి సోమాలియా, కెన్యాలలో గతంలో ఉండేది. సోమాలియాలోని కొన్ని గ్రూపులకు మద్దతిస్తూ, ఇస్లామిక్ న్యాయ సమాఖ్య ఉనికిని గుర్తించ నిరాకరించే అమెరికా ప్రయత్నం వల్ల, ఈ రోజు అక్కడ ఆల్‌షబాబ్ శక్తివంతమైంది. అక్కడ ఉగ్రవాదం వేళ్లూనడానికి సామాజిక, ఆర్థిక, మత కారణాలు కూడా తోడ్పడ్డాయి. కెన్యాలో 22 శాతం కికియు, 14 శాతం లుహ్యా, 13 శాతం లూ, 12 శాతం కలెంజిన్, 11 శాతం కంబా, 6 శాతం కిసిలి, 6 శాతం మిరు, 15 శాతం ఇతర ఆఫ్రికన్లు, 1 శాతం ఆఫ్రికేతర్లు ఉన్నారు. భిన్న జాతులు నివసిస్తున్న కెన్యాలో అమెరికా వ్యూహాత్మక ఎత్తుగడల వల్ల కొన్ని జాతుల ప్రజలు ఇస్లామీకరణ చెందుతున్నారు. వీరిలో కొంతమంది ఉగ్రవాద సంస్థలలో సభ్యులుగా ఉన్నారు. 2006 నుంచే ఇక్కడ ఉగ్రవాద కార్యకలాపాలు ఊపందుకున్నాయి. 1963, డిసెంబరు 12న యునైటెడ్ కింగ్‌డమ్ నుండి స్వాతంత్ర్యాన్ని పొంది, 1964, డిసెంబరు 12న కెన్యా రిపబ్లిక్‌గా అవతరించింది. తలసరి ఆదాయం 1,802 డాలర్లుగా ఉంది. 1963 నుండి సోమాలియాకు, కెన్యాకు మధ్య సరిహద్దు వివాదాలు జరుగుతూనే ఉన్నాయి. 1967 అరుషా మెమరాండం, 1969లో మరో సరిహద్దు ఒప్పందం జరిగాయి. 2007లో జరిగిన ఎన్నికల్లో జాతీయ ఐక్యత పార్టీ నుండి కిబాకి ప్రధాన ప్రతిపక్ష పార్టీ అయిన ఆరెంజ్ డెమెక్రటిక్ మూవ్‌మెంట్ అభ్యర్థి రైలాఒడింగాపై గెలిచారు. భూపంపకాల్లో భాగంగా భిన్న తెగల మధ్య జరిగిన హింస వల్ల 1000 మంది ప్రజలు ప్రాణాలు కోల్పోవడమే గాక, 6 లక్షల మంది నిరాశ్రయులయ్యారు. దీనికి ప్రధాన కారణం అప్పటి పాలకవర్గం 1997 ఎన్నికల్లో భాగంగా భిన్న తెగల మధ్య చిచ్చురేపడమేనని కెన్యా మీడియా విశ్లేషించింది. 2008లో ఒడింగా ప్రధానమంత్రిగా నియమించబడ్డాడు.

కెన్యా మానవ అభివృద్ధి సూచిక మేరకు పేద దేశం. దాని ర్యాంకు 0.519. 186 దేశాలలో కెన్యా 146 స్థానంలో ఉంది. కెన్యా ప్రజల్లో 38 శాతం మంది దారిద్ర్యంలో మగ్గుతున్నారు. ప్రధానమైన వ్యవసాయ రంగం నిర్లక్ష్యం చేయడం వల్ల ఉత్పాదకత తగ్గిపోయింది. 2007 ఎన్నికలకు ముందు కెన్యా 7 శాతం వృద్ధి సాధించింది. విదేశీ అప్పులను కూడా కొంతమేర తగ్గించుకుంది. 2007 అధ్యక్ష ఎన్నికలు కెన్యాలో రాజకీయ అస్థిరతను, గందరగోళాన్ని రేపడం వల్ల ఆర్థికంగా చితికింది. స్వేచ్ఛా వాణిజ్యం వల్ల కెన్యాలో నిత్యావసర వస్తువుల ధరలు ఎక్కువుగా ఉంటాయి. అయితే 2013లో రాజ్యాంగంలో కొన్ని మార్పులు చేపట్టడం వల్ల మొక్కజొన్న, కిరోసిన్, వంటనూనెల ధరలను ప్రభుత్వమే నిర్దేశిస్తుంది. కెన్యాలో ప్రైవేటీకరణ వేగవంతం వల్ల ప్రభుత్వ సంస్థల్లో ప్రైవేటు పెట్టుబడులు ఎక్కువయ్యాయి. ముఖ్యంగా టూరిజం, టెలికమ్యూనికేషన్స్, ట్రాన్స్‌పోర్టు, నిర్మాణ రంగాలలో విదేశీ పెట్టుబడులను ఎక్కువగా ఆహ్వానించడం మూలాన జిడిపి వృద్ధి 4.3 శాతానికి పెరగవచ్చని ప్రపంచబ్యాంకు అంచనా వేస్తోంది. జిడిపిలో సేవారంగమైన టూరిజం 61 శాతం వాటాను కలిగిఉంది. ఈ రంగం వల్ల ప్రజలు 18 శాతం ఉపాధిని పొందుతున్నారు. జిడిపిలో వ్యవసాయం వాటా 24 శాతం, పారిశ్రామికరంగం వాటా 14 శాతంగాను ఉంది. వ్యవసాయంపై 65 శాతం ప్రజలు ఆధారపడుతున్నారు.

కెన్యాలో విభిన్న తెగలున్నాయి. వీరి మధ్య సఖ్యతను పెంచే దిశగా పాలకవర్గాలు ఎప్పుడూ ప్రయత్నించలేదు. వలసపాలన నుండి చాలా దేశాలకంటే ముందే విముక్తిపొంది కూడా అభివృద్ధి దిశగా తన పయనాన్ని సాగించలేక, తీవ్ర పేదరికంలో మగ్గుతున్న దేశంగా కీర్తిపొందింది. కెన్యా, సోమాలియా మధ్య ఉన్న జాతుల, తెగల, భౌగోళిక వివాదాలను తమకు అనుకూలంగా మార్చుకునే ఎత్తుగడలో భాగంగా సామ్రాజ్యవాద దేశాలు పావులు కదుపుతున్నాయి. దారిద్ర్యం తాండవిస్తున్న దేశాల్లో ఉగ్రవాదం వేళ్లూనకొనడానికి సామాజిక పరిస్థితులు అనుకూలంగా ఉండడం, అమెరికా మిత్ర దేశాలకు కలిసొచ్చింది. కెన్యా ప్రభుత్వం ఇప్పటికైనా మేల్కొని మెజారిటీ ప్రజల ఆకాంక్షలకు అనుకూలంగా తమ విధానాలను మార్చుకోవలసి ఉంది. ఆ చర్యలు మాత్రమే ఉగ్రవాదాన్ని తగ్గిస్తాయి.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# దండకారణ్యంలో పోరు మహిళ

**ముప్పై ఏళ్ల దండకారణ్య పోరాట చరిత్రలో మహిళలు అసామాన్యమైన పోరాటాలు చేస్తూ, ఆదివాసి, అటవీ ప్రాంతాలలో సామాజిక మార్పు కోసం కృషి చేస్తున్నారని అంటున్నారు కె. రాధ, వసంత**

మార్క్స్ ప్రతిపాదించిన గతితార్కిక చారిత్రక భౌతికవాదం కొత్త ప్రాపంచిక దృక్పథాన్ని ఇచ్చింది. అణిచివేతకు గురైన ప్రజానీకానికి ఉపశమనాన్ని కలిగించడమేగాక, విజయాన్ని చేకూర్చింది. వర్గపోరాటం ద్వారానే సమాజం అభివృద్ధి చెందుతుందని మార్క్సిజం ఇచ్చే భౌతికపరమైన విశ్లేషణ. సమాజ పునాదిని నిర్ణయించే శక్తిగా ఆర్థిక విధానాన్ని గుర్తించడం ప్రాపంచిక దృక్పథంలో క్రియాశీలమైన మార్పుల్ని తీసుకొని వచ్చింది. సమాజంలో మనిషిపై మనిషి సాగించే దోపిడీకి గల కారణాలను విశ్లేషించడంలో ఆగిపోక మార్గాంతరం చూపింది. 'తత్వవేత్తలు ప్రపంచాన్ని పలు రకాలుగా వ్యాఖ్యానించారు. కాని అసలు సమస్య సమాజాన్ని మార్చడం' అని మార్క్స్ స్పష్టం చేశారు.

సమాజంలో ఒక వర్గం మరొక వర్గంపై చేసే దోపిడీగానీ, సమాజంలో స్త్రీల పై అణిచివేత గానీ శాశ్వతమైంది కాదని చరిత్రపరమైన భౌతికవాద దృక్పథం, మానవ సమాజం చారిత్రక వృద్ధికి సంబంధించిన విశ్లేషణ స్పష్టం చేస్తున్నాయి. సమాజంలో దోపిడీ ప్రారంభం స్త్రీల అణిచివేతతో ప్రారంభమయింది. ప్రపంచ చరిత్రలో స్త్రీ మాతృస్వామ్య హక్కు కోల్పోవడం ఘోరమైన పరాజయం. కుటుంబంలో పురుషుడు అధికార పగ్గాలు చేజిక్కించుకున్నాడు. సమాజంలో స్త్రీ కిందికి నెట్టివేయబడింది. స్త్రీ బానిసయింది. కేవలం పిల్లల్నికనే సాధనమయింది. సామాజిక ఉత్పత్తి శ్రమ నుండి స్త్రీ దూరం చేయబడింది.

బ్రిటిష్ పాలకులకు మద్దతు పలికిన భూస్వాములకు కాంగ్రెస్ స్వాగత ద్వారాలు తెరిచింది కాని బూర్జువా విప్లవ లక్ష్యాలను సాధించ లేకపోయింది. భూస్వామ్య, అర్ధ భూస్వామ్య విధానాల్ని రద్దు చేయలేదు. వ్యవసాయ కూలీలకు, పేద రైతులకు భూమి పంపిణీ చేయలేదు. ప్రజల ప్రజాస్వామిక ఉద్యమాలను అణిచివేసేందుకు బ్రిటిష్ పాలకులు సృష్టించిన అధికార గణం యథాతథంగా ఉంది. ఈ పరిస్థితులలో సమాజంలో తీవ్రమైన పరివర్తన సంభవించే సూచనలు కానరాలేదు. భారతదేశ పాలకులైన బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం ప్రజల ఆశలను వమ్ము చేసింది. వలసవాద ఫ్యూడల్ విధానాల ద్వారా సంక్రమించిన వారసత్వం కొనసాగుతోంది. కార్మికులు, కర్షకులు, మధ్య తరగతి ప్రజలను దోపిడీ చేసే పాలకుల మనస్తత్వంలో ఇసుమంతైనా మార్పు రాలేదు. ఫలితంగా మహిళల స్థితిగతులు యథాతథంగానే మిగిలిపోయాయి. వారు వర్గదోపిడీ బాధితులు గానే కొనసాగుతున్నారు. ఫ్యూడల్ వారసత్వ ఫలితాలైన వెనకుబాటుతనం, మూఢాచారాలు, అలవాట్లు, మతమౌఢ్యం వారిని బందీలుగా చేశాయి. మతం, జాతి, కులం, లింగభేదం, జన్మస్థలం వంటి కారణాలపై ఏ పౌరుడి పట్ల రాజ్యం వివక్ష చూపరాదని భారత రాజ్యాంగం ప్రాథమిక హక్కులలోని 14వ అధికరణం నిర్దిష్టంగా పేర్కొన్నప్పటికీ వివక్ష విధానం దారుణంగా కొనసాగుతోంది.

దేశ వ్యాప్తంగా మహిళలు వందలూ, వేలూ, లక్షల సంఖ్యలో సాంఘిక, రాజకీయ, ఉద్యమాలలో పాల్గొంటున్నారు. మహిళల ప్రజాస్వామ్య ఉద్యమాలు శీఘ్రగతిన సాగుతున్నాయి. కేవలం తమ రాజకీయ సాంఘిక చట్టపరమైన హక్కుల కోసమేగాక, మహిళలు ప్రజా హక్కుల కోసం కూడ పోరాటం సాగిస్తున్నారు.

లెనిన్ అన్నట్టు 'ప్రతి వంటింటి మహిళా రాజకీయవేత్త కావాలి. అప్పుడే ఈ సామాజిక మార్పును విజయవంతం చేయగలం. జనాభాలో సగభాగంగా ఉన్న మహిళలు మారకుండా సమాజం మారిందని ఎలా చెప్పగలం!'

నేడు దండకారణ్యంలోని అత్యంత వెనుకబడిన ఆదివాసి, అటవీ ప్రాంతాలలో సామాజిక మార్పు కోసం మహిళలు పోరాటంలోకి దిగారు. ఈ పోరాట ప్రభావం కేవలం ఈ అటవీ ప్రాంతాన్నే కాదు, దేశాన్నే తనవైపు తిప్పింది. లెనిన్ పిలుపుకు కార్యరూపం ఇచ్చిన ఆ చరిత్ర చూద్దాం.

నేటి దండకారణ్యంలో, ఉద్యమం 30 ఏళ్ల చరిత్రలో మహిళలు అసామాన్యమైన పోరాటాలు చేస్తున్నారు. 'జల్ జంగల్ జమీన్' కోసం పురుషులతో పాటు మహిళలు కూడా మావోయిస్టు పార్టీ నాయకత్వంలో సాగుతున్న ప్రజాయుద్ధంలో భాగస్వాములవుతున్నారు. ప్రజా సంఘాల నుండి మొదలుకొని ప్రజా ప్రత్యామ్నాయ జనతన సర్కార్ల వరకు పోరాడి సాధించుకున్నారు. సాధించుకుంటున్నారు.

మహిళలు ఇక్కడ రెండు రకాల అణిచివేతలకు గురవుతున్నారు. ఒకటి, తెగ సాంప్రదాయాలలో రీతి రివాజుల పేరతో జరిగే పితృస్వామిక అణచివేత. రెండు, ప్రభుత్వ యంత్రాంగం, వ్యాపారులూ, పేపరు మిల్లు ఉద్యోగస్తులు సాగించే అణిచివేత మహిళలను వేధించడం, లైంగిక అణచివేత, దోపిడి. వీటితో పాటుగా ప్రభుత్వాలు తలపెట్టిన పారిశ్రామికీకరణ విష సంస్కృతి కూడ ప్రవేశించింది. బైలదిల్లా గనుల్లో దగాపడిన చెల్లెళ్ల గురించి బి.డి. శర్మ రచనే దీనికి సజీవ సాక్ష్యం.

దండకారణ్యంలోని ఆదివాసి సమూహాలు ఏ ఎత్నిక్ గ్రూపుకు చెందినవైనా వాటన్నింటి జీవన విధానంలో పెద్ద మార్పులేమి లేవనుకోవచ్చు. కాకపోతే మాడ్ కొండల్లో నివసించే అతి స్వల్ప జనాభా మినహా అన్ని రకాల ఆదివాసి ప్రజా జీవితాలు దాదాపు ఒకేలా ఉన్నాయి. వారి ఆచార వ్యవహారాలలో వైవిధ్యం కన్నా సారూప్యతే అధికం అని కూడ చెప్పుకోవచ్చు. కట్టు, బొట్టు, మాట, ముచ్చటా, తిండి తిప్పలు మొదలైన విషయాలన్నింటిలోనూ, అనుభవాలలోనూ అన్ని తెగల మహిళలు అక్కా చెల్లెళ్లే. ఆమెను తెగ పితృస్వామ్యం మొరటుగా అణిచివేసింది. అడుగడుగునా ఆమెను ఓ దగ్గర 'అనేచడ్' అంటూ మరో దగ్గర 'ముత్తి' అంటూ హింసించేది. విప్లవోద్యమ ప్రవేశం ముందు వరకూ ఆమె వర్ణనాతీతమైన పితృస్వామ్య హింస వేదనను భరించింది.

ఆదివాసి మహిళ అలుపెరుగని శ్రమజీవి. ఆస్తిపై అధికారాన్ని చేజిక్కించుకున్న పురుషుడు స్త్రీలతో పాటు శ్రమశక్తిని వెచ్చించడంలో

కొంత వెసులుబాటును పొందాదని ఆదివాసి సమాజాన్ని చూస్తే అతి సులువుగానే అర్థమవుతుంది. ఆదివాసి మహిళ ఉత్పత్తిలో, సామూహిక ఉత్పత్తిలో ఇంటి చాకిరి, గృహశ్రమలో పురుషుడి కన్నా అధికంగా శ్రమిస్తోంది. ఆమె మగాళ్లతో పాటు నాగలి పడుతోంది. అయితే గత కొద్ది కాలంగా 'షానెక్కిన' పౌర సమాజం ఆమెను ఉత్పత్తి నుంచి దూర చేయడంలో భాగంగా నాగలి పట్టడాన్ని మాన్పిస్తోంది. ఆమె పంట కాపు కాస్తోంది. అది ఏపుగా ఎదిగి, పండినాక దాన్ని కొడవలితో కోసి, వరి మోపులు మోస్తోంది. భారమైన పనులన్నిటిలో పురుషుడితో పోటీ పడుతోంది. కాకపోతే ఆస్తిపై అధికారానికి సంకేతంగా నిలిచే అతి కొద్ది పనులపై తెగ పితృస్వామ్యం విధించిన పోలో మేలోలు (నిషేధాలు) మినహా ఉత్పత్తిలో ఆమె శ్రమ లేకుండా ఉత్పాదనే లేదని రూఢిగా చెప్పవచ్చు. కాని ఆమెను ఆ ఉత్పత్తిపై హక్కు నుంచి వంచించారు.

ఉత్పత్తి, సామూహిక ఉత్పత్తిలో పాల్గొనే మహిళ గృహశ్రమలో తన అధికశక్తిని వినియోగిస్తోంది. కేవలం గృహశ్రమలోనే ఆమె పాల్గొంటుం దంటే మాత్రం అది అర్ధ సత్యమే అవుతుంది. ఆమె గృహ అవసరాలను చాలా వరకు సమకూరుస్తోంది. వంట చెరకు నుంచి ప్రకృతిలో దొరికే ఆకు, అలము, కాయ పండు, కంద మూలాలు, వెదురు మొక్కలు, పుట్టకొక్కులు, పువ్వులు, నూనె గింజలు ఎన్నెన్నో గృహ అవసరాలను పురుషునితో పొత్తు లేకుండానే సంపాదిస్తోంది. అది ఆమె తన బాధ్యతగా చేయాల్సిందే తప్ప మగవాళ్లని మీరు పాలు పంచుకొండి అని కోరకూడదు.

ఆమె అన్ని రకాల కూలీ పనుల్లో పాల్గొంటుంది. ఆదివాసుల అడవుల నుంచి అత్యంత విలువైన ప్రకృతి సంపదలను దోపిడిదారులు కొల్లగొట్టుకు పోవడానికి దోపిడి ప్రభుత్వాలు చేపట్టిన రోడ్ల నిర్మాణా లన్నింటిలో ఆమె తన శ్రమ శక్తిని వెచ్చించని రోడ్డే లేదంటే అతిశయోక్తి కాదు. ప్రభుత్వ భవనాల నిర్మాణంలో ఆమె రెక్కల కష్టం దాగుంది. తునికాకుల ద్వారా ఎంతో సంపదను కూడబెట్టుకున్న టేకీదార్ల దోపిడిలో ఆమె చెమట నెత్తుర్లున్నాయి. నెత్తిన మూటలతో గూడెం గూడెం తిరిగి వస్తు మార్పిడి విధానంలో హద్దులేని మోసాలతో కుబేరులైన షావుకార్ల నీతిమాలిన సంపాదనలో ఆమె అమాయకత్వం, పేదరికం, ఆమె అవసరాలన్ని దర్శనమిస్తాయి. కాగితపు పరిశ్రమల నుంచి మార్కెట్‌లోకి అందంగా తయారై వచ్చే తెల్లని కాగితాల్లో ఆమె ఆక్రందనలున్నాయి. ఆమె అడవికి యజమానురాలు, కాని ఆమె అన్ని విధాల వంచనకు గురై కూలీ బతుకును ఈడుస్తోంది. ఆమె కేవలం శ్రమ దోపిడినే కాదు, లైంగిక దోపిడి, హత్యాచారాలనూ, వేధింపులనూ, అవమానాలనూ మౌనంగా భరించేది.

ఆదివాసుల భూములు అన్యాక్రాంతం కాకూడదని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మొసలి కన్నీరు కారుస్తూ రాజ్యాంగం ఉనికిలోకి వచ్చాక కొన్ని నూతన చట్టాలు ప్రవేశపెట్టాయి. అయితే ఈ చట్టాల వేటకు వెంటనే గురైంది మహిళలే. మైదాన ప్రాంతాల నుండి వచ్చిన గిరిజనేతరులు ఇక్కడ కబ్జా చేసుకున్న ఆదివాసుల భూములను దక్కించుకోవడానికై ఆదివాసి మహిళలను పెళ్లి చేసుకునే కొత్త కుట్రలు మొదలైనాయి. వారి పట్ల ఈ చట్టం మరో కొత్త అణచివేత సాధనంగా తయారయింది. దండకారణ్య వ్యాప్తంగా ఇలాంటి కేసులు కావల్సినన్ని దర్శనమిస్తాయి.

దండకారణ్యంలో సామ్రాజ్యవాద అనుకూల పారిశ్రామికీకరణతో విష సంస్కృతి కూడ ప్రవేశించింది. బైలదిల్లా గనుల్లో దగా పడిన చెల్లెళ్లు దీనికి సజీవ సాక్ష్యం. అక్కడ రాజ్యమేలే సామ్రాజ్యవాద సంస్కృతి ఎయిడ్స్‌లాంటి భయంకర వ్యాధులను దండకారణ్యానికి అంటగట్టింది.

దండకారణ్యంలో భాగమైన అవిభాజిత బస్తర్‌లో ఇటీవల కాలంలో పర్యాటక (టూరిజం) పరిశ్రమను బాగా ప్రోత్సహిస్తున్నారు. ప్రజా సమస్యలను పరిష్కరించడంలో దారుణంగా విఫలమైన చత్తీస్‌గఢ్ ప్రభుత్వం ఇప్పుడు టూరిజానికి పెద్ద పీట వేస్తూ దీనితోనే బస్తర్ సంపూర్ణంగా అభివృద్ధి చెందుతుందని నమ్మబలుకుతోంది. దీనిలో భాగంగా బస్తర్‌లోని చిత్రకూట్ జలపాతం, కాంకేర్ ఘాట్ నేషనల్ పార్క్, బార్సూర్, తీరడ్‌గఢ్, కోటంసర్ వంటి కొన్ని ప్రదేశాలను ప్రత్యేకించి టూరిస్టు కేంద్రాలుగా అభివృద్ధి చేస్తున్నది. ఇక్కడ ఖరీదైన రెస్టారెంట్‌లనూ, బార్లనూ, లాడ్జిలనూ వేగంగా నిర్మిస్తున్నారు. ప్రజలు సాంప్రదాయకంగా జరుపుకునే దసరా పండుగను కూడ 'బస్తర్ లోకోత్సవ్' పేరుతో రాజ్యోత్సవంగా ప్రకటించి పెద్ద ఎత్తున టూరిస్టులను ఆకర్షించే ప్రయత్నం గత రెండేళ్లుగా సాగుతోంది. బస్తర్‌లోని ప్రకృతి అందాల గురించి పత్రికల్లోనూ ఇంటర్నెట్‌లోనూ రంగు రంగుల ఫొటోలతో ఆకర్షణీయమైన ప్రచారం చేస్తూ దేశ దేశాల్లోని పర్యాటకులను ఇక్కడకు రప్పించాలని ప్రభుత్వం బాగా ప్రయత్నిస్తోంది. దీని ద్వారా చాలా డబ్బు వస్తుందనీ, ప్రజలకు ఉపాధి అవకాశాలు దొరుకుతాయనీ, ఇంకా అనేక విధాల మేలు జరుగుతుందనీ తప్పుడు ప్రచారం చేస్తోంది.

నిజానికి టూరిజం పరిశ్రమకు ప్రోత్సాహాన్నిచ్చిన దేశాలన్నింటి అనుభవం చెపుతున్న చేదు వాస్తవం ఏమిటంటే దీని వల్ల వేశ్యా వృత్తి, మాదక మత్తు పదార్థాల అక్రమ వ్యాపారం, భిక్షాటన, ఎయిడ్స్ వంటి ప్రాణాంతక వ్యాధులు పెచ్చరిల్లిపోతాయి. ఇది సెక్స్ టూరిజంగా అభివృద్ధి చెంది మహిళలను పెద్ద సంఖ్యలో వేశ్యా వృత్తిలోకి ఈడుస్తుంది. దీని ద్వారా సామ్రాజ్యవాద విష సంస్కృతి విచ్చలవిడిగా వ్యాపించి ఇక్కడి ప్రజల ఆదిమ సంస్కృతి అంతరించిపోతుంది. సామ్రాజ్యవాద విష సాంస్కృతిక దాడి కూడ ప్రత్యేకించి మహిళలను ఎక్కువ పీడనకు గురిచేస్తుంది. నేడు దండకారణ్యంలో మహిళల్లో ముఖ్యంగా క్రాంతికారీ ఆదివాసి మహిళ సంఘం నిర్వహించే సభలూ, విప్లవ దినాలూ, సదస్సుల ద్వారా కూడ పెద్ద ఎత్తున రాజకీయ చైతన్యం పెరుగుతోంది. ఒకప్పుడు తమ గ్రామం చుట్టు పక్కల అడవి గురించి తప్ప ఏం తెలియని మహిళలు నేడు అమెరికా సామ్రాజ్యవాదం గురించి, ఇరాక్‌పై దాడి గురించి వేదిక లెక్కి ఉపన్యసించగలుగుతున్నారు. దళారీ పాలకుల నూతన ఆర్థిక విధానాల గురించి, సెజ్‌ల గురించి, వాటి దుష్ప్రభావాల గురించి విశ్లేషిస్తున్నారు. పొట్ట కూటి కోసం ఆరుగాలం కష్టపడడం తప్ప ఇంకేం ఆలోచించలేని మెదళ్లు నేడు సంస్థ రాజకీయ నిర్మాణ పరమైన సమస్యల్ని పరిష్కరించడానికి పదునెక్కుతున్నాయి. ఉన్నత స్థాయి జ్ఞానానికి నిచ్చెనలేస్తున్నారు.

సమస్యల మధ్య నలుగుతున్న మహిళలు వాటి మీద యుద్ధం ప్రకటించే సమయం కోసం సహజంగానే ఎదురు చూడసాగారు. విప్లవోద్యమం వారికి తగిన అవకాశాల్ని కల్పించింది. ప్రజా యుద్ధం వారిని ఆకర్షించింది. వారి గాయాలను తడిమింది. వారు చనిపోవడానికి ఉపయోగించిన పిట్ట మందుల అవసరం తీరిపోయింది.

ప్రజా సంఘాల్లో సంఘటితమవుతున్న మహిళల పట్ల గ్రామాల్లో గౌరవభావం పెరిగింది. చైతన్యవంతులవుతున్న మహిళలు సాయుధం కావడాన్ని ప్రజలు ప్రోత్సహిస్తున్నారు. పీడిత ప్రజల భారాలను తొలగించ డానికి సంప్రదాయ సంకెళ్లను తెంచుకొని జీవన్మరణ యుద్ధంలో సాహసంగా పోరాడుతూ విజయాల బాటలో నేలకొరుగుతున్న తమ పోరు బిడ్డలను చూసి కంటతడి పెడుతున్నారు. వారి స్థానాన్ని భర్తీ చేయడానికి పూనుకుంటున్నారు. ఇప్పుడు ఏ సంప్రదాయకత వారిని అడ్డుకోవడం లేదు. మంచి – చెడు విచక్షణతో ప్రగతిశీల నిర్ణయాలు తీసుకుంటున్నారు. నిరక్షరాస్య మహిళలు నేడు ప్రపంచాన్ని చదువుతున్నారు. నేటి దండకారణ్య ఉద్యమమే దేశ భవిష్యతును మార్చివేస్తుందనే నమ్మకం ప్రజలకు ఉంది.

*(రచయితలు మహిళా రాజకీయ ఖైదీలు)* వీ

# నేటి అనంతపురం

గ్రాసంలేక పశువులను వధ్యశాలలకు తరలిస్తున్న ప్రజలు ఒకపక్క తమ సరదాల కోసం పందెం పరుగులంటూ వృషభాలకు అన్నిరకాల సదుపాయాలను కల్పిస్తూ రైతులను నిర్లక్ష్యం చేస్తున్న పాలకులు మరోపక్క ఉన్న తీరును వివరిస్తున్నారు **కె. నాగేశ్వరాచారి**

అనంతపురం జిల్లాలో ఇప్పుడు ఓ విచిత్ర సన్నివేశం కనిపిస్తోంది. మనసునుంచి చూస్తే అదో బాధకర దృశ్యమనిపించక తప్పదు. ఫోర్ వీలర్స్‌లో రాతి దూలం లాగే వృషభాలు హుందాగా వెళ్తుంటే వెనుక వచ్చే ఫోర్ వీలర్స్‌లో కబేళాలకు వెళ్లే పశువులు కనిపిస్తాయి. అదే రోడ్డు పక్కన ఎండిన గడ్డి మేస్తూ కడుపు నిండక మోరలెత్తి చూసే పశువులు కనిపిస్తాయి. ఈ దృశ్యం చూస్తే ఆత్రేయగారి 'కారులో షికారుకెళ్లే పాలబుగ్గల పసిడిదానా' పాట గుర్తుకు వస్తుంది. వ్యవసాయ జీవితంతో ముడిపడ్డ పశువుల్లో ఈ తేడా విడివడిన సందర్భాన్ని విశ్లేషించుకోవాల్సి ఉంది.

వ్యవసాయోత్పత్తిలో భాగం పంచుకొనే పశువులకు మేత లేదు. దాణా లేదు. ఆలనా పాలనా ఉండదు. కాడి మెడ మీద ఉంచుకోని వృషభాలకు మాత్రం మంచి దాణా ఉంటుంది. రోజు స్నానం చేయిస్తారు. మంచి పౌష్టికాహారం పెడ్తారు. రాత్రుల్లో దోమలు కుట్టకుండా జాగ్రత్తలు తీసుకుంటారు. ఇవి చేయవలసిన పని జాతర్లలో రాతి దూలాలు లాగడమే. బంగారు, వెండి మెడల్స్, నగదు బహుమతులు గెల్చుకోవడమే. వీటి కష్టం యజమాని భుజకీర్తులలో పొదిగిన రంగు రాళ్లు మాత్రమే.

గ్రామాల్లో ట్రాక్టర్ సేద్యాలు విస్తరిస్తున్నాయి. అయినా ఎద్దుల అవసరం దూరం కాలేదు. ధనిక రైతైనా, పేద రైతైనా ఎద్దులను సేద్యానికి ఉపయోగించు కోవాల్సి ఉంది. వ్యవసాయ ఎద్దుల ఆలనా పాలనా ఖర్చుతో కూడుకున్నది కాదు. వరిగడ్డి కడుపు నిండా పెడితే చాలు. జొన్న, వేరుశెనగ, ఎండిన మేత పెడితే చాలు ఆ ఎద్దులు వ్యవసాయపు పనులు చేసి పెడ్తాయి. వర్షాలు బాగా పడే రోజుల్లో ఉలువలు పండేవి. సద్దలు పండేవి. రైతులు దాణాగా సద్ద, ఉలువలు ఎద్దులకు పెట్టేవారు. ఇప్పుడు ఆ పంటలు కనుమరుగైనాయి. వ్యవసాయ ఎద్దులను రైతులు కేవలం పనులున్న రోజుల్లో మాత్రమే జూన్, జూలై నెలల్లో కొని డిసెంబర్ నెలల్లో అమ్మి వేస్తారు. కేవలం ఆరు నెలలు మాత్రమే రైతుల ఇంట్లో ఉంటాయి. మిగతా రోజుల్లో తిండి పెట్టలేని స్థితిలో వాటిని అమ్ముకోక తప్పదు. రైతులు పశువులను కేవలం పనిముట్లుగా మార్చుకున్నారు. అనంతపురం జిల్లాలో కనిపించే ఈ స్థితికి ప్రతిగా నిరంతర పోషణలో ఉన్న వృషభాలు కన్పిస్తాయి.

ఇవి కూడ జిల్లా అంతటా లేవు. ధర్మవరం, తాడిపత్రి, గుత్తి, గుంతకల్లు, ఉరవకొండ ప్రాంతాలు మాత్రమే రాతి దూలాలు లాగే వృషభాలు కనిపిస్తాయి. ఈ ప్రాంతాలన్నీ రేగడి నేలలే. ఈ రేగడి నేలల సంస్కృతి మిగతా ప్రాంతాల కంటే భిన్నంగా ఉంటుందని ఒక అభిప్రాయం ఉంది.

రాతి దూలాలు లాగే వృషభాల పోషణ అధిక వ్యయంతో కూడుకున్నది. నెలకు తక్కువలో తక్కువ ఇరవై వేల రూపాయలు ఖర్చవుతుంది. వీటి నిర్వాహణ కోసం ముగ్గురు మనుషులు కావాలి. గతంలో వీటికి సద్దపిండి, బెల్లం, గానుగ చెక్క దాణా వంటి పదార్థాలు పెట్టేవారు. ఇప్పుడు వీటికి తోడు కోడిమాంసం, మద్యం కూడ తాపుతున్నట్లు తెలుస్తోంది. ప్రతి రోజూ సాయంత్రం శిక్షణగా రాతి దూలాలు లాగిస్తారు. ఆ శిక్షణా సమయంలో పది మందైనా అవసరమవుతారు. పందేలకు ఇతర ప్రాంతాలకు వెళ్లవలసి వస్తే ఈ వృషభాలను వాహనాల్లోనే తరలిస్తారు. అక్కడి తిండి ఖర్చులు ఎవరికి వారే భరించుకోవాల్సి ఉంటుంది. ఈ పందెంలో గెలిచిన మొత్తం వీటి నిర్వహణకు ఏ మూలకు సరిపోదు. మరెందుకు ఈ పందేలు నిర్వహిస్తున్నట్లు? మరెందుకు ఈ వృషభాల్ని పోషిస్తున్నట్లు? కరువు ప్రాంతాల్లో ఈ సంస్కృతి ఎందుకు నెలకొన్నట్లు? ఏ కొద్ది మందికో పరిమితమైన వృషభ రాజ పోషణ ఇది. ఒక ప్రాంతంలో బ్యాంక్ ఉద్యోగి రాతి దూలం లాగే వృషభాలను పెంచుతున్నట్లు వార్తలొచ్చాయి. మరికొన్ని చోట్ల వృషభాలకు మంచి శిక్షణనిచ్చి లాభసాటి రేట్లకు అమ్ముకుంటున్న వ్యాపారం జరుగుతోంది.

దూలం లాగే పందేలు జరిగే సమయంలో గుర్రపు పందేల లాగా పై పందేలు వేసుకొని డబ్బులు పోగొట్టుకోవడం, సంపాదించుకోవడం జరుగుతోంది. తొండ ముదిరి ఊసరివెల్లి అయినట్లు ప్రచారం. నిర్వాహకుల హుందాతనం, దాతృత్వం బహుళ ప్రచారాన్నందుకొని రాజకీయ పలుకుబడి పెంచుకోవడానికి, ప్రజల్లో నాయకుని పేరు నిరంతర స్మరణకు ఈ పందేలు ఉపయోగపడుతున్నాయి. ప్రత్యర్థి వర్గాల ఆధిపత్య ఘర్షణకు లోనై గుత్తి దగ్గర ప్రతి సంవత్సరం జరిగే రాతి దూలాలు లాగే పందేలు పోలీసుల జోక్యంతో రద్దయినాయి. రాజకీయ ఆధిపత్యపు పోరు భూస్వామ్య సంస్కృతిని రద్దు చేసే వరకు ఎదిగింది. తాడిపత్రిలో రాష్ట్ర స్థాయిలో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి రాతి దూలాలు లాగే పందేలు మాజీ మున్సిపల్ చైర్మన్ నిర్వహించారు. ఈ సంబరాల్లో చీర్‌గర్ల్స్‌ను ఏర్పాటు చేసి విమర్శలకు గురైనారు. అలా ఏర్పాటు చేస్తే తప్పేంటని ఎదురుదాడికి లంకించుకున్నారు. భూస్వాముల దర్పం క్రమంగా వ్యాపారాన్ని సంతరించుకోవడం గమనించవచ్చు. ఇదో పార్శ్వంలోని చిత్రం.

మరో పార్శ్వంలోని చిత్రమేమిటంటే బడుగు రైతుల పనిముట్లైన ఎద్దులు తమ యజమానులలాగే అకాల మరణాలకు గురికావడం, ప్రభుత్వం ఏర్పాటు చేసిన గడ్డి కేంద్రాలలో అనాథ శరణాలయాల్లో

లాగా జీవనం గడపడం, కొలత బత్తెపు తిండి తినడం అంటు జాడ్యాలకు గురై కనీసం ప్రభుత్వ వైద్యమైనా లభించక చావడం.

ఈ గడ్డి కేంద్రాలు కూడ నీటి వసతి ఉన్న పెన్నాహోబిలం దగ్గర, పెనుగొండ, మడకశిర ప్రాంతాల్లోనే ఏర్పాటు చేస్తారు. కోస్తా ప్రాంతం నుంచి రైల్వే వ్యాగన్లలో వరిగడ్డిని సరఫరా చేస్తారు. ఇందులో మురిగిన పనికిరాని గడ్డి ఉంటుందని చెప్పనవసరం లేదు. ఈ గడ్డి కేంద్రాల వెంట నడిచే కాంట్రాక్టు రాజకీయాల్ని పరిమితంగానైనా ఆచార్య కొలకలూరి ఇనాక్ 'సర్కార్ గడ్డి' నవలలో చూపించారు. ఇప్పటికీ 20 వసంతాల నుంచి ప్రతి సంవత్సరం గడ్డి కేంద్రాలను నిర్వహిస్తూనే ఉన్నారు. శాశ్వత ప్రాతిపదికన పశుగ్రాస కొరత నివారణోపాయాల్ని వెదకడం లేదు. కదిరి ప్రాంతంలోని గ్రామాల్లో కనీసపు మంచినీటి వసతులు కూడ లేక గ్రామాలు ఖాళీ చేసినట్లు ఇటీవల కొన్ని ప్రజా సంఘాలు పత్రికలకు వెల్లడించాయి. రాజకీయ ఆధిపత్యాలకు జరిగినంత గొడవ ఆందోళనలు, ధర్నాలు, పాడవుతున్న వ్యవసాయ రంగానుబంధ పశుసంపదను గురించి రాజకీయ పార్టీలకు పట్టలేదు. జిల్లాలో పారుతున్న ఎచ్.ఎల్.సి. చారిత్రక విశిష్టమైంది. పారిశ్రామికాభివృద్ధి మాట ఒక ఎండమావి. తాడిపత్రి ప్రాంతంలో కోట్లాది రూపాయల సున్నపురాయి అక్రమ తవ్వకాలు రాజకీయ అండదండలతో అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నాయి. ఓబుళాపురం గనులు సృష్టించిన రాజకీయ అవినీతి, సంస్కృతి అందరికీ తెలిసిందే.

ఒక జీవన విధానంగా ఉండే వ్యవసాయం క్రమంగా మార్కెట్ శక్తుల ఆధిపత్యం వల్ల పరిశ్రమగా మారిపోయింది. జిల్లాలో ఆహార పంటల కంటె వాణిజ్య పంటలైన తోట పంటలే విస్తరిస్తున్నాయి. బెంగుళూరు మీదుగా వ్యవసాయోత్పత్తులు ముంబాయి ప్రాంతాలకు ఎగుమతి అవుతున్నాయి. నేటికీ గ్రామాల్లో రెండు గ్లాసుల పద్ధతి కొనసాగుతూనే ఉంది. పారిశ్రామిక సంబంధాలు నెలకొనక పోవడం వల్ల, భూస్వామ్య సంబంధాలు కొనసాగుతుండడం వల్ల బక్క చిక్కిన ఎద్దులు, కండ బలిసిన రాతి దూలాలు లాగే వృషభాలు కనిపిస్తున్నాయి. భూస్వాముల వికృతానందం కనిపిస్తోంది. పాశ్చాత్య దేశాల్లోలాగే బుల్‌ఫైట్ లాగా, దున్నపోతుల పందేల్లాగా వృషభాల్ని బాగా మేపి బరువులు లాగించడం వికృత చేష్టలే. గతంలో వాగు వంకల్లో ఫలసాయాన్ని ఇంటికి తెచ్చుకొనే క్రమంలో బలమైన బళ్లు ఇసుకలో కూరుకొని పోయినప్పుడు ఎద్దులు అవసరమయ్యేవి. ఇప్పుడా అవసరం లేదు. రాష్ట్రంలో రాతి దూలాలు లాగే వృషభాల్ని రాజకీయ నాయకులు లక్షలాది రూపాయల ఖర్చుతో పెంచుతున్నట్లు తెలుస్తోంది. వాటిని బ్రీడింగ్‌గా వాడుకుంటున్నారు. బలిష్టమైన ఒంగోలు జాతి ఎద్దులు రైతాంగానికి ట్రాక్టర్ల వంటివి. బ్రెజిల్ దేశస్తులు ఒంగోలు జాతి పశువుల వ్యాప్తిపై పేటెంట్ హక్కులు పొందుతున్నట్లు వార్తాపత్రికలు రాస్తున్నాయి. క్రమంగా పశు సంపదపై కూడ సామ్రాజ్యవాదుల ఆధిపత్యం మొదలైంది.

కేవలం విత్తనోత్పత్తిలోనే హైబ్రిడైజేషన్ కాదు, పశుసంపదలో కూడ హైబ్రిడ్ మొదలైంది. శాస్త్ర సాంకేతిక రంగాభివృద్ధి పయనం ఏ దిశగా సాగుతోందో గమనించాలి. రైతుల ఆత్మహత్యలకు అనేక కారణాల్లో హైబ్రిడ్ విత్తనాలు కూడ ఒక కారణమని తెలుస్తోంది. పంటలూ నాశనమైనాయి. పాడీ నాశనమైంది. ఈ జిల్లాలో ఉష్ణోగ్రతలు ఇతర ప్రాంతాల కంటె అధికంగా నమోదవుతూ ఉన్నాయి. పాడి పరిశ్రమాభివృద్ధి ప్రశ్నార్థకమైంది. మొత్తంగా వ్యవసాయ రంగంలో మరో పార్శ్వం కూడ నాశనమైన సందర్భం ఇది. కానీ రాయల పట్టాభిషేకోత్సవాలు, లేపాక్షి ఉత్సవాలు, ప్రపంచ తెలుగు భాషా ఉత్సవాలు, నీలం సంజీవరెడ్డి జయంతి ఉత్సవాలు ఘనంగా జరుగుతున్నాయి. కనీసం తాగు నీటికి నోచుకోని వందల కొద్ది గ్రామాలు జిల్లాలో ఉన్నాయి. ఈ పరిస్థితి అధిగమించ దానికి ఎటువంటి ప్రయత్నాలు జరగడం లేదు. 'గోరు చుట్టుపై రోకటి పోటన్నట్లు' నంబుల పూలకుంట ప్రాంతంలో యురేనియం శుద్ధి కర్మాగారం ఏర్పాటు చేయనున్నారు. దీని వల్ల ఎటువంటి దుష్ఫలితాలుంటాయో తెలిసిందే. నల్గొండ జిల్లాలో వద్దన్న యురేనియం శుద్ధి కర్మాగారం అనంతపురం జిల్లాలో ఎందుకు ముద్దయిందో పాలకవర్గమే వివరించాలి. ఈ కర్మాగారాన్ని వ్యతిరేకించే ఉద్యమ కమిటీ జిల్లాలో ఒకటి రూపుదిద్దుకుంటూ ఉంది.

జిల్లాలో నిరంతరం వేధిస్తున్న కరువు వలసలపై దృష్టి సారించకుండా యురేనియం శుద్ధి కర్మాగారం వద్దని ప్రజలు ఉద్యమించేలా ప్రభుత్వం పన్నిన పన్నాగం ఇది. జిల్లా ముఖ చిత్రం తెగిన బల్లి తోకలా ఒక పక్షం విలవిల లాడుతుంటే పాలక పక్షం పదవుల పందిళ్లలో సేదదీరుతోంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

రాబోయే సంచికలలో...

- లెనిన్ ప్రసిద్ధ రచన 'సామ్రాజ్యవాదం' - ఎస్‌వీఎస్ నాగభూషణ్
- ఆంధ్రలో తొలి మహిళా సమాజం - షేక్ మహబూబ్ బాషా
- దారిద్ర్య నిర్మూలన పథకాలు - డా. ఇమ్మానేని సత్యసుందరం
- జన్యుమార్పిడి పొందిన అమెరికా పంటలకు మన పొలాలు బలి కావాలా? - వై. కృష్ణమూర్తి
- ఆదివాసుల స్వయంపాలన - దాసరి నివాస్

# న్యాయస్థానాలు - తీర్పులు

**బూటకపు ఎన్‌కౌంటర్‌లని తెలిసినా, విచారణలో కాలయాపన జరిగిందనే నెపంతో న్యాయస్థానాలు మనిషి ప్రాణానికి నష్టపరిహారాన్ని పరిష్కారంగా సూచిస్తున్నాయని అంటున్నారు చెరుకూరి సత్యనారాయణ**

దేశ అత్యున్నత న్యాయ స్థానం ఇటీవల మరో తీర్పులో బూటకపు ఎన్‌కౌంటర్‌లో చనిపోయిన కుర్రవాడి తండ్రికి 20 లక్షల రూపాయలు నష్ట పరిహారం ఇవ్వమని హర్యానా ప్రభుత్వాన్ని ఆదేశించింది. గుంటూరు, కర్నూలు జిల్లాల్లో ఎస్.పి.గా పని చేసిన రామాంజనేయులు హయాంలో జరిగిన నకిలీ ఎన్‌కౌంటర్లను నిర్ధారించి జాతీయ మానవ హక్కుల కమిషన్ కూడా హతుల కుటుంబాలకు ఐదు లక్షల రూపాయల నష్టపరిహారం చెల్లించమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఆదేశించింది.

గత సంవత్సరం చత్తీస్‌గడ్‌కు చెందిన డా. మహమూద్ అజాంను పోలీసులు దారుణంగా అవమానించిన సందర్భంలో కూడా పది లక్షల రూపాయల నష్టపరిహారం ఇప్పించింది. దానికి కారకులైన పోలీసు అధికారుల జీతాల్లో నుండి రికవర్ చేసుకోమని కూడ ఆదేశించింది.

సుప్రీం కోర్టు న్యాయమూర్తులు జస్టిస్ అల్తాబ్ ఆలం, జస్టిస్ రంజనా ప్రకాష్ దేశాయ్‌ల ధర్మాసనం ఇచ్చిన తీర్పు మంచి తీర్పే గాని కొంత విడ్డూరంగా ఉంది. అదెలాగంటే,

2008 అక్టోబర్ 12 రాత్రి ప్రవీణ్ అలియాస్ సునీల్ అనే నేరస్తుడు ఒక మోటర్ సైకిల్‌పై వెనుక కూర్చొని ప్రయాణిస్తున్నట్లు వచ్చిన నమ్మకమైన సమాచారంతో ఆ మోటర్ సైకిల్‌ని వెంటాడినట్లు, ఆ సమయంలో ఉమేష్ అనే వ్యక్తి మోటర్ సైకిల్ నడిపినట్లు, వీధిదీపం వెలుగులో కరపత్రంలోని ఫోటోల ఆధారంతో హెడ్‌కానిస్టేబుల్ సునీల్‌ని గుర్తించినట్లు, ఆపమన్నా మోటర్ సైకిల్ ఆపకపోగా ఇంకా స్పీడ్ పెంచారని ఈ ఛేజింగ్‌లో పోలీసు వాహనం తగిలి మోటర్‌సైకిల్ కింద పడినట్లు, సునీల్ రెండు చేతులతోనూ రెండు ఆయుధాలు ధరించి ఉన్నట్లు ఆత్మరక్షణ కోసం జరిపిన కాల్పుల్లో సునీల్ చనిపోయినట్లు పోలీసులు ప్రకటించారు.

హతుడి పేరు, ఊరి పేరు తప్ప మార్పులేని ఇలాంటి కథనాలు కొన్ని వేల సార్లు విన్నాం. ఎ.ఎస్.ఐ. ఇచ్చిన సమాచారంతో ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేశారు. చీకట్లో మోటర్ సైకిల్ నడిపిన వ్యక్తి పారిపోయినట్లు కూడా ఆ కథనంలో ఉంది. వెంటనే హతుని తండ్రి రాహతాష్ కుమార్‌ని పిలిపించి శవాన్ని గుర్తింపు చేయడమేగాక ఒత్తిడి చేసి దహనం చేయించారు. శ్రాద్ధకర్మలు నిర్వహించడానికి ఉండిపోయిన హతుని తండ్రి కేసు వివరాలు, పోస్టుమార్టం నివేదికలు సంపాదించాడు. వాటిలో విషయాలు చూసి నిర్ఘాంతపోయి తన కొడుకుని ఎన్‌కౌంటర్ పేరుతో పోలీసులు హత్యచేశారని నిర్ధారణకు వచ్చాడు.

పంజాబ్ హర్యానా కోర్టును ఆశ్రయించాడు. ఈ హత్యకు పాల్పడిన పోలీస్ అధికారులపై 302 ఐ.పి.సి కింద కేసు నమోదు చేయాలని, ఆ కేసుని సి.బి.ఐ పరిశోధించాలని ఆదేశించాల్సిందిగా హైకోర్టుని కోరారు.

ఎన్‌కౌంటర్ నకిలీ అని చెప్పడానికి ఆధారాలు లేవని హైకోర్టు దాన్ని కొట్టివేసింది. ఎన్‌కౌంటర్ గూర్చి మెజిస్టీరియల్ విచారణ జరిపిన తహాశీల్దారు, అడిషనల్ డిప్యూటీ కమిషనర్ కూడా సహజంగానే పోలీసు వాదన వాస్తవమేనని నివేదికలిచ్చారు. ఈ రెండు నివేదికల్ని సుప్రీంకోర్టు తోసి పుచ్చింది. తిరస్కరించడానికి ఈ కింది అంశాలను ఆధారంగా చేసుకుంది.

పోస్టుమార్టం రిపోర్టు ప్రకారం బుల్లెట్లు 3-8 అడుగుల దూరం నుండి మాత్రమే తగిలాయి. గాయం చుట్టూ ఏర్పడిన నల్లని చారికలు ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. హతుడు అంత దగ్గరలో ఉన్నందున అతను కాల్పులు జరిపి ఉంటే పోలీసులు కూడా గాయపడి ఉండాలి. కానీ ఒక్క పోలీసు కూడా గాయపడలేదు.

పోలీసువారు హతుని ఆచూకి తెలపమని ప్రజల్ని కోరుతూ ప్రచురించిన కరపత్రంలో ఫోటోలు వేర్వేరుగా ఉండడమేగాక, అందులో ఒకటి బాల్యంలోని ఫోటో. వాటి ఆధారంగా గుర్తించామని చెప్పడం నమ్మశక్యంగా లేదు.

మోటారు సైకిల్‌పై వేగంగా వెళుతున్న వారిని లాంతరు వెలుగులో గుర్తుపట్టడం సాధ్యం కాదు. హతుడిపై మోపబడ్డాయని చెప్పబడుతున్న ఏ కేసు ఎఫ్.ఐ.ఆర్‌లోనూ హతుని పేరు లేదు.

పోలీసులు చెబుతున్న అతడు 'మోస్ట్ వాంటెడ్' అయినా దగ్గరలో ఉన్న మనిషిని ముఖ్యమైన శరీర భాగాలపై (ఛాతి, పొట్ట) కాల్చవలసిన అవసరం లేదు. స్వల్పంగా గాయపడేట్లు కాల్చవచ్చు.

ప్రత్యక్ష సాక్షి చెప్పేదాంట్లో విశ్వసనీయత లేదని, తహాశీల్దారు విచారణ తూతూ మంత్రంగా జరిగిందని దాన్నే గుడ్డిగా అడిషనల్ కమిషనర్ ఆమోదించాడని నిజమైన నిజ నిర్ధారణ చేయడంలో వారిద్దరూ విఫలమయ్యారని, జాతీయ మానవ హక్కుల కమిషన్ సూచించినట్లు ఒక స్వతంత్ర సంస్థతో దర్యాప్తు చేయించాలి. తహాశీల్దారు విచారణ దానికి సరైన ప్రత్యామ్నాయం కాదు. హతుని తండ్రి దీన్ని బూటకపు ఎన్‌కౌంటర్ అన్నందున దీన్ని హత్య కేసుగా నమోదు చేయాలి. కాని అలా జరగలేదు. ఈ రెండు అంశాలలోనూ ప్రభుత్వం రాజ్యాంగ ధిక్కారానికి పాల్పడింది.

పై కారణాల రీత్యా సునీల్ బూటకపు ఎన్‌కౌంటర్‌లో పోలీసులచే చంపబడ్డాడని సుప్రీంకోర్టు నిర్ధారించింది. స్వతంత్ర సంస్థతో విచారణ జరిపించమని హైకోర్టు ఆదేశించి ఉండాల్సింది అని కూడా అభిప్రాయ పడింది. ఈ కేసులో అప్పిలేట్ అయిన హతుని తండ్రి రాహతాష్ కుమార్

# ఆయుధం అణచివేతకు ఓ సాధనం

**సామ్రాజ్యవాదులూ, భూస్వాములూ, పెట్టుబడిదారులూ, కార్పొరేట్ సంస్థలూ తమ సంపదను, అధికారాన్ని నిలుపుకోవడానికి సాయుధ కాపలాతో రాజ్యమేలుతున్నారని అంటున్నారు విశ్వం**

రాయి ఆదిమానవుడి మొదటి ఆయుధం. దాన్ని అతను తన ఆహార సముపార్జనకై, క్రూరమృగాల నుండి ఆత్మరక్షణకై ఉపయోగించాడు. ఆపై రాయిని ఓ కర్రకు గట్టి బల్లెంలా ఉపయోగించాడు. ఆ తరువాత కత్తులు, గొడ్డళ్లు, విల్లు బాణాలను తన ఆయుధాలుగా అభివృద్ధి పరుచుకున్నాడు. స్వంత ఆస్తి వర్గాలు ఏర్పడడం, వాటిని కాపాడడానికి రాజ్యం ఆవిర్భవించడంతో, ఆయుధం రాజ్యంలో భాగమయింది. 13వ శతాబ్దంలో తుపాకి మందు కనుకొని దానిని ఆయుధాలలో ఉపయోగించేంత వరకు విల్లు బాణమే యుద్ధాలలో ప్రధాన భూమికను పోషించింది.

నేడు భారీ మొత్తంలో ఎవరి దగ్గర అత్యంత ఆధునిక ఆయుధాలుంటే వారిదే పెత్తనం. పేదవాడి చేతిలో ఆయుధం ఉంటే అతను తీవ్రవాదో, ఉగ్రవాదో అవుతాడు. అదే ప్రభుత్వాల తరపున పోలీసో, సైనికుడో పట్టుకుంటే అతను రక్షకుడు అవుతాడు. ఏ ఆయుధానికి వర్గ దృక్పథం లేదు. అది దానికి ఆపాదించబడ్డది. పోలీసులూ, సైన్యం, జైళ్లూ, కోర్టులూ రాజ్యంలోని భాగాలు. శ్రమ శక్తిని దోచుకుని సంపదలను పోగేసుకోవడానికి ఆ పోగేసుకున్న సర్వ సంపదలను కాపాడుకోవడానికి బలప్రయోగం ఒక సాధనం. నేడు ఆ ఆయుధం సంపదలను కాపలాకాసే పనిముట్టయింది. బలప్రయోగం లేని, ఆయుధం లేని వర్గ సమాజపు అస్తిత్వాన్ని ఊహించలేం.

నేడు ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలు సరిహద్దుల భద్రతా, అంతర్గత భద్రతలనే కారణాలను చూపి దేశ భద్రతకే ముప్పు ఏర్పడిందంటూ, తమ సాయుధ బలగాల సైనికీకరణకు పెద్ద ఎత్తున పూనుకుంటూ ప్రజాధనాన్ని పెద్దఎత్తున ఖర్చు పెడుతున్నాయి. అమెరికా తన ప్రపంచ ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు పెద్ద ఎత్తున సైనికీకరణకు ఖర్చుపెడుతుంటే, దక్షిణ చైనా సముద్రంపై తన ఆధిపత్యాన్ని చాటుకునేందుకు చైనా సైనికీకరణకు పూనుకుంటుంది. చమురును ఉత్పత్తి చేసే అరబ్‌దేశాల నట్టనడుమ అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాదుల ఏజెంటుగా ఇజ్రాయిల్, ఇజ్రాయిల్‌కు వ్యతిరేకంగా ఇరాన్‌తో సహా ఇతర అరబ్ దేశాలు సైనికీకరణ దిశలో పయనిస్తున్నాయి. శ్రీలంక తమిళుల పోరాటాన్ని అణిచివేసేందుకు పెద్ద మొత్తంలో ఆయుధాలను కొనుగోలు చేసి తన సైన్యాన్ని రెట్టింపు చేసింది. భారత దేశానికి వ్యతిరేకంగా పాకిస్థాన్ ఏటా తన సైనిక బడ్జెట్‌ను పెంచుకుంటూ పోతున్నది. పశ్చిమాన పాకిస్థాన్‌తో, ఈశాన్యంలో చైనాతో ప్రమాదం పొంచి ఉన్నదంటూ, అంతకంటే ముఖ్యంగా అంతర్గత భద్రతకు పెనుముప్పు ఏర్పడిందంటూ భారతదేశం తన సైనికీకరణకు కారణాలు చూపుతున్నది.

2010లో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న దేశాలు పెట్టిన సైనిక ఖర్చు 16,300 కోట్ల డాలర్లుగా ఉంది. ఇది భారతదేశపు ఒక ఆర్థిక సంవత్సరపు జిడిపితో సమానం. లేదా భారత ప్రభుత్వం ఆరేడు సంవత్సరాల పాటు పైసా పన్ను వసూల్లు చేయకుండానే ప్రభుత్వాన్ని

---

అనుభూతుల పట్ల సుప్రీంకోర్టు పూర్తి సానుభూతిని వ్యక్తం చేసింది. ఘటన జరిగిన కాల వ్యవధిని, సాక్ష్య సేకరణలో ఉండే ఇబ్బందుల్ని (రికార్డుల సేకరణ) దృష్టిలో ఉంచుకొని మళ్లీ విచారణ జరిపించడం వృథాగా సుప్రీం కోర్టు భావించింది.

కుమారుని మరణానికి పరిహారంగా 20 లక్షలు చెల్లించమని హర్యానా ప్రభుత్వాన్ని సర్వోన్నత న్యాయస్థానం ఆదేశించింది.

సుదీర్ఘకాల వ్యవధి తర్వాత పరిశోధించినవి, విచారించినవి, శిక్షించినవి కోకొల్లలుగా కేసులు ఉన్నాయి. ఎక్కువ కాలం తర్వాత పరిశోధించడం, విచారించడం వృథా అనే మాట సర్వోన్నత న్యాయస్థానం నోట పలికితే ఇక దేశంలో న్యాయానికి దిక్కెక్కడ? ఈ మాత్రం జాప్యం చేయించడం, చేయడం పోలీసులకు నీళ్ల ప్రాయం. రెండు పోలీసు స్టేషన్ల నుంచి రికార్డులిప్పించలేనంత బలహీనంగా న్యాయ వ్యవస్థ ఉందా? నాలుగేళ్ల క్రితం జరిగిన కేసును పరిశోధించలేని స్థితిలో సి.బి.ఐ. ఉందా? అదే నిజమైతే దేశ వ్యాప్తంగా జరుగుతున్న అతి పెద్ద స్కాంల దర్యాప్తుల భవిష్యత్తు ఏమిటి? న్యాయ వ్యవస్థపై న్యాయ వ్యవస్థకే నమ్మకం లేదని సామాన్య మానవుడికి అర్థమైతే కక్షిదారుల మానసిక స్థితి ఏమిటి? హతుని తండ్రి ఫీలింగ్స్ గౌరవిస్తున్నామని చెప్పడం ఇలాగేనా? సి.బి.ఐ. విచారణకు ఆదేశిస్తూ నష్ట పరిహారం కూడా ఇవ్వమని చెపితే సుప్రీం కోర్టు పట్ల ప్రజలకున్న గౌరవం మరింత ఇనుమడించేది. 20 లక్షల రూపాయలు సుప్రీం కోర్టు దృష్టిలో చాలా భారీ మొత్తం కావచ్చు. స్కాంల పాపంతో వేల కోట్లు పోగేసుకుంటున్న నేరస్తుల దృష్టిలో అది పిచ్చుకరెట్టంత.

ఇలాంటి పరిస్థితుల్లో ప్రాణాల విలువను డబ్బుతో కొలవడం గాని మానవ సంబంధాలకు డబ్బు ప్రత్యామ్నాయంగా భావించడం గాని, డబ్బు కట్టడం వలన నేర పూరిత మనస్తత్వాలు బాధకు, డబ్బు పంచడం ద్వారా బాధితులు స్వాంతనకు గురవుతారని భావించడం గాని ఏవీ హేతువుకి నిలబడేవి కావు.

(రచయిత న్యాయవాది)

వీ

నడిపేందుకు సరిపడ మొత్తమిది. 2001 నుండి ఈ సైనిక ఖర్చనేది ప్రతిఏట 30 నుండి 50శాతం వరకు నిరంతరంగా పెరుగుతూనే ఉంది. ఈ ఏడాది అమెరికా తన రక్షణకై సుమారు 30 లక్షల కోట్ల రూపాయలను (553 అరబ్ డాలర్లు) ఖర్చు చేస్తున్నది. అదే చైనా 6,34,700 కోట్ల రూపాయలు (గతేడాది 5,95,840 కోట్లు), భారత్ 203672 కోట్ల రూపాయలను తమ రక్షణ బడ్జెట్‌లుగా నిర్ణయించాయి. భారతదేశం తన ఆర్థిక బడ్జెట్‌లో (2013-14) రక్షణ శాఖకి 12.23 శాతం కేటాయించగా, ఇది ఈ దేశ స్థూల జాతీయోత్పత్తిలో 1.83 శాతంగా ఉంది. పాకిస్థాన్ తన రక్షణ బడ్జెట్‌ను ఈ ఏడాది 49,500 కోట్ల రూపాయలుగా నిర్ణయించింది.

సైనికీకరణలో గ్లోబల్ మిలటరైజేషన్ ఇండెక్స్ (జీఎమ్ఐ) ప్రకారం గత ఇరవై సంవత్సరాలుగా ఇజ్రాయిల్ మొదటి ర్యాంకులో ఉంది. రెండవ స్థానాన్ని సింగపూర్ ఆక్రమించింది. మూడు సిరియా, నాలుగు ఖతర్, అయిదు జోర్డాన్, ఏడు కువైట్, ఎనిమిది అజర్ బైజాన్, తొమ్మిది, పది స్థానాల్లో బహరైన్, సౌదీ అరేబియాలు ఉన్నాయి. అమెరికా 29వ స్థానంలో, ఆఫ్రికా ఖండంలోని అంగోలా మాత్రమే 30వ స్థానంలో, ఇరాన్ 34వ స్థానంలో ఉన్నాయి. ఇరాన్ పక్కనే ఉన్న అజర్ బైజాన్ అత్యధిక భూగర్భ సంపదతో సెంట్రల్ ఆసియాలో రాజకీయంగా కీలకస్థానంలో ఉండడంతో అది పెద్దమొత్తంలో సైనిక ఖర్చుకు పూనుకుంటోంది. ఇండియా, చైనాలు కూడా పెద్దమొత్తంలో తమ డిఫెన్స్ బడ్జెట్‌లను పెంచుతూ పోతున్నాయి. ఇండెక్స్‌లో వీటి స్థానం 71-82. శ్రీలంక ప్రభుత్వం కూడా ఎల్‌టిటిఇని అణిచివేసే పేరుతో పెద్ద ఎత్తున సైనికీకరణకు పూనుకుంది. ముంబాయిలోని ఒక మేధావుల బృందం నిర్వహించిన అధ్యయనం ప్రకారం, దక్షిణ ఆసియాలో శ్రీలంక అధికంగా మిలటరీకరణ జరిగిన సమాజంగా తెలిపింది. శ్రీలంకలో ఒక మిలియన్ ప్రజలకు ఎనిమిది వేల మంది సైనికులున్నారు. అదే పాకిస్తాన్‌లో నాలుగు వేలు, నేపాల్‌లో రెండు వేలు, బంగ్లాదేశ్‌లో వెయ్యి మంది సైనికులు మాత్రమే ఉన్నారు. మిలటరీకరణలో సబ్ సహరా, లాటిన్ అమెరికా దేశాలు బాగా వెనకబడి ఉన్నాయి.

సైనిక ఖర్చుల్లో ఆయుధాల కొనుగోళ్ల కోసం వెచ్చించేదే అధికం. సైనిక జీతభత్యాలు, ఇతర వ్యవస్థాగత ఖర్చులు మినహా మిగతా నిధులన్నిటిని చాలా దేశాలు ఆయుధాలు, మందుగుండు లాంటివి కొనుగోలు చేయడానికే వినియోగిస్తున్నాయి. నేడు ఆయుధాల, యుద్ధ విమానాల, ఫిరంగుల, సబ్‌మెరైన్‌ల వ్యాపారం లక్షల కోట్ల రూపాయలలో జరుగుతోంది. ఆయుధాల అమ్మకంలో అమెరికా మొదటి స్థానంలో ఉంది. అమెరికా మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలలో కూడా, యుద్ధాలలో మునిగి ఉన్న దేశాలకు ఆయుధాలను అమ్మింది. యుద్ధరంగం యూరప్‌లో ఉండడంతో యూరప్‌కు అతి దూరంగా ఉన్న అమెరికా యుద్ధంలో ఇరుక్కున్న అన్ని దేశాలకు పెద్దఎత్తున ఆయుధాలనమ్మి కోట్ల కొద్ది డాలర్లను ఆర్జించింది. యుద్ధాలలో ఓడిన జర్మనీ, ఇటలీలుగాని, గెలిచిన బ్రిటన్, ఫ్రాన్సులుగాని తీవ్ర నష్టాలలో కూరుకుపోయి సాధించిన విజయాలనూ, లాభాలనూ నిలబెట్టుకోలేక పోయాయి. ఆయుధాలను అమ్మిన అమెరికా మాత్రం పెద్దఎత్తున లాభాలనార్జించి యుద్ధ ఫలితాలనన్నిటిని చేజిక్కించుకొని, యుద్ధం ముగిసిన తర్వాత వెనువెంటనే పెద్ద ఫైనాన్సర్‌గా ప్రపంచం ముందుకు వచ్చింది. గత సంవత్సరం అంతర్జాతీయ ఆయుధాల మార్కెట్‌లోని 77 శాతం అమ్మకాలను తానే చేజిక్కించుకుంది. 2011లో అంతర్జాతీయ మార్కెట్‌లో అమెరికా ప్రపంచంలోని వివిధ దేశాలకు 66.3 బిలియన్ డాలర్ల (3,51,390 కోట్ల రూపాయల) మేరకు ఆయుధాలను అమ్మింది. ఇది గత 2010తో పోల్చితే 21.4 బిలియన్ డాలర్లు ఎక్కువ. అమెరికా తన ఆయుధాలను పెద్ద మొత్తంలో ఇజ్రాయిల్, సౌదీ అరేబియా, కువైట్, సింగపూర్, ఇరాక్, దక్షిణ కొరియాలకు అమ్ముతోంది. గతంలో లాటిన్ అమెరికాలోని సైనిక నియంతలు పాలించిన అన్ని దేశాలకు ఆయుధాలను అమ్మింది. ఇరాన్ బెదిరిస్తున్న అణు బాంబు దాడికి వ్యతిరేకంగా అమెరికా గల్ఫ్ దేశాలతో కలిసి ప్రాంతీయ మిస్సైల్ డిఫెన్స్ సిస్టమ్‌ను ఏర్పాటు చేస్తానంది. యునైటెడ్ అరబ్ ఎమిరాత్ (యుఎఇ)తో మిస్సైల్ డిఫెన్స్ సిస్టమ్ ఏర్పాటుకై 3.5 బిలియన్ డాలర్ల ఒప్పందం చేసుకుంది. సౌదీ అరేబియాకు 84 అడ్వాన్స్‌డ్ ఎఫ్-15 ఫైటర్స్ బ్లాక్ హక్ హెలికాప్టర్లు అమ్మకానికి ఒప్పందం చేసుకుంది. అమెరికా తన ఆయుధాల అమ్మకాలలో వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నది. కేవలం ఆయుధాలను అమ్మడం వరకే పరిమితం కావడం లేదు. దక్షిణ చైనా సముద్రంపై ఆధిపత్యం కోసం, చైనాకు వ్యతిరేకంగా తైవాన్‌కు పాట్రియట్ అంటే మిస్సైల్స్‌ని రెండు బిలియన్ డాలర్లకు (10,600 కోట్లు) అమ్మింది. ఇది ప్రాంతీయంగా ఉద్రిక్తతలను పెంచుతుందని చైనా వ్యతిరేకించి నప్పటికీ ఖాతర్ చేయలేదు. ఇప్పుడు ఉత్తర కొరియాకు వ్యతిరేకంగా దక్షిణ కొరియాకు పెద్ద ఎత్తున ఆయుధాలను సమకూర్చి, దాంతో ఉమ్మడి సైనిక విన్యాసాలు మొదలుపెట్టింది. గత సంవత్సరం భారతదేశానికి 2017 వరకు దశల వారీగా 155 ఎమ్ఎమ్ అల్ట్రాలైట్ హోవిడ్జర్స్ (ఎమ్-777) 2700 ఫిరంగులను 20 వేల కోట్ల రూపాయలకు అమ్మేందుకు అమెరికా ఒప్పందం చేసుకుంది. అమెరికా తన వ్యూహాత్మక ఆయుధాలను తన వ్యూహంలోని దేశాలకు తప్ప మరెవరికి ఇవ్వదు. ఆయుధాల వ్యాపారం, ఆర్థిక సహాయం, ప్రపంచ ఆధిపత్య రాజకీయాలతో అమెరికా ప్రపంచ వ్యవహారాలలో నిత్యం జోక్యం చేసుకుంటూ, ప్రపంచ పోలీసుగా వ్యవహరిస్తోంది.

అమెరికా తర్వాత ఆయుధాల అమ్మకాలలో రష్యా రెండవ స్థానంలో ఉంది. అంతర్జాతీయ మార్కెట్లో రష్యా వాటా 8.6 శాతం మాత్రమే. ప్రచ్ఛన్న యుద్ధకాలంలో ఆయుధాల ఉత్పత్తిలో అగ్రస్థానంలో ఉన్న రష్యా సోవియట్ యూనియన్ పతనంతో వెనక్కి వెళ్లింది. ప్రచ్ఛన్న యుద్ధ సమయంలో సాగినంత వేగంగా ఆయుధాల అభివృద్ధి అనేది ఆ తర్వాత లేదనే చెప్పుకోవాలి. అప్పుడు పోటీ అనేది స్టార్‌వార్ వరకు వెళ్లింది. సోవియట్ యూనియన్ పతనమై పోయినప్పటికీ అది తన సైనిక శక్తిని మాత్రం ఏమాత్రం కోల్పోలేదు. సద్దాం హుస్సేన్ కాలంలో ఇరాక్, రష్యా నుండి పెద్ద ఎత్తున ఆయుధాలను సేకరించింది. సిరియాకు కూడా రష్యాయే మెయిన్ సప్లయిదారు. ఇప్పుడు మళ్లీ సిరియాకు మిస్సైల్‌ను పంపే ఏర్పాటులో ఉంది. ఇరాన్, ఆల్జీరియాలతో సహా ఇంకా అనేక దేశాలు కూడా రష్యా నుండి ఆయుధాలు కొనుగోలు చేస్తున్నాయి. గత సంవత్సరం ఇరాక్‌తో రష్యా 4.2 బిలియన్ డాలర్ల విలువైన ఒప్పందం చేసుకుంది. భారత్ రష్యా నుండి డిఫెన్స్ హార్డ్‌వేర్‌ను

మొదటి నుంచి దిగుమతి చేసుకుంటున్నది. 2011లో భారత్‌కు దిగుమతి అయిన ఆయుధాలలో 50 శాతం వరకు రష్యా నుండి దిగుమతి చేసుకున్నవే. గతంలో ఇవి 80 శాతంగా ఉండేవి. యుద్ధ శకటాలపై నుండి ప్రయోగించే 10 వేల యుద్ధ శకట విధ్వంసక క్షిపణులను 1200 కోట్ల రూపాయల ఖర్చుతో భారత్ ఈ మధ్యనే రష్యాతో కొనుగోలు చేసింది.

షాంఘై సంఘటనతో చైనా, రష్యాలు వ్యూహాత్మక భాగస్వాములుగా వ్యవహరిస్తున్నాయి. రష్యా తన మొదటి శ్రేణి సుకోయ్-35 యుద్ధ విమానాలను ఇరవై నాలుగింటిని చైనాకు అమ్మింది. సుకోయ్-35 ఇంజన్ రాడార్ చాలా ఉన్నతమైనవి. ప్రపంచంలో చైనా ఒక్కదానికే రష్యా తన యుద్ధ విమానాలను అమ్మింది. రష్యా తన సైనిక శక్తితో, చైనా భాగస్వామ్యంతో అమెరికాకు దీటైన పోటీగా నిలిచింది.

గడాఫీని తుడ్చివేసిన తర్వాత లిబియాకు ఆయుధాల అమ్మకాలలో పశ్చిమ దేశాలు గుత్తాధిపత్యాన్ని సాధించాయి. భారత్ తన వాయుసేన కోసమని ఫ్రాన్స్ నుండి 'డెసాల్ట్ రాఫెల్' అనే 126 యుద్ధ విమానాలను కొనుగోలు చేస్తున్నది. వీటి ఖరీదు 90 వేల కోట్ల రూపాయలు. ఇవి 2016 వరకు సైన్యంలో చేరుతాయట. అలాగే గత సంవత్సరం ఫ్రాన్స్-భారత్ 1.23 అరబ్ డాలర్ల (6519 కోట్ల రూపాయలు) ఎంఐసిఎ మిస్సైల్‌ను కొనే ఒప్పందం కుదుర్చుకుంది. దీంతో భారత్‌కు 500 మిస్సైల్ లభిస్తాయి. 2013 ఫిబ్రవరి 16న ఫ్రాన్స్ అధ్యక్షుడి భారత్ సందర్శన సందర్భంగా భారత్‌లో ఎయిర్ డిఫెన్స్ సిస్టమ్‌ను అభివృద్ధి పరిచేందుకుగాను 30 వేల కోట్ల రూపాయల ప్రాజెక్టుకై ప్రాథమికంగా సంతకాలు జరిగాయి. బ్రిటన్, ఇటలీ, చైనాలు కూడా అంతర్జాతీయ మార్కెట్‌లో ఆయుధాలను అమ్ముకుంటున్నాయి. పాకిస్తాన్ తన ఆయుధాలకై ఎక్కువగా చైనాపైనే ఆధారపడుతోంది. ఎల్‌టిటిఇని అణిచి వేసేందుకు రెట్టింపు చేసుకున్న శ్రీలంక సైన్యంలో చైనా నుండి దిగుమతి చేసుకున్న ఆయుధాలే అధికంగా ఉన్నాయి.

ఆయుధాల వ్యాపారం కోట్లల్లో జరుగుతుండడం, లాభసాటిగా జరుగుతుండడంతో ఇందులో దళారీల పాత్ర కూడా బాగా పెరిగింది. 25 సంవత్సరాల క్రితం రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రిగా కొనసాగిన సమయంలో ఇటలీ నుండి కొనుగోలు చేసిన బోఫోర్స్ ఫిరంగుల డీల్‌లో అవక తవకలు జరిగిన విషయం అందరికీ తెలిసిందే. మధ్యవర్తులయిన విన్ చాద్దా, క్వాత్రోచి, రాజీవ్ కుటుంబానికి ముడుపులు అందాయనేది బహిరంగ రహస్యమే. 2010లో అతి ముఖ్యమైన వ్యక్తుల ప్రయాణాల కోసమని రు. 3600 కోట్ల ఖర్చుతో అతి సురక్షితమైనవిగా భావించే 12 హెలికాప్టర్లను భారత్ ఇటలీతో కొనుగోలు చేసింది. ఇందులో 360 కోట్లు లంచాలు తిన్నట్లుగా బయటికి పాకింది. దేశాన్ని ప్రాణాలొడ్డి అయిన సరే రక్షిస్తానని ప్రమాణం చేసిన వాయుసేన ప్రముఖుడైన ఎస్‌పి త్యాగి పేరు ముందువరుసలోకి రావడం విశేషం. కేవలం కమిషనే పది శాతంగా ఉంటే ఇక కంపెనీలు లాభాల గురించి చెప్పనవసరం లేదు. నిజంగానే ఆయుధాల వ్యాపారమనేది బంగారపు బాతు గుడ్డు లాంటిదే. ఆయుధాలు ఆయా దేశాల శక్తి సామర్థ్యాలకు, బల ప్రదర్శనలకు ప్రతిరూపంగా భావిస్తుండడంతో వాటి డిమాండ్ విపరీతంగా పెరిగిపోయింది. వాస్తవానికంటే రెండు మూడు రెట్లు అధికంగా ధర పలుకుతాయి. ఇక బ్లాక్ మార్కెట్‌లో అయితే పదిరెట్లు అధికంగా ధర చెల్లించైనా కొనేవాళ్లున్నారు. ఈ లాభసాటి వ్యాపారంలో దొరుకుతున్న పెద్ద పెద్ద ముడుపులను కాజేయడంలో, వాటిని విదేశీ బ్యాంకుల్లో దాచుకోవడంలో మన రాజకీయ నాయకులు, ఉన్నత సైనికాధికారులు ముందు వరుసలో ఉన్నారు. 1971లో భారత్-పాక్ యుద్ధ సమయంలో నావికా దళాధిపతిగా పనిచేసిన ఎస్‌ఎం. నందా రిటైర్ కాగానే ఆయుధాల కొనుగోలులో సైన్యానికి మధ్యవర్తిగా పనిచేశాడు. స్వంత వ్యాపారానికై లండన్‌లో ట్రేడింగ్ కంపెనీ తెరిచి, అప్పటికే నావిక దళంలో అధికారిగా పనిచేస్తున్న తన కొడుకైనా సురేశ్ నందాకు కూడా ఉద్యోగానికి రాజీనామా ఇప్పించి ఆయుధాల వ్యాపారంలోకి దించాడు. రాజీవ్ గాంధీకి అతి సన్నిహితుడైన, పార్లమెంటు సభ్యుడు కూడా శ్రీకాంత్‌వర్మ కొడుకు అభిషేక్‌వర్మ విదేశాల నుండి జరిగిన అనేక ఆయుధాల డీలింగుల్లో మధ్యవర్తిగా పనిచేసి కోట్లు సంపాదించాడు. టైట్రా సిపోక్స్ 600 ట్రక్కుల కొనగోలు ఫైల్‌ను ఓకే చేస్తే 14 కోట్ల రూపాయలు ముడుపులుగా అందిస్తానని రిటైర్డ్ లెఫ్టినెంట్ జనరల్, మాజీ ఇంటలిజన్స్ చీఫ్ తెజెందర్ సింగ్ తనకు ఆశ చూపాడని, అక్షరాలా భారత చీఫ్ ఆఫ్ ఆర్మీయే బహిరంగ పరిచాడు. 135 మిలియన్ డాలర్ల ఒప్పందంలోని 40 లక్షల రూపాయలకు విలువ చేసే ట్రక్కులను 80 లక్షలకు, అంటే రెండింతలకు పెంచి అమ్ముతున్నారు. ముడుపుల వ్యవహారాలు పైస్థాయిలో జరుగుతూ ఉండడం, అలా అక్రమంగా ముట్టిన పెద్ద మొత్తాలను విదేశీ బ్యాంకుల ఖాతాల్లో గుప్తంగా జమ అవుతూ ఉండడం నేటికీ కొనసాగుతూనే ఉంది. నిజాయితీలేని మన రాజకీయ నాయకులు, 'దేశభక్తి' సన్నగిల్లిన ఈ సైనికాధికారులు రేపు దేశాన్ని తెగనమ్మినా కూడా ఆశ్చర్యపడాల్సింది లేదు. సైన్యంలో దేశభక్తి ఉద్బోధకం అనేది సాధారణ సైనికులకు కాస్తంత తలకెక్కుతుందేమో గాని, ఉన్నత వర్గాలకు చెందిన సైనికాధికారుల దేశభక్తిని సందేహించాల్సిందే. ఇప్పుడు 90 వేలకోట్ల డెసాల్ట్ రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలులో ముఖేశ్‌అంబానీ మధ్యవర్తిగా వ్యవహరిస్తున్నాడు. దీంట్లో ముడుపులు ఎంతో ఇంకా ముందుకురాలేదు. ఒప్పందాలు ఎంత పెద్దవో ముడుపులు కూడా అంత పెదమొత్తంలో ఉంటాయి.

సామ్రాజ్యవాదుల ఆయుధాల మార్కెట్‌కు వెనుకబడిన దేశాలు పెద్ద వనరుగా తయారయ్యాయి. ఆయుధాల మధ్యన ఉన్న పోటీ మూలానా వాటి వ్యాపారం మరింత లాభసాటిగా తయారయింది. చైనాను దృష్టిలో ఉంచుకొని, ఫ్రాన్స్‌తో కొనుగోలు చేస్తున్న డెసాల్ట్ రాఫెల్ యుద్ధ విమానాలు ఇంకా భారత్‌కు అందీ అందక ముందే, రష్యా తన కోసమే తప్ప మరెవరికీ ఇవ్వనని, తన మొదటి శ్రేణి సుకోయ్-35 యుద్ధ విమానాలను చైనాకు ఇవ్వడంతో, రాఫెల్‌పై పెంచుకున్న నమ్మకాలు అప్పుడే నీరుకారడం మొదలయ్యాయి. డెసాల్ట్ రాఫెల్ కంటే సుకోయ్-35 విమానాలు ఎక్కువ శక్తివంత మైనవి. ఇందులో ఈర్బీస్ రాడార్ ఏర్పాటు ఉంది. రాఫెల్‌లో ఉన్న ఆర్‌బిఇ-2 రాడార్ కన్న ఇది రెండింతల రేంజ్‌లోని టార్గెట్లను వెతుకుతుంది. ఇలా ఏదేని యుద్ధ విమానమో, ఫిరంగో లేక జలాంతర్గామిలో కొనుగోలు చేసి, దాన్ని సైన్యంలో చేర్చిచేర్చక ముందే ఎదుటిపక్షంలో అంతకంటే మెరుగైన

యుద్ధ విమానమో, ఫిరంగో వచ్చి చేరడంతో, మరొక కొత్త ఆయుధం కోసం వెతుకులాట మొదలవుతున్నది. ఇరు దేశాల మధ్యన పోటీని పెంచడమనేది సామ్రాజ్యవాదులకు లాభ దాయకం. సామ్రాజ్యవాద దేశాలు వెనుకబడిన దేశాలలో ఉద్రిక్తతలను, శత్రుత్వాన్ని పెంచి పోషిస్తున్నాయి. లేదా ఆ దేశాలు నిరంతరం యుద్ధాలలో, యుద్ధ వాతావరణంలో మునిగేటట్లు చూడడం వల్లనే అవి నిరంతరం ఆరని రావణ కాష్టంలా మండుతూ ఉండడం వల్లనే, సామ్రాజ్యవాదుల ఆయుధాల ఉత్పత్తి, అమ్మకాలు, లాభాలు ఎడతెగకుండ కొనసాగుతూ ఉంటాయి. అరబ్ రూపాయలలో సాగే సామ్రాజ్యవాదుల ఈ వ్యాపారం, యుద్ధాల కోసం రోజు రంగాన్ని (దేశాలను) సిద్ధం చేస్తూనే ఉంటుంది. అమాయక ప్రజలను శవాలుగా మార్చే ఈ ప్రక్రియ సామ్రాజ్యవాదం ఉన్నంతకాలం నిరంతరం కొనసాగుతోంది.

మానవుడి శ్రమ సంపదలను సృష్టిస్తే, యుద్ధం విధ్వంసాన్ని, వినాశనాన్ని సృష్టిస్తుంది. మానవుడు చెమటోడ్చి సృష్టించిన సర్వ సంపదలను, యుద్ధాలనేవి వాటిని పోగేసి తగల బెడతాయి. సామ్రాజ్యవాదులు ప్రపంచం మీద రుద్దిన మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలలో మొత్తం తొమ్మిదిన్నర కోట్ల మంది హతులయ్యారు. అంతకు మించి క్షతగాత్రులయ్యారు. కోట్ల కొద్ది రూపాయల విలువైన సంపద సర్వనాశనమైంది. 1945 రెండో ప్రపంచ యుద్ధం ముగిసే సమయంలో జపాన్‌లోని హిరోషిమా, నాగసాకి నగరాలపై అమెరికా జరిపిన అణుబాంబు దాడిలో మూడు లక్షల మంది చనిపోయారు. లెక్క లేనంత మంది రేడియేషన్ బారినపడి నేటికీ నరకాన్ని అనుభవిస్తున్నారు. అణుబాంబు పడినచోట పచ్చగడ్డి కూడా మొలవని పరిస్థితి ఏర్పడింది. సామ్రాజ్యవాదుల లాభాల యుద్ధ క్రీడలో కోట్లాది సామాన్యులు బలికావాల్సి వచ్చింది. మితి మీరిన లాభాలకోసం సామ్రాజ్యవాదులు ఎంతకైనా తెగిస్తారనే విషయం చరిత్రలో తేలిపోయింది.

సోవియట్ యూనియన్ పతనంతో అగ్రరాజ్యాల మధ్యన పోటీ అంతరించి, ప్రచ్ఛన్నయుద్ధం వెనక్కి వెళ్లి మూడవ ప్రపంచయుద్ధం ముందుకు రాకపోయినప్పటికీ సామ్రాజ్యవాదుల కుట్రల యత్నాలతో ప్రపంచంలోని అనేక దేశాలు స్థానిక, ప్రాంతీయ యుద్ధాల్లో ఇరుక్కు పోయాయి. మారణకాండ కొనసాగుతూనే ఉంది. 2001లో అఫ్ఘానిస్థాన్ మీద, 2003లో ఇరాక్ మీద దాడి చేసిన నాటినుండి అమెరికా 15 లక్షల మందిని చంపి వేసింది. 1991లో మొదటిసారి ఇరాక్‌పై దాడి సందర్భంగా లక్షకుపైగా ఇరాక్ సైనికులను ఎడారుల్లోనే బుల్‌డోజర్లతో చంపి ఆ ఎడారుల్లోనే ఇసుకలో పూడ్చివేసింది. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిననాటి నుండి మధ్యప్రాచ్యంలో అరబ్ దేశాలకు వ్యతిరేకంగా ఇజ్రాయిల్ సైనిక శక్తి వెనుక అండగా అమెరికా, పశ్చిమ దేశాలు ఉన్నాయనేది స్పష్టం. ఆయిల్ దోపిడికై అరబ్ ప్రాంతం రణ రంగంలా ఉంది. యుద్ధాల నడుమనే దశాబ్దాలుగా అరబ్ ప్రజానీకం జీవన సమరం సాగిస్తున్నారు. రష్యన్ భల్లూకం పట్టులోంచి బయట పడ్డ అఫ్ఘానిస్థాన్ నేడు అమెరికాతో తలపడుతున్నది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత జరిగిన స్థానిక, ప్రాంతీయ యుద్ధాలలో జరిగిన ప్రాణనష్టం, ఆస్తి నష్టం మొదటి, రెండవ ప్రపంచయుద్ధాలకు ఏమాత్రం తీసిపోదు. వియత్నం, కోరియా, ఇండో-చైనా, ఇండో-పాక్, పాక్-బంగ్లాదేశ్, ఇరాన్-ఇరాక్, ఇజ్రాయిల్-అరబ్ దేశాలు, ఇజ్రాయిల్-పాలస్తీనా, సోమాలియా, అర్జెంటీనా లాంటి దేశాలలో సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష పరోక్ష చొరబాటుతో జరిగిన యుద్ధాలలో లక్షల సంఖ్యల్లో ప్రజలు హతులయ్యారు. అలాగే ఇండోనేషియా, మలయా, పిలిప్పిన్స్, చిలీ, టర్కీ, పెరూ, క్యూబా, బొలివియా, అల్జీరియా, కాంగో, బర్మా, నేపాల్, శ్రీలంక, భారత్‌ల్లో జరిగిన జరుగుతున్న అంతర్యుద్ధాలలోనూ పెద్దఎత్తున మారణకాండ జరిగింది. మరణాలు వేల, లక్షల సంఖ్యలోనే ఉంటాయి. పెద్దఎత్తున జరుగుతున్న మారణకాండ నుండి తప్పించుకోవడానికి ప్రజలు తమ ఊర్లు, దేశాలు విడిచి ఇతర దేశాల్లోనే కాదు, తమ దేశాల్లోనే శరణార్థులుగా బతకాల్సి వస్తోంది. గత మూడు దశాబ్దాలుగా పోరాడిన శ్రీలంక తమిళ ప్రజలను, శ్రీలంక సైనిక బలగాలు క్రూరంగా అణచివేసి 66 వేల మందిని చంపివేశాయి. గత దశాబ్దంలో సాగిన నేపాల్ విముక్తి పోరాటంలో 10 వేలకు పైగా పోరాట యోధులు, ప్రజలు నేలకొరిగారు. నేడు అన్ని దేశాల సైనికులకు, సైనిక దళాలకు సరిహద్దు భద్రత, అంతర్గత భద్రత అనేవి విడివిడిగా అంటూ ఏమి లేకుండా పోయాయి. అధికారంలో ఉన్న పాలకులు ఏది చెపితే అదే వారికి వేదంలా తయారయింది.

ప్రపంచాధిపత్యం కోసం కొనసాగుతున్న సామ్రాజ్యవాదుల వ్యూహంలో, వారికి తాబేదారుగా ఉన్న భారత పాలక వర్గం, దక్షిణాసియాలో ఛోటా నవాబుగా వ్యవహరిస్తోంది. 1971లో తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్ విభజన)లో సైనిక జోక్యం, శాంతి పరిరక్షక దళం (ఐపికెఎఫ్) పేరుతో శ్రీలంకలో ప్రవేశం, సిక్కింను కబళించడం, నేపాల్ సార్వభౌమాధికారాన్ని ధిక్కరిస్తూ, చైనా సరిహద్దు గల నేపాల్ భూభాగంలో తన సైనిక అడ్డాను కొనసాగించడం, భారత పాలకుల విస్తరణవాద కాంక్షను తెలియజేస్తున్నాయి. పాకిస్తాన్ సరిహద్దులో యుద్ధ ప్రమాదం పూర్తిగా తొలగిపోలేదని, పశ్చిమం కంటే ఈశాన్య సరిహద్దులో చైనా మనకు భద్రత సవాళ్లను సిద్ధ పరిచిందని చెపుతూ, భారత్ పెద్ద ఎత్తున సైనికీకరణకు పూనుకుంది. ఈ సైనికీకరణ వెనుక భారత పాలకులకు విస్తరణవాద కాంక్ష లేదని చెప్పలేం.

పదమూడు లక్షల మంది సైనికులతో భారత్ ప్రపంచంలోనే నాలుగవ అతిపెద్ద సైన్యంగా నిలిచింది. దాని అనుబంధ సైనిక బలగాల సంఖ్య కూడా గణనీయంగానే ఉంది. వాటిని సాయుధంగా సంఘటితం చేయడానికి ఏటా లక్ష కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నది. ఇందుకై 2009-12 మధ్యలో మొత్తం 2 లక్షల కోట్ల రూపాయలను ఆయుధాల కొనుగోలుకై ఖర్చు పెట్టింది. 2010 మొదలు 2012 వరకు మూడు సంవత్సరాలలోనే 28 వేల తుపాకులను రష్యా నుండి కొనుగోలు చేసింది. ఇందులో ఎక్కువ శాతం ఎకే 47 తుపాకులే ఉన్నాయి. కొనుగోలు చేసిన తుపాకుల నుండి 18 వేల అసాల్ట్ రైఫిల్స్‌ను మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలలోని సాయుధ బలగాలకు కేటాయించింది. సైన్యం కేవలం సరిహద్దులో శత్రువుతో మాత్రమే పోరాడుతుంది అనేది ఒట్టి బూటకం. గత మూడు దశాబ్దాలుగా మూడు లక్షల భారత సైన్యం కాశ్మీర్‌లో తిష్టవేసి, సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం కింద విశేషమైన అధికారాలు పొంది 70 వేల మంది కాశ్మీరీ యువతను, మిలిటెంట్లను హత మార్చాయి. యువకులను మాయం చేయడం, పట్టుకొని కాల్చివేసి సామూహికంగా శవాలను పూడ్చిపెట్టడం, కనిపించిన మహిళలను సామూహికంగా మానభంగాలు

చేసి చివరకు వారిని హత్య చేసి శవాలను కాలువల్లో పారేశారు. 1991 ఫిబ్రవరి 23న ఉత్తర కాశ్మీర్‌లోని కోనరి, పోశపారా గ్రామాల్లోని వంద మంది మహిళలను భారతీయ సైన్యం, సామూహిక అత్యాచారాలు చేసింది. తల్లుల ముందరే పిల్లలను చెరచారు. కాశ్మీరీలోయలో కనిపించని పిల్లలకోసం విలపించని తల్లి లేదు. మొత్తంగా ఒక తరం యువత గ్రామాల్లో లేకుండా పోయింది. ఇంతటి అత్యాచారాలకు, హత్యలకు పాల్పడిన భారతీయ సేనను, తమ దేశాన్ని కాపాడే సైన్యంగా కాశ్మీరీ ప్రజలు ఎలా నమ్ముతారు?

ఈశాన్య భారతంలోని ఏ సాధారణ ప్రజానీకాన్నడిగిన భారతీయ సైన్యాన్ని విదేశీ సైన్యంగానే పిలుస్తారు. భారతీయసేన జరిపిన ఘాతుకాలకు బలైన ఈశాన్య ప్రజల నరనరాల్లో 'ఇండియన్ ఆర్మీ గో బ్యాక్' అనే నినాదం జీర్ణించుకు పోయింది. 1967 నక్సల్బరీలో 'దున్నే వాడికే భూమి' అంటూ, జోతేదార్లపై తిరగబడ్డ రైతాంగంపైన అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ సైన్యాన్ని దింపి నెత్తురు పారించింది. నక్సల్బరీ మొదలు శ్రీకాకుళం, ముషా హరి, బీర్‌భుమ్, లఖింపూర్ ఖేరి, ధర్మపురి, మలనాడు, మహారాష్ట్ర, ఆంధ్ర, పశ్చిమ బెంగాల్, ఒడిషా, బీహార్, జార్ఖండ్‌ల నుండి నేటి దండకారణ్యం వరకు విశాల ప్రాంతంలో గత నాలుగు దశాబ్దాలుగా భూమి, భుక్తి, విముక్తి కోసం, జల్, జంగల్, జమీన్ కోసం, భూస్వామ్య కార్పొరేటు, బహుళజాతి సంస్థల దోపిడికి వ్యతిరేకంగా పోరాడిన పదమూడు వేల మందికి పైగా విప్లవ ప్రజానీకాన్ని, వారి నాయకత్వాన్ని, భారత దేశ సాయుధ బలగాలు భూస్వాముల, కార్పొరేట్, బహుళజాతి సంస్థల పక్షం వహించి హతమార్చాయి. రాజ్యంపై ఏ వర్గం ఆధిపత్యం కొనసాగుతుందో, ఆ వర్గం తన ప్రత్యర్థివర్గాన్ని అణచడానికి రాజ్యం, ఆయుధాన్ని ఓ సాధనంగా ఉపయోగించు కుంటుందనేది స్పష్టమవుతున్నది.

సామ్రాజ్యవాద, బడా కంపెనీల, బడా భూస్వాముల అంటకాగుతున్న భారత పాలకవర్గాలు, సాయుధ బలగాల దన్ను లేకుండా ఒక్క రోజు కూడా తమ పరిపాలన కొనసాగించలేని స్థితికి నెట్ట బడ్డాయి. వామపక్ష తీవ్రవాదం నేడు దేశ అంతరంగిక భద్రతకు పెనుముప్పుగా పరిణ మించిందన్న ప్రధాని మన్మోహన్‌సింగ్ ప్రకటన, జల్, జంగిల్, జమీన్‌కై ఉద్యమిస్తున్న ప్రజలపైకి సైన్యాన్ని ఉసిగొల్పేలా చేసింది. భారత సైన్యంలోని మాజీ బ్రిగేడియర్ పోన్వర్ బాధ్యుడిగా కాంకేర్‌లో జంగిల్ వార్‌ఫేర్ స్కూల్‌ని స్థాపించి, అందులో 47 వేల మంది సాయుధ బలగాలకు సైన్యం శిక్షణనివ్వడం, 2011 మే 31న శిక్షణ పేరుతో బస్తర్‌లో సైన్యాన్ని దింపడం, ఇలాంటి శిక్షణ కోసమేనని సరాయిపాలి అడవి ప్రాంతాన్ని అప్పగించడం, బిలాస్‌పూర్‌లోని చకర్ బాటాలో భారతీయ వాయుసేన ట్రైనింగ్ సెంటర్‌ని, మిలటరీ బెస్ స్టేషన్‌ను ఏర్పాటు చేయడం, జిరాం ఘాటి ఘటన జరిగిన వెనువెంటనే బస్తర్‌లో అర్ధ సైనిక బలగాల మద్దతుకై వాయుసేనకు చెందిన 12 హెలికాప్టర్లతో నాగపూర్‌లో వాయుసేన అడ్డాను ఏర్పాటు చేయడం లాంటివే గాక, భారీ సైనిక మొహరింపులు, 83 ఎం.ఎం మోర్టార్లు, రాకెట్ లాంచర్‌లు ఆర్మ్‌డ్ వెహికిల్స్, హెలికాప్టర్ల కేటాయింపులు చూస్తుంటే, ఇవన్ని బస్తర్‌పై ప్రత్యక్ష సైనిక జోక్యానికే అనే విషయం తేటతెల్లం చేస్తుంది. ప్రమాదకరమైన మానవరహిత 'డ్రోన్' విమానాల దాడికి కూడా సన్నహాలు పూర్తయ్యాయి. ఈ సైనిక జోక్యం మాడ్‌లో మొదలై మధ్య, తూర్పు భారతంలోని ఆదివాసి ప్రాంతాలను ఆక్రమించి, ఆదివాసులను నిర్వాసితులను గావించి, ఈ మొత్తం భూభాగాన్ని కార్పొరేట్, బహుళజాతి సంస్థలకు అప్పగించడమే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తలపెట్టిన ఈ యుద్ధం లక్ష్యమని స్పష్టమవుతోంది. కేంద్రం నుండి అర్ధ సైనిక బలగాలను చత్తీస్‌గడ్‌లో దింపి, కేంద్ర రాష్ట్ర సంయుక్త బలగాలకు తానే 'కమాండర్ ఇన్ చీఫ్' గా బాధ్యతలు స్వీకరించిన ముఖ్యమంత్రి రమణ్‌సింగ్, రాష్ట్రం మొత్తాన్నే పోలీసు రాజ్యంగా మార్చి వేశాడు. పాలకవర్గాల దోపిడిని నిలదీసినందుకే ప్రజలనే శత్రువులుగా భావించి ప్రజలపైనే యుద్ధాన్ని ప్రకటించాయి.

ప్రపంచంలోని అన్ని దేశాలలో లాగే భారత దేశ ప్రజలు కూడ అందరిలాగే కడు పేదరికంలో బతుకులీడ్వాల్సి వస్తున్నది. ఈ దుస్థితికి దేశంలో సంపదలు కరువై కాదు. విశాలమైన సాగు భూములు, అడవి సంపద, మత్స్య సంపద, ఏడాది పొడుగుతా పారే జీవనదులు, ఇనుము, బొగ్గు, బాక్సైట్ లాంటి ఖనిజ సంపదలెన్ని ఉన్నా, సామాన్యుడికి కడుపు నిండ తిండి దొరకడం గగనమై పోయింది. భూములను భూస్వాములు, ఖనిజ సంపదలను కార్పొరేటు, బహుళ జాతి సంస్థలు కాజేయడంతో, దేశంలో ఏటా 26 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను పండిస్తున్నప్పటికీ 82 కోట్ల మంది ప్రజలకు ఆహార భద్రత లేకుండా పోయింది. 10855 కోట్ల రూపాయల విలువైన 27 అంతస్తుల 'అంటీలియా' భవనంలో ఐశ్వర్యం నిక్షిప్తమై ఉంది. దాన్ని ఏటా 180 లక్షల ఖర్చుతో జడ్ కేటగిరి కింద ప్రభుత్వం కాపాలా కాస్తోంది. రాజులు పోయి రాజ్యాలు అంతరించినా, రాచమర్యాదలకేమి కొదవలేనట్టు నాలుగు వందల ఇరవై ఎకరాల స్థలంలో, పదహారు వేల కోట్ల రూపాయల విలువైన, మూడు వందల నలభై గదుల భవనంలో (రాష్ట్రపతి భవన్) భారత ప్రప్రథమ పౌరుడు నివాసముంటున్నాడు. ఈ దేశంలో, తాడిమెట్లలో మూడు వందల నలభై గుడిసెలు బూడిదయినా, సార్కెన్‌గూడ, ఎడ్సమెట్టలో అమాయక ఆదివాసులు హతులయినా ఎవరిక్కావాలి. సంపదను సాయుధ శక్తి కాపలా కాస్తున్న చోట ప్రజలు తమ మనుగడ కోసం పోరాడక తప్పదు. అది వర్గ సంఘర్షణగా రూపు దాల్చి, సాయుధ ఘర్షణతో తప్ప మరే విధంగానూ పరిష్కారం కాజాలదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. - సం.

# ఖైర్లాంజి : కుల-వర్గ అవగాహన

**ఆనంద్ తేల్‌తుంబ్డె రాసిన 'ఖైర్లాంజి' పుస్తకంపై సమీక్షావ్యాసంలో కుల సమస్యపై మార్క్సిస్ట్ దృక్పథాన్ని, అంబేద్కర్ దృక్పథాన్ని, తేల్‌తుంబ్డె వాదనలను పరిశీలిస్తున్నారు ఎన్. రవి**

(గత సంచిక తరువాయి...)

ఖైర్లాంజి విషయంలో విషాదంగా కనిపించేదేంటంటే స్థానిక రాజ్య యంత్రాంగంలో ముఖ్యులంతా దళితులే. భండారా ఎస్.పి, డిఎస్‌పిలు, అంధల్‌గాంవ్ పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్, ఏరియా కానిస్టేబుల్, పోస్ట్‌మార్టమ్ చేసిన జూనియర్ డాక్టర్, జూనియర్ డాక్టర్‌తో పోస్ట్‌మార్టమ్ చేయించిన సివిల్ సర్జన్, పబ్లిక్ ప్రాసిక్యూటర్, నోడల్ ఆఫీసర్ అందరూ దళితులే. అందులోనూ అత్యధికులు మహర్లే. ఖైర్లాంజి బాధితులైన భోట్‌మాంగేలు కూడా మహర్ కులస్తులే.

మరి ఎందుకలా జరిగింది?

తమ వాళ్లను కొందరిని రాజ్య యంత్రాంగంలో చేర్పించినంత మాత్రానే రాజ్య స్వభావం మారుతుందని ఆశిస్తే అది దళితుల అమాయకత్వమే అవుతుంది. ఒక సంస్థ స్వభావం ఆ సంస్థను నడిపించే / రక్షించే (manning it) విడి వ్యక్తులందరి స్వభావాల కూడిక మొత్తంతో సమానమైంది కాదు. ఎన్నో అనుభవాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నా దళితులు అర్థం చేసుకోవడం లేదు. సంస్థలు చిరకాలం ఉండేవి. వ్యక్తులు జీవిత పర్యంతం మాత్రమే ఉంటారు. కాబట్టి సంస్థలు వ్యక్తులకు అతీతంగా ఆధిపత్య - వర్గ స్వభావాన్ని ప్రతిబింబిస్తాయి. ఒకవేళ వ్యక్తులు ఆ సంస్థ / వ్యవస్థ స్వభావానికి అనుగుణంగా లేకపోతే అందుకు అనుగుణంగా మారేంతవరకు వాళ్లపై తీవ్రమైన ఒత్తిడి ఉంటుంది. వాళ్ల వర్గస్థాయి కారణంగా దళితులపై ఈ ఒత్తిడి అనివార్యంగా ఉంటుంది. దాంతో కొంత కాలానికి తమ ఉనికిని కాపాడుకోవడానికి సచేతనంగానో, అచేతనంగానో రాజీపడిపోతారు. ఈ క్రమంలో అపరాధ భావన నుండి తమ్ముతాము రక్షించుకోవడానికి తాము దళితులకు ఎంతో చేసేస్తున్నామని చెప్పుకుంటారు. అయితే ఈ క్రమంలో ఏపాటైనా దళితుల కోసం చేసినా అది రాజ్యపరిపాలనా తంత్రపు పరిధిలోకి వచ్చేదే తప్ప అంతకు మించి కాదు. ఎవరైనా వ్యక్తిగతంగా ఒక దళిత వ్యక్తి ఈ ఒత్తిడిని తట్టుకొని దళితుల ప్రయోజనాలను మొదట్లో నెరవేర్చినా, అధికారంలో పైకి వెళ్లే కొద్దీ తనకు తెలియకుండానే పై వర్గ స్వభావాన్ని సంతరించుకుంటాడు. క్రమంగా తన మూలాలను మరిచిపోతాడు.

తమ వాళ్లు అధికార స్థానాల్లో ఉంటే ప్రభుత్వానికి సంబంధించిన విషయాల్లో తమకు సాయం చేస్తారని దళితులు కూడా నమ్ముతారు. అంబేద్కర్ కూడా అట్లాగే ఆశించాడు. కానీ తన తప్పిదాన్ని తెలుసుకొని చదువుకున్న వాళ్లు తనను మోసం చేశారని వాపోయాడు. అధికార యంత్రాంగంలో కొంతమంది దళితులకు స్థానం కల్పించడం ద్వారా రాజ్యం గురించిన భ్రమలు పెరుగుతాయి అంతే. పైగా పాలక వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజల నిరంతర రాజకీయ ఒత్తిడి ద్వారా మాత్రమే రాజ్య స్వభావంలో మార్పు సాధ్యమనే విషయాన్ని కూడా అది మరుగు పరుస్తుంది.

కుల భావన / కుల చైతన్యం (caste consciousness) నిర్మూలించి వర్గ చైతన్యం పెంపొందించడం ద్వారానే కుల నిర్మూలన సాధ్యం : కులానికి (కులభావనకు) అనంతంగా విభజించే లక్షణం ఉంది. కులాలు - ఇతర కులాలతో సంబంధాల్లోకి వెళ్లాల్సి వచ్చినప్పుడు తమలోకి ముడుచుకుంటాయి. సాపేక్షంగా తమ ఆధిక్యాన్ని స్థాపించుకోవడానికి ప్రయత్నిస్తాయి. ఇతర ఉన్నత కులాలు ఆధిక్యత కోసం చేసే ఒత్తిడి తొలగగానే కులాలు తమలోనే నిచ్చెన మెట్ల దొంతరను వెతికి ఆవిష్కరించుకుంటాయి. అట్లా బ్రాహ్మణవాదానికి వ్యతిరేకంగా పోరాడడానికి విభిన్న అస్పృశ్య కులాలు ఒక్కటై 'దళిత' అస్తిత్వాన్ని ఆవిష్కరించుకున్నాయి. ఈ ఒత్తిడి తొలగగానే (బ్రాహ్మణవాదంతో పోరాడాల్సిన తప్పనిసరి అవసరం, అందరి విశ్వాసం చూరగొన్న గొప్పనాయకత్వం - ఈ రెండూ తొలగగానే) మహర్ కులంలోనే ఉపకులాలు తలెత్తి వాటిలో అవి తాము అధికులమంటే తాము అధికులమనే కొట్లాట ప్రారంభమైంది. దళిత ఉద్యమంలోని ఎన్నో అవాంఛిత పరిణామాలను ఈ చట్రంలో విశ్లేషించి చూడవచ్చు. కులం అంతస్సారంలో వ్యక్తివాద వైఖరి. అది నిరంతరం ఆధిక్యతా భావాన్ని కోరుకుంటుంది. కులపు విభజించే భావజాలం కుటుంబం వద్ద కూడా ఆగదు. అది వ్యక్తి స్థాయి దాకా కూడా పోవచ్చు. కుటుంబంపైన బయటి ఒత్తిడి లేనప్పుడు (అంటే బయటి 'శత్రువు' కారణంగా ఐక్యంగా ఉండాల్సిన అవసరం లేనప్పుడు) కుటుంబ సభ్యులు కూడా ఊహాజనితమైన నిచ్చెనమెట్ల దొంతరలో తమ కుల ఆధిక్యతను ప్రదర్శిస్తారు. మన దేశ సంస్కృతినంతా ఇట్లా కుల దృక్పథం నుండి వివరించవచ్చు.

ఈ వ్యక్తివాదం కులీన వర్గాలకు, కులాలకే తోడ్పడుతుంది. అటువంటి వాళ్లే స్వేచ్ఛా విపణిని, ప్రపంచీకరణను ఆహ్వానిస్తారు.

శూద్రులు, దళితుల మధ్య ఐక్యత ఎంతో వాంఛనీయమైనదనేది నిర్వివాదాంశం. అయితే కులం అనేది అటువంటి ఐక్యతకు ప్రాతిపదిక కాజాలదని గుర్తించడం అవసరం. వర్గ ప్రాతిపదికన మాత్రమే అది సాధ్యం. నిజానికి కుల వ్యవస్థ ఈనాడు ఎంత సంక్లిష్టమైనదంటే కుల ప్రాతిపదిక రానురాను నిరర్థకమవుతోంది. ఎంత త్వరగా ఈ ప్రాతిపదికను మార్చుకుంటే అంత మంచిది. అయితే కులాన్ని ఒక విశ్లేషణా పరికరంగా పూర్తిగా నిరాకరించడమన్నా అది తప్పే. కడుగుతో పాటు బియ్యం పారబోసిన చందమవుతుంది. కావలసిందేమిటంటే కులానికి ఉన్న సకలకోణాలను (డైనమిక్స్) గురించిన మన అవగాహనను సునిశితం చేసుకోవాలి.

కుల దాడులను, అత్యాచారాలను ఆపడమెట్లా ? 'దళితులు తక్కువ స్థాయి మనుషులు, వాళ్లు అట్లాగే వ్యవహరించాలి' అన్న కుల భావజాలం వల్ల ఈ కుల కట్టుబాటును ధిక్కరిస్తే శిక్షించవచ్చు అనే దానికి సమాజ సమ్మతి ఉంది. తమ రాజకీయ, సామాజిక ప్రాబల్యం పలుకుబడి కారణంగా బాధితులు ఫిర్యాదు చేయరని, చేసినా ఏం కాకుండా చూసుకోగలమనే ధీమా. న్యాయస్థానాల్లో కూడా శిక్ష నుండి తప్పించుకోగలమనే భరోసా కుల అత్యాచారాలకు కారణమవుతున్నది.

దళితులు తమ పౌరహక్కుల కోసం నిలబడడమే రెచ్చగొట్టే చర్యగా సవర్ణ హిందువులు భావిస్తున్నప్పుడు, అత్యాచారాన్ని నిలవరించడం కోసం, హక్కుల కోసం పోరాడడమే మానేయాలంటే ఆ పౌరహక్కులనే అణచివేసినట్లే. ఇది అత్యాచారం కంటే దారుణమైన వెనుకబాటు చర్య. మరి దీనికి పరిష్కారం కుల భావనను, కుల వైషమ్యాన్ని నిర్మూలించడంలో ఉండవచ్చు. అణగారిన కులాల కుల వ్యతిరేక పోరాటం వల్ల కుల వైషమ్యం పుడుతున్నదనేది గమనించవచ్చు. అందువల్ల కుల వైషమ్యాన్ని / శత్రుత్వాన్ని నిరోధించడానికి ఆ పోరాటాన్ని ఆపడమంటే అది పలాయనవాదం. అందువల్ల కుల నేరాలను అరికట్టాలంటే కుల భావనను నిర్మూలించేందుకు కృషి చేయాలి. ఖైర్లాంజీలు పునరావృతం కాకుండా నివారించాలంటే నిజమైన వర్గ చైతన్యం నిర్మించడం ద్వారా మాత్రమే సాధ్యం.

అత్యాచారాలను ఆపడానికి సైద్ధాంతికంగా కులాన్ని భావజాల స్థాయిలో ఎదుర్కోవాలి. భౌతిక స్థాయిలో దాడులను ప్రతిఘటించి ఆపాలి. గ్రామీణ ప్రాంతాల్లో అధికారానికి మూలమైన మౌలిక వనరు - భూమిని - వ్యక్తిగత ఆస్తి పరిధి నుండి తొలగించి 'రాజ్యం - మైనారిటీలు' లో అంబేద్కర్ ప్రతిపాదించినట్లు భూమిని జాతీయకరణ చేయాలి.

ధర్మశాస్త్రాల్లో కులానికి పునాదులున్నాయని భావించి వాటిని సైద్ధాంతికంగా ఎదుర్కొన్న కుల వ్యతిరేక పోరాటం ఎంచుకున్న పద్ధతి మొదటి పద్ధతి. ఇక భౌతిక దాడులను భౌతికంగానే ఎదుర్కొని ఆపడానికి దళితులు ఐక్యమై, బలోపేతం కావాలి. వారికి మద్దతుగా బయటి శక్తులను కూడగట్టాలి. దళితులు దాడులను ప్రతిఘటించగలరు, ప్రతిదాడులు చేయగలరనే భయం ఉంటే దాడులు చేసే వాళ్ళు చేయరు. ఉదాహరణకు చెంచురామయ్యను పీపుల్స్‌వార్ దళం చంపేశాక ఆ ప్రాంతంలో పెద్ద అత్యాచారం జరగలేదు. నక్సలైట్లు దళితులకు వెన్నుదన్నుగా ఉన్నారని సవర్ణులు భావిస్తే దళితులపై దాడి చేయడానికి ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తారు. అయితే బీహార్‌లోలా దాడులు - ప్రతిదాడులకు కూడా దారి తీయవచ్చు.

గ్రామీణ ప్రాంతంలో దళితులకు, సవర్ణులకు మధ్య అధికారంలో అంతరానికి మూల వనరైన భూసంపదను వ్యక్తిగత ఆస్తి పరిధి నుండి తొలగించడం కుల వ్యవస్థతో పోరాడే మరో ముఖ్య వ్యూహం. పాలక వర్గాలు కావాలనే అరకొరగా బూటకపు భూ సంస్కరణల నాటకానికి తెరతీశాయి. భూమిని జాతీయకరణ చేస్తే కుల వ్యవస్థ పునాదులు కదిలేవి. అయితే అటువంటి కార్యభారం చేపట్టాలంటే రాజ్యాన్ని సంపూర్ణంగా విప్లవీకరించడం తప్పనిసరి.

ఈ పరిచయ - సమీక్షా వ్యాసంలో పై అభిప్రాయాలన్నీ ఖైర్లాంజి పుస్తకంలోనివే. పుస్తకంలో వివిధ అధ్యాయాల్లో ఉన్న తేల్‌తుంబ్డె సైద్ధాంతిక ప్రతిపాదనలన్నీ ఒకే చోటచేర్చడం మాత్రమే జరిగింది. ప్రతిపాదనలకు తగిన ఉపశీర్షికల్లో కొన్ని మాత్రమే ఈ వ్యాసకర్త స్వయంగా చేర్చినవి. ఇక ఖైర్లాంజి ఘటనకు సంబంధించిన వివరాలు, మీడియా దాదాపు సంపూర్ణంగా అగ్రకులాల చేతిలోనే ఉన్న విషయానికి సంబంధించి వివరాలు ఈ వ్యాసంలో తడమడం లేదు. అవన్నీ వాటికవే స్పష్టమైనవి.

కులం - వర్గం - భూమి, ఆర్థిక అభివృద్ధికి సంబంధించిన ప్రతిపాదనల గురించి కొంత చర్చిద్దాం.

కుల అత్యాచారాలు, భూయజమాన్యం గురించిన చర్చ చేస్తూ భూయజమాన్యం - అధికారం (దళితుల అధికారం) ఒక భ్రమ అని పుస్తకం చివరి అధ్యాయంలో తేల్‌తుంబ్డె అంటాడు. కులాన్ని వర్గానికి సంబంధించిన ఒకానొక అంశంగా మాత్రమే పిడివాద వామపక్షవాదులు చూస్తారనీ, అన్ని కుల ఘర్షణలకు మూలాలు భూసమస్యతో ముడిపడి ఉన్నాయని తామే కల్పించుకున్న భ్రమను విశ్వసిస్తారని విమర్శిస్తాడు. మార్క్సిస్టు ఆర్థిక నియతివాదానికి మద్దతుగానే ఈ వాదన తోడ్పడుతుందని, భారతదేశంలో వామపక్షవాదులు ఈ విషయంలో పిడివాద వైఖరి నవలంబిస్తారని కూడా విమర్శించాడు.

మరొక చోట కులదాడులను, కుల అత్యాచారాలను ఆపడమెలా అని చర్చిస్తూ గ్రామీణ ప్రాంతంలో కుల అధికారానికి మూలవనరు భూ ఆధిపత్యమని సరిగా గుర్తిస్తూ అంబేద్కర్ 'రాజ్యం - మైనారిటీలు'లో ప్రతిపాదించినట్లు భూమిని స్వంత ఆస్తి పరిధిలోంచి తప్పించి జాతీయకరణ చేయాలి అంటాడు.

రెండు వ్యాఖ్యలు పరస్పరం కొంచెం విరుద్ధంగా కనిపించినా కొంచెం అన్వయించుకుంటే పైకి కనిపించే ఆ వైరుధ్యాన్ని తొలగించుకోవచ్చు.

భావజాలపరంగా కుల సమస్యకు కొన్ని శతాబ్దాలుగా వేళ్లూనుకున్న కుల సంస్కృతి కారణంగా ఉండొచ్చు. కానీ ఆ పేరున భూ సమస్యను, తద్వారా ముడిపడిన ఆర్థిక కారణాలను కూడా ఏమాత్రం తక్కువ చేసి చూడరాదు. గ్రామీణ ప్రాంతంలో బ్రాహ్మణకులాల ఆధిపత్యం నిర్ణయాత్మకంగా దెబ్బతినడానికి కారణం బ్రాహ్మణ వ్యతిరేక శూద్రకులాల పోరాటంతో పాటు, దాని ఫలితంగా కూడా భూసంబంధాల్లో వచ్చిన మార్పే కదా! భూయజమాన్యం బ్రాహ్మణ కులాల చేతుల్లో నుండి వ్యవసాయ శూద్రకులాల చేతుల్లోకి మారడంతోనే కదా ఈ మార్పు సంభవించింది! ఈ విషయాన్ని స్వయంగానే విపులంగా వర్ణించి చర్చించిన తేల్‌తుంబ్డె 'అన్ని కుల - ఘర్షణలు భూసమస్యతో ముడిపడి ఉన్నాయని తామే కల్పించుకున్న భ్రమను విశ్వసిస్తార'ని అనడంలో మార్క్సిస్టులను కొంత గేలిచేయడం ఉంది. (రివిజనిస్టుల నుండి మావోయిస్టుల దాకా ఏ తేడా పాటించకుండా మార్క్సిస్టులనడం వల్ల కూడా తేడాలనర్థం చేసుకోవడం కష్టం) అయితే మార్క్సిస్టులు (నేను ప్రధానంగా వ్యవసాయ విప్లవాన్ని ఇరుసుగా నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమంలో నిమగ్నులైన విప్లవకారుల గురించి మాట్లాడుతున్నాను) పై విమర్శలో నుంచి గ్రహించవలసిన దాన్ని తప్పక గ్రహించాల్సిందే. అది ఎలా ?

కుల అధికారానికి గ్రామీణ భారతంలో మూల వనరు భూ సంపదేననేది నిర్వివాదాంశం. అయితే కుల ఘర్షణలన్నింటినీ భూ సమస్యతోనే ముడిపెట్టి చూడడం మాత్రం సరైందికాదు. కుల ఆధిక్య భావన దానికదే సంస్కృతిలో భాగంగా వేళ్లూనికొని పోవడం వలన భూసమస్య ప్రత్యక్షంగా లేనిచోట కూడా దళితులు తమ హక్కుల కోసం, ఆత్మగౌరవం కోసం నిలబడినప్పుడు ధిక్కార స్వరం సహించలేక జరిగే దాడులెన్ని లేవనీ ? భూమి, ఆర్థిక అభివృద్ధి తదితర లౌకిక కారణాలు, ఘర్షణలకు మూలకారణమైనా లౌకికేతర కారణమైన కుల తత్వపు పాత్రను తక్కువ అంచనా వేయరాదు. అలా తక్కువ అంచనా వేసే తప్పిదం విప్లవకారులసలే చేయరాదు. ఈ విషయంలో అవసరమైన స్థాయిలో సాంస్కృతిక పోరాటాన్ని, కులతత్వ వ్యతిరేక పోరాటాన్ని ఉపేక్షించకూడదు.

ఇక ఆధిపత్యానికి మూలవనరైన భూ సంపద జాతీయం కావడం ప్రస్తుత వ్యవస్థలో ఆచరణ సాధ్యమా.? భూమి, రాజకీయ అధికార సమస్యలను పరిష్కరించడానికే కదా నక్సల్బరీ నాటి నుండి కొనసాగుతున్న విప్లవోద్యమం - ఆ విప్లవాన్ని రక్తపుటేరుల్లో ముంచెత్తేందుకు భారత రాజ్యం చేపడుతున్న దమనకాండ. తాజాగా గ్రీన్‌హంట్ లక్ష్యమూ అదే కదా ! 'దున్నేవాడికే భూమి' అన్న నినాదంపైనే అంతలా నిర్బంధం ప్రయోగిస్తున్నప్పుడు భూసంపదను జాతీయం చేయడం ఒక లక్ష్యమే తప్ప లక్ష్య సాధనం కాదు. రష్యా, చైనాల్లో విప్లవానంతర అనుభవాన్ని పరికించినా - భూమిని జాతీయం చేయడమనేది 'ప్రజా ప్రభుత్వానికైనా' అంత సులభ సాధ్యం కాదు అనేది స్పష్టమవుతుంది.

ఈ విషయం లోతుల్లోకి పోవడమో, ఈ సమస్యను కీలకమైన

సమస్యగా నలభై ఏళ్లకు పైగా సాగుతున్న నక్సలైట్ల పోరాటం గురించి ఈ కోణంలోంచి చర్చించడమో తేల్‌తుంబ్డె చేయలేదు. చేసి ఉంటే బావుండేది.

కుల భావన / కులతత్వం ఆధారంగా; కులగుర్తింపు, కుల అస్తిత్వ ఉద్యమాల ఆధారంగా కులనిర్మూలన అసాధ్యమన్న తేల్‌తుంబ్డె ప్రతిపాదన చాలా చర్చాయోగ్యమైన ప్రతిపాదన. అయితే దీని అర్థం కులాన్ని ఏమరపరచడం ఎంతమాత్రం కాదు. కులం, కుల దోపిడీ, అత్యాచారాలకు సంబంధించిన సకల కోణాల గురించి మన అవగాహనను, నిశితం చేసుకోవాలనే తేల్‌తుంబ్డె వాదనతో కలిపే ఈ విషయాన్ని అర్థం చేసుకోవాలి. కుల భావన / కుల చైతన్యం ఈ కోణాలను అర్థం చేసుకోవడంలో తప్పక తోడ్పడినాయనేది ఎంత సత్యమో కులానికి స్వతహాగా విభజించే లక్షణం, దొంతరలను కోరుకునే లక్షణం ఉండడం వల్ల అస్తిత్వ ఉద్యమాలు విశాల ఐక్యత సాధించడంలో కానీ, కులనిర్మూలనలో కానీ తీవ్రమైన పరిమితులున్నాయనేది గత రెండు దశాబ్దాల కుల అస్తిత్వ ఉద్యమాల అనుభవంలోనైనా, ఈశాన్య భారతంలో తెగలు / జాతుల ఉద్యమాల అనుభవం చూసినా అర్థమవుతుంది. ఈశాన్య భారతంలో భారత పాలకవర్గాలకు వ్యతిరేకంగా మొదలైన పోరాటాలు – నాగా – కుకీలు; నాగా – మెయితీలు; బోడోలు – అసామీలు; బోడోలు – సంథాలీలు; – ఇంకా ఇట్లా ఎడతెగని తెగల పోరాటాలుగా దిగజారుతున్నాయి. ఇవి అంతిమంగా వీళ్లందరినీ దోచుకొనే భారత దళారీ బూర్జువా పాలకవర్గాలకే పరోక్షంగా ఉపయోగపడుతున్నాయి. బహుశా ఒక్క మహిళల అస్తిత్వ పోరాటానికి తప్ప మిగిలిన ఇటువంటి అస్తిత్వ పోరాటాలన్నింటిలో ప్రజలను నిలువుగా చీల్చగలిగే ప్రమాదకర అంశాలు ఇమిడి ఉన్నాయి. దీనర్థం అస్తిత్వ పోరాటాలు తప్పని కాదు. అస్తిత్వ పోరాటాలకు విశాల ప్రాతిపదికన పోరాడే సైద్ధాంతిక పునాది, చైతన్యం అవసరమని మాత్రమే. ఆ కోణం నుండి చూసినప్పుడు కులాల మీద ఆధారపడే అస్తిత్వ ఉద్యమాలకున్న పరిమితులను అర్థం చేసుకోవడం సులభమవుతుండవచ్చు.

తమిళనాడులోని ధర్మపురి జిల్లాలోని నాయకన్‌కొట్టయ్ గ్రామంలో దళిత యువకుడు, వన్నియార్ (వెనుకబడిన కులం) యువతిని పెళ్లి చేసుకున్నందుకు వన్నియార్‌లు, దళితులపై 2012 నవంబర్‌లో చేసిన దాడులను విశ్లేషిస్తే ఈ విషయాలు మరింత స్పష్టమవుతాయి. ఆ ప్రాంతం ఒకప్పుడు ధర్మపురి జిల్లాలో నక్సలైట్ ఉద్యమానికి ఆయువుపట్టు. అక్కడ నక్సలైట్ ఉద్యమం బలంగా ఉన్న కాలంలో దళితులకు, వన్నియార్లకు మధ్య వర్గ ఐక్యత మాత్రమే కాక పీడిత కులాల మధ్య ఐక్యత, సయోధ్య ఉండడమే కాక, కులాంతర వివాహాలు ఎటువంటి తీవ్రమైన వైమనస్యాలు, దాడులు లేకుండా జరిగాయి. నక్సలైట్ ఉద్యమం అణచివేతకు గురై వెనుకపట్టు పట్టడంతో అక్కడ క్రమంగా వేళ్లూనుకున్న కులచైతన్యం / కులభావన వెర్రితలలు వేసిన ఫలితంగా ఈ దాడులు జరిగాయి. కులనిర్మూలన ఉద్యమాలు ఈ విషయాలన్నింటినీ గమనంలో ఉంచుకొని ముందుకు సాగాలి.

ఈ నేపథ్యంలోనే వర్గ ప్రాతిపదికన మాత్రమే శూద్రకులాల, దళితుల కష్టజీవుల మధ్య ఐక్యత సాధించగలం – కుల ప్రాతిపదికన కాదు అన్న తేల్‌తుంబ్డె వాదనతో ఏకీభవించకుండా ఉండలేం.

తేల్‌తుంబ్డె ప్రతిపాదనలు ఆంధ్రప్రదేశ్‌లో కులనిర్మూలన ఉద్యమం సరైన సిద్ధాంత ప్రాతిపదికను రూపొందించుకోవడానికి అవసరమైన ప్రేరకంగా పనిచేస్తాయని ఆశిస్తున్నాను.

అయితే తేల్‌తుంబ్డె ప్రతిపాదనలు కొన్ని ఆయన ప్రతిపాదించిన తీవ్రతతో ఉన్నాయా అనేది ఆలోచించాల్సిందే.

ఉదాహరణకు శూద్రకులాలకు, దళితులకు మధ్య పెరిగిన వైరుధ్యాలు, కుల సంఘర్షణల గురించి చెపుతూ గత నాలుగు దశాబ్దాల్లో బ్రాహ్మణ కులాలు ప్రత్యక్షంగా కుల దాడులకు పాల్పడలేదన్నాడు. కానీ అత్యంత క్రూరమైన మారణకాండలు సాగించిన రణవీర్‌సేన భూమిహార్లది. భూమిహార్లంటే బ్రాహ్మణుల్లోని ఒక తెగనే. అయితే రణవీర్‌సేన దాడులను తేల్‌తుంబ్డె నక్సలైట్లు, భూమిహార్ల మధ్య ఘర్షణలుగా మాత్రమే చూశాడా ? అట్లా చూస్తే – నందిగ్రాం పోరాటంలో కూడా కుల కోణాన్ని చూసిన తేల్‌తుంబ్డె వాదనకే పూర్తిగా విరుద్ధమైనది కదా ! రణవీర్‌సేన క్రూరదాడుల్లో అసువులు బాసిన వాళ్లలో అత్యధికులు దళితులే. భూమి సమస్య, అధికార సమస్య, కుల అహంకారం,అన్నీ సమపాళ్లలో కలిసిన దాడులు ఇవి.

పౌరసమాజం కుల సమస్యను తగినరీతిలో పట్టించుకోవడం లేదనే విమర్శ చేస్తున్నప్పుడు మతదాడులకు వ్యతిరేకంగా స్పందించినంతగా కుల దాడుల పట్ల స్పందించడం లేదని, గుజరాత్ దాడులకు వ్యతిరేకంగా పౌరసమాజ స్పందనను, ఖైర్లాంజి అత్యాచారానికి వ్యతిరేకంగా వచ్చిన స్పందనను పోల్చాడు. ఇది అంత సబబనిపించదు. అట్లా పోలిక లేకుండానే విమర్శించవచ్చు. గుజరాత్ మారణకాండ, ఖైర్లాంజితో స్థాయిలో ఏమాత్రమూ పోల్చలేనిదనేది వాస్తవం కదా !

నందిగ్రాం పోరాటంలో చనిపోయింది దళితులని – దళితకోణం నుండి చూడడం కూడా అంత సరైంది కాదేమో ఆలోచించవలసిందే. ఎందుకంటే సెజ్ (ఎస్ఇజెడ్) ల పేరుతో భూమిని లాక్కోవడమనేది ఆదివాసుల విషయంలో కనిపించినంత ప్రస్ఫుటంగా ఇతర ప్రాంతాల్లో కులాలవారీగా కనిపించిన దాఖలాల్లేవు. ఆయా ప్రాంతాల్లో ఉన్న అన్ని కులాల కుటుంబాలు ప్రభావితమైనాయి. (ఏదేమైనా ఈ విషయంలో మరిన్ని వివరాలుంటే తప్ప ఈ విశ్లేషణను అంగీకరించడం కష్టం). దళితులు సాధారణంగా భూమిలేని కుటుంబాల వారై ఉంటారు. కాబట్టి విస్థాపితులైనప్పుడు ఇతరులకంటే మరింత ఎక్కువగా దెబ్బతింటారు. పునరావాసం వంటి విషయాల్లో కూడా ఇతరుల కంటే ఎక్కువ సమస్యను ఎదుర్కోవలసి ఉంటుంది. కులంతో ముడిపడిన ఇటువంటి ఇతర కోణాలన్నీ బయటకు తేవాలి. కానీ తేల్‌తుంబ్డె ఈ విషయంలో చేసిన వ్యాఖ్యలతో అంగీకరించడం కష్టం. కనీసం మరిన్ని వివరాలుంటే తప్ప కష్టం.

చివరగా అనువాదం గురించి:

ముందే వివరించినట్టు అనువాదకులు చాలా చోట్ల ఆశ్చర్యం కలిగించే రీతిలో తప్పు అనువాదం చేశారు. మచ్చుకు కొన్ని.

'Although it could be argued that caste society has staved off changes at the structural; macro level, in reality it has undergone many changes in its composition and character.'

దీని అనువాదం – 'కుల సమాజం నిర్మాణపరంగానూ, స్థూలస్థాయిలోనూ పరిణామరహితంగా ఉందని అనగలిగినప్పటికీ వాస్తవానికి దాని పొందికలోనూ, లక్షణాల్లోనూ ఎన్నో మార్పులకు గురైంది' అని ఉండాలి. కానీ 'కుల వ్యవస్థ మార్పులకు లోనయిందనీ, ఉపరితలంలో వచ్చిన మార్పులు కుల వ్యవస్థను ప్రభావితం చేశాయన్న వాదనలు ఉన్నాయి. ఈ మార్పుల ప్రభావం కుల వ్యవస్థపై లేకపోలేదు. కుల సమీకరణల్లో, లక్షణంలో మార్పులు తెచ్చిన మాట నిజమే' అని అనువదించారు. మార్పుకు గురైంది అని రచయిత స్పష్టంగా తన అభిప్రాయాన్ని చెపుతున్నప్పుడు 'ప్రభావితం చేశాయన్న వాదనలూ ఉన్నాయి' అని రాయడం, రచయిత వాదని 'ఉపరితలాన్ని' అనువాదంలోకి తేవడం సరైంది కాదు.

'The state (is) weaving an intricate web of protective and developmental policies in favour of oppressed castes but not touching the economic base of shudra castes'...అన్న దానికి ' (ఈ కారణం) వల్లనే రాజ్యం అభివృద్ధిని, రక్షణ విధానాలను అణచివేసే కులాలకు మద్దతుగా రూపొందిస్తుంది తప్ప శూద్ర కులాల ఆర్థిక మూలాలను తాకదు'-అని అనువాదకులు పూర్తిగా పప్పులో కాలేశారు.

'రాజ్యం **పీడిత కులాలకు** లాభం చేకూరేలా రక్షణ విధానాలను, అభివృద్ధి విధానాలను చేపట్టింది. కానీ భూసమస్యతో ముడిపడిన శూద్రకులాల ఆర్థిక పునాది జోలికి మాత్రం పోలేదు' అని అనువదించాలి.

Now (the contest) is seen between the land owning peasant castes and dalits as landless labourers అని ఆంగ్లమూలంలో ఉంటే తెలుగు అనువాదంలో 'ఇప్పుడు అది భూమి ఉన్న రైతాంగ కులాలకు, భూమిలేని దళితులకు, ఇతర నిమ్నకులాలకు మధ్య పోటీగా మారింది' అని ఉంది. ఇక్కడ 'ఇతర నిమ్న కులాలను' అని అనువాదకులు చొప్పించి మూల రచయిత ప్రతిపాదిస్తున్న విషయాన్నే గందరగోళపరిచారు.

Electoral compulsions had prompted the imagining of an amorphous identity called 'bahujan' (the oppressed majority) - bracketing the dalits with the so-called OBCs, sweeping under the carpet many a contradiction between them in the village context.

రచయిత చెప్పిన దాన్ని పూర్తిగా తలకిందులు చేస్తూ అనువాదం 'ఎన్నికల రాజకీయాలు తీసుకొచ్చిన బహుజనవాద రాజకీయాలు దళితుల్ని, సోకాల్డ్ ఒబిసిలను వేరు చేశాయనే చెప్పాలి. ఈ విభజన గ్రామీణ ప్రాంతాలలో అనేక వైరుధ్యాలను బట్టబయలు చేసింది'.

'వైరుధ్యాలను కప్పిపెట్టి దళితులను, సోకాల్డ్ ఒబిసిలను ఎన్నికల రాజకీయాల అవసరాలు 'బహుజను'ల పేరు మీద ఒకేగాటన కట్టాయి' అనడానికి, పై అనువాదానికి ఏమన్నా సంబంధం ఉందా?

'The state's role in shaping castes and contradictions today is not adequately understood.'

'ఈ రోజు కులాలు, కుల వైరుధ్యాలు రూపు దిద్దుకోవడంలో రాజ్యపు పాత్రను తగినంతగా అర్థం చేసుకోవడం లేదు'.

మరి అనువాదకులు ఏం చేశారు? - 'కులాన్ని, కుల వైరుధ్యాన్ని రాజ్యం తనకు అనుకూలంగా మలుచుకోవడానికి ఎలాంటి పథకాలు రచిస్తున్నదో అర్థం చేసుకోవడానికి తగినన్ని ఆధారాలు లేవు' !

దళిత ఉద్యమం కానీ, కుల ఉద్యమం కానీ కుల చైతన్యానికి ఉన్న పరిమితిని లోతుగా పరిశీలించుకోవలసిన ప్రతిపాదనను అనువాదకులు ఎట్లా అర్థం పర్థం లేకుండా చేశారో చూద్దాం.

Thus, the dalit identity could be founded with motley untouchable castes coming together to fight brahminism under the leadership of Ambedkar. But once this pressure was gone both of the imperative of fighting brahminism and that of a commanding leadership - even the core mahar caste tended to discover subcastes and claim hierachical superiority for their own. Quite a few undeniable developments in the dalit movement could be traced to this dynamic. Caste, in essence, is an individualistic attitude that constantly seeks to assert superiority. The divisive ideology of castes does not even stop at the family; it can narrow down to the level of an individual. Even family members, in the absence of any external pressure, would discover notional hierarchy and assert an imagined caste superiority. Our entire cultural paradigm could be framed from an essentially caste perspective.

దీని సరైన అనువాదం ఇదే వ్యాసంలో - 'కులభావన / కుల చైతన్యాన్ని నిర్మూలించి వర్గ చైతన్యం పెంపొందించడం ద్వారానే కులనిర్మూలన సాధ్యం' అన్న ఉపశీర్షిక కింద మొదటి పేరాలో 'అట్లా బ్రాహ్మణవాదానికి ... ' నుండి పేరా ఆఖరి వరకు ఉంది.

పుస్తక అనువాదంలో 'దళిత వ్యక్తిత్వం అన్నది అంటరానితనానికి వ్యతిరేకంగా, బ్రాహ్మణిజాన్ని సవాలు చేస్తూ అంబేద్కర్ నాయకత్వంలో వచ్చిన ఉద్యమం. అయితే మనం గమనించాల్సింది ఈ ఉద్యమం రాగానే ఈ ఒత్తిడిని తట్టుకోవడానికి మహర్ కులాల్లో ఉపవిభజన తీసుకొచ్చారు. అంతిమంగా మళ్లీ ఆధిపత్యకులాలదే పైచేయి అయింది. ఇలాంటి సంఘటనలు మన దేశ దళిత ఉద్యమంలో అనేకం కనిపిస్తాయి. కులం దాని సారంలో వ్యక్తిగతమైన స్వభావం ఉన్నట్లనిపించినా అదే నిరంతరం స్థిరంగా అధికారాన్ని నిలబెట్టేదిగా ఉంటుంది. కుల విభజన భావజాలం కుటుంబం దగ్గరే ఆగదు. వ్యక్తిగత స్థాయిలో సైతం అది ప్రభావాన్ని నెరుపుతుంది. కుటుంబ సభ్యుల మధ్య ఎలాంటి బయటి ఒత్తిడిలు లేకపోయినా అది భావనాపరమైన కుల ఆధిపత్యాన్ని సృష్టిస్తుంది. మన సాంస్కృతిక చరిత్ర సొంతం ఈ దృష్టితో చెప్పిందే' అని ఉంది.

ఏ విషయంలో దళిత ఉద్యమం / కుల నిర్మూలనా ఉద్యమం తన దృక్పథానికి సంబంధించిన స్వవిమర్శ చేసుకోవాలనీ, అవగాహనను సునిశితం చేసుకోవాలనీ ఆశించి తేల్‌తుంబ్డె ప్రతిపాదించాడో ఆ అవగాహన పై అనువాదంలో ఏదీ?

- 'నేడు మౌలికమైన కుల విభజన సవర్ణులకు (కుల హిందువులకు), అంటరానివాళ్లకు మధ్య ఉంది' - అని తేల్‌తుంబ్డె రాసినప్పుడు (the fundamental division of caste is between savarnas (caste Hindus) and out castes.) సవర్ణులంటే అగ్రకులాలు, శూద్రకులాలను కలిపి ఆయన ఉద్దేశించాడు. అనువాదకులు 'అగ్రవర్ణాలకు, అంటరాని వాళ్లకూ మధ్య' - అని మూల రచయిత ఉద్దేశ్యాన్ని తప్పుగా అనువదించారు. (చూడండి-'బహుజనభ్రమ')

ఖైర్లాంజి (తెలుగు) పుస్తకం 129వ పేజీలో 'ఈ కారణంగానే డా. బి.ఆర్. అంబేద్కర్ అంటరాని వాళ్లు అసలు హిందువులే కారని ఎప్పుడూ వాదించేవారు. ఈ మధ్య 'నేను హిందువునెట్లయిత' పుస్తకం ద్వారా కంచె ఐలయ్య శూద్రులు కూడా హిందువులు కారనే వాదన ముందుకు తెచ్చారు! అని ఉంది. మరి మూల గ్రంథంలో ఉన్న చివరి వాక్యాన్ని అనువాదకులు ఎందుకు వదిలేశారు? ఆ చివరి వాక్యం- 'అయితే గుర్తుంచుకో వలసినదేమిటంటే వలసవాదులు, జాతీయవాదులు 'హిందూ' అనేదానికి ఏవర్ణన ఇచ్చినప్పటికీ శూద్రులు వర్ణ/కుల వ్యవస్థలో పూర్తిగా అంతర్భాగమే. దళితులు ఎప్పుడూ కారు.' తేల్‌తుంబ్డె ఐలయ్య ప్రతిపాదనతో విభేదిస్తున్నాడనేది స్పష్టమే. మరి అనువాదకులు దీన్ని మాత్రం ఎందుకు వదిలేశారు?

'నిజమైన వర్గ చైతన్యం నిర్మించడం ద్వారా మాత్రమే భవిష్యత్తులో ఖైర్లాంజిలను నిరోధించగలమని' రచయిత రాస్తే అనువాదకులు మాత్రం 'నిజమైన వర్గచైతన్యం నిర్మించాలంటే ఖైర్లాంజి వంటి ఘటనలు జరగకుండా చూడాలి' అని తల్లకిందులుగా ప్రతిపాదించారు!!!

ఇట్లాంటి తప్పుల తడకలు పుస్తకం నిండా కోకొల్లలుగా ఉన్నాయి. మలి ప్రచురణ నాటికి 'మలుపు బుక్స్' ఈ పుస్తకంలోని లోపాలను సరిదిద్దుతుందని ఆశిస్తాను. నిజానికి కనీసం ఒకటవ, ఐదవ, ఏడవ, ఎనిమిదవ అధ్యాయాల సరియైన అనువాదం వీలైనంత త్వరలో తెలుగు పాఠకులకు అందాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(అయిపోయింది)*

*(రచయిత మావోయిస్టు రాజకీయ ఖైదీ)*

# మేం మళ్లీ వస్తాం! - 3

**సోవియట్ యూనియన్, చైనా పతనాలతో మార్క్సిజం అంతం కాలేదని విశ్వసిస్తూ, ఆ రెండు అనుభవాలను తన శైలిలో విశ్లేషించిన తోలేటి జగన్మోహనరావు 'మేం మళ్లీ వస్తాం' పై రంగనాయకమ్మ సమీక్షావ్యాసం**

*(గత సంచిక తరువాయి...)*

ఒక నాడు, 'కమ్యూనిజం' అనే సిద్ధాంతాన్ని తెలిసి మాట్లాడే వాళ్ల మార్క్సు ఎంగెల్స్‌లు ఇద్దరే వుండేవారు. కానీ ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా దాన్ని ఇష్టంతో మాట్లాడే వాళ్ల లక్షల మంది ఉన్నారు. ఎలా జరిగింది ఇది? కమ్యూనిస్టు పార్టీల ద్వారా జరిగింది. ఆ సిద్ధాంతాన్ని, ఆ పుస్తకాల వల్లా, ఆ ఉద్యమాల వల్లా, నేర్చుకున్నాం. కార్మిక జనాలకు, కమ్యూనిస్టు పార్టీల కార్యకర్తలు బోధిస్తారు. 'మనం శ్రమ దోపిడీకి గురి అవుతున్నాం. ఇది బానిసల కాలం నించీ జరుగుతోంది. వాళ్ల పోరాటాల వల్లే మార్పులు ప్రారంభమయ్యాయి. మనం, ఇప్పుడు ఉన్న దోపిడీదారుల మీద పోరాడి, మన శ్రమని వాళ్లలాగకుండా, మనం పేదలుగా - సేవకులుగా మారకుండా, చేసుకోవాలి. మనం దోపిడీ లేని సమాజాన్ని, ప్రతి ఒక్కరూ శ్రమ చేసే సమాజాన్ని, నిర్మించుకోవాలి' అని బోధిస్తారు. కార్మికుల వృత్తి సంఘాల ద్వారా, కమ్యూనిస్టు పార్టీల ద్వారా జరిగేది అదే. రష్యాలో ప్రజలు, సోషలిస్టు మార్పులకు సిద్ధం కాకపోతే, అసలు దోపిడీదారుల నించి రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకోవడం ఎలా జరిగింది? సోషలిజం, 'దిగువ దశ'లో ఉన్నట్టు చెపుతున్నారు. ఆ 'దిగువ దశ' ఎలా ఏర్పడింది? ప్రజలు ఏ కొత్త భావాలూ నేర్చుకోకపోతే, ఆ దిగువ దశని, 'ఎగువ దశ'గా ఎవరు చేస్తారు? ఎవరైనా చేసి పెట్టాక అప్పుడు ఈ మొత్తం రష్యా ప్రజలు ఆ ఎగువ దశలోకి వెళ్తారా?

ఇంకా చూడండి. రచయిత: 'కమ్యూనిస్టులు.... సాహిత్యంలో, కళల్లో, సినిమాల్లో, నాటకాల్లో, ప్రజలు సోషలిస్టు ఆదర్శాలకు ఉత్తేజితులై పాటలు పాడుతూ సోషలిస్టు నిర్మాణానికి నడుం కట్టినట్టు చిత్రిస్తుంటారు. ఆదర్శాల ప్రచారం అవసరమే గానీ, సామాజిక వాస్తవాన్ని గుర్తించడం అంత కన్నా ముఖ్యం. సోషలిజాన్ని నిర్మించే వర్గం అని మార్క్సు చెప్పిన కార్మిక వర్గం కూడా ఒక ఆదర్శ సమాజ నిర్మాణం కోసం పని చేయదు' అంటారు (పే. 394).

మరి, మార్క్సు చెప్పిన కార్మిక వర్గం, ఎలా బైట పడుతుంది 'శ్రమ దోపిడీ' నించి? దోపిడీ జరుగుతోందని తెలుసుకున్న వర్గం, దాన్నించి అసలు బైట పడదా? ఒక వేళ, పెట్టుబడిదారీ పద్ధతుల తోనే, వర్గ సామరస్యాలతోనే, ఆ మార్గంలోనే బైట పడుతుందా? అలా బైట పడడానికైనా, దాని ప్రయత్నం దానికిఉండదా? 'గత చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్రే' అన్నారు కదా మార్క్సు ఎంగెల్స్‌లు? ఆ వర్గ పోరాటాలన్నీ ఎవరు చేశారు? బానిసలు, 'బానిసత్వమే బాగుంది' అనుకోకుండా, శిలువల మీద ఎక్కడాని కైనా భయపడకుండా, పోరాటాలు ఎందుకు చేశారు? కౌలు రైతుల పోరాటాలూ, కార్మికుల పోరాటాలూ, ఎందుకు జరిగాయి? ఏ పోరాటాలూ లేకుండానే, చరిత్ర మారుతూ వచ్చిందా?

కార్మికులు, యజమానుల ఆజ్ఞలే సుఖమైనవి - అనుకోరు. అది 'దాస్యం' అని తెలియకపోతే కొంత సర్దుబాట్లతో ఉంటారు గానీ, వాళ్లకి వర్గ జ్ఞానం వస్తే అలా అనుకోరు. వాళ్లకి, 'శ్రమ దోపిడీ' విషయం చెప్పాలి. స్టాలిన్ దేశంలో ఉన్న ప్రజలకి, స్టాలిన్ పార్టీ ఏమీ నేర్పదా? శ్రామిక వర్గానికి, శ్రమ దోపిడీ నించి విముక్తి చెందాలని చెపుతుందా లేదా? వారికి నేర్పి, వారిని ఆ మార్గంలో అభివృద్ధి చేయకపోతే, ఇక నాయకత్వం అనేది ఎందుకు? నాయకత్వం, ప్రజలకు నేర్పడానికి కాదా? పెట్టుబడిదారీ పద్ధతులు వద్దు - అని స్టాలిన్ పార్టీ బోధించినా కూడా ప్రజలు, 'మాకు దోపిడీ సమాజాల పద్ధతులే కావాలి' అన్నారా?

స్టాలిన్ పార్టీ, ప్రజలకు చాలా నేర్పిందని కూడా ఈ రచయిత అంటారు. ప్రజలకు ఏం నేర్పాలో ఆ దిశగా కమ్యూనిస్టు సాహిత్యమూ కళలూ కృషి చేస్తాయనీ, ఆ ప్రభావంతో కార్మిక వర్గం సోషలిస్టు నిర్మాణానికి కృషి చేస్తుందనీ కూడా ఈ రచయితే అంటారు. కానీ ఒక వేపు అలా చెపుతూనే 'కార్మిక వర్గంతో సహా శ్రమ జీవులు (వీళ్లెవరు?) ఈ సోషలిస్టు వ్యవస్థ వలన ఏం లాభం మనకి?' అని ఆలోచిస్తారట! అవును, 'సోషలిజం' పేరుతో ఉన్నసమాజం వల్ల ఏమీ తేడా కనపడకపోతే, అలాగే ఆలోచిస్తారు మరి. స్టాలిన్ పార్టీ పీస్ వర్క్‌నే వుంచింది కాబట్టి, అది తప్పు అని చెప్పకుండా దాన్నే సమర్థించడం కోసం, ఈ రచయిత, కార్మికులే దాన్ని ఇష్టపడతారని చెప్పడం ఇది! అర్థమైంది, స్టాలిన్ నాయకత్వం, ప్రజలకు అలాగే నేర్పిందన్నమాట! వాళ్లని పీస్ వర్క్ సంపాదనలోనే వుంచిందన్నమాట! వాళ్లకి కొత్త భావాలు నేర్పకపోతే, అంతే మరి.

స్టాలిన్ కాలంలో అధికోత్పత్తి ఏ కారణాల వల్ల జరిగిందో రచయిత ఇలా చెపుతున్నారు: 'కార్మికులకు పీస్ వర్క్‌తో సంపాదన పెంచుకునే అవకాశం కల్పించడం ద్వారా, సూపర్ వైజర్లకు బోనస్‌ల ద్వారా, రైతులకు అధికోత్పత్తికి బోనసులు ఇవ్వడం ద్వారా, సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి పెంచడం జరిగింది' (పే. 395).

స్టాలిన్ వల్ల ఎలాంటి అధికోత్పత్తి జరిగిందో, ఎంత ఆధునీకరణ జరిగిందో, కొన్ని లెక్కలు చూపించారు (పే. 34). ఒక బ్రిటిష్ పెట్టుబడిదారుడు వచ్చి, సోవియట్‌లో రోడ్లనీ, పార్కుల్నీ, అలాంటి వాటిని, ఎంత పొగిడాడో, అదీ చెప్పారు (పే. 45). ఆ ఆధునీకరణ, సోవియట్‌లో సోషలిజాన్ని నిలబెట్టలేకపోయిందనే సంగతి మాత్రం రచయిత గమనించినట్టు లేదు.

అధికోత్పత్తి కోసం బోనసులు ఇవ్వొచ్చని లెనిన్ చెప్పిన కొటేషన్‌ని కూడా చూపించారు. దాన్ని సరిగా పరిశీలిస్తే, అది సోషలిస్టు పాలన నిలబడడానికి కొత్త రోజుల గురించి చెప్పిన మాటల్లాగ తేలుతుంది.

ఈ రచయిత అధికోత్పత్తి వాదం చూపించి, చివరికి స్టాలిన్ మీద ఆరోపణలు తప్పు - అని తేల్చారు: 'సోవియట్ యూనియన్‌లో, ........ పెట్టుబడిదారీ పునరుద్ధరణకు స్టాలిన్ చర్యలు దారి తీశాయన్న ఆరోపణ

వుంది. అది వాస్తవం కాదు. సామాజిక వాస్తవానికి విరుద్ధంగా వుండే ఏ ఆదర్శమూ నిలవదు. సమాజం ఆర్థికంగా, మానసికంగా, సాంస్కృతికంగా, సంసిద్ధం కాకుండా, కేవలం సోషలిస్టు చైతన్యంతో సోషలిస్టు నిర్మాణం సాధ్యం కాదు' (పే. 395).

'మానసికంగా' మార్పు అంటే, భావాల మార్పు కాదా? సమాజం సోషలిస్టు పద్ధతులతో 'సంసిద్ధం' అయి ఉన్నప్పుడే కార్మికులు పెట్టుబడిదారీ పద్ధతులు వదులుతారనీ; అంత దాకా సమాజంలో ఉన్నది పెట్టుబడిదారీ వాస్తవమే కాబట్టి కార్మికులు ఆ వాస్తవాన్నే ఇష్టంతో పాటిస్తారనీ, చెప్పడం! మరి మార్పు ఎప్పుడు? ఎవరు తెస్తారు మార్పు? కార్మికులే పెట్టుబడిదారీ పద్ధతులు వదలకపోతే, వీళ్ళు ఇలాగే వుంటే, సమాజాన్ని సంసిద్ధం చేసేది ఎవరు? పెట్టుబడిదారీ పద్ధతుల వెర్రితోనే కార్మికులు వుంటే, అది తప్పని చెప్పకుండా, సోషలిస్టు నాయకత్వం కూడా ఆ పద్ధతులనే కొనసాగిస్తుందా? అలా చేస్తే, అది ప్రజల వెనకాల నడవడం! ప్రజల అజ్ఞానాన్నే నాయకులు అనుసరిస్తే, ఇక 'నాయకత్వం' అనే దానికి అర్థం ఏముంటుంది? ప్రజలకు తెలియని విషయాల్ని వాళ్లకి బోధించాలా, వాళ్ల పాత భావాల ప్రకారమే నాయకత్వం నడవాలా? పరిశ్రమల్లో పీస్ వర్క్‌ని తీసేసి టైమ్ వర్క్‌ని పెట్టే మార్పు నాయకత్వం చేయలేదా? ఆ మార్పుని 10 ఏళ్లకైనా, 20 ఏళ్లకైనా చేయకపోతే, మరి సోషలిస్టు పద్ధతుల ప్రవేశం ఎప్పుడు?

స్టాలిన్ కాలంలో, నిజంగా పెట్టుబడిదారీ పని పద్ధతులే వుండి, వాటి మీద ఆరోపణలు వుంటే, ఏ పరిశీలకుడైనా, ఆ ఆరోపణల్ని ఎగరగొట్టడానికి ప్రయత్నించకుండా, 'నిజమే, 20 ఏళ్ల తర్వాత కూడా పెట్టుబడిదారీ పద్ధతులే సాగడం తప్పే. ఒక వేళ అప్పటికి కూడా వాటిని మార్చగలిగే పరిస్థితులు లేకపోతే, ఆ సమాజాన్ని సోషలిజంగా లెక్క కట్టకూడదు. పీస్ వర్క్ లాంటి పెట్టుబడిదారీ పద్ధతుల్ని 30 ఏళ్లకి కూడా మార్చలేనప్పుడు, స్టాలిన్ సోషలిజం నిర్మించాడు - అనకూడదు' అని అర్థం చేసుకుంటే సరిపోతుంది. కానీ, మనకి ఇష్టమైన నాయకుడి మీద ఈగ వాలకూడదనుకుంటే, ఈ రచయిత చేసిన వాదం లాంటి వాదాలే పుట్టుకొస్తాయి.

ఈ రచయిత, ఇలా భావిస్తారు:

అసలు ఈ రచయిత వాదానికి మూల కారణం, స్టాలిన్‌తో పోల్చి మావోని విమర్శించాలనేది. మంచి విమర్శ అయితే, అది తప్పకుండా చెయ్యాలి, చేసి తీరాలి. స్టాలిన్ అయితే, భౌతిక వాస్తవాన్ని పట్టించుకుంటూ నడిచాడు గానీ, మావో అయితే ఆ వాస్తవాన్ని పట్టించుకోకుండా, మొదట భావాల్ని మార్చడానికి, సాంస్కృతిక విప్లవకాలంలో సోషలిస్టు భావాలు నేర్పాలని, భావ వాద దృష్టితో ప్రవర్తించాడు - అంటారు రచయిత.

కానీ, సాంస్కృతిక విప్లవ కాలంలో, మేధా శ్రామికులు కూడా శారీరక శ్రమలు చెయ్యాలనే పద్ధతీ, కార్మికుల మేనేజిమెంటు పద్ధతీ తెచ్చి, అత్యద్భుతమైన మార్పుల కోసం ప్రయత్నించారు. అది నిలబడిందా లేదా అన్నది వేరే సంగతి. దాన్ని స్టాలిన్ చేయలేదు కాబట్టి, మావో పద్ధతి ఈ రచయితకి నచ్చలేదు.

స్టాలిన్ కాలంలో, దేశం ఎంతో సౌఖ్యంగా నడిచిందని చాలా చోట్ల చెప్పారు. అన్నీ తక్కువ ధరలు, ఉచితాలు, నిరుద్యోగం లేదు, ఇంకా చాలా. అలాంటి దాన్ని జనం నిలబెట్టుకోలేదంటే, అసలు వాళ్లసిద్ధాంతపరంగా నేర్చుకున్నదేమీ లేదనీ, నాయకులు ఎటు తిప్పితే అటు తిరిగారనీ, అర్థం!

కృశ్చేవ్ ద్వారా వచ్చిన రివిజనిజానికి కారణాలు ఏమైఉండవచ్చో, ఈ రచయిత చాలా వాటిని ఊహించారు. రెండో ప్రపంచ యుద్ధంలో గెలిచిన విజయంతోనే ప్రజలు ఉన్నారు. కానీ వాళ్లసోషలిజంతో విసిగిపోయినట్టుగా ఈ రచయిత ఊహించారు. 'మూడు దశాబ్దాల రక్తపాతం తర్వాత, రష్యా, మానసికంగా అలిసిపోయిఉండవచ్చు. ఇది, కృశ్చేవ్ రివిజనిజానికి, ఒక కారణమైఉండవచ్చు' (పే. 144). రచయిత, అక్కడక్కడా స్వంత ఊహలు చేస్తూ ఉంటారు.

జనం అలిసిపోయినట్టే, కృశ్చేవ్ కూడా అలిసిపోయాడేమో మరి!

అసలు, కార్మిక ప్రజలకు సోషలిస్టు సిద్ధాంతాన్నీ, ఆ భావాల్నీ, నేర్పే పని, పెట్టుబడిదారీ సమాజంలోనే చెయ్యాలి. దోపిడీ సమాజాన్ని తీసి వెయ్యాలని కార్మికులకు అర్థమైతేనే ఆ పని జరుగుతుంది. రష్యాలో గానీ, చైనాలో గానీ, దోపిడీ సమాజాల రాజ్యాధికారాల్ని తీసివేసి, సోషలిస్టు పాలన ఏర్పర్చిన తర్వాత అయినా, సోషలిస్టు భావాలు నేర్పడానికి ప్రయత్నించకూడదని ఈ రచయిత వాదం! ఎందుకంటే, అసలు విషయం మారకుండా, దానికి సంబంధించిన చైతన్యం (భావాలు) మారవనీ, కాబట్టి చైతన్యాన్ని మార్చే విధానం తప్పు అనీ ఆ వాదం. అసలు విషయం కొంత మారి, సోషలిస్టు రాజ్యాధికారం ప్రారంభమైందిగా? మనం ఏ విషయాన్ని మార్చాలో, దానికి సంబంధించిన పాత భావాల్ని మొదట మార్చకపోతే, ఆ విషయాన్ని మార్చేది ఎలాగ? దోపిడీ సమాజంలో, ఒక పరిశ్రమలో సమ్మె జరిగేటప్పుడు, ఆ కార్మికులకు పోటీగా అక్కడ పని చేయడానికి పరాయి కార్మికులు వెళ్లకూడదు - అని తెలుసుకోవడం అంటే, అది భావాల మార్పే. ఆ కొత్త భావాలు రావడం వల్లే కార్మికుల మధ్య పోటీ ఆగిపోతుంది. అంటే, కొత్త భావాలు వచ్చాకే పాత విషయం మారుతుంది. అలాగే, కార్మికులు పీస్ వర్క్ విధానాన్ని ఒప్పుకోకూడదు - అని, అది ఎందుకు తప్పో తెలుసుకుంటే, అదీ భావాల మార్పే. ఆ కొత్త భావాలు వచ్చాకే ఆ పద్ధతిని వదిలేస్తారు. పాత విషయం మారుతుంది. - ఇంత చిన్న విషయం మీద కూడా అస్తవ్యస్తమైన వాదమా?

ఈ పుస్తకం చూపించిన సమాచారం ప్రకారమే చూస్తే (ఈ సమాచారం నిజమైనదా కాదా, స్టాలిన్ కాలంలో అలాగే జరిగిందా లేదా - అనేది, అనవసరం. ఇచ్చిన సమాచారం ప్రకారమే చూస్తే), స్టాలిన్ సామాజిక వాస్తవాన్ని బట్టి నడవడం అంటే, పెట్టుబడిదారీ పద్ధతుల్ని ఏళ్ల తరబడీ అలాగే వుంచడం! అది, భౌతిక వాదం అని రచయిత మెచ్చుకోలు! పెట్టుబడిదారీ పద్ధతుల్ని వదిలెయ్యాలని (ఆ భావాల్ని మార్చుకోవాలని) ఎవరైనా బోధిస్తే, అది భావ వాదం అని దాని మీద తిరస్కారం! అయితే, పెట్టుబడిదారీ పద్ధతుల్ని వదిలెయ్యాలని చెప్పడం ఎప్పుడు మొదలుపెట్టాలి? ఎప్పుడు మొదలుపెట్టినా అది తప్పే అవుతుంది కదా? మరి మార్పు ఎప్పుడు? సమాజం 'సంసిద్ధం' అయ్యాక! ప్రజలకు కొత్త భావాలే లేకపోతే, సమాజం కొత్తగా 'సంసిద్ధం' ఎలా అవుతుంది?

స్టాలిన్ కాలంలో, 'మళ్ళీ పెట్టుబడిదారీ విధానం రావచ్చు' అనే ఊహ కలగడానికే అవకాశం లేక పోయిందట. ఆ సోషలిజం ఎలా వుందంటే, అది శాశ్వతం అనీ, చెక్కు చెదరదనీ,మళ్లీ వెన కదుగులు పడే అవకాశమే లేదనీ, అనుకునే విధంగా వుందన్నమాట!

'సోషలిస్టు వ్యవస్థలో నయా బూర్జువా వర్గం జన్మించే అవకాశం వుందా? ఈ ప్రశ్నకు స్టాలిన్ కాలంలో అవకాశం లభించలేదు' (పే. 330).

ఆశ్చర్యం ఏమిటంటే, అసలు ఆ సమాజం ఎన్నో వైరుధ్యాలతో

వుందని ఈ రచయితే చెపుతారు. సోషలిజంలో కూడా, ప్రత్యేక సదుపాయాలు పొందే డైరెక్టర్లూ, మేనేజర్లూ, సైనికాధికారులూ, ప్రభుత్వాధికారులూ, రచయితలూ, కళాకారులూ, ట్రేడు యూనియనిస్టులూ –వంటి ఉన్నత వర్గాలు ఉండడం వల్ల, వాటికీ శ్రామిక వర్గానికీ ఘర్షణలు ఉండడం వల్ల, నయా పెట్టుబడిదారీ విధానానికి అవకాశాలు ఉంటాయి – అని కూడా రచయితే అంటారు.

ఈ స్వార్థాలూ, ఈ నయా రివిజనిజాలూ, ఎందుకు వస్తా యంటే, 'అమితోత్పత్తి లేకపోవడం' వల్లనట! నయా రివిజనిజాన్ని పోగొట్టడానికి, ప్రజల చైతన్యాన్ని (భావాల్ని) మార్చాలని చూస్తే ప్రయోజనంఉండదనీ, ఉత్పత్తిని 'అవసరాన్ని మించి' తయారు చెయ్యాలనీ, అప్పుడు స్వార్థాలన్నీ పోతాయనీ, చెపుతారు.

'ఈ నయా బూర్జువా వర్గ ప్రభావం, భావజాల ప్రభావం వలన తొలగేది కాదు. ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెంది, ప్రజలకు అవసరమైన దాని కన్నా ఎక్కువ ఉత్పత్తి చేసే స్థితిలోనే ఈ ప్రమాదం తొలగుతుంది' (పే. 334).

మొత్తం సమాజానికంతటికీ 'అవసరాన్ని మించిన' ఉత్పత్తి ఉంటే, ఎవరికీ స్వార్థం ఉండదు – అని! 'అవసరాన్ని మించిన ఉత్పత్తి'ని ఏం చేస్తారు? ఇతర దేశాల పేద ప్రజలకు దాన ధర్మాలు చేస్తారనుకుందాం. అదీ 'అవసరం' కిందకే వస్తుంది. అవసరాన్ని మించిన దాన్ని ప్రపంచం వాడడం సాధ్యం కాదు. దాన్ని సముద్రాల్లో పారేసి, సముద్రాల్ని కలుషితం చేస్తే తప్ప, అవసరాన్ని మించిన ఉత్పత్తిని వదిలించుకోవడం సాధ్యం కాదు.

స్టాలిన్ మరణం వల్ల రివిజనిజం?:

ఈ పుస్తకం చెప్పిందంతా, సోవియట్ యూనియన్ సోషలిజంతో సాగుతూ ఉండగా, స్టాలిన్ మరణం వల్లే ఆ దేశంలో పెట్టుబడిదారీ పునరుద్ధరణ జరిగిందని! 'స్టాలిన్ అనంతరం..... మరణానంతరం...... మరణానంతరం......'– ఇలాంటి మాటలు కొన్ని దజన్ల సార్లు కనపడతాయి. (స్టాలిన్ మరణం, 1953లో.)

మరణించింది, స్టాలిన్ ఒక్కడే. పోలిట్ బ్యూరో సభ్యులంతా బతికే ఉన్నారు, మరణించలేదు. కేంద్ర కమిటీ సభ్యులంతా బతికే ఉన్నారు. దేశంలో కార్మిక జనం అంతా బతికే ఉన్నారు. మరణించింది స్టాలిన్ ఒక్కడే. ఒక్క వ్యక్తే. ఒక్క నాయకుడు పోగానే దేశం అలా మారిపోయిందని చెప్తే, ఆ వాదానికి ఏం అర్థాలు రావచ్చో ఈ రచయిత ఊహించలేదు.

స్టాలిన్ పోగానే అంతా మారిపోయిందంటే, ఆ వ్యక్తి ఉన్నప్పుడు దేశం మారకుండా ఉన్నది ఆ ఒక్క వ్యక్తి వల్లే అన్నమాట! అంటే, స్టాలిన్ ప్రతీదీ ఏక పక్షంగానే చేశాడనే అర్థం రాదూ?

స్టాలిన్ ఏక పక్షంగా నిర్ణయాలు తీసుకుంటాడనే ఆరోపణని ఈ రచయిత గట్టిగానే తిరస్కరించారు. నిజానికి, ఏక పక్ష నిర్ణయాలు తీసుకోవడం చక్రవర్తులకు కూడా సాధ్యం కాదని ఇంతకుముందే చూశాం. స్టాలిన్‌తో పాటు ఒక మెజారిటీ అనుచరులు ఉంటారు పార్టీలోనూ, దేశంలోనూ. మరి అలాంటప్పుడు, స్టాలిన్ ఒక్కడే పోతే, అదే వాదాన్ని అనుసరించే మెజారిటీ సభ్యులు బతికే వుంటారే! వాళ్ళేమయ్యారు? వాళ్ళకి కూడా కావలసింది సోషలిజమే అయితే, వాళ్లందరూ ఉండగా సోషలిస్టు పద్ధతులు ఎలా మారాయి?

విప్లవాన్ని ఒక్క మనిషే నిలబెట్టాడనీ, అతను పోగానే అది మారిందనీ అంటే, ఇలాంటి వాదాలకి ఏమైనా అర్థం ఉంటుందా?

స్టాలిన్ పోయాక, విద్రోహులు లెనిన్ విగ్రహాల్ని పడగొట్టారని చెప్పి, 'స్టాలిన్ వుంటే అలా జరిగేది కాద'ని, ఈ రచయిత అంటారు. స్టాలిన్ ఒక్కడే ఏది అయినా చేస్తాడని చెప్పడం! అసలు స్టాలిన్ పోతే మార్పు ఎందుకు జరిగింది?

అసలు నిజం ఏమై వుండాలి? ఆ తప్పులన్నీ గతం నించే సాగుతూ ఉన్నవై వుండాలి. పార్టీ సంస్థల్లో వాళ్లకి గానీ, బైట ఉన్నప్రజలకు గానీ, అసలు సోషలిజం కోసం ఏ మార్పులు కావాలో ఏమీ తెలీదు. నాయకులు అనే వాళ్లకి కొన్ని మాటలు వచ్చు గానీ, వాటి అర్థాలు తెలీవు. అర్థాలు బాగా తెలిసిన లెనిన్, అతి తక్కువ కాలంలో, నూతన ఆర్థిక విధానం పేరుతో పెట్టుబడిదారీ సంబంధాలే ఉన్నకాలంలో వెళ్లిపోయాడు. తర్వాత పాత్ర అంతా స్టాలిన్ ఉన్నపార్టీది. ఆ పార్టీ మార్క్సియన్ సోషలిస్టు పద్ధతుల్ని అనుసరించిఉండదు – అనే అర్థానికే రావలసి వస్తుంది.

చైనాలో కూడా మావో పోగానే పార్టీలో మార్పులు వచ్చేసి, రివిజనిజం వచ్చేసిందంటే, మావో కాలంలోనే సరైన సోషలిస్టు పద్ధతులు లేవు – అనే అర్థానికి రావాలి. వాళ్ల వ్యక్తి పూజలు కూడా సోషలిజాన్ని ఆకర్షించలేకపోయాయి.

ఏ దేశం సంగతైనా అంతే. అంతా విప్లవకరంగా నిజంగా జరుగుతూ వుంటే, నాయకులు పోతే, జనం మరింత గట్టిపడతారు. నాయకుడి మీద ప్రేమతో మరింత విప్లవకారులవుతారు. అలా జరగలేదంటే, ఆ జనమే రివిజనిజానికి చోటు ఇచ్చారంటే, అసలు తప్పు గతం నించే వస్తూ వుందని అర్థం వస్తుంది. ఆ జనానికి సరైన వాటిని ఏమీ నేర్పలేదని అర్థం వస్తుంది.

'స్టాలిన్ పోయాక, మావో పోయాక ......' అనే వాదాలు వదిలెయ్యాలా, ఇంకా అలాగే చెప్పుకుంటూ వుండాలా?

'సమానత్వం' కన్నా అభివృద్ధి ఉంటుందా?

ఈ పుస్తకం, మొత్తానికి ఏం చెపుతోంది? – సోషలిజాలే కాదు, కమ్యూనిజాలే కాదు, ఎంత గొప్ప సమాజం అయినా నిలబడేదేమీఉండదనీ, పోయి తీరుతుందనీ, చెపుతోంది. ఆ 'పోవడం' తప్పదు – అని చెపుతోంది.

ఈ పుస్తకం చేసే వాదల ప్రకారం, మనం సోషలిజాన్ని నిర్మించినా, మళ్లీ పెట్టుబడిదారీ విధానం వచ్చి సోషలిజాన్ని తీసేస్తుంది. అయినా మనం దానికి విచారించకూడదు. ఎందుకంటే, మళ్లీ ఇంకో సోషలిజం వస్తుంది. ఆ రెండో సోషలిజం ఇంకా అభివృద్ధితో వస్తుంది. అది ఎలా జరుగుతుందంటే, 'మేం, మళ్లీ వస్తాం' అనే కేకలతో వచ్చే కొత్త తరం విప్లవకారుల వల్ల అది వస్తుంది. కానీ, అప్పుడే సంతోషించకూడదు. అదీఉండదు, మళ్లీ పెట్టుబడిదారీ విధానం వచ్చి, రెండో సోషలిజాన్ని కూడా తీసేస్తుంది. అయినా విచారించకూడదు. అప్పుడు, ఆ నాటి కొత్త తరం విప్లవకారులు, మూడో సోషలిజాన్ని తీసుకువస్తారు. అది ఇంకా అభివృద్ధితో ఉంటుంది. కానీ, అదీ నిలబడదు. మళ్లీ రివిజనిజం! కానీ దానికీ విచారించకూడదు. కొత్త తరం విప్లవకారులు ఎప్పుడూ లేస్తారు, వస్తారు. వాళ్లు, మరింత అభివృద్ధికరమైన నాలుగో సోషలిజాన్ని నిర్మిస్తారు. కానీ అదీ ఆగదు. – ఇలా, ఒక్క సారి కాదు, రెండు సార్లు కాదు, ఐదు సార్లు కాదు, ఎన్ని సార్లయినా సోషలిజం వస్తూనే పోతూనే ఉంటుంది. రావాలి కాబట్టి వస్తుంది, పోవాలి కాబట్టి పోతుంది. – ఇదీ, ఈ పుస్తకం చెప్పిన సమాజ పరిణామ క్రమం. సోషలిజం పోవడం అంత తప్పనిసరి సహజత్వం అయితే, రివిజనిజం తెచ్చిన కృశ్చేవ్‌ని ఎంతో మెచ్చుకోవాలి. పడీ పడీ తిట్టడం ఎందుకు?

సరే, సోషలిజం పోతుంది. చివరికి ఏమిటి? చివరికి నిలబడి వుండి పోయేదాన్ని చెప్పుకోవాలి గానీ, దారి పొడుగునా వచ్చి పోయే వాటి

సంగతెందుకు? – అనకండి! ఈ పుస్తకం ప్రకారం, 'చివర'ఉండదు. చివర వుంటే చెప్పుకుంటాం గానీ, లేని దాన్ని ఎలా చెప్పుకుంటాం? 'సమాజానికి, ఎందుకలా జరుగుతుంది?' అని అడగండి! ఎందుకంటే, అలా జరుగుతుందని చెప్పే సూత్రం ఒకటి వుందని ఈ పుస్తకం చెపుతోంది.

సూత్రం అలా చెప్తే, దాన్ని నమ్మవలసిందేనా? ఏం సూత్రం అది? 'గతితార్కిక భౌతిక వాదం' అనే దాన్ని విన్నారా? అందులో, 'నెగేషన్ ఆఫ్ నెగేషన్' సూత్రం గురించి విన్నారా?

నిజానికి, ఆ సూత్రం కాస్త మంచిదే. దాన్ని సరిగా అర్థం చేసుకుంటే, దానితో ఇబ్బందిఉండదు. సరిగా అర్థం చేసుకోకపోతే, అది మన తప్పే, సూత్రం తప్పు కాదు. అసలా సూత్రం ఏమిటో, దాన్ని ఎలా అర్థం చేసుకోవాలో, మొదట చూడాలి. (ఈ పుస్తకం చెప్పేదాన్ని చూస్తే, ఎవరి ప్రశ్నలు వాళ్లకి రావాలి. వాటిని చూస్తే చాలు!)

'నెగేషన్ ఆఫ్ నెగేషన్'కి మొదట తెలుగులో అర్థం చెప్పు కుంటే, 'ఒక అంశాన్ని తిరస్కరించే రెండో అంశం కూడా, తర్వాత తిరస్కరణకు గురి అవుతుంది' అని! 'తిరస్కరించేది కూడా, తిరస్కరించబడుతుంది' అని చెపుతారు. చెడ్డ పనిని, మంచి పని తిరస్కరిస్తే, ఆ మంచి పని కూడా తర్వాత తిరస్కరణకు గురి అవుతుందా? 'చెడ్డ' పోయి, 'మంచి' వస్తూఉండడం కనపడు తోంది. 'మంచి' కూడా పోతూ ఉంటుందని చెప్పే సూత్రం ఒక సూత్రమా?

'సోషలిజం'లో వుండే మంచి, శ్రామిక వర్గానికే కాదు, దోపిడీ వర్గానికి కూడా మంచే. ఎలాగంటే, వాళ్లు, బానిస కాలం నించీ దోపిడీ దొంగల్లా బతికే పరిస్థితి, సోషలిజంలో పోతుంది.. వాళ్ళూ శ్రమలు చేయడం మొదలుపెట్టి, వాళ్ల శ్రమలతోనే వాళ్లబతికే విధానం కొత్తగా ప్రారంభమైతే, అప్పటి నించీ వాళ్లదోపిడీ దొంగలు కారు. వాళ్లకూడా ఆత్మ గౌరవంతో, న్యాయంగా, తప్పులు చేయకుండా, బతికే మంచి మానవులు అవుతారు. సోషలిజమే లేకపోతే, వాళ్లఎప్పుడూ దోపిడీదారుల్లాగే వుండిపోతారు. వాళ్లని ఉద్ధరించాలన్నది కార్మిక వర్గం దృష్టి కాకపోయినా, శ్రామిక వర్గం, దోపిడీ నించి విముక్తి చెందడం అంటే, దోపిడీదారులకు కూడా, 'దోపిడీ చేయడం నించి' విముక్తే. అంటే, సోషలిజం, అందరికీ మంచిదే. అలాంటి మంచి సమాజం కూడా పోతూనే ఉంటుందా? నెగేషన్ సూత్రం, తిరకాసు సూత్రం కాదు. దాన్ని ఎలా అర్థం చేసుకోవాలో, ఆ ఉదాహరణలు చూద్దాం. లేకపోతే ఆ సూత్రం అర్థం కాదు.

బానిస సమాజం, మొదటి దోపిడీ సమాజం కదా? దాని తర్వాత భూస్వామ్య సమాజం వచ్చి, మొదటి దాన్ని తిరస్కరించింది. రెండోది కూడా దోపిడీ సమాజమే. అయినా, అది బానిసత్వాన్ని తీసేస్తుంది కాబట్టి, అది, మొదటి దాని కన్నా కొంత అభివృద్ధి కరమైనదే. అయితే, ఆ రెండోది కూడా వుండిపోదు. అందులో ఇంకా చెడ్డ వుంది కాబట్టి, మూడోది వచ్చి, అంటే పెట్టుబడిదారీ విధానం వచ్చి, భూస్వామ్యాన్ని (రెండో దాన్ని) తీసేస్తుంది. మూడోది కూడా దోపిడీ సమాజమే. అయినా భూస్వామ్యం కన్నా పెట్టుబడి దారీ విధానం కొంత అభివృద్ధికరమైనదే. శ్రామికులకు జీతాల పద్ధతీ, పని గంటల పద్ధతీ, సెలవుల పద్ధతీ, అలాంటివి అక్కడ ఏర్పడతాయి. అయితే, ఆ మూడోది కూడా దోపిడీదే. అదీ వుండి పోదు. దాని కన్నా అభివృద్ధికరమైనది సోషలిజం కదా? అది 4వ దశ. అది వచ్చి; మూడోదాన్ని తీసేస్తుంది. సోషలిజంలో కూడా ఇంకా జీతాల పద్ధతీ, పాత శ్రమ విభజన పద్ధతీ, సరుకుల అమ్మకాల పద్ధతీ, అన్నీ వుండి, సోషలిజం కూడా కొన్ని పరిమితులతో ఉంటుంది. వాటి నన్నిటినీ కూడా తీసివెయ్యగలిగేది 5వ దశ అయిన కమ్యూనిజం. అంటే, ఆ 5వది వచ్చి, 4వ దాన్ని తీసేస్తుంది. అంటే, అప్పటి దాకా జరిగింది ఏమిటంటే, మంచిది వచ్చి, చెడ్డని తీసేస్తోంది.

కమ్యూనిజాన్ని, వైరుధ్యాలు లేని సమాజంగా ఊహిస్తాం. అది అలా తయారైతేనే అది కమ్యూనిజం. ఊరికే, ఆ పేరుతో పిలిస్తే అది కమ్యూనిజం అవదు. కమ్యూనిజం అంటే, శతృ వర్గాలు లేని, శ్రమ దోపిడీ లేని, శతృ వైరుధ్యాలు లేని, అందరూ శ్రమ చేసే సమాన సంబంధాల సమాజం! ఈ సమాజంలో, యజమానీ శ్రామిక సంబంధాలుఉండవు. కలిమీ – లేమీ తేడాలుఉండవు. (దోపిడీ వుంటేనే, పేదలూ – ధనికులూ.) ఈ సమాజంలో, స్త్రీ పురుషు లందరూ, ఉత్పత్తిదారులే. ప్రతి ఒక్కరూ, కొన్ని శారీరక శ్రమలూ, కొన్ని మేధా శ్రమలూ, డ్యూటీల ప్రకారం చేసే విధంగా, దోపిడీ సమాజాల శ్రమ విభజన మారుతుంది. ఈ సమాజంలో, అమ్మ డాలూ – కొనడాలూ, జీతాల పద్ధతీ, డబ్బు చలామణీ, ఏమీఉండవు. అందరూ శ్రమలు చేయడమూ, అవసరాల్నిబట్టి ఉత్పత్తులు వాడుకోవడమూ, ఉంటాయి. (నెలకి 50 కిలోల బియ్యాన్ని వాడగలిగే కుటుంబం, 100 కిలోల్ని కాదు, 60 కిలోల్ని కూడా వాడలేదు. 7, 8 కుర్చీలతో అవసరం ఉన్నకుటుంబం, 20 కుర్చీల్ని వాడలేదు. ఏ ఉత్పత్తి సంగతైనా అంతే.) సమాజంలో, ప్రతీ చోటా, నిర్వహణ సంఘాలే గానీ, 'ప్రభుత్వం' అనేదిఉండదు. దానితో అవసరంఉండదు. ప్రభుత్వం లేనప్పుడు, కోర్టులూ జైళ్ళూ అక్కరలేదు. దోపిడీ లేనప్పుడు, యుద్ధాలూ సైనికులూ అక్కరలేదు. అందరూ పని చేసే సమాజంలో, అనవసరపు ఖర్చులు లేని సమాజంలో, మనుషుల పని కాలం, రోజుకి 3, 4 గంటల కన్నా ఎక్కువగా అవసరంఉండదు. అందరికీ పరిశుభ్రమైన, విశాలమైన ఇళ్ళూ; కల్తీ లేని ఆహారం; ప్రకృతి శాస్త్రాలూ – సమాజ శాస్త్రమూ తెలిసిన విజ్ఞానం, జీవితాంతం ఉంటాయి. కుల, మతాల వంటి తప్పుడు సంప్రదాయాలు సోషలిజంలోనే మాయమవుతూఉండగా, అక్కడ మిగిలిపోయిన తప్పులేమైనా వుంటే, అవన్నీ ఇక్కడ అంతరిస్తాయి. – ఇటువంటి వర్గ వైరుధ్యాలు లేని సమాజం ఏర్పడిం దని ఊహిద్దాం. దాని పేరు 'కమ్యూనిజం'. ఇదంతా, ఆదర్శం కోసం ఊహించడం కాదు. అంతా హేతుబద్ధంగా సాగుతుంది.

ఆ సమాజానికి, గుణమూ, రూపమూ, ఉంటాయి. గుణం, 'సమానత్వ శ్రమ సంబంధాలు'. రూపం, అప్పటికి ఉన్నఉత్పత్తుల తయారీని బట్టి! ఉత్పత్తుల్లో మార్పులు జరుగుతూ వుంటే, సమాజ రూపంలో చిన్నా – పెద్దా మార్పులు ఉంటాయి. నాగళ్ళు పోయి ట్రాక్టర్లు వస్తే, క్రమంగా నాగళ్ళు కనపడవు, ట్రాక్టర్లే తప్ప! బస్సులూ రైళ్ళూ వచ్చి, ఎడ్ల బళ్లని మాయం చేస్తాయి. ఫోన్లు వచ్చి, టెలిగ్రాముల్ని తీసేస్తాయి. డాబాలు వచ్చి, పెంకుటిళ్ళు మాయమవు తాయి. టేప్ రికార్డర్లు వచ్చి, గ్రామఫోన్లని మరిపిస్తాయి. ప్రకృతి సహజత్వాన్ని పాడుచేసే ఉత్పత్తులేవైనా వుంటే, అవీ నిలబడవు. కొన్ని రకాల ఉత్పత్తులు అంతరించి, వాటి స్థానంలో కొత్త రకాలు స్థిరపడినప్పుడు, అది సమాజానికి రూపంలో మార్పే. సమాజంలో గుర్రప్పందాల వంటి జూదాలన్నీ అంతరించిపోతే, అది కూడా రూపంలో మార్పు. పత్రికల్లో ఆడవాళ్ల చంకల, తొడల, పిర్రల, వెకిలి జుట్ల, ఫోటోలన్నీ అంతరిస్తే, అది సమాజానికి గుణంలోనూ, రూపంలోనూ కూడా మార్పు. – ఇలాంటి మార్పులన్నిటినీ ఊహించుకోవచ్చు. దోపిడీ గుణం మారినప్పుడు; దోపిడీ రూపాలు కూడా మారతాయి. పాత సమాజాల్లో వుండే కొన్ని 'మంచి'లు మారకుండా వుండిపోతాయి.

సమానత్వ సంబంధాల్లో ఎక్కడైనా చిన్న మార్పు జరిగితే, అవి అసమానత్వ సంబంధాలు అవుతాయి. అలా జరిగితే, 'మంచి గుణం' కొంత చెడిందని అర్థమే గానీ, సమాజం ఇంకా అభివృద్ధి చెందిందని అర్థం కాదు. 'సమానత్వం'లో ఏ శాఖలో ఏ చిన్న బీట పడినా, దాని మీద చర్చలు జరిగి, ఆ బీట అంతర్ధానమై, సమానత్వమేమళ్లీ సర్దుకోవాలి. అంటే, ఎప్పుడూ నిలబడవల సింది, 'సమానత్వం'. అదే, చివరి దశ. శాశ్వతంగా నిలబడవలసిన దశ అదే. అదే కమ్యూనిజం.

అయితే, ఆ సమానత్వం తర్వాత ఏమిటి? సమానత్వం ఇంకా అభివృద్ధి చెందాలంటే ఎలాగ? సమానత్వానికి ఇంకా అభివృద్ధి ఉంటుందా? – ఉండదు.

నెగేషన్ సూత్రం, కమ్యూనిజం మీద కూడా పనిచేస్తుందా?

సమానత్వ సంబంధాలతో ఏర్పడే కమ్యూనిజం, ఇక ఆ సంబంధాలతోనే కొనసాగుతుంది. గుణం అయితే, 'సమానత్వమే'. రూపం అయితే, ఉత్పత్తుల్లో, ఉత్పత్తి శక్తుల్లో, అప్పుడప్పుడూ ఏర్పడే మార్పుల వల్ల, ఆ శక్తుల్ని వాడాలా, వదిలెయ్యాలా అనే మిత్ర వైరుధ్యాలు తలెత్తితే, అవి కూడా చర్చలతో అంతరించి, సమాజ రూపంలో మార్పు జరగవచ్చు, జరక్కపోవచ్చు.

బానిస సమాజం నించి, కమ్యూనిజం దాకా చూస్తే, చెడ్డని చివరికి మంచి తీసేసిందని అర్థం వస్తుంది. అయితే, ఆ మంచికి కూడా తిరస్కరణ ఉంటుందా? 'నెగేషన్' సూత్రం, కమ్యూనిజం మీద కూడా పనిచేస్తుందా? అది, పాత సమాజాల్ని మారుస్తూ వచ్చినట్టు, కమ్యూనిజాన్ని కూడా మారుస్తుందా? – మార్చదు. 'సమానత్వం' కన్నా అభివృద్ధిఉండదు కాబట్టి, ఆ దశ అంతకన్నా పైకి పోవడం జరగదు. సమానత్వం మారాలంటే, అది వెనక్కి మారాలి గానీ, ముందుకి మారదు. వెనకడుగులు పడి ఎక్కడైనా పతనం జరిగితే, ఆ సంబంధాలుమళ్లీ ముందుకు నడిచి, సమానత్వ దశకే చేరాలి. 'సమానత్వం' అనేది, మానవ సమాజానికి చివరి దశ. సమాజం చేరవలసిన గమ్యం అదే!

'నెగేషన్' సూత్రం, ఎంత వరకూ పనిచేస్తుందంటే, శత్రు వైరుధ్యాలు ఉన్నంత వరకే. అంటే, అవి పోయే వరకే. బానిస సమాజం, కమ్యూనిజం వరకూ అభివృద్ధి చెందుతూ వచ్చిందంటే, ప్రతీ దశలోనూ శత్రు వైరుధ్యాలు వున్నాయి కాబట్టే. ఆ వైరుధ్యాలు అంతరించిపోయిన తర్వాత, ఇక ఆ సూత్రంతో పనిఉండదు. ఆ సూత్రాన్ని ఇలా అర్థం చేసుకుంటే, దానితో ఇబ్బందిఉండదు.

ఆ సూత్రాన్నే కాదు, ఇంకో రెండు గతి తార్కిక సూత్రాలు కూడా ఇలాంటివే కనపడతాయి. పదార్థాల్లో, ఎప్పుడూ చలనం (మార్పు) ఉంటుందనేది ఒకటీ; గుణం, పరిమాణంగా; పరిమాణం, గుణంగా; మారతాయనేది ఇంకోటీ.

ప్రకృతి పదార్థాల్లో, చలనం (మార్పు) ఎప్పుడూ జరుగుతూ, ఆ పదార్థాలు మారడం స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది. అయితే, ప్రకృతిలో ఏ మార్పు జరిగినా, అది సహజ పరిణామమే. అది వైరుధ్యాలతోనే జరిగినా, ఆ వైరుధ్యాలు శత్రు వైరుధ్యాలు అవవు. సూర్యగోళం హఠాత్తుగా పేలిపోయినా, నక్షత్రాలన్నీ రాలి చెల్లా చెదురైనా, ప్రకృతిలో ఇంకెలా జరిగినా, అవన్నీ సహజ పరిణామాలే. వాటి సహజ కారణాలేవో వాటికి ఉంటాయి. నీరు, పల్లానికి ప్రవహించడంలో, ఎంత సహజ కారణం ఉంటుందో, ఒక నక్షత్రానికి కాంతి తగ్గిపోవడంలో అంత సహజ కారణం ఉంటుంది. ఆ కారణాలు ఎప్పటికీ నశించవు. అక్కడ, కొంత కాలానికి అంత రించిపోయే శత్రుత్వాలేమీఉండవు. కానీ, సమాజంలో మార్పులు అలా కాదు. బానిసత్వం, కమ్యూనిజం వరకూ మారిందంటే, అది శత్రు వైరుధ్యాల వల్ల! ఆ వైరుధ్యాలు ఏ దశ నాటికి పోతాయో, సమాజ గుణంలో మంచి మార్పు అక్కడే స్థిరపడి ఆగిపోవాలి. శత్రుత్వాలు అంతరించిపోయే దశ మానవ సమాజానికి ఉంటుంది.

ప్రకృతిలో జరిగే ప్రతీ మార్పూ సమాజానికి యధాతథంగా వర్తించదు. ఎందుకంటే, ప్రకృతిలో వుండేవి శత్రు వైరుధ్యాలు కావు. అవి శత్రు వైరుధ్యాలే అయితే, ప్రకృతిలో కూడా ఆ వైరుధ్యాలు పోయి, ప్రకృతి ఏదో ఒక చివరి గమ్యానికి చేరి అక్కడే స్థిరపడి, ఆ పదార్థం అలా నిలిచిపోవలసి వస్తుంది. అక్కడ ఎలా జరుగుతుందో మనం చెప్పుకోలేకపోయినా, సమాజం సంగతి మాత్రం మన తర్కంతో స్పష్టంగా చెప్పుకోగలం. ప్రకృతికి ఆదీ, అంతమూ,ఉండవని చెప్పుకుంటాం. ప్రకృతికి మొదలూ, చివరా,ఉండవు. కానీ, మానవ సమాజానికి, మొదలూ, చివరా, ఉంటాయి. మొదలు ఆదిమ సమాజం అయితే, చివరిది కమ్యూనిజం. కమ్యూనిజం దాకా హేతుబద్ధమైన తర్కంతో చెప్పుకోగల వాళ్లం, ఆ తర్వాతను గురించి కూడా ఆ తర్కంతోనే చెప్పుకోగలం. తర్కం అనేది, జోస్యం కాదు. సమాజ సంబంధాల్లో, శత్రు వైరుధ్యాలు లేని గుణం ఏర్పడి, అప్పటి నించీ 'చలనం' అనేది, గుణంలో గాక, రూపంలోనే సాగుతుంది. 'పరిమాణం' అనే దానికి మనం ఏ అర్థం చెప్పుకున్నా, అది ఎలా మారినా, అది, 'సమానత్వం' అనే గుణాన్ని మార్చదు. ఒక గుణం పోయి, ఇంకో గుణం రావడం, కమ్యూనిజం తర్వాత జరగదు. ఆ 3 పేర్లు గల గతి తర్క సూత్రాలు, శత్రు వైరుధ్యాలు గల సమాజంలో, కొన్ని దశల వరకే కనిపిస్తాయి.

గతి తర్క సూత్రాలుగా చెప్పుకున్న వాటిని తప్పు తప్పులుగా అర్థం చేసుకోవడం ఈ 'మేం వస్తాం' పుస్తకంలో చాలా ఎక్కువగా వుంది. సమాజ సంబంధాల్లో ఎప్పుడూ మార్పులు (ఎప్పుడూ చలనం) జరుగుతూనే ఉంటాయి అనీ (అంటే, కమ్యూనిజం కూడా పోతుంది అని), ఒక దశని తిరస్కరించిన ఇంకో దశకి కూడా అలాగే జరుగుతుంది – అనీ, ఆ రకంగా ఆ మార్పులన్నీ నిరంతరం జరుగుతాయని భావిస్తుంది, ఈ పుస్తకం. అందుకే, 'ఏ సమాజమూ నిలబడదు' అనే అర్థానికి వచ్చింది.

'మేంమళ్లీ వస్తాం' అనే కేకలతో వచ్చే విప్లవకారులు, ఈ పుస్తకం ప్రకారం, వాళ్లవచ్చి చేసే పని ఏమిటంటే, కొత్తగా నిర్మించే సోషలిజాన్ని తప్పకుండా లోపాలతోనే నిర్మిస్తారు – అనుకోవాలి. తర్వాత రివిజనిజం రావడానికి అనుకూలంగా! సోషలిజంలో ఉన్నజనం, అజ్ఞానులుగా వుంటేనే,మళ్లీ రివిజనిజం ప్రవేశించగలదు. అంటే, జనాన్ని అజ్ఞానంగానే వుంచాలి.

స్టాలిన్ పార్టీ – సోషలిజం గానీ, మావో పార్టీ – సోషలిజం గానీ, లోపాలతో వున్నాయి కాబట్టే, అక్కడ రివిజనిజాలు తలెత్తగలి గాయని అర్థం. ఆ నాయకులు విప్లవకారులే అయినా, వారి వాదా లకు పార్టీలో మెజారిటీలు లేక, అప్పటికి ఆ పార్టీ, సమాజంలో సంబంధాల్ని అంతకన్నా మార్చడం సాధ్యం కాలేదని అర్థం చేసుకో గలం. అలా అర్థం చేసుకోవడం గాక, సోషలిజం తర్వాత రివిజనిజం ప్రవేశించి తీరుతుందనీ, రివిజనిజం తర్వాతమళ్లీ అభివృద్ధే వస్తుందనీ, అదీ పోతుందనీ, అది అలా సాగుతూనే ఉంటుందనీ, ఈ 'మళ్ళీ వస్తాం' పుస్తకం చెప్పడం చాలా హాస్యాస్పదం.

(ఇంకా ఉంది)

*(రచయిత బహు గ్రంథకర్త, మార్క్స్ 'పెట్టుబడి' పరిచయకర్త)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన-20

***భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వపరాల చరిత్రను వివరిస్తున్నారు***

**ఎస్.సరళా వందనం**

*(గత సంచిక తరువాయి...)*

**ఆంధ్రప్రదేశ్ ఏజెన్సీ ప్రాంతాల భూ బదిలీ క్రమబద్ధీకరణ చట్టం 1959**

1959లో చేసిన ఈ చట్టం ద్వారా భారత రాష్ట్రపతికి ఏజెన్సీ ప్రాంతాలుగా నిర్ధారించడానికి ఉన్న అధికారం ద్వారా ఆదిలాబాదు, వరంగల్, ఖమ్మం, మహబూబ్‌నగర్ జిల్లాలలో గిరిజనులు నివసించే ప్రాంతాలను ఏజెన్సీ ప్రాంతాలుగా నిర్ధారించారు. ఇదే చట్టం ద్వారా ఏదేని ప్రాంతాలను ఎప్పటికప్పుడు ఏజెన్సీ ప్రాంతాలుగా 'గంజా విజగపట్నం చట్టం 1839' లోని సెక్షన్ 8 ద్వారా అప్పటి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధికి స్థానిక పరిస్థితులను బట్టి ఏజెన్సీ ప్రాంతాల పరిధిని పెంచే లేదా తొలగించే లేదా నిర్ధారించే అధికారం ఏదైతే ఉందో అది రాష్ట్రపతికి సంక్రమించింది. ఈ చట్టం ద్వారా ఏజెన్సీ ప్రాంతాలుగా గుర్తించిన ప్రాంతాలలో పరిపాలనా సౌలభ్యం కోసం ఏజెన్సీ డివిజనల్ అధికారులను నియమించారు. 1954 సంవత్సరంలో ప్రత్యేకంగా గిరిజనులను సహకార సంఘాలుగా ఏర్పరచడానికి సహకార సంఘాల చట్టం 1954 అమలులో కొచ్చింది. చేసి ఈ చట్టం ద్వారా గిరిజన సహకార సంఘాలను ఏర్పాటు చేశారు. గిరిజనుల ఆధీనంలో ఉన్న భూములపై గిరిజనేతరులు జరిపిన కొనుగోళ్ళు, బదలాయింపులు, దానాలు, లీజులు భూలావాదేవీలు చెల్లవని 1959 చట్టం నిర్దేశించింది. గిరిజనేతరుల ఆధీనంలోని భూముల పరిష్కారం, గిరిజనులకు భూమి హక్కుల క్రమబద్ధీకరణ అధికారాన్ని ఏజెన్సీ డివిజనల్ అధికారికి ఈ చట్టం ద్వారా సంక్రమించాయి.

ఈ చట్టం ద్వారా ఏజెన్సీ ప్రాంతాలుగా గుర్తించిన ప్రాంతాలలో గిరిజనులు తమ భూములను గిరిజనులకే అమ్మాలి. ఒకవేళ గిరిజనులు కొనుక్కోవడానికి ముందుకు రాకపోతే ప్రభుత్వమే ఆ భూములను కొని గిరిజనులకు ఉచితంగా కాని, అమ్మకం ద్వారా కాని పంపిణీ చేయాలి. గిరిజనేతరుల ఆధీనంలో ఉన్న భూములను ఏజెన్సీ డివిజనల్ అధికారి స్వాధీనం చేసుకొని ఇంతకు ముందు ఆ భూమిని అనుభవిస్తున్న వారికే అప్పగించాలి. ఒకవేళ ఆ కుటుంబ సభ్యులు ఎవరూ లేకపోతే వేరే గిరిజనులకు అమ్మకం ద్వారా లేదా ఉచితంగా పంపిణీ చేయాలి. ఈ చట్టం ద్వారా గిరిజనులు తమంతట తామే భూమిపై హక్కులను వదులు కోవాలనుకుంటే అది రాష్ట్ర ప్రభుత్వం అనుమతిలోనే జరగాలి.

ఈ చట్టం పరిధి నుంచి 1959 సంవత్సరానికి ముందు జరిగిన భూ లావాదేవీలను, ఎస్టేట్ భూముల చట్టం 1908 ద్వారా అయిన లావాదేవీలను మినహాయించారు.

**హైదరాబాద్ రాష్ట్ర (ప్రాంత ఇజారా, కౌలు భూముల రద్దు, నిర్ధారించిన పన్నుల మీద ఇచ్చిన రాయితీ రద్దు చట్టం 1961**

పూర్వపు నిజాం పాలనలోని హైదరాబాద్ రాష్ట్ర ప్రాంతాలలో నిర్ధారించిన పన్ను మీద రాయితీ ఇస్తూ పన్ను వసూలు చేసుకొమ్మని వందల వేల ఎకరాలు ఇజారాదారులకు లీజుగాను, శాశ్వతంగానూ ప్రభుత్వం ఇచ్చింది. ఈ మక్తాదారులు తమకు కేటాయించిన భూములలో (పన్ను రాయితీ కింద) పన్ను వసూలు చేసుకుంటూ అధికారం అనుభవిస్తున్నారు. కౌలుదారుల చట్టాల వలనయినా, ఇనాం భూములు రద్దు చట్టం వలనయినా సాగుదారుడు అనుభవంలో ఉన్న భూమికి ప్రభుత్వం నిర్ధారించిన భూమి శిస్తు మొత్తం చెల్లించి, భూమిపై తమ అనుభవాల్ని నిరూపించుకొని సాగుదారుడు భూమి హక్కు పత్రాన్ని పొందాల్సి వస్తుంది. పన్ను వసూలు చేసుకొనే అధికారం, ఇతర అధికారులు మక్తాదారులుకు ఉండడం వలన, సాగుదారులు హక్కులు పొందే అవకాశం లేకుండా పోయింది. ఈ చట్టం ద్వారా భూమిపై వాస్తవ హక్కు పొందే వారి కోసం ఇజారాదారులు, కౌలుదారులు, మక్తాదారులకు అధికారం ఉన్న భూములపై వారికిచ్చిన అధికారాన్ని, పన్నుపై రాయితీని రద్దు చేయడంతో వాస్తవ సాగుదారులకు భూములపై హక్కు పొందే అవకాశం లభించింది.

**ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కమతాల గరిష్ఠ పరిమితి చట్టం 1961**

ఈ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటికీ వర్తింప చేస్తూ కుటుంబంలోని ప్రతి సభ్యున్ని ఒక యూనిట్‌గా తీసుకొని భూమికి గరిష్ఠ పరిమితిని నిర్ణయించారు. ఈ చట్టం ద్వారా యూనిట్‌కు 27 ఎకరాల మాగాణి లేదా తరి భూమి, 360 వరకూ ఎకరాల మెట్ట భూమి ఉండొచ్చని నిర్ణయించారు. వ్యాపార పంటలైన చెరుకు, కాఫీ, తేయాకు, రబ్బరు, తోట భూములను ఈ చట్ట పరిధి నుంచి మినహాయించారు. ఈ చట్టం ద్వారా లక్షల ఎకరాల మిగులు భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందని భావిస్తే, వాస్తవంగా ఆంధ్ర ప్రాంతంలో 4305 ఎకరాలు, పూర్వ హైదరాబాద్ రాష్ట్ర భూభాగంలో 22995 ఎకరాలు మాత్రమే మిగులు భూమిగా ప్రకటించారు. భూస్వాములు వాణిజ్య పంటల రూపంలో వందల ఎకరాలకు ఈ చట్ట పరిధి నుంచి మినహాయింపు పొంది, వ్యవసాయం మీద వచ్చిన ఆదాయాలను ఇతర రంగాలకు మళ్లించి లబ్ధి పొందారు. ఈ చట్టం ద్వారా భూమి లేని వారికి, కౌలుదారులకు, సేవా ఇనాందారులకు వచ్చిన ఉపయోగం పెద్దగా లేకపోగా, ఐదుగురు సభ్యులున్న కుటుంబానికి భూమి రకాన్ని బట్టి 180 నుంచి 360 ఎకరాల తరి భూమి, 1080 నుంచి 2160 ఎకరాల మెట్ట భూమిపై హక్కులు పొందడానికి వీలు ఏర్పడింది.

**నిర్వాసితుల ఆస్తుల పరిపాలనా చట్టం 1950, నిర్వాసితుల(నష్ట పరిహారం, పునరావాసం) చట్టం 1954**

ఈ చట్టాలు రెండూ కేంద్ర ప్రభుత్వానికి చెందినవి. కేంద్ర ప్రభుత్వం 1950 చట్టం చేయడానికి ముందే హైదరాబాదు ప్రభుత్వం నోటిఫికేషన్

నంబరు 5 ద్వారా 1949 సెప్టెంబరు 15న హైదరాబాదు రాష్ట్ర భూభాగంలోని నిర్వాసితుల ఆస్తులపై నిబంధనలు అమలులోకి తీసుకొచ్చింది. ఈ నిబంధనలలోని సెక్షన్ 6 ద్వారా కస్టోడియన్ అయిన నాగేంద్ర బహదూర్ నిర్వాసితుల ఆస్తులను ప్రభుత్వం స్వాధీన పరుచుకుంటూ చేస్తూ హైదరాబాదు గజిట్‌లో 1949 డిసెంబర్ 19న స్వాధీనం చేసుకున్న ఆస్తులను ప్రకటించింది. నిజాం పాలన కింద ఉన్న నిర్వాసితుల భూములు, ఇతర సంస్థానాల భూములు ప్రభుత్వ పాలన కిందకు వచ్చాయి. అదే సమయంలో భారతదేశం నుంచి తూర్పు, పశ్చిమ పాకిస్తాన్లుగా విడిపోవడం కూడ జరిగింది. ఈ చట్టం పరిధిలోకి నిర్వాసితులుగా ఎవరైతే 1947 మార్చ్ 1 నుంచి భారత భూభాగం నుంచి పాకిస్తాన్‌కు వెళ్లిపోతారో వారు 1947 ఆగస్టు 14 తరువాత పాకిస్తాన్‌లో ఆస్తులను సంపాదించుకుంటారు. ఎవరైతే తమ ఆస్తులను భారత ప్రభుత్వం అనుమతి లేకుండా 1949 అక్టోబర్ 18 తరువాత పాకిస్తాన్‌కు బదిలీ చేస్తారో వారు పాకిస్థాన్‌గా ఆవిర్భవించిన తరువాత 1949 అక్టోబర్ 10కి పాకిస్తాన్ ప్రభుత్వం ఎవరి ఆస్తినైతే నిర్వాసిత ఆస్తిగా పరిగణిస్తుందో వారిని, నిర్వాసితులుగా భారత ప్రభుత్వం గుర్తించింది. ఇలాంటి వారి ఆస్తులను మొత్తాన్ని గుర్తించి 1950–1951 మధ్య రిజిష్టర్లు తయారు చేయమని ఈ చట్టం ద్వారా కలెక్టర్లకు అధికారం ఇచ్చారు. ఈ రిజిష్టర్లను బేసిక్ ప్రాపర్టీ రిజిష్టర్లంటారు. ఈ చట్టం ద్వారా ప్రభుత్వం నిర్వాసితుల ఆస్తులను స్వాధీనం చేసుకోవడం, వాటి పాలనా వ్యవహారాలను నిర్వహించడం, ఆస్తులను పరిరక్షించడంతో పాటు నిర్వాహక అధికారిగా కూడా ఉంటుంది. ఇందుకోసం నిర్వాసితుల (నష్ట పరిహారం, పునరావాసం) చట్టం 1954 ద్వారా నిర్వాసితులకు నష్ట పరిహారం, పునరావాసం, వారి పేర ఉన్న ఆస్తులను అమ్మకం లేదా పరిష్కారం చేయడానికి భారత ప్రభుత్వ పరిధిలో, సెక్రటరీని చీఫ్ సెటిల్‌మెంట్ కమిషనర్‌గా నియమించారు. రాష్ట్రానికి సంబంధించి బోర్డు ఆఫ్ రెవెన్యూను, జిల్లాకు సంబంధించి 1967 వరకూ కలెక్టరును 1967 నుంచి (జాయింట్ కలెక్టర్ల) సంయుక్త కలెక్టర్ల వ్యవస్థ ప్రారంభమైన తరువాత వారిని, జిల్లాకు సెటిల్‌మెంట్ అధికారిగా నియమించడం జరిగింది. తహసిల్దారుకు నిర్వాహక అధికారిగా తన తాలుకా పరిధిలోని నిర్వాసితుల ఆస్తులను నిర్వహించే బాధ్యత ఈ చట్టం ద్వారా సంక్రమించింది.

ఈ చట్టాల ద్వారా నిర్వాసితులు కాని వారి ఆస్తిలో నిర్వాసితునికి భాగం ఉంటే, అలాంటి వాటికి పరిష్కారం సివిల్ కోర్టుల పరిధిలో ఉంటుంది. పూర్వ హైదరాబాదు రాష్ట్ర పరిధిలోకి వచ్చే జిల్లాలైన హైదరాబాదు, రంగారెడ్డి, నల్గొండ, ఖమ్మం, నిజామాబాదు, కరీంనగర్, వరంగల్, ఆదిలాబాదు, మెదక్, మహబూబ్‌నగర్‌లలో ఇప్పటికీ నిర్వాసితుల భూములు పరిష్కారం కాకుండా తగాదాలలో ఉన్నాయి. పూర్వ మద్రాసు రాష్ట్ర పరిధిలోని కృష్ణా, కర్నూలు, గుంటూరు, ప్రకాశం, పశ్చిమ గోదావరి జిల్లాలలో కస్టోడియన్ జనరల్ ద్వారా అమ్మకాలు, పరిష్కారాలు ఎప్పుడో జరిగిపోయాయి. పూర్వ హైదరాబాదు రాష్ట్రంలోని జిల్లాలకు సంబంధించిన నిర్వాసితుల ఆస్తులను బొంబాయి డిప్యూటీ కస్టోడియన్ జనరల్ దగ్గర నుంచి కొన్న వారు అమ్మకపు ధ్రువ పత్రాలు చూపించినా కూడా 1950–51లో తయారు చేసిన రిజిష్టర్లలో వీరి పేర్లను ఇప్పటికీ మార్పుచేయలేదు. బొంబాయి డిప్యూటీ కస్టోడియన్ జనరల్‌లు పరిష్కరించిన భూముల జాబితా, అమ్మకపు ధ్రువ పత్రాలలో ఉన్న భూముల జాబితాలు బోర్డు ఆఫ్ రెవెన్యూలోనూ ప్రతిజిల్లా పరిధిలోనూ ఉన్న నిర్వాసితుల భూములకు సరైన సహ సంబంధం (కోరిలేషన్) లేక ఎన్నో కేసులు ఇప్పటికీ పెండింగ్‌లో ఉన్నాయి.

**శత్రు ఆస్తి చట్టం 1968**

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పాకిస్తాన్, ఇరాన్, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ దేశాల వారు ఈ దేశంలో వారికి ఉన్న వేలాది ఎకరాల భూములను వదిలేసి వెళ్లిపోయారు. కొంత మంది వెళ్లకపోయినా వారి కుటుంబంలోని కొద్ది మంది మిగతా వారు వెళ్లిపోయి అక్కడే సెటిల్ అవడం వలన వారి కుటుంబం మొత్తం ఆస్తులను కూడా శత్రు ఆస్తులుగా పరిగణించి కస్టోడియన్‌లు ప్రభుత్వ ఆస్తులుగా వాటిని పరిగణించి స్వాధీనం చేసుకున్నారు. భారత ప్రభుత్వం దేశం మొత్తం మీద 2186 ఈ తరహా ఆస్తుల పర్యవేక్షణ చేపట్టింది. ఈ విదేశస్తుల ఆస్తులను ప్రభుత్వం ద్వారా లీజుకు తీసుకొని అనుభవిస్తున్న వారు చాలా కాలం నుంచి ఈ భూములలో ఉంటూ భూమిపై హక్కులు పొందే అవకాశం వచ్చి హక్కులు పొందారు. కాని ఇప్పటికి కూడా కొన్ని ఆస్తులకు సంబంధించి ఇక్కడే నివసిస్తున్న శత్రు ఆస్తి చట్టం పరిధిలోకి వచ్చే వారసులు కోర్టులలో వ్యాజ్యాలు నడిపిస్తూ తమ ఆస్తులను స్వాధీనం చేసుకోవడం, తిరిగి అప్పీలులో ఓడిపోవడం, చివరకు ఇప్పుడు సుప్రీంకోర్టులోనూ ఈ చట్ట పరిధిలో కొచ్చే కేసులు చాలా పెండింగ్‌లో ఉన్నాయి.

**ఆంధ్రప్రదేశ్ మహలుల(రద్దు, రైత్వారీగా మార్పు) నిబంధనలు 1969**

ఖమ్మం జిల్లా ఏజెన్సీ ప్రాంతాలైన నాగూరు, అలబాక, చర్లతో పాటు సుబ్బన్నపేట, దొండుపేట, సారంగపాణి గ్రామాలలో ఉన్న మహలులు, ఎస్టేట్ల యాజమాన్యాల కింద ఉన్న భూములను ఈ నిబంధనల ద్వారా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఈ భూములను సర్వే చేయించి సాగుదారులకు పట్టాలు ఇవ్వడానికి సెటిల్‌మెంట్ అధికారిని డైరెక్టర్ ఆఫ్ సర్వే ఆధీనంలో పని చేసే విధంగా నియమించారు.

**భూదాన భూములు**

భూమిలేని పేద ప్రజలకు భూమిని పంచడానికి భూస్వాములు తమంతట తామే తమ స్వాధీనంలోని భూములపై హక్కులు వదులుకొని భూదానం చేయడానికిగాను 1956 ఏప్రిల్ 18లో ప్రస్తుత రంగారెడ్డి జిల్లా పోచంపల్లి నుంచి ఆచార్య వినోబా భావే పాదయాత్ర చేపట్టారు. పదయాత్ర ద్వారా దాదాపు పది సంవత్సరాలు దేశమంతటా పర్యటించి 42 లక్షల ఎకరాల భూమిని భూస్వాములు స్వచ్ఛందంగా దానం చేసే విధంగా ప్రోత్సహించారు. ఈ దానం చేసిన భూముల నిర్వహణకు, వాటి పంపిణీకి 1958 సంవత్సరంలో భూదాన యజ్ఞ బోర్డులను నియమించారు. రాష్ట్రంలో 1.95 లక్షల ఎకరాల భూమిని భూదానోద్యమం ద్వారా సేకరించగా, అందులో కొంత భూమిని ప్రభుత్వ అవసరాలకు వినియోగించారు. 1.08 లక్షల ఎకరాలను పూర్తిగా భూమిలేని పేదలకు పంపిణీ చేశారు. 9783 ఎకరాల భూమి పంపిణీ ఇప్పటికీ జరగకుండా భూదాన యజ్ఞ బోర్డు వద్ద ఉండి రకరకాల పరిధిలో వ్యాజ్యాలలో ఉంది. కొన్ని భూములైతే దానమిచ్చిన వారి వారసుల ఆక్రమణలోనే ఉన్నాయి. ఈ భూములను పొందిన వారు వారసత్వంగా అనుభవించాలి తప్ప అన్యాక్రాంతం చేయకూడదు. కాని భూదాన భూములను పొందినవారు వాటిని అమ్ముకున్నారు. వీటికి తోడు రాష్ట్ర భూదాన యజ్ఞ బోర్డు నిబంధలకు విరుద్ధంగా అనర్హులకు భూమిని కేటాయించడం కూడ జరిగింది.(ఇంకా ఉంది)

(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)
saralareddy007@gmail.com

వీ

**www.veekshanam.wordpress.com మీద రాసిన వ్యాఖ్యలు**

*ఇంటర్నెట్‌లో బ్లాగ్ మీద జరిగే చర్చలలో వ్యాఖ్యాతల వివరాలు, స్థలాలు ఉండవు. దాదాపుగా అజ్ఞాత రచయితల వ్యాఖ్యల లాగ ఉంటాయి. ఆ అజ్ఞాతత్వం వల్ల మర్యాద పరిధులు దాటిన వ్యాఖ్యలు కూడా ఉంటాయి. ఒకరిద్దరు వ్యాఖ్యాతలే నెలపొడుగునా వేరు వేరు సమయాల్లో వేరు వేరు విషయాల మీద వ్యాఖ్యలు పోస్ట్ చేస్తున్నారు. ఒకరి వ్యాఖ్యల మీద మరొకరు కూడా ప్రతిస్పందిస్తున్నారు. ఈ వ్యాఖ్యాలలో నుంచి అచ్చులో పాఠకులకు అవసరమనుకున్న వాటిని మాత్రమే ఎడిట్ చేసి ప్రచురిస్తాం.*

వీక్షణం సెప్టెంబర్ సంచిక చాల ఆసక్తి కలిగించింది. ముందుగా ఉత్తరాల ప్రచురణ విషయంలో కొంత అభ్యంతరం చెప్పక తప్పదు. బ్లాగ్ సైట్‌లో వదిలిన వ్యాఖ్యలు ప్రచురించే హక్కు నిర్వాహకులకు ఉంది. అదే సమయంలో వ్యాఖ్య పూర్తిగా ప్రచురించాలి. నేను ఆగస్టులో చేసిన వ్యాఖ్యలో, తదుపరి భాగంలో, తెరాస భయానికి ప్రక్రియ ఆలస్యం చేయకూడదని భావించి, ఉమ్మడి రాజధాని తాత్కాలికంగానే ఉండాలని మార్పు చేశాను. విమర్శించే వారు దానిని కూడా విమర్శించవచ్చు. నా వ్యాఖ్యను విమర్శించిన వారు (సెప్టెంబర్ బ్లాగ్ సైట్లో అ ఉత్తరం రెండు భాగాలుగా ఉన్నది, నేను చూసిన ఆగస్టు బ్లాగ్‌లో లేదు) రాజేంద్రబాబు అనుకుంటాను, ఉన్నతమైన పరిష్కారం ఏమిటి అని అడిగారు. నాకు అందుబాటులో ఉన్న సమాచారం మేరకు సంపాదకులకు ఆగస్టులో, ఇ-మెయిల్లో ఉత్తరం పంపాను. వారు ప్రచురిస్తే కొంత వివరణ దొరుకుతుంది. అంతకంటే వివరంగా, లోతుగా సెప్టెంబర్ సంచికలో గంగాధర్ రాశారు. పిట్ట పోరు గురించి రాసింది ప్రజలలో హైదరాబాద్ గురించి ఉన్న ఘర్షణ, ఆచరణలో కేంద్ర పాలిత ప్రాంతం చేయడం గురించి. ఆ వివరణ ఇవ్వకపోవడం నా పొరపాటు. వారి వాదనకు కాలం చెల్లింది అని రాశానని ఆరోపణ చేశారు. దూరంగా ఉండడంవల్ల, జాగ్రత్త తీసుకుని 'కొంత కాలం చెల్లినట్లు కనబడుతుంది' అని రాశాను, గమనించగలరు.

ఇక పాములు చలి చీమల మాటకు వస్తే, చలి చీమలకు దొరికిన పాము మిగలదు. కోస్తా, రాయలసీమ ప్రాంతపు పాలకులు, నేడో రేపో తెలంగాణ పాలకులతో రాజీ కుదుర్చుకుంటారు. వారి ఆర్థిక మూలాలు, ఆఖరికి అక్రమంగా కూడబెట్టిన ఆస్తులు కదిలించే విధానం ఇప్పటికి లేదు. పైపెచ్చు ఆందోళన జరుగుతున్న సమయంలోనే పాలకుల నడుమ, వ్యాపార, రాజకీయ, వివాహ సంబంధాలు నడుస్తూనే ఉన్నాయి. చలి చీమలు పాముల పోలిక కాల్పనిక వస్తువే కాని ఉద్యమంలో నిజ వస్తువు కాదు. పెద్ద కార్మిక సాంద్రత ఉన్న ప్రాంతంలో వారి నాయకత్వం లేకుండా పాములు చావవు. ఇప్పుడు ఏర్పడుతున్న 'అఖండ' తెలంగాణ భావజాలం భవిష్యత్తులో వామపక్షాలకు, ప్రజాస్వామిక వర్గాలకు ప్రమాదం అన్నదే నా ఆందోళన. దానిని అందరూ పంచుకోవాలన్న నియమం ఏమి లేదు. తెరాస, జాక్ పరిమితులు విప్లవకారులకు లేవు. వామపక్షాల గురించి రాసిన దానిని తెరాస, జాక్‌లకు అన్వయించడంలో అర్థంలేదు.

దిగ్విజయ్ సింగ్ ప్రకటనను తెరాస ఆహ్వానించిన తరువాతే, పోలవరం గురించి ఎందుకు అభ్యంతరం తెలపలేదు అనే సందేహం మిగుల్చుకునే, ఇక ప్రభుత్వ లాంఛనాలు మాత్రమే మిగిలాయని దూరంగా ఉన్న వాళ్లం భావించాం. ఇక జాక్, తెరాసల ఆచరణ విధానాల విషయానికి వస్తే, నాకు తెరాస ఆచరణ గురించి బాధ లేదు. కొద్దిపాటి తేడాలతో నా దృష్టిలో కాంగ్రెస్, తెరాస, బిజెపి, టిడిపి ఒక్కటే. నా విభేదం విప్లవకారులతోనే. మొదటి తరహా పార్టీలు క్షీణించాలని కోరినట్లే, విప్లవ పార్టీలు బలపడాలని నా కోరిక. రాష్ట్రం రెండైనా, మూడైనా పెట్టుబడి పెట్టుబడే, దానివల్ల జరుగుతున్న విస్థాపన, మనిషి బతకలేని పర్యావరణ విధ్వంసం ఒక్కటే. పరిశ్రమలు తక్కువగా ఉన్న ప్రాంతానికే రాయితీలు ఇవ్వవలసిన అవసరం ఎక్కువ. అభివృద్ధి అని చెప్తున్నది ప్రపంచ బ్యాంకు నమూనా సామ్రాజ్యవాద అభివృద్ధే. అది ఎద్దేవా అనుకుంటే అది వారి ఇష్టం.

చివరిగా, సీమాంధ్రులు ఆత్మగౌరవంతో బతకలేరా? అన్నారు. చాలా మంచి మాట. ఆత్మగౌరవం ఉందో లేదో తెలియని వాళ్ల సంగతి అటుంచి, ఇంతకాలం వలసవాదులని విమర్శించిన – కాంట్రాక్టర్లు, సినిమా రంగం, రియల్ ఎస్టేట్, నిర్మాణ సంస్థలు, పరిశ్రమలు, ఐటి సంస్థలను (సీమాంధ్రులవి) – ఇక్కడే ఉండండి అన్నప్పుడు ఆత్మగౌరవం అడ్డురాలేదా? స్థానిక అధికారం మారినంత మాత్రాన వలసవాదం నడవదా?

రంగనాయకమ్మ సమీక్ష నాకు చాలావరకు అర్థంకాలేదు. అర్థం చేసుకున్న ఒకటి, రెండు విషయాలు మాత్రం ప్రస్తావిస్తాను. ఏ వస్తువునైన అంతర్గత వైరుధ్యాల కలయికగా గుర్తించడం గతితర్కం. వైరుధ్యం అంటే అనైక్యత అని భావించడం యాంత్రిక, సుద్ధ తర్కం. రాజకీయ పార్టీ కూడా ఇందుకు మినహాయింపు కాదు. వైరుధ్యం అనేది నిర్దిష్టంగా (స్థల, కాల పరిమితులకు లోబడి) ఉంటుంది. దీన్ని గుర్తించకుండా చేసే వాదన చాలా మట్టుకు ఎటుతెగని స్థితిలో ముగుస్తుంది.

69 పార్టీలు ఉంగే 69 సామ్యవాదాలు ఉంటాయా? ఆ పార్టీల నడుమ ఐక్యత, పోరాటాలు తత్వశాస్త్రం నుండి ఎత్తుగడల వరకు సాగి, అంతిమంగా ఏదో ఒకమార్గం విజయం సాధించడం, లేదా సమిష్టి నాశనం జరగడం ఆచరణలో చూడలేదా? అక్టోబర్ విప్లవంలో మూడు పార్టీలు ఉంటే మూడు సామ్యవాదాలు వచ్చాయా? మార్క్సిజం ప్రాథమికంగా ఆచరణ శాస్త్రం. ఆచరణతో సంబంధం లేనిదే అంతా బుద్ధిలో నుంచి పుట్టించే ఆదిభౌతిక (మెటాఫిజికల్) ధోరణి. తెలుగుదేశంలో మార్క్సిజం ప్రచారానికి ఎంతో దోహదం చేసిన వారు ఇలా రాయడం విచారకరం.

స్టాలిన్ అయినా జార్ అయినా ఏకవ్యక్తి పాలన జరిపేది కొన్ని వర్గాల, శ్రేణుల ఆధారంగానే. కాని ఆ వర్గాలు వారి ప్రయోజనాలకు రక్షణ ఉన్నంతవరకు రోజువారి పాలనలో జోక్యం చేసుకోవడం అరుదు. నాయకుని ఎదిరిస్తే పదవి, ప్రాణాలు మిగలవని తెలిసి ఎందరు ఎదిరిస్తారు? దానిని ఆమోదం అనడం నిర్దిష్ట పరిస్థితితో సంబంధం లేని శుద్ధతర్కం. ఒక్క స్టాలిన్ మీదే ఎందుకు నిందలు, పార్టీ బాధ్యత, ప్రజల బాధ్యత అనే వాదన కూడా సమస్య మూలాల్లోకి వెళ్లదు. ఎవరి ప్రతినిధిగా స్టాలిన్ పనిచేశాడు అని ప్రశ్నిస్తే జవాబు దొరుకుతుంది. రెండు ప్రపంచ యుద్ధాల నడుమ సామ్రాజ్యవాద దేశాల దాడి, తెల్లసైన్యంతో అంతర్యుద్ధం, దానిలో పెద్ద సంఖ్యలో మరణించిన కార్మికవర్గ కార్యకర్తలు, యుద్ధ సమయంలో కార్మికుల స్థానంలో విప్లవ అనుభవంలేని కార్మికులు, వీరిలో గణనీయమైన భాగం ఫ్యాక్టరీ పనిని తాత్కాలికమైనదిగా చూసే చైతన్యం, వినియోగ సరుకుల కొరత, పాత జారిస్ట్ నిపుణుల మీద ఆధారపడి వారికి అధిక జీతాలు, సౌకర్యాలు కల్పించవలసిన స్థితిలో స్టాలిన్ అధికారం సాగింది. ఒకరిద్దరు కార్యకర్తలు తమ కంటే నైపుణ్యం ఉన్న వందలాది జారిస్ట్ ఉద్యోగులను అజమాయిషీ చేయడం వంటి పరిస్థితిలో పార్టీలో రాజకీయ దిగజారుడు, సమాజంలో పెద్ద ఎత్తున్న ఉన్న రైతుల ఒంటరి తత్వం, మత, మాయజాల నమ్మకాలు, స్తబ్ధతల నేపథ్యంలో ఈ రకం పాలన ఏర్పడింది. (ఉదా. లెనిన్ పొలిటికల్ రిపోర్ట్ పార్టీ 12వ కాంగ్రెస్, (ది కార్ రెఫ్యూజెస్ టు ఒబే ది డ్రైవర్, పేజీ 41-51), లెనిన్స్ ఫైనల్ ఫైట్ నుండి, పాత్ ఫైండర్ ప్రెస్.)

ఇక పార్టీలో గ్రూపుల మాటకొస్తే, అది ట్రాట్స్కీ వాదన కాదు. ఆర్ఎస్ఎల్‌డిపి లోనే గ్రూపులు ఉండేవి. విప్లవం తరువాత పునర్నిర్మాణ కాలంలో గ్రూపులు నిషేధించిన మాట నిజమే. ఆచరణలో ఇది పట్టు విడుపులతోనే అమలు జరిగిందని పాల్ లేబ్లాన్క్ (లెనిన్ అండ్ ది రెవెల్యూషనరీ పార్టీ, రెసిస్టెన్స్ బుక్స్) వంటి చరిత్రకారుల వాదన. ఇప్పటికి మార్క్సిస్ట్ పార్టీలలో గ్రూపు (ఫ్యాక్షన్, ట్రెండ్ ఎన్సీ, కాకస్) విధానం ఉంది. ఉదాహరణకు ఆస్ట్రేలియాలోని సోషలిస్ట్ అలయన్స్ నియమావళిలో గ్రూపు ఏర్పరుచుకునే హక్కు ఉంది. బ్రిటన్‌లో సోషలిస్ట్ వర్కర్స్ పార్టీలో మహాసభకు ముందు అలా ఏర్పడే హక్కు ఉంది. ఇండియాలో, నాకు తెలిసిన 2000 సంవత్సరం వరకు, పేరుకి పార్టీలో గ్రూపులు లేవుగాని ఆచరణలో ప్రతి ప్రాంత నిర్మాణం స్థానిక నాయకత్వం చుట్టూ తిరుగుతూ చిన్న, చిన్న జాగిర్ల లాగా ఉండేది. పార్టీ అంటే శిల వంటిది (మోనోలిత్) అనే సూత్రం స్టాలిన్ చెప్పిన భాష్యం. కృశ్చేవ్‌తో రివిజనిజం మొదలైందని వాదించేవారు, అంతకు ముందే స్టాలిన్ ఇచ్చిన ఒకే దేశంలో సామ్యవాదం అనే నినాదం చూడరు. పెట్టుబడే ఒకే దేశపు పరిధిలో ఇమడనప్పుడు అంతకంటే ఉన్నతమైన సమాజం కార్మిక వర్గ అంతర్జాతీయ భాగస్వామ్యం లేకుండా సాధ్యం కాదు. మార్క్సిజం పుట్టుక, ఆచరణ మొత్తం అంతర్జాతీయంగానే జరిగింది. ఇది పూర్తిగా వారి సమీక్షకు సంబంధించిన విషయం కాకపోయినా సందర్భం వచ్చింది గనుక, కార్యకర్తలకు ఉపయోగ పడుతుందని భావించి, నాకు తెలిసిన మేరకు రాస్తున్నా. ఎవరెలాంటి విమర్శ చేసినా సంతోషమే.

◆ ◆ ◆

ఒక రాజధాని ఏర్పాటు గురించి రిటైర్డ్ హోం కార్యదర్శి పద్మనాభయ్య చెప్పింది సబబుగా ఉంది. పది సంవత్సరాలు ఉమ్మడి రాజధాని వెనుక మోసం ఉందనిపిస్తుంది. కొత్త రాజధాని కట్టడానికి మూడు నాలుగు సంవత్సరాలకు మించి ఎందుకు? హైదరాబాద్‌లో ఉన్న వనరుల విషయం వేర్పాటు జరుగుతున్నప్పుడే తేల్చవచ్చు. మొత్తం కాంగ్రెస్, బిజెపి, టిఆర్ఎస్ రాజకీయ ప్రయోజనాలు, దాని వెనుక బహుళజాతి, గుత్త పెట్టుబడిదారీ ప్రయోజనాలు వెలికితీయాలి. ఎంత వీరంగం వేసినా మూడు పార్టీలకు కావాల్సింది 'అభివృద్ధే' కాబట్టి లోపాయకారి

రాజీ ఉందనే అనుమానం వేస్తుంది. ఇప్పటికే అధిక కెపాసిటీతో, ఆర్డర్‌లో కొరత ఎదుర్కొంటున్న అణు విద్యుత్ సంస్థల ప్రయోజనం ఉంటే ఆశ్చర్యం లేదు. టిఆర్ఎస్ పోలవరం, పులిచింతల గురించి మౌనం వహించి (బిజెపి, టిడిపి సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు) తనది అటువంటి 'అభివృద్దే' అని చెప్పకనే చెప్పింది. బాధ పడేది మాలాంటి వారు, విభజనకోసం ఆందోళన చేస్తున్నవారు కాదు.

◆ ◆ ◆

ముప్పాళ్ల భార్గవశ్రీ (ఏ ఎంఎల్ పార్టీయో తెలియదు, బహుశా పాత యుసిసిఆర్ఐ కావచ్చు) చాలా మంచి వ్యాసం రాశారు. కాని సమాజాన్ని ఉన్నతమైన స్థితి వైపు నడిపించి ప్రజల శక్తి సామర్థ్యాలు పరస్పర ఘర్షణలో వృథా కాకుండా చేయగల వర్గం ఏది అది, దానికి నాయకత్వం వహించే రాజకీయ పార్టీకి కావల్సిన ఆచరణ ఏమిటన్నది ప్రశ్న. చాలా కాలం విప్లవ పార్టీలు చైనా యజమానుల మీద కేంద్రీకరించి, కార్మికులను విస్మరించాయి. అగ్రగామి వర్గం కార్మిక వర్గం ఒక్కటే. దానిలో నుండి వచ్చిన ఆంగిక నాయకులో పార్టీ అంటే ముందు అలాంటి ఆంగిక నాయకులుగా ఎదిగే ప్రయత్నం చేయాలి. చిన్న వ్యవసాయం ఒంటరితనాన్ని పెంచితే పరిశ్రమ, వాణిజ్యం ఐక్యతను పెంచుతుంది.

◆ ◆ ◆

తెలంగాణవాదులు స్థానబలం చాలుననుకున్నారు, రెండువైపులా నిర్మాణాలు ఉన్న వామపక్షాలు వాటిని ఉపయోగించుకునే సృజనాత్మకత చూపలేదు. కేంద్రం మొత్తానికి గండికొట్టి చేతులు దులుపుకుంటే పరిస్థితి మరింత విషమించే ప్రమాదం ఉంది. ఉన్న కొద్దిపాటి సంబంధాలైనా ఉపయోగించి కోస్తా, రాయలసీమ ప్రజల వద్దకు వెళ్లడం అవసరం. రేపు బిజెపి అధికారంలోకి వచ్చినా విభజన జరుగుతుంది. కాని కోస్తా, రాయలసీమలో ఉన్న ఆందోళన ఉపయోగించుకుని మరో ఫాసిస్ట్, సెక్రటేరియన్ సంస్థ ఏర్పడితే అక్కడ మరింత ప్రమాదం.

◆ ◆ ◆

వ్యక్తి పూజ అనేది అచారిత్రకంగా ఉండదు. స్టాలిన్ నాటికి అక్టోబర్ విప్లవం అంతర్జాతీయ విప్లవ క్రమంలో భాగంగా లేకుండా ఒక దేశ పరిమితులకి కుదించి పోయింది. ఒక దేశంలో సోషలిజం అనేది అశాస్త్రీయ భావన - సోషలిస్ట్ నిర్మాణం కార్మికవర్గ అంతర్జాతీయ పునాది మీద జరుగుతుంది. అలాకాకుండా ఒకేపార్టీ పాలన, ఒక దేశంలో విప్లవం అనే భావాల వల్ల, మొదటి విప్లవం అర్ధ భూస్వామ్య, భూస్వామ్య పూర్వ సంబంధాలున్న రష్యా (సోవియట్ యూనియన్)లో జరగడం వల్ల (జర్మన్ విప్లవం కూలిపోవడం వల్ల) ఏకాకిగా ఉంది. వెనుకబడ్డ సమాజంలోని మాయ, మంత్రజాల, మార్మిక భావాల పునాది మీద వ్యక్తి ఆరాధన మొదలైంది. చైనా విప్లవం కూడా ఇలాంటి సమాజంలోనే వచ్చింది. అశాస్త్రీయ భావాలు, వ్యక్తి ఆరాధన విలువలు, సరైన విమర్శలేని సంస్కృతి వీటన్నిటి మీద పోరాటం చేయాలి. అలాగే ఆ పోరాటం అమూర్తంగా కాకుండా ఒక ఆచరణకు దారి చూపాలి. భారతదేశ విప్లవాన్ని ప్రపంచ విప్లవ క్రమంలో భాగంగా చూడడం, ప్రపంచ విప్లవ చరిత్ర పరిశీలన అవసరం.

◆ ◆ ◆

తెలంగాణ ఆందోళనలో (వ్యతిరేక ఆందోళనలోను) కొట్టవచ్చినట్లు కనబడుతున్న విషయాన్ని, గదిలో ఏనుగును చూడనట్లు, ఎవరూ ఇంతవరకు ప్రస్తావించినట్లు కనబడదు. ప్రజల కోరికలు, అవసరాలకు అనుగుణంగా రాజకీయ వ్యవస్థ - రాజ్య యంత్రాంగం, శాసన విభాగాలు - పనిచేయడం లేదు. వికేంద్రీకరణ వల్ల ఆ లక్షణం మారదు. ప్రజలలో - కొంత వరకైనా - పెరుగుతున్న నైపుణ్యం, విద్య, మారుతున్న అవసరాలకు అనుగుణంగా రాజ్య వ్యవస్థ అది నిలబెడుతున్న ఆర్థిక సంబంధాలు మారడం లేదు. ఈ సంక్షోభం కొన్ని సంవత్సరాలుగా అందరూ ఎదుర్కొంటున్నప్పటికీ, సంక్షోభానికి పరిష్కారం, వ్యవస్థ లోపాలు - అంటే సంస్కరణలలో - లేదు అనే విషయం వామపక్ష మేధావులు సైతం ప్రకటించడం లేదు. తెలంగాణ వచ్చినా, రాకున్నా సమాజంలో గుణాత్మక మార్పు అనివార్యమైన అవసరం. దీన్ని సాధించగలిగేది కార్మిక వర్గ నాయకత్వంలో మాత్రమే.

◆ ◆ ◆

కృష్ణా నది జలాల పంపిణీ మీద సజయ, కిషన్ రావు వ్యాసం చదివిన తరువాత కొన్ని సందేహాలు కలుగుతున్నాయి. కృష్ణా పరీవాహక ప్రాంతం తెలంగాణ ప్రాంతంలో 65-68 శాతంగా నాకు దొరికిన సమాచారం. 68 శాతం అని భావిస్తే, కృష్ణా, గోదావరి నదులకు ఎగువ ప్రాంతంగా ఉన్న తెలంగాణకు కాలువల నీరు కిందికి అందినట్లు ఎలా అందగలదు? శ్రీశైలం ఎత్తు సుమారు 269 మీటర్లు, నాగార్జునసాగర్ ఎత్తు సుమారు 179 మీటర్లు అని నాకు అందుబాట్లో ఉన్న సమాచారం. ఎత్తైన ప్రాంతం, మిట్ట పల్లాలుగా ఉన్న మండలాలు సరాసరి సముద్ర మట్టానికి సుమారుగా నల్లగొండ 224 మీటర్లు, మిర్యాలగూడ 152 మీటర్లు, భోనగిరి 450 మీటర్లు, సిద్దిపేట 540 మీటర్లు, సంగారెడ్డి దాదాపు 600 మీటర్లు అంతకు మించి ఎత్తులో ఉన్న ప్రాంతాలకు కాలువలు నీరు దిగువకు ప్రవహించినట్లు (గ్రావిటీ) అందదు. అయితే, ఎత్తిపోతల పథకాలు పెద్ద ఎత్తున కావాలి. వీటికి అవసరమైన విద్యుచ్ఛక్తి కావాలంటే బొగ్గు, సహజ వాయువు, వాయువు లేదా అణు ఇంధనం ఉండాలి. సహజ వాయువు తెలంగాణ ప్రాంతంలో పెద్దగా ఉన్న ఆధారాలు లేవు. గాలి మరలకు తీర ప్రాంతం ఉండాలి. బొగ్గు ఉత్పత్తి మరింత పెంచాలి, లేదా దిగుమతి చేసుకోవాలి, లేదంటే అణు కుంపటి నెత్తి మీద పెట్టుకోవాలి. మళ్లీ ఈ విద్యుత్ ఉత్పత్తికి నీరు కేటాయించాలి, లేదంటే పరిసరాలకు అనువైన చిన్ననీటి పారుదల పథకాలు నిర్మించాలి, అది జరగాలంటే పెద్ద పెద్ద ప్రాజెక్టుల ఆకర్షణ ఉండదు, హరిత విప్లవ నమూనా 'అభివృద్ధి'కి సరిపడదు. ధనిక వర్గాలకు కాంట్రాక్టులు, రాజకీయ నాయకులు, ప్రభుత్వ ఉద్యోగులకు కమిషన్లు, లంచాలు పెద్ద ఎత్తున వీలు పడదు. బూర్జువా ప్రజాస్వామిక డిమాండ్‌లో కూడా బూర్జువా వర్గం సాధించలేని సమాజంలో ఇటువంటి ప్రశ్నలు ప్రజల ముందుకు రాక మానవు. ఏ డిమాండ్‌లను కూడా ఏ వర్గం సాధించాలి అనే ప్రశ్న ఎదుర్కొనక తప్పదు.

◆ ◆ ◆

పరిస్థితులు మాత్రమే కారణం కాదు, అంతిమంగా అవే కారణం. ఆ ప్రమాదం ఉందని గుర్తించి దానిని ఎదుర్కొనే ఆచరణ ఆ పరిస్థితులను మౌలికంగా మార్చే వైపు ఎక్కుపెట్టాలి.

*- కె. నరేంద్రమోహన్, ఆస్ట్రేలియా*

వ్యక్తి పూజ గురించి కొంత. తోలేటి పుస్తకంపై రంగనాయకమ్మ రాస్తున్న సమీక్ష రెండవ భాగంలో వ్యక్తి పూజ గురించి సమీక్షిస్తూ సరైన విశ్లేషణ చేశారని భావిస్తున్నాను. మార్క్సిస్ట్ సర్కిల్‌లో స్టాలిన్ కాలం నుండి నేటి వరకు ఈ ధోరణి లేదా జబ్బు కొనసాగుతున్నది. మార్క్స్, ఎంగెల్స్ ప్రపంచానికి ఒక కొత్త మార్గాన్ని చూపించినప్పటికీ వాళ్లలో కీర్తి కండూతి గానీ మేము గొప్పవాళ్లమనే భావన గాని ఉన్నట్లు ఎక్కడా కనిపించదు. ప్రపంచంలోనే మొట్టమొదటి సోషలిస్ట్ దేశాన్ని నిర్మించిన లెనిన్‌లో కూడా అలాంటి ఛాయలు కనిపించవు. స్టాలిన్ కాలం నుండి మావో వరకు, చారు మజుందార్ నుండి నిన్న మొన్నటి ప్రచండ వరకు నేడు ప్రపంచ వ్యాప్తంగా కొనసాగుతున్న మావోయిస్టు ఉద్యమాల్లోని ఎందరో నాయకుల్లో ఈ ధోరణి కొనసాగుతున్నది. కీర్తి కండూతి అనే ఈ జబ్బు సోకకుండా ఉండాలంటే వ్యక్తి కంటే సమిష్టి గొప్ప, ప్రజలే చరిత్ర నిర్మాతలనే నిజమైన భావన, మాటల్లో వల్లించడం వేరు నిజంగా ఆ భావాన్ని ఇంకించుకోవడం వేరు. మనం చేసే మంచి పనులను గురించి, మన శక్తి సామర్థ్యాల గురించి ఇతరులు పొగడాలని పైకి అనకపోయినా లోలోన కోరుకోవడం, కొన్నిసార్లు తమకు తామే సొంత డబ్బా వాయించుకోవడం, ఇతరులు తమ గురించి పొగడుతుంటే పాములు, తేళ్లు కరిచినట్లు కాకుండా మనసు తన్మయత్వంతో ఆనందడోలికల్లో తేలియాడినట్లు అవుతున్నంత కాలం మనలో పైన చెప్పిన భావాలు ఇంకనట్లే. తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లు ఇవే పెరిగి రేపు బలమైన వ్యక్తి పూజకు దారితీస్తాయి. దీనికి తాజా ఉదాహరణ ప్రచండ కాగా ఎక్కడికక్కడ మన చుట్టూ, మనలో చాలా మందికి ఆ జబ్బు ఉందనడం అసత్యం కాదు. ఈ బలహీనతను అధిగమించడం కష్టసాధ్యమే కాని, అసాధ్యం కాదు. దానికోసం మార్క్సిజాన్ని నమ్మేవాళ్లందరు చిత్తశుద్ధితో ప్రయత్నించాలి. మనలోని తప్పుడు భావాలపై అంతర్గత పోరాటం చేసుకోవాలి. భారత మావోయిస్టు ఉద్యమంలో సిపిఐ మావోయిస్టు అధికార ప్రతినిధి అమరుడు ఆజాద్ లాంటి కామ్రేడ్స్ అలాంటి జబ్బుకు అతీతంగా నిలబడి ఆదర్శాలు నెలకొల్పారు. మనం వారు చూపిన దారిలో నడుద్దాం. వారి ఆదర్శాలని కొనసాగిద్దాం. బుద్ధిజీవుల్లో కాస్త ఈ జబ్బు ఎక్కువే. నా దృష్టిలో పొగిడించుకొనే వాడికన్నా పొగిడేవాడు మరింత ప్రమాదకరం. పొగిడి పొడిగి ఇతరులని చెడగొట్టడం తాము చెడిపోవడం, అందుకే పొగడ్తలు మాని మానవతను కర్తవ్యంగా భావించి ఎవరు చెయగలిగింది వాళ్లు చేయడమే మనందరి బాధ్యత అని నేను భావిస్తున్నాను.

◆ ◆ ◆

వ్యక్తి పూజ గురించి నేను రాసిన అభిప్రాయంపై నరేంద్రమోహన్ వ్యాఖ్య చదివాను. దేశ పరిస్థితి, సామాజిక నేపథ్యం అన్ని పనిచేయడం సరియైనవే కావచ్చు గాని, వ్యక్తి పూజను డిస్క్రైబ్ చేయడంలో దాన్ని కంట్రోల్ చేయడంలో ప్రధాన నాయకత్వం పాత్ర వాళ్ల కాన్షియస్‌నెస్ కీలకమైందనే నేను చెప్పదల్చుకున్నది. లెనిన్, స్టాలిన్‌లు ఏకకాలంలోని ఒకే దేశంలోని విప్లవ నాయకులు కాని ఈ విషయంలో ఇద్దరి అవగాహన ఆచరణ వేరు వేరు.

- నటాష

## కశ్మీర్‌లో మిలిటెంట్ల దాడి

జమ్ము కశ్మీర్‌లో సైనిక దుస్తుల్లో వచ్చిన ముగ్గురు మిలిటెంట్లు సెప్టెంబర్ 26న జమ్ము ప్రాంతంలోని కథువా పోలీస్ స్టేషన్‌పై దాడిచేశారు. ఈ దాడిలో ఒక ఎస్ఐ, నలుగురు పోలీసులు, ఇద్దరు పౌరులు మరణించారు. మరో ఇద్దరు గాయపడ్డారు. అక్కడి నుండి వెళ్ళి జిల్లాలోని సైనిక శిబిరంపై దాడిచేసి ఒక బస్సు డ్రైవర్‌ను, లెఫ్టినెంట్ కల్నల్‌తో పాటు మరో ముగ్గురు సైనికులను కాల్చిచంపారు. ప్రతిగా సైన్యం జరిపిన కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు చనిపోయారు. ఈ దాడిపై సైన్యం విచారణకు ఆదేశించింది. ఈ దాడి చేసింది తామేనని 'షోహదా బ్రిగేడ్' అనే సంస్థ ప్రతినిధి పిటిఐ వార్తా సంస్థకు తెలిపాడు.

## దాణా కుంభకోణంలో లాలూకు జైలు

దాణా కుంభకోణం కేసులో బీహార్ మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్రీయ జనతా దళ్ అధినేత లాలు ప్రసాద్ యాదవ్‌తో సహా 45 మందిని రాంచి సిబిఐ ప్రత్యేక న్యాయస్థానం సెప్టెంబర్ 30న దోషులుగా తేల్చింది. ఇందులో రాజకీయ నాయకులు, ఐఏఎస్ అధికారులు ఉన్నారు. 1996లో వెలికి వచ్చిన 950 కోట్ల దాణా కుంభకోణంలో రు.35.66 కోట్లు లాలూ కాజేశారనే అభియోగంపై ఆయన్ను కోర్టు దోషిగా తేల్చింది. శిక్షపడిన లాలూకు లోక్‌సభలో అనర్హత వేటు పడింది.

## ఐదు రాష్ట్రాల్లో అసెంబ్లీ ఎన్నికలు

ఐదు రాష్ట్రాల అసెంబ్లీల ఎన్నికలకు జాతీయ ఎన్నికల సంఘం అక్టోబర్ 4న షెడ్యూల్ విడుదల చేసింది. ఐదు రాష్ట్రాల అసెంబ్లీల కాల పరిమితులు డిసెంబర్ 12 నుండి జనవరి 4 మధ్యలో ముగుస్తున్నాయి. ఛత్తీస్‌గఢ్‌లోని 90 అసెంబ్లీ స్థానాలకు నవంబర్ 11, 19లలో, మధ్యప్రదేశ్‌లోని 230 స్థానాలకు నవంబర్ 25న, రాజస్థాన్‌లోని 200 స్థానాలకు డిసెంబర్ 1న, ఢిల్లీలోని 70 స్థానాలకు, మిజోరంలోని 40 స్థానాలకు డిసెంబర్ 4న ఎన్నికలు నిర్వహిస్తారని ఎన్నికల సంఘం ప్రధాన అధికారి వి.ఎస్. పంత్ తెలిపారు. డిసెంబర్ 8న కౌంటింగ్ నిర్వహించి అదేరోజున ఫలితాలు వెల్లడిస్తారని వి.ఎస్ పంత్ తెలిపారు.

## పాట్నా కోర్టు తీర్పు

బీహార్‌లోని లక్ష్మణ్ పూర్ - బాతే గ్రామంపై 1997 డిసెంబర్ 1న మధ్యరాత్రి భూమిహార్లు, రణవీర్‌సేన నిర్దిస్తున్న దళితులపై దాడి చేసి 58 మందిని నరికి చంపారు. చనిపోయిన వారిలో 27 మంది స్త్రీలు, 16 మంది పిల్లలు ఉన్నారు. ఈ కేసులో అర్వాల్ జిల్లా సెషన్స్ కోర్టు నిందితుల్లో 16 మందికి మరణ శిక్ష, 10 మందికి యావజ్జీవ కారాగారశిక్ష విధిస్తే, పాట్నా హైకోర్టు సాక్ష్యాలు లేవంటూ అక్టోబర్ 12న వారిని నిర్దోషులుగా విడుదల చేస్తూ కేసును కొట్టివేసింది. 50 బీగాల ప్రభుత్వ భూమిపై వివాదం ఈ మారణకాండకు దారితీసింది. ఈ కేసులో మారణకాండ జరిగిన పదకొండు సంవత్సరాల తరువాత 2008 డిసెంబర్ 23న పోలీసులు చార్జిషీట్ దాఖలు చేశారు.

## ఎం.పి. రషీద్ మసూద్‌పై అనర్హత వేటు

నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వంలో ఆరోగ్య మంత్రిగా పనిచేసిన సమయంలో మెడికల్ సీట్లను అనర్హులకు అమ్మిన కేసులో దోషిగా తేలిన కాంగ్రెస్ ఎం.పి మసూద్ రాజ్యసభ స్థానానికి అనర్హుడయ్యాడు. అక్టోబర్ 21న ఢిల్లీ కోర్టులో రషీద్‌కు నాలుగేళ్ల జైలు శిక్ష విధించబడ్డది. దోషులుగా తేలి శిక్ష పడినవారు చట్టసభల్లో కొనసాగే అర్హత లేదంటూ జూలై 10న ఇచ్చిన తీర్పు ప్రకారం అనర్హత వేటు పడిన తొలి రాజకీయ నేత అయ్యారు. అవినీతి కేసులో దోషిగా తేలిన రషీద్ అనర్హతను ధృవీకరిస్తూ రాజ్యసభ సెక్రెటరీ జనరల్ అక్టోబర్ 21న నోటిఫికేషన్ జారీచేశారు.

## ఔషధ ప్రయోగాలు

ప్రజల ప్రయోజనాల కోసమే ఔషద ప్రయోగాలు చేపట్టాలని, బహుళజాతి కంపెనీల లాభాల కోసం కాదని సుప్రీంకోర్టు వ్యాఖ్యానించింది. ఔషద ప్రయోగాలకు సంబంధించి కేంద్రం రూపొందించిన నిబంధనలు లోపభూయిష్టంగా ఉన్నాయని పేర్కొంది. బహుళజాతి కంపెనీలు భారతీయులపై విచ్చల విడిగా ఔషద ప్రయోగాలు చేస్తున్నాయంటూ దాఖలైన వ్యాజ్యాలపై అక్టోబర్ 21 సుప్రీం కోర్టు స్పందించింది. ఔషద ప్రయోగాల్లో పాల్గొనేవారి నుంచి ముందుగా సమ్మతి తీసుకొని దాన్ని ఆడియో/వీడియో రికార్డింగ్ చేయాలని జస్టిస్ ఆర్ ఎం లోథా నేతృత్వంలోని ధర్మాసనం తెలిపింది.

## కలలోని బంగారం కోసం వేట!

ఉత్తరప్రదేశ్‌లోని దౌడియాకలా గ్రామంలో రాజారావు రాంబక్ష్ సింగ్ కోట ఆలయంలో వెయ్యి టన్నుల బంగారం కోసం తవ్వకాలు జరుగుతున్నాయి. యుపికి చెందిన సాధువు శోభన్‌సింగ్ సర్కార్‌కు రాజారావు రాంబక్ష్ సింగ్ కోట ఆలయంలో బంగారం నిల్వలున్నట్లు కల వచ్చినట్లుగా చెప్పడంతో కేంద్ర వ్యవసాయ, ఫుడ్ ప్రాసెసింగ్ శాఖ సహాయ మంత్రి చరణ్‌దాస్ మహంత్ తవ్వకాల కోసం భూ విజ్ఞాన పరిశీలక శాఖ (జిఎస్ఐ), పురావస్తు శాఖ (ఎఎస్ఐ) లను అక్టోబర్ 18న ఆదేశించారు.

## ఒడిశాలో ఫైలిన్ తుఫాన్ బీభత్సం

ఒడిశాలో ఫైలిన్ తుఫాన్ వల్ల పెద్ద ఎత్తున వచ్చిన వర్షాలకు వరద నీరు పొంగి పొర్లడంతో 38 మంది మృతిచెందారు. వరదలకు ప్రభావితులైన వారి సంఖ్య ఒక కోటి ఇరవై మూడు లక్షలని రాష్ట్ర ప్రభుత్వం తెలిపింది. 2,276 గ్రామాలు దెబ్బతిన్నాయని తెలిపింది. గంజాం, బాలసోర్, మయూర్‌భంజ్ జిల్లాలను బాగా దెబ్బతిన్న ప్రాంతాలుగా గుర్తించినట్లు రెవెన్యూ, విపత్తు నిర్వహణ శాఖ మంత్రి ఎస్.ఎస్. రావు అక్టోబర్ 17న మీడియాకు తెలిపారు. తుఫాన్ కారణంగా జరిగిన పంట నష్టం 2400 కోట్లు ఉంటుందని ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ అన్నారు.

## మధ్యప్రదేశ్‌లో మహా విషాదం

మధ్యప్రదేశ్‌లోని రతన్‌గడ్ మందిరానికి వెళ్లే వంతెనపై జరిగిన తొక్కిసలాటలో 115 మంది మృతిచెందారు. మరో వంద మందికి పైగా గాయపడ్డారు. దసరా సందర్భంగా నవమి పూజలు చేసేందుకు అక్టోబర్ 13న లక్షమందికి పైగా భక్తులు రావడంతో నియంత్రించేందుకు పోలీసులు లాఠీచార్జ్ చేయడంతో, ఆ వెంటనే వంతెన కూలేలా ఉందని పుకార్లు లేవదీయడంతో తొక్కిసలాట జరిగింది. కొద్ది మంది తొక్కిసలాటలో కింద నలిగిపోగా, ఎక్కువ మంది సింధూ నదిలో పడి ప్రాణాలు కోల్పోయారు. ఇదే ప్రదేశంలో 2006లో కూడా తొక్కిసలాట జరిగి 50 మంది ప్రాణాలు కోల్పోయారు. వీ

# నోబెల్ బహుమతులు

## భౌతిక శాస్త్రం

విశ్వంలోని ప్రతి పదార్థ ద్రవ్యరాశికి కారణమైనదిగా భావిస్తున్న 'దైవకణం' (హిగ్స్–బోసన్) ఉనికిని సిద్ధాంతపరంగా కనుగొన్నందుకు పీటర్ హిగ్స్ (బ్రిటన్), ఫ్రాంకోయిస్ ఎంగ్లర్ట్ (బెల్జియం) లు భౌతికశాస్త్ర విభాగంలో ప్రతిష్టాత్మక నోబెల్ బహుమతిని పొందారు. మన విశ్వం ఎల్లప్పుడూ ఏదైనా పదార్థాన్ని ఎందుకు కలిగి ఉందనే విషయాన్ని తెలిపే ఒక కణ సిద్ధాంతాన్ని వీరిద్దరు గతేడాది ఆవిష్కరించారు. వారిద్దరూ చేసిన కృషికి గుర్తుగా వారికి ఈ ఏడాది నోబెల్ బహుమతి లభించింది.

## శాంతి

రసాయనిక ఆయుధాల పర్యవేక్షణ సంస్థ (ఆర్గనైజేషన్ ఫర్ ద ప్రొహిబిషన్ ఆఫ్ కెమికల్ వెపన్స్– ఒపిసిడబ్ల్యు) కు ప్రతిష్టాత్మక శాంతి నోబెల్ లభించింది. రసాయనిక ఆయుధాల నిరోధించడంలో చేసిన కృషికిగాను ఈ బహుమతి ఇస్తున్నట్లు నోబెల్ కమిటీ ప్రకటించింది. సిరియాల ఇటీవల రసాయన ఆయుధాల ప్రయోగం, తమ కర్తవ్యం ఇంకా మిగిలే ఉన్నదని తెలియజెప్పిందని, ఒపిడబ్ల్యు డైరెక్టర్ జనరల్ అహ్మద్ ఉజుంచు తెలిపారు. ఈ సంస్థ 1997లో ఏర్పడింది.

## అర్థశాస్త్రం

స్టాక్‌మార్కెట్, బ్రాండ్ మార్కెట్, రియల్టీ రంగాల్లో ధరల కదలికలు ఎలా ఉంటాయో, ఆ కదలికలు ప్రపంచ వ్యాప్తంగా వ్యక్తిగత ఇన్వెస్టర్ల పెట్టుబడి ధోరణుల్లో మార్పుకు ఎలా దోహదపడుతాయి అన్న అంశాలపై చేసిన పరిశోధనకు గాను ముగ్గురు అమెరికా ప్రొఫెసర్లకు ఈ సంవత్సరం అర్థశాస్త్రం నోబెల్ బహుమతి లభించింది. యుజీన్ ఫామా, లార్స్ పీటర్ హాన్సెన్ చికాగో విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నారు. మరొకరు రాబర్ట్ షిల్లర్ యేల్ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉన్నారు. 1960 దశాబ్ది నుంచి ఇళ్ల ధరల్లో ఎంత త్వరితంగా మార్పులు వచ్చాయన్నది సమగ్రంగా విశ్లేషించారు. స్వల్పకాలంలో స్టాక్ ధరల కదలికలను అంచనా వేయడం ఎంత కష్టమో విశ్లేషించారు.

## సాహిత్యం

కథా రచయిత్రి, సమకాలీన కథానికా నిష్ణాతురాలుగా ప్రఖ్యాతి పొందిన ఎలైస్ మన్రోకు సాహిత్యంలో నోబెల్ పురస్కారం లభించింది. ఆమెను 'కెనడియన్ చేహోవ్'గా అభివర్ణిస్తారు. చిన్న చిన్న పట్టణాల్లోని సామాజిక వాతావరణాన్ని, మానవ సంబంధాలను, నైతిక సంఘర్షణలను తన కథల్లో చిత్రించిన ఎలైన్ మన్రో సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన వారిలో 13వ మహిళ కావడంతో పాటు మొట్టమొదటి కెనడియన్ మహిళ. ఇంగ్లిష్ ప్రధానాంశంగా చదువుకుంటున్న కాలంలోనే 1950లో 'ది డైమెన్షన్స్ ఆఫ్ ఎ షాడో' పేరిట తొలి కథ రాశారు. భర్త జేమ్స్ మన్రోతు కలిసి 'మన్రో బుక్స్' ప్రచురణ సంస్థను ప్రారంభించారు. 1968లో తొలి కథా సంపుటి 'డాన్స్ ఆఫ్ ది హ్యాపీ షేడ్స్' మన్రోకు అంతర్జాతీయంగా గుర్తింపు తెచ్చింది.

## రసాయన శాస్త్రం

అతి క్లిష్టమైన రసాయన ప్రక్రియలను అణుస్థాయిలో వివరించేందుకు ఉపయోగపడే కంప్యూటర్ సిమ్యులేషన్స్ (అనుకరణలు) ను రూపొందించిన ముగ్గురు శాస్త్రవేత్తలకు ఈ ఏడాది రసాయన నోబెల్ బహుమతి వచ్చింది. మార్టిన్ కార్ప్లస్ (అమెరికా–ఆస్ట్రియన్), మైకేల్ లెవిట్ (అమెరికా – బ్రిటిష్), ఆరీ వార్షెల్ (అమెరికా – ఇజ్రాయెల్)లకు ఈ బహుమతి లభించింది. నిత్య జీవితంలో కీలకమైన రసాయన ప్రక్రియలకు వీరు ముగ్గురు కంప్యూటర్ అనుకరణలు (నమూనాలు) రూపొందించారని, వాటి సహాయంతో దాదాపు అన్ని రసాయన ప్రక్రియలనూ అత్యంత సూక్ష్మస్థాయిలో అర్థం చేసుకోవడంతోపాటు ఆ చర్యల క్రమాన్ని ఊహించవచ్చు.

## వైద్యశాస్త్రం

వైద్య శాస్త్రంలో అమెరికాకు చెందిన రాండీ షెక్‌మాన్, జేమ్స్ రోత్‌మాన్, జర్మనీకి చెందిన థామస్ స్యూదోఫ్‌లకు ఉమ్మడిగా నోబెల్ బహుమతి లభించింది. శరీర కణాల్లో అంతర్గతంగా, కణాల మధ్య రవాణా వ్యవస్థపై పరిశోధన చేసినందుకు వీరికి నోబెల్ లభించింది.

# ఫిలిప్పైన్స్‌లో భూకంపం

ఫిలిప్పైన్స్‌లో అక్టోబర్ 15న ఉదయం భారీ భూకంపం సంభవించింది. ఇది రిక్టర్ స్కేల్‌పై 7.2గా నమోదయింది. ఈ భూకంపం తాకిడికి వంద మందికి పైగా మరణించారు. బొహోల్, సెబు ప్రాంతాలలో దీని తీవ్రత చాలా ఉంది. భారీ ఆస్తి నష్టం సంభవించింది. ఎన్నో భవనాలు, చర్చిలు కుప్పకూలాయి. రహదారుల మీద పగుళ్లు ఏర్పడ్డాయి. వంతెనలు కూలిపోయాయి.

# ముగిసిన అమెరికా షట్‌డౌన్

గత నెల రోజులుగా అమెరికాను కుదేలు చేసిన ఆర్థిక సంక్షోభానికి తెరపడింది. అమెరికా షట్‌డౌన్‌ను ముగించడానికి రిపబ్లికన్ పార్టీ డెమోక్రాట్ పార్టీలు ఒప్పందానికి వచ్చాయి. అమెరికన్ కాంగ్రెస్‌లోని ఉభయ సభలు సెనేట్, ప్రతినిధుల సభ ప్రభుత్వ రుణపరిమితి పెంపునకు ఉద్దేశించిన బిల్లును ఆమోదించాయి. ఆ బిల్లుపై అధ్యక్షుడు ఒబామా సంతకం చేయడంతో దానికి చట్టం ప్రతిపత్తి లభించింది. దీంతో పదహారు రోజులుగా సాగుతున్న షట్‌డౌన్‌ను ఎత్తివేస్తున్నట్లు అధ్యక్ష భవనం ప్రకటించింది. తక్షణం ఉద్యోగాల్లో చేరాలని ఉద్యోగులకు తెలిపింది. ఈ బిల్లు చట్టంగా రూపాంతరం చెందడంతో అమెరికా ప్రభుత్వంపై ఉన్న 167 లక్షల కోట్ల డాలర్ల రుణపరిమితిని ఎత్తివేసి నట్టయింది. ఈ బిల్లు అమలుతో 2014 ఆర్థిక సంవత్సరంలో అమలులో ఉన్న ప్రాజెక్టులు, కార్యకలాపాలన్నింటికీ ఎలాంటి అవరోధం లేకుండా నిధులు అందించేందుకు ప్రభుత్వానికి వీలు కలుగుతుంది. ఈ బిల్లును రిపబ్లికన్‌లు తీవ్రంగా ప్రతిఘటించారు. కొత్త ఆరోగ్య సంరక్షణ చట్టం విషయంలో అమెరికా అధ్యక్షుడు ఒబామాతో రిపబ్లికన్‌లు తీవ్రంగా పోటీ చేశారు.

వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎ.మల్లేశ్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 సెప్టెంబర్ నుండి 30 సెప్టెంబర్ 2013 వరకు 14 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య - 1295)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 5 | - | 20 | 24 | 10 | 8 | 5 | 2 | 2 | 2 | 3 | 1 | 1 | 23 | 35 | - | - | - | 3 | - |
| మహబూబ్‌నగర్ | - | 6 | 2 | 21 | 11 | 9 | 8 | 4 | 2 | 6 | 7 | 7 | 23 | 10 | 47 | 11 | - | 2 | - | - | - |
| నల్గొండ | - | 2 | 1 | 13 | 19 | - | 1 | 4 | 1 | 2 | 3 | 4 | - | 5 | 30 | 38 | - | - | - | 5 | - |
| హైదరాబాద్ | - | - | - | 6 | 6 | - | - | - | - | 2 | 5 | 10 | - | - | 7 | 15 | - | - | - | 7 | - |
| మెదక్ | - | 2 | - | 9 | 15 | 3 | 9 | - | - | - | 4 | 2 | 1 | 17 | 30 | 55 | - | - | - | - | 3 |
| కరీంనగర్ | 1 | 4 | 6 | 4 | 7 | 2 | 3 | 2 | 3 | 7 | 4 | 5 | 2 | 4 | 20 | 5 | - | - | - | - | 4 |
| రంగారెడ్డి | - | 4 | - | 18 | 10 | 4 | 13 | 5 | 2 | 4 | 3 | 2 | 2 | 2 | 14 | 26 | - | - | - | - | - |
| వరంగల్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ఖమ్మం | - | - | - | 7 | 15 | 3 | 11 | 2 | 2 | 4 | 4 | 4 | - | 5 | 21 | 18 | - | - | - | - | 2 |
| నిజామాబాద్ | - | - | - | 5 | 12 | 3 | 2 | - | 2 | 1 | 1 | 3 | 6 | 4 | 19 | 15 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 8 | 4 | 5 | 6 | 8 | 3 | 5 | 2 | 3 | - | 3 | 28 | 8 | - | - | - | - | 4 |
| శ్రీకాకుళం | - | - | - | 3 | 6 | 3 | 7 | 5 | 1 | 4 | 1 | - | 3 | 6 | 33 | 13 | - | - | - | - | 1 |
| నెల్లూరు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | - | - | - | 1 | 6 | 4 | 1 | 1 | - | 2 | - | - | 12 | 5 | 24 | 16 | - | - | - | 19 | 12 |
| **మొత్తం** | **1** | **23** | **9** | **115** | **135** | **46** | **69** | **36** | **18** | **39** | **36** | **43** | **50** | **62** | **296** | **255** | **-** | **2** | **-** | **34** | **26** |

BCL

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రరాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య - ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| రాజ్యం - సంక్షేమం | కె. బాలగోపాల్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దళిత | కె. బాలగోపాల్ | 120 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| హక్కుల బాటసారి | బుర్ర రాములు రచనలు | 50 |
| నిగాహ్ | కె. బాలగోపాల్ వ్యాస సంకలనం | 200 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్నీ | | |

## కథ - నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యూమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh (1956-2006)** | | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Veekshanam Telugu Monthly Journal of Political Economy and Society - 148 - November 2013 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 29/10/2013 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం మీ నుంచి కోరుతున్నది
# రచనా సహాయం, ఆర్థిక సహాయం

మీ వంటి వేలాది మంది పాఠకుల ఆదరాభిమానాలతోనే వీక్షణం నానాటికీ అభివృద్ధి చెందుతున్నదని మీకు తెలుసు. వీక్షణం తాను పెట్టుకున్న ప్రజా చైతన్య పురోగమన, విస్తరణ లక్ష్యాలకు మరింతగా చేరుకోవాలంటే మీవంటి అభిమానులు, పాఠకులు, రచయితలు, దాతలు మరింతగా చేయూత నందించవలసి ఉంది. మీ చేయూత రచనల రూపంలో కావచ్చు, ఆర్థిక సహాయం రూపంలో కావచ్చు.

వీక్షణంకు రచయితల నుంచి, అభిమానుల నుంచి రచనలు గణనీయంగానే అందుతున్నప్పటికీ ఇంకా ఎక్కువ, ఇంకా నాణ్యమైన రచనలు రావలసి ఉంది. అందుకు మీ పూనిక అవసరం. వీక్షణం మూడు రకాల రచనలకు ప్రాధాన్యతనిస్తుంది : 1) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలలో విరివిగా సమాచారం వస్తున్నప్పటికీ ప్రజానుకూల విశ్లేషణ లేని అంశాలపై ప్రజా దృక్కోణం నుంచి లోతైన విశ్లేషణలు. 2) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు సాధారణంగా విస్మరించే ప్రజా జీవన పరిణామాల గురించి సమాచార, విశ్లేషణా రచనలు. 3) ఏ సమాచారాన్నయినా అర్థం చేసుకోవడానికి అవసరమైన పనిముట్లు అందించే దృక్పథ ప్రధానమైన రచనలు.

వీక్షణం ఆర్థిక స్థితి సమస్యాత్మకంగా ఉన్నదని, ఏ నెలకానెల అన్నట్టుగా సాగుతున్నదని మీకు ఎప్పటికప్పుడు నివేదిస్తూనే ఉన్నాం. ప్రతి సంచిక ఆర్థిక లోటుతో నడుస్తున్నది. వ్యక్తిగత చందాలు, సంస్థల చందాలు, పుస్తకాల అమ్మకాలు, విరాళాలు, ప్రకటనలు వంటి వనరులన్నీ ఇంకా పెరిగితే గాని పత్రిక మనుగడ సుస్థిరం కాదు. వీక్షణం అభిమానులు, పాఠకులు ప్రతి ఒక్కరూ పూనుకుని తమ వంతు బాధ్యతగా చందాలు చేర్పించడం, విరాళాలు, ప్రకటనలు సేకరించడం వంటి అన్ని రూపాలలో ఆర్థిక సహాయం అందించడం అవసరం.

**తెలుగు సమాజంలో ప్రగతిశీల ఆలోచనాధారలో, ప్రజానుకూల పత్రికల సంప్రదాయంలో**
**కృషి చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం**

**తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణ వీక్షణం**

**ఈ సంభాషణను విస్తరిద్దాం! తెగిపోకుండా కాపాడుకుందాం!**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M268 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |